# ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం; సమాచార, ప్రజా సంబంధాల శాఖ; హైదరాబాద్

"ఆంధ్ర ప్రదేశ్" కాలండర్, 1964

| | జనవరి | ఫిబ్రవరి | మార్చి | ఏప్రిల్ | మే | జూన్ |
|---|---|---|---|---|---|---|
| ఆది | 5 12 19 26 | 2 9 16 23 | 1 8 15 22 29 | 5 12 19 26 | 31 3 10 17 24 | 7 14 21 28 |
| సోమ | 6 13 20 27 | 3 10 17 24 | 2 9 16 23 30 | 6 13 20 27 | 4 11 18 25 | 1 8 15 22 29 |
| మంగళ | 7 14 21 28 | 4 11 18 25 | 3 10 17 24 31 | 7 14 21 28 | 5 12 19 26 | 2 9 16 23 30 |
| బుధ | 1 8 15 22 29 | 5 12 19 26 | 4 11 18 25 | 1 8 15 22 29 | 6 13 20 27 | 3 10 17 24 |
| గురు | 2 9 16 23 30 | 6 13 20 27 | 5 12 19 26 | 2 9 16 23 30 | 7 14 21 28 | 4 11 18 25 |
| శుక్ర | 3 10 17 24 31 | 7 14 21 28 | 6 13 20 27 | 3 10 17 24 | 1 8 15 22 29 | 5 12 19 26 |
| శని | 4 11 18 25 | 1 8 15 22 29 | 7 14 21 28 | 4 11 18 25 | 2 9 16 23 30 | 6 13 20 27 |

| | జూలై | ఆగష్టు | సెప్టెంబరు | అక్టోబరు | నవంబరు | డిశంబరు |
|---|---|---|---|---|---|---|
| ఆది | 5 12 19 26 | 30 2 9 16 23 | 6 13 20 27 | 4 11 18 25 | 1 8 15 22 29 | 6 13 20 27 |
| సోమ | 6 13 20 27 | 31 3 10 17 24 | 7 14 21 28 | 5 12 19 26 | 2 9 16 23 30 | 7 14 21 28 |
| మంగళ | 7 14 21 28 | 4 11 18 25 | 1 8 15 22 29 | 6 13 20 27 | 3 10 17 24 | 1 8 15 22 29 |
| బుధ | 1 8 15 22 29 | 5 12 19 26 | 2 9 16 23 30 | 7 14 21 28 | 4 11 18 25 | 2 9 16 23 30 |
| గురు | 2 9 16 23 30 | 6 13 20 27 | 3 10 17 24 | 1 8 15 22 29 | 5 12 19 26 | 3 10 17 24 31 |
| శుక్ర | 3 10 17 24 31 | 7 14 21 28 | 4 11 18 25 | 2 9 16 23 30 | 6 13 20 27 | 4 11 18 25 |
| శని | 4 11 18 25 | 1 8 15 22 29 | 5 12 19 26 | 3 10 17 24 31 | 7 14 21 28 | 5 12 19 26 |

# ఆంధ్రప్రదేశ్

సంపుటి : 8. పుష్యం - మాఘం
సంచిక : 3 1885 శకం
జనవరి, 1964

'ఆంధ్ర ప్రదేశ్' పాఠకులకు, రచయితలకు, చందాదారులకు, ఏజంట్లకు నూతన సంవత్సరం సందర్భంగాను, సంక్రాంతి సందర్భంగానూ మా శుభాకాంక్షలు. — ఎడిటర్

## విషయ సూచిక



రెండవ అట్ట : సంక్రాంతికి పూర్వం పంటకోతలు.
మూడవ అట్ట : ధాన్యాన్ని తూర్పోత పడుతున్నదృశ్యం.

సంవత్సరం చందా — రు 3—00
విడి ప్రతి రు 0—25 నయాపైసలు

# ముఖ్యమంత్రి లేఖ

ప్రియమైన చదువరీ!

కొత్త సంవత్సరం వచ్చినప్పుడల్లా కొత్త కొత్త నిర్ణయాలు చేసుకోవడం మనందరికీ ఒక సంప్రదాయం. ఈ సంవత్సరానికి నా సంకల్పాలలో ఒక దానిని ఇదివరకే నేను ప్రకటించాను. ఫిబ్రవరి మొదటివారంనుంచి ఇది అమలులోనికి వస్తుంది. "ఒక్కొక్క జిల్లాలో ఒక వారం" చొప్పున గడుపుతూ రాష్ట్ర ప్రజలతో ప్రత్యక్ష సంబంధం కలిగి వుండడానికి నిశ్చయించుకున్నాను. దీనివల్ల పరిపాలనా నిర్వహణ కూడా పటిష్ఠమవుతుంది. ఇందుకై నేను ప్రస్తుతం నిర్వహిస్తున్న పదవీ బాధ్యతలలో కొన్నింటిని నా సహచరులను స్వీకరించమని అభ్యర్థించాను. పదవీ స్వీకారం చేసినప్పుడు స్వచ్ఛమైన, సమర్థవంతమైన పరిపాలనను గూర్చి నేను ఏమని నిర్ణయించుకున్నదీ, [illegible] ఈ నిర్ణయాన్ని నెరవేర్చడానికి నేను ఏమేమి చర్యలు తీసుకుంటున్నదీ మీకు తెలుసు. అనుభవజ్ఞులైన సీనియర్ అధికార్లను జిల్లాలలో నియమించడం ఈ చర్యలలో ఒకటి. నిజానికి కొన్ని సందర్భాలలో వీరికి జీతభత్యాలలో నష్టం కలుగుతున్నది కూడా. అయినప్పటికీ అనుభవశాలులైన ఈ అధికార్లు, ఈ బదిలీలను రాష్ట్రంయొక్క జనసామాన్యం యొక్క ప్రయోజనాల దృష్ట్యా సంతోషంగా సమ్మతించారు. ఇది నిజంగా నాకు గర్వకారణం. ఈ నానూత్న సంకల్పాన్ని సఫలీకృతం చేయడానికి ముందు కూడా వీరు ఇదేవిధంగా సహకార భావాన్ని ప్రదర్శించగలరని నమ్ముతున్నాను.

మనదేశంలోని వివిధ రాజకీయపార్టీల ఆదర్శాలు, విధానాలు ఏవైనప్పటికీ ప్రతి ఒక్కటికూడా ప్రజాస్వామ్యాన్ని అనుసరిస్తున్నట్లు చెప్పుకుంటుంది. ప్రజాస్వామ్యం అనే పదం చాలా ఇంపుగా వుంటుంది. జనాకర్షణకు ఈ రోజుల్లో ఈ మాట బాగా ఉపయోగపడుతుంది. అయితే లక్ష్యసిద్ధిగల ఏ రాజకీయ పార్టీగాని ఉద్దేశపూర్వకంగా కేవలం నినాదంగానే ప్రజాస్వామ్యం అనే పదాన్ని ఉపయోగించుకోవడం లేదు. కొందరు తామే నిజమైన ప్రజాస్వామిక సిద్ధాంతాలను అనుసరిస్తున్నామని చెప్పుకుంటూ ఇతరులు అవలంబిస్తున్నది బూటకపు ప్రజాస్వామ్యమని, ఇంకా ఏమేమో నిందారోపణలు చేయవచ్చు. తమవాదనను బలపరుచుకుంటూ తమ ఆరోపణలను సమర్థించుకుంటూ విభిన్నమైన వ్యాఖ్యానాలు చేయవచ్చు. అయితే ముఖ్యమైన విషయమేమిటంటే, ప్రజాస్వామిక పద్ధతులలో తమకు గల విశ్వాసాన్ని ప్రజలు గుర్తించాలంటే, వారు ప్రత్యక్షంగా క్రమశిక్షణయొక్క కొన్ని కనీస ప్రమాణాలకు కట్టుబడివుండాలి.

ఉదాహరణకు ఆసియాలోకెల్లా పెద్ద ప్రజాస్వామిక దేశానికి చెందిన మనం మన రాజ్యాంగపు నిర్దేశాలను మన శాసనసభ్యుల సర్వసత్తాక అధికారాన్ని చిత్తశుద్ధితో గౌరవించాలి. రాజ్యాంగం మనకు ప్రసాదించిన ప్రాథమిక హక్కులకు కట్టుబడి ఏ అంశం గురించి అయినా మనం ఎంతకాలమయినా చర్చించుకోవచ్చు. వాదించుకోవచ్చు. కాని సర్వసత్తాక అధికారంగల మన శాసనసభలు ఏదైనా ఒక ముఖ్య విషయంలో ఒకసారి నిర్ణయంతీసుకొని దానికి శాసనం రూపం యిచ్చిన తరువాత అది అమలు జరుగకుండా వివిధ ఆందోళన ఉద్యమాలద్వారా నిరోధిస్తామంటూ పదే పదే బెదిరించడం ఎంతమాత్రం ప్రజాస్వామిక విధానం అనిపించుకోదు. శాసనాన్ని సవరించడానికి గాని కొత్త శాసనం తేవడానికి గాని పార్లమెంటరీ పద్ధతులలో ప్రయత్నాలు చేయవచ్చు. కాని మార్పు జరిగే పర్యంతం శాసనాన్ని విఫలం చేయడానికి శాసనసభ వెలుపల నిరోధక చర్యలకు పూనుకోవడం వినాశకరమైన విధానం. వీటిని ప్రోత్సహించే వారు ప్రజాస్వామ్యాన్ని తృణీకరించినవారే అవుతారని మనవి చేస్తున్నాను.

అదనపు భూమిశిస్తు విధింపు చట్టానికి వ్యతిరేకంగా "సత్యాగ్రహం", "ప్రత్యక్ష చర్యల"కు దిగుతామంటూ బెదిరిస్తూవుండడం వల్ల ఈ విషయాలు నేను చెప్పవలసి వచ్చింది. ఈ శాసనం జరగడానికిపూర్వం, బిల్లు చర్చించబడుతున్న సమయంలోనూ, బిల్లు ఆమోదించబడిన తరువాతకూడా దీనిలో ప్రతిపాదనలను సమర్థిస్తూ, చాలాసార్లు చెప్పడం జరిగింది. సహేతుకమైన విమర్శలకు సమాధానాలు ఇవ్వబడినవి. చక్కని జీవన విధానాలను సాధించడానికి మన రాష్ట్రం సాగిస్తున్న సత్వరకృషిని విజయవంతం చేయడానికే అదనపు భూమిశిస్తు విధింపు అవసరమైందని నేనూ ఇతరమంత్రులు అనేకసార్లు వివరించాము. ప్రణాళికలను అమలుపరచడంలో మనం గర్వకారణమైన ఫలితాలు సాధించాం. రెండవ ప్రణాళిక కేటాయింపును పూర్తిగా వెచ్చించాము. మూడవప్రణాళికా పథకాలఅమలులోకూడా గట్టిగా కృషిచేస్తున్నాం. మూడవ ప్రణాళికలో వచ్చే సంవత్సరానికి ప్రణాళికా సంఘంవారు మనం అడిగినంత వరకు

బాదాషు పూర్తిగా కేటాయింపు చేశారు. వారు పెట్టిన కోత నామ మాత్రమైనది. ఇప్పటి మన సామర్థ్యాన్ని తగ్గకుండా నిలబెట్టుకో డానికి మన రాష్ట్రంలోనే అధికంగా సాధన సంపత్తులను సమ కూర్చుకోవలసిన బాధ్యత మనమీదవుంది. ఈ ముఖ్యోద్దేశంతోనే మన శాసనసభ అదనపు భూమిశిస్తు శాసనం చేయడం జరిగింది. ప్రణాళిక విజయవంతంగా అమలు పరచడంలో రాష్ట్రీదేశ శ్రేయోభి లాషులంతా సహాయపడాలి. ఈ చట్టానికి వ్యతిరేకంగా జరిగే ఆందోళ నలు, బెదిరింపులను వేటినీ ప్రభుత్వం సహించబోదని నేను హెచ్చ రిస్తున్నాను.

మన ప్రణాళికలన్నీకూడా ప్రజల ముఖ్యమైన అవసరాలను తీర్చడానికి ఉద్దేశించబడినవే. అందువల్ల ఈ ప్రణాళికా పథకాలలో మనం ఎట్టి సడలింపులనుకూడా జేయడానికి వీలులేదు. నిజానికి వచ్చే పది లేక పదిహేను సంవత్సరాలకు మనం రూపొందించ వల మన దీర్ఘకాలిక ప్రణాళిక దృష్ట్యా, సాధ్యమైన మూలధన మార్గాల ద్వారా సమకూరగలవానితోసహా సాధన సంపత్తులు చాలనట్లే కనిపిస్తున్నవి. ఉదాహరణకు గ్రామీణ విద్యుదీకరణకు సంబంధించి విస్తృతమైన పథకాన్ని పరిశీలిస్తున్నాము. దీనికి సుమారు రు. 450 కోట్లు ఖర్చవుతుంది. ఈ పథకం ప్రకారం అయిదవ పంచవర్ష ప్రణాళిక ముగింపునాటికి రాష్ట్రంలోని ప్రతి గ్రామానికీ విద్యుచ్ఛక్తి లభిస్తుంది. అనావృష్టి, కరువు కాలాలలోకూడా మనరైతులు అత్యవసరమైన పనులన్నీ కొనసాగించుకో గలిగేటట్లు వీలు కలిగిం చాలి. ఒక్క విద్యుచ్ఛక్తి వల్లనే ఇది సాధ్యపడుతుంది. నిజానికి మన గ్రామప్రజలకు సంబంధించినంతవరకు స్వాతంత్ర్యం అంటే ప్రణాళికా కార్యక్రమాలు, విద్యుచ్ఛక్తి సరఫరా అని నిర్వచించ వచ్చు, ఎందుచేతనంటే వీటివల్లనే ఎడతెగకుండా ఉత్పత్తికృషి జరిగి వాస్తవ ప్రగతిని సాధించడానికి వీలు కలుగుతుంది. నీటివన రుల సౌకర్యాలు లేనటువంటి వెనుకబడిన ప్రాంతాలలోని రైతులకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయడానికి అధికతర ప్రాధాన్యం ఇస్తున్నాము. రాష్ట్రంలోని ప్రతిరైతుకూ నీటిపారుదలకు ఒక బావినీ, అవసర మైన విద్యుచ్ఛక్తి సరఫరానూ సమకూర్చాలన్నదే మన ఆశయం,

గ్రామీణ అవసరాలపట్ల ఈ విధంగా దృష్టిని కేంద్రీకరిస్తున్నా మంటే పట్టణప్రాంతాల సమస్యలను నిర్లక్ష్యం చేస్తున్నామని అర్థం కాదు. నేనూ నా సహచరులు ఎప్పుడూ వీటినిగురించి ఆలోచిస్తూనే వుంటాము. అయితే పట్టణాలు, నగరాల పరిస్థితి కొంత భిన్న మైనది. ఇక్కడ విద్యావంతులు, విజ్ఞానవంతులు అయిన నాయకులు వుంటారు. వారు పరిస్థితులను మెరుగుపరచడానికి స్వయంగా సమ ర్థులు. ఈ సమస్యలను ఎల్లప్పుడూ విశాల దృక్పథంతో ఉదార వైఖరితో చూడాలనీ, మైనారిటీ హక్కులనబడే వాటికోసం అంతగా ప్రయత్నించవద్దని ఇటువంటి నాయకులకు విజ్ఞప్తి చేస్తు న్నాను. స్థూలంగా చెప్పుకోవాలంటే మనకు ఇక్కడ భాషకు సంబంధించిన లేక యితర మైనారిటీ సమస్యలు లేవని నా అభి ప్రాయం. స్వల్ప సమస్యలు ఏవి ఉత్పన్నమైనా వాటిని పరిపాలనా చర్యలద్వారా శీఘ్రంగా పరిష్కరించడం జరుగుతున్నది.

మన రాష్ట్రంలో ఎస్. ఎస్. ఎల్. సి. పబ్లిక్ పరీక్షకు ప్రైవే టుగా కూర్చోవడానికి స్త్రీలకు అవకాశం కల్పిస్తూ ఇటీవల ఉత్తర్వు చేయడం జరిగింది. ఈ చర్య (మైనారిటీలు, మెజారిటీలతో దీని కేమీ ప్రమేయం లేదు) నాకు చాలా ఆనందకరంగా వుంది. వచ్చే మార్చి పరీక్షలనుంచి దీనిని అమలు పరచడానికి ప్రభుత్వ పరీక్షల కమీషనరు చర్యలు తీసుకుంటున్నారు. అన్ని స్థాయిలలోనూ స్త్రీ విద్యకు సౌకర్యాలు పెంపొందించాలి. హైదరాబాదు, కాకినాడలలో నెలకొల్పబడిన స్త్రీల పాలిటెక్నిక్స్ విషయంలో నైతేనేమి ఇంకా ఇతర పథకాల విషయంలో నైతేనేమి స్త్రీలు చూపుతున్న శ్రద్ధా సక్తులనుబట్టి మనం కల్పించగల మరేఅదనపు సౌకర్యాలనైనా వారు పూర్తిగా వినియోగించుకోగలరని నా విశ్వాసం. ఉన్నత విద్యను అపేక్షించే ప్రతిభావంతులైన విద్యార్థినులు చాలామంది వున్నారు కాబట్టి ఈ విషయంలో మన విశ్వవిద్యాలయాల సంపూర్ణ సహకారం అవసరం. ఈ సహకారం అవశ్యం లభించగలదని నేను విశ్వసిస్తున్నాను.

జై హింద్ !

భవదీయుడు,

నీలం సంజీవరెడ్డి.

# జరిగింది...జరుగనున్నది...

అద్దూరి బలరామరెడ్డి



ఆర్థిక రంగంలో మనం గడించిన అనుభవాన్నిబట్టి, ఇతర భారీ పరిశ్రమల మాదిరిగానే, వ్యవసాయ పథకాలకు కూడ తగినంత ప్రాముఖ్యత నివ్వాలని గుణపాఠం కలిగింది. మన పంచవర్ష ప్రణాళికలు, సమాజ వికాస పథకాలు మొదలైన వాటిలో మన బ్రతుకుతెరువు అన్ని రంగాలలోను అభివృద్ధి కావాలనే లక్ష్యం ఉంటూ వున్నప్పటికీ వ్యవసాయోత్పత్తి ఎక్కువచేయాలనే ఉద్దేశం ముఖ్యంగావున్నది. ఏమంటే వ్యవసాయమే మన జీవనోపాధి. అరవై నాలుగు విద్యలూ అవుపొదుగులో ఉన్నవంటారు. ఆ విధంగా ఇన్నికోట్ల ప్రజలు మన పొలం పంటల కెదురుచూస్తూ ఉంటారు. ఈ పరిస్థితులలో క్షణ క్షణానికీ కొన్ని వందల శిశువులు మన దేశంలో జన్మిస్తున్నారు. పెరుగుతూవున్న జనసంఖ్యను పోషించేది సేద్యభూమేకదా. అందుచేత ఇదొక పెద్ద సమస్యగా ఉంది. మన తెలివి తేటలకూ, శక్తి సామర్థ్యాలకూ ఇదొక పరీక్ష. ఈ పరిస్థితిలో ఆహారాన్ని ఎక్కువ చేయడమో లేక ఆహుతి కావడమో ఒక్కటే మార్గం. కనుక ఆహార శాస్త్రజ్ఞుల సూచన ప్రకారము నిత్యమూ పెరుగుతూవున్న జనాభాకు చాలినంత ఆహార వస్తువులనే కాకుండ మన దేశంలోని పరిశ్రమలకు కావలసిన కొన్ని ముడి పదార్థాలను కూడ ఇతోధికంగా ఉత్పత్తి చేయడమే కర్తవ్యం. సాగులోనికి రాకుండా ఉన్న కొంతభూమి, సాగు నీటిపారుదలకు నదీ జలాశయాలు ఉన్నప్పటికీ, ఇంకా ఎక్కువగా క్రొత్త భూములను సాగుచేసే అవకాశాలుతగుమాత్రం ఉన్నవి. పోనీ—అడవుల పొలిమేరకు పోయి చెట్టు చేమలు కొట్టి సేద్యవంతం చేదామనుకుంటే మనరాష్ట్రంలో అడవుల విస్తీర్ణం కూడా తక్కువగా ఉంది. అందుచేత, ప్రస్తుతం ఉన్న సాగునేలలోనే సాధ్యమైనంత ఎక్కువగా పండించడమే మన కర్తవ్యం.

మనపంచవర్షప్రణాళికలలో మొదటినుండి ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయోత్పత్తికై అగ్రస్థానమిస్తున్నాము; ఆ లక్ష్యసాధనకై అవిరళకృషి చేస్తున్నాం. ఇంతలో చైనా దురాక్రమణ వచ్చినందువల్ల మన వ్యవసాయ పథకాలస్థాయి, గమనం, లక్ష్యం మొదలగునవి ఎక్కువచేయవలసి వచ్చింది. మూడవ ప్రణాళిక అంతమయ్యే సరికి 27 లక్షల 90 వేల టన్నుల ఆహార ధాన్యాలు, 4 లక్షల టన్నుల చమురు గింజలు, ఒక లక్ష 18 వేల టన్నుల చెఱకు, పంచదార, 85 వేల బేళ్ళ ప్రత్తిని అదనంగా పండించనున్నాము. దీనికి తగిన వ్యవసాయ కార్యక్రమాలలో 227 పథకాలున్నాయి. వీటి ఖర్చు 1300 లక్షల రూపాయలు.

ఈ కార్యక్రమంలో అధికోత్పత్తికి సహాయపడగల విద్య, పరిశోధన, ప్రచారం మొదలయినవికూడా చేరివున్నాయి. అయినా ఉత్పత్తికి సంబంధించిన మేరకు చిన్నతరహా నీటిపారుదల, క్రొత్త భూములను సాగులోనికి తేవడం, భూసార పరిరక్షణ, మెట్టసాగులలో మేలైన పద్ధతులు, మంచి జాతి విత్తనాల వాడుక, పచ్చి ఎరువులు, కంపోస్టులు, రసాయనికపు ఎరువులు, సస్యరక్షణ మొదలైనవి ఉన్నాయి.

విస్తృతంగా భూమిని సాగుచేసి పంట నెక్కువ చేద్దామనే ఆలోచన ఎక్కువఖర్చు మాత్రమేకాక అలక్ష్యంగా జరిగేపని. సాగు నేలకు గంపడిస్తే, గరిశడిస్తానంటుందట; కనుక ప్రస్తుతం సాగులో ఉన్న ప్రతి ఎకరాలోను వీలైనంత ఎక్కువ మదుపుతో భూసారాన్ని పెంచి, మంచి పద్ధతులలో చేలను పండిస్తే, పెట్టుబడికి, పడినశ్రమకు ఎన్నోరెట్లు ఫలితం వస్తుంది. అప్పుడు

మనసేద్యం 'రాజుచేతిలోని నిమ్మపండు' మాదిరి రాణిస్తుంది. ఈ అనుభవంతో "సాంద్రవ్యవసాయ పథక" మనేది జిల్లా స్థాయిని తయారయి అమలులోనికివచ్చింది. మనరాష్ట్రంలో పశ్చిమగోదావరిజిల్లాకిది వర్తింపజేయబడి 1960 రాబీ కాలంలో ప్రారంభమయింది. ఈ పథకంక్రింద రైతులకు కావలసిన విత్తనాలు, ఎరువులు, సస్య రక్షక ఔషధాలు, ఋణం, సాంకేతిక సహాయం మొదలైనవి చాలినంతగా సకాలంలో అందజేయ బడుతూన్నవి. కడచిన మూడు సంవత్సరాలలో ఈ పథకం వలన ప్రయోజనం చాలా ప్రోత్సాహకరంగా ఉన్నది. ఎకరా దిగుబడి పంటలలో పెరిగింది. ముఖ్యంగా వరిపంటలో ఎకరాకు 1000 పౌనులు ఎక్కువ పండింది. అంటే సామాన్యంగా వచ్చే ఎకరా దిగుబడిలో నూటికి 54 వంతులు ఎక్కువ. సగం పంటకు పైగా ఈ పథకం వలన ఎక్కువ పండిందంటే స్వల్ప విషయంకాదు. ఎన్నో అంతస్తులలో ఈ కార్యక్రమ నిర్వహణలో ప్రజాపాలకులు వ్యష్టిగాను, సమిష్టిగానూ కృషిచేసి ఉండబట్టి, ఇంతటి తృప్తి కలిగింది.

ఇది ఇంతతో ఆగలేదు. సాంద్ర వ్యవసాయ విధానం ఈ పరిస్థితిలో శరణ్యమని ఋజువయింది. కనుక మరో పది జిల్లాలలో ఈ విధానమే గల సాంద్ర వ్యవసాయ పథకాన్ని మన రాష్ట్ర ప్రభుత్వం అమలు పరిచింది. అయితే ఈ పథకానికి పశ్చిమగోదావరి జిల్లాలో నడుస్తూన్న పథకమంతటి విస్తృత స్వభావం కానీ ధన సహాయంకానీ లేదు. సాంద్రవిధానంలోని ప్రధాన అంశాలు తప్పకుండా చేతనున్న ఆర్థిక స్తోమత కనుగుణంగా తగు సవరణలు చేసి తూర్పు గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కర్నూలు, మహబూబ్ నగర్, వరంగల్, కరీంనగర్, నిజామాబాదు జిల్లాలలో ఈ పథకాన్ని ఈ సంవత్సరమే తొలిపంటకాలంలో ప్రారంభించారు.

ఈ పథకం క్రింద వరి, జొన్న, రాగి (చోడి), మొక్కజొన్న, చెరుకు, వేరుశనగ, ప్రత్తి, అరటి కూరగాయల ఉత్పత్తిని ఎక్కువ చేయాలని ఉద్దేశం. ఈ పంటల విస్తీర్ణంలో తొలి సంవత్సరం 40 శాతం, రెండవ యేడు 70 శాతం ఇక మూడవయేడు పూర్తిగాను పథక కార్యక్రమాలతో నిర్వహిస్తారు. అంతటితో మూడవ పంచవర్ష ప్రణాళిక చివరకు వస్తుంది. అప్పటికి ఆయాపంటల దిగుబడిలో అయిదవవంతు హెచ్చు కాగలదు. పది జిల్లాలలో కొత్తగా ఈ యేటినుండి నడప బడుతున్న సాంద్ర వ్యవసాయ కార్యక్రమ లక్ష్యం ఇది. సహకార సంఘాల ద్వారానూ, ఎరువుల కొనుగోలుకై ప్రత్యేకంగా ఇవ్వ బడుతూఉన్న ఋణాల ద్వారానూ, రైతులకు తగు ధనసహాయపు ఏర్పాట్లున్నాయి.

మెట్ట భూములలో కూడ సాంద్ర వ్యవసాయం జరిపి ఉత్పత్తిని ఎక్కువ చేద్దామని మిగతా 10 జిల్లాలలో ఉన్నట్లే, ఆదిలాబాదు, అనంతపురం జిల్లాలలో ఒక పథకాన్ని ప్రభుత్వం ఈ యేడు రాబీ జొన్న పంటలతో ప్రారంభించింది. క్రమంగా మెట్ట సాగులలోనున్న మిగతా పంటలకు, జిల్లాలకు కూడా ఇది వర్తింపజేయబడుతుంది.

ఆంధ్ర ప్రదేశ్ చమురుగింజల పంటకు కూడ ముఖ్యమైనది. కనుక మూడవ ప్రణాళిక అంతమయ్యేసరికి అదనంగా 4 లక్షల టన్నుల చమురు గింజలు ఉత్పత్తి చేయవలసిన లక్ష్యాన్ని నిర్ణయించు కున్నాము. ఈ చమురు గింజలలో వేరుశనగలు మనకు ముఖ్యం. నీటి పారుదలకు నదుపాయ ముంటే వర్షాధారంతో కంటే ఎక్కువగా పండించ గలమని అనుభవం. కనుక కర్నూలు జిల్లా తుంగభద్ర ప్రాజెక్టు దిగువ ఎమ్మిగనూరు తాలూకాలో 17 గ్రామాలు తీసుకొని వాటిలో 5000 ఎకరాల మేరకు సాంద్ర వ్యవసాయ సిద్ధాంతాలను, పద్ధతులను చేర్చి ఒక పథకం గత సంవత్సరం అమలు పరచబడింది. దీని ఫలితం ఎంతో ఉత్సాహంగా ఉంది. ఏమంటే ఇదివరకు ఎకరాలో సరాసరి దిగుబడి 397 కిలోగ్రాములుండగా ఈ పథకం అమలు జరిగిన తర్వాత 524 కిలోగ్రాములకు దిగుబడి పెరిగింది. అందు చేత మరిరెండు జిల్లాలలో—చిత్తూరు, మహబూబునగరు జిల్లాలలో – ఈ సంవత్సరం దీనిని ప్రవేశపెట్టడం జరిగింది.

సాంద్ర వ్యవసాయ విధానం ఇంతటితో ఆగిపోలేదు. ప్రత్తిపంటకు కూడా వర్తింప జేశారు. ముఖ్యంగా పొడవుపోచప్రత్తి మనకు కావాలి.

వరిపంట కోతలైన తర్వాత గుంటూరు, కృష్ణా డెల్టా భూములలో పి. 216 ఎఫ్ అనే పొడవుపోచప్రత్తి రకాన్ని పెంచడానికి ఎక్కువ అవకాశం, లాభం ఉన్నట్లు కన బడింది. ముఖ్యమైన రెండువరిపంటలకు గల మధ్య కాలంలో పండగల రకమిది. అందు చేత గత సంవత్సరం 5000 ఎకరాలలో ఈ రకం ప్రత్తి సాంద్ర వ్యవసాయ విధానంలో పండించబడింది. ఈ సంవత్సరం 20000 ఎకరాలకు, వచ్చేసంవత్సరం 50000 ఎకరాలకు ఇది విస్తరింప బడుతుంది.

ప్రత్యేకంగా ఒక సాంద్ర వ్యవసాయ పథకం ఉన్నా లేకపోయినా పంటల దిగుబడిని ఎక్కువచేయగలవాటిలో ఎరువు లొకటి. సేంద్రియపుఎరువులు, రసాయ నికపుఎరువులు అవసరం. స్థానికంగా ఆకు

లములు, చెత్త చెదారాలు, పశు మల మూత్రాలు మొదలైన వెన్నో సేంద్రియపు ఎరువుల తయారీకి ఉపయోగిస్తవి. పచ్చి ఎరువు పైర్లకు తగినవి కూడా ఎన్నో ఉన్నవి. ఈ విధమైన సేంద్రియపు ఎరువులను గ్రామములోనే సొంతంగా తయారు చేసుకోవచ్చు కనుక, ఈ విషయాలలో ఎక్కువ శ్రద్ధాసక్తులతో ఫలితాన్ని పొందగల కార్యక్రమాలు సాగుతూ ఉన్నవి. ఇక రసాయనికపు ఎరువుల విషయమై మనం కంపెనీలపై ఆధారపడవలసి ఉంది. అయినా మన రాష్ట్రానికి చాల ఎక్కువ సరఫరా అయ్యేటట్లు ప్రభుత్వం శ్రద్ధ తీసుకున్నది.

మూడవ ప్రణాళిక చివరి రెండు సంవత్సరాల కాలంలో $11\frac{1}{2}$ లక్షల టన్నుల నత్రజని యెరువులు, 6 లక్షల టన్నుల సూపరు ఫాస్ఫేటు (భాస్వరపు ఎరువు)ను సరఫరా చేయగల కార్యక్రమం ఏర్పాటయింది. వీటికి తోడుగా 487 లక్షల టన్నుల కంపోస్టు, ఒకలక్ష టన్నుల మానవ పురీషపు కంపోస్టు తయారు చేయాలని మా లక్ష్యం.

వ్యవసాయోత్పత్తిని ఎక్కువ చేసే కార్యక్రమాలకు సహాయపడే అంశం మరొకటి కూడావుంది. అదేమంటే 'భూసార పరిరక్షణ' నదీలోయలలోనూ, ఏటవాలుగా వున్న మెరక ప్రాంతాలలోనూ, వాన వరదల వల్ల నేలకోత జరుగుతూ ఉంటుంది. అందువల్ల భూములు నిస్సారమై నిష్ప్రయోజనమవుతూన్నవి. ఈ దుస్థితిని వారించి, భూసారాన్ని నిలపగల కార్యక్రమాలలో వాలుగట్లు వేయడం గడ్డి సేద్యం, పీల్చిక సేద్యం, సస్యపరివర్తన మొ॥ పద్ధతులు చేరివున్నాయి. వీటివలన తక్షణ ఫలితం ఫలసాయంలో కన్పించకపోయినా నిలకడపై, భూసారం ఎక్కువవటం వలన, బహుకాలం వరకు వ్యవసాయోత్పత్తిని హెచ్చుస్థాయిలో నిలపగలవు. కనుక ఈ కార్యక్రమం మన రాష్ట్రంలో జరుగుతూ వున్నది.

ఇంతవరకు $1\frac{1}{2}$ లక్షల ఎకరాలలో ఈ పనిబాట్లు జరిగినవి. మూడవ ప్రణాళికలో 2 లక్షల 66 వేల ఎకరాలలో జరుపుదామని లక్ష్యం. దీనికి రైతు పొలాల్లో వాలుగట్లు వేసే నిమిత్తం, ఒకకోటి 74 లక్షల రూపాయల ఖర్చు అవుతుంది. ఈ ఖర్చు భరించడం రైతులకు కష్టం, కనుక ఆ ఖర్చుని ముందుగా ప్రభుత్వమే భరించి, తాపీగా 15 సంవత్సరాలలో వాయిదాలపై వసూలు చేస్తారు. వాలుగటు వేసి, పొలాలను చదును చేసినతర్వాత సాంద్రపద్ధతులలో మెట్ట వ్యవసాయం చేసి ఉత్పత్తి నెక్కువచేయడమెలాగో చెప్పిచేయించే సాంకేతిక సిబ్బంది శ్రద్ధవహిస్తున్నారు.

ఏ మహత్తర కార్యమయినా నడిపేటప్పుడు, నడిపించేవారికి నడపబడే వారికి కూడ తగిన విద్యావ్యాసంగం చాలా అవసరం. వ్యవసాయరంగంలో కావలసిన సాంకేతిక విద్య, పరిశోధన, ప్రచారం ఉన్నది. ఈ మూడింటిఫలితం వ్యవసాయోత్పత్తిలో కన్పడుతుంది. కనుక వీటిలో పరస్పరంగా ఒక కలయిక ఉండాలి. వీటి కనుగుణంగా కార్యక్రమాల రూపురేఖలను తీర్చిదిద్దే ఉద్దేశంతో రాజేంద్రనగర్‌లో వ్యవసాయ విశ్వవిద్యాలయమొకటి త్వరలో ఏర్పాటు కానున్నది. దీనికై 206 లక్షల రూపాయలు ఖర్చు అవుతుంది. ఈ మూడవ ప్రణాళిక ముగిసే లోపుగా 125 లక్షల ఖర్చుగాగల పనిబాట్లను పూర్తిచేద్దామని మా ఉద్దేశము.

ఇటువంటి వ్యవసాయ విశ్వవిద్యాలయం పనిచేస్తూ ఉన్నందువలన, పరిశోధనా ఫలితాలు ఇంతకంటె విరివిగా రైతుల ఆచరణలోనికి వచ్చి ఫలసాయాన్ని ఎక్కువ చేయడానికి వీలుంటుంది. ఇప్పుడు వ్యవసాయ శాఖ నిరహిస్తూ ఉన్న పరిశోధన, విద్యా భాగాలు ఆ విశ్వవిద్యాలయంలో ముమ్ముందు ఉండగలవు. దీనివలన వ్యవసాయశాఖకు వ్యవసాయోత్పత్తి విషయంలో ఎక్కువకృషి చేయ వీలుంటుంది. ఒకవైపు విశ్వవిద్యాలయం, వేరొకవైపు ప్రభుత్వ వ్యవసాయ శాఖ — వీటితో వ్యవసాయదారులు పరస్పర సహకారంతో ముందడుగు వేయగలరని, ఆంధ్ర ప్రదేశ్ అత్యధికంగా పండించబడు రాష్ట్రాలకు ఎగుమతి చేయగలదనీ పరిశ్రమలకు కావలసిన ముడిసరకులనుకూడా అధికంగా ఉత్పత్తిచేసి ఆర్థికస్థాయిని ఎక్కువ చేయగలదనీ ఆశిస్తున్నాము.

రానున్నది నాల్గవ ప్రణాళిక. నాటికి నేటికి మనఎదుట నిలచి నిరంతర కృషి కోరే ఏకైకలక్ష్యం — అధిక వ్యవసాయోత్పత్తి. కనుక నాల్గవ ప్రణాళికలో మూడవ ప్రణాళిక లక్ష్య ప్రమాణాలకు $1\frac{1}{2}$ రెట్లు సాధిద్దామని ఉద్దేశం. దానికి తగిన పథకాలు ఆలోచనలో ఉన్నవి. వాటివలన 40 లక్షల టన్నుల ఆహారధాన్యాలు, 6 లక్షల టన్నుల వేరుశనగలు (?) — చమురుగింజలు, 1 లక్ష 75 వేల టన్నుల చెరకు పంచదార, 1 లక్ష 25 వేల బేళ్ళపత్తి అదనంగా ఉత్పత్తి కాగలవు. ఈ లక్ష్య సాధనలో 60 వేల ఎకరాలకు అదనంగా సాగునీటి పారుదల, 4 లక్షల ఎకరాల కొత్తభూమిని బాగుచేసి సాగుకు అనుకూలపరచడం, 5 లక్షల ఎకరాలలో భూసార పరిరక్షణ, 13 లక్షల ఎకరాలలో పచ్చి ఎరువు వాడకం, $22\frac{1}{2}$ లక్షల టన్నుల రసాయనిక భాస్వరపు ఎరువులు, $37\frac{1}{2}$ లక్షల టన్నుల నత్రజని ఎరువులు, 1 లక్ష 19 వేల టన్నుల మేలురకం మేలైనజాతి విత్తనాల పంపకం, 2 కోట్ల ఎకరాలలో సస్యరక్షణ, మొదలైన కార్యక్రమాలకు చెందినపథకాలు రానున్నాయి.

సాంద్ర వ్యవసాయ పద్ధతి ముమ్మందు ఇతోధికంగా నాల్గవ ప్రణాళికలో రాష్ట్రంలో వ్యాపించగలదు. మన ఏకైక లక్ష్యమైన అధిక వ్యవసాయోత్పత్తిని సాధించగలమని కృతనిశ్చయంతో ముందడుగు వేస్తున్నాము.



# ప్ర బో ధ ము

వారణాసి వెంకటేశ్వరులు

బంధుర సంపదాళియుత భారతజాతి విదేశరాజ్య సం
బంధముచేత నక్కట! అమానుష భీకరపారతంత్ర్య ని
ర్బంధమునం గృశించి,పలుబాములపాలయి బాధనందుచోన్
గాంధిమహాత్ము నుద్యమమునన్ లభియించెనహో!స్వరాజ్యమే!

భరతభూమికి స్వాతంత్ర్య భాగ్యమబ్బె;
కాఁగ దారిద్ర్యము నవిద్య రోగబాధ
సస్యహీనతయును పరిశ్రమలకోఁత
జరిగి మాతృదేశమ్ము నిస్సారమయ్యె ॥

ఎట్టి భాగ్యమ్ముగల దేశమేని కాని
నియమబద్ధ ప్రణాళికానిరతి లేక
అగునె వృద్ధి? రష్యామొదలైన దేశ
ములు ప్రణాళికాతతిచేత పొందె వృద్ధి ॥

ఒక నిర్దిష్ట విశిష్టపద్ధతిఁ బ్రభుత్వోద్యోగివర్గమ్ము లె
క్కకు మీఱన్ సమకూర్చి లభ్యమగు భాగ్యంబెల్ల, దేశాభివృ
ద్ధికినై వెచ్చముసేఁ బొనర్చుటకు యత్నింపంగడంగన్ ప్రణా
ళిక గానెంతురు; నేఁడు మూఁడవది వెల్గెన్ సాము భాగమ్మునన్

దారము లేని మాలిక - ఉదార గుణమ్ములు లేని వ్యక్తి - బం
గారము లేని భూష - మడికారము లేని కవిత్వమున్ - సదా
చారము లేని పాండితియు - సారవిచార బృహత్ప్రణాళికా
ధారము లేని దేశము వృథాయగుగాదె తలంచి చూడగన్॥

వేఁకొంబందికోట్లు మనవిత్తము వెచ్చముచేసి జాతి సౌ
ఖ్యాలకు మూలకందమగునట్టుల చేయు ప్రభుత్వపుం గృషిన్
పాలును గొంచు, సాయముగ భారత సోదరులెల్ల నిల్చుచో
లీల ప్రణాళికా విజయడిండిమముల్ మినుముట్ట మ్రోయవే!॥

జాతిం గాంచియు, దేశముం దలఁచియున్, స్వాభావిక
మ్మెంచియున్
ఖ్యాతిం గన్గొని, కోట్లసంఖ్య జనసంఘంబున్ విలోకించి, వి
ఖ్యాతం బౌ నదులెంచి, ఆర్థికసమస్యన్ బెల్లు యోజించి, సం
ప్రీతిం గొల్పు ప్రణాళికా విజయలక్ష్మిం గూర్చుడీ సోదరుల్॥

సంకటముల్ పదింబదిగ సంభవమైనను, వెంటనంటి యా
టంకము లెన్ని యేని మిము డాసిన, భూరి ధనవ్యయాసకున్
గొంకక, కార్యభారమునకున్ వెనుదీయక భారతీయులున్
కంకణముల్ ధరింపుడు ప్రణాళికలం బరిపూర్తిసేయగా ॥

విద్యాపద్ధతి వృద్ధిచేసి ప్రజకున్ విస్తార విజ్ఞాన సం
పద్యోగమ్మునుగూర్చి, సస్యచయసంపన్నమ్ముగావించియున్,
వైద్యస్ఫూర్తి ఘటించి, సర్వవిధ సౌభాగ్యాలవాలమ్ము నౌ
విద్యుచ్ఛక్తిని ఈ ప్రణాళిక లె వే వెల్గొందగా జేయుతన్ !॥

మన నాగార్జునసాగరు
కన, భాక్రానంగలాదిగా గలకట్టల్
మునుకొని ప్రణాళికా జయ
మును జాటు మహాపతాకములు తలపోయన్ !॥

జాతీయభాగ్యమ్ము సాలున కైదు
శాతమ్ము చొప్పున పెంపుదలను చేఁత,
ఆహారధాన్యమ్ము లధికమ్ముగాఁగ దే
శమ్మున పండ యత్నమ్ముసేఁత,
ఉక్కుమున్నగువాని యుత్పత్తిగావించి
మితిలేని యంత్ర నిర్మితినిచేఁత,
జనశక్తి ఘనముగా విని యోగమును జేసి
బహువిధోద్యోగ కల్పనముసేఁత

సామ్యవాదసిద్ధాంత మాచరణసేఁత
విపినసంపద సొంపును వృద్ధిసేఁత
మూఁడవప్రణాళిక ముగియబోవులోన
యత్నమొనరింప దగిన కృత్యమ్ములివియె !

ఎలరారుగావుత ! ఎల్లరంగాలలో
భారతాభ్యుదయమ్ము బహుముఖాల
అలరారుగాత ! పుష్కల సస్యలక్ష్మివి
లాస మెల్లెడలను భాసురముగ
పొనరారుగాత ! మా భూరికర్మాగార
నిర్మాణనైపుణి నిఖిలదిశల
తనరారుగాత ! విద్యావైద్యసౌకర్య
ముఖల ప్రజకు నిరభ్యంతరముగ

క్రాలుగాత ! సమాజ వికాసపథము
వెలయుగావుత ! మా కీర్తి విశ్వవీథి
పంచవర్ష ప్రణాళికా బద్ధ విపుల
యత్నసముదాయ సంసిద్ధి యగుచు మాకు !




### శాంతి చిహ్నాలు

విదేశాలలోని అనేక సైనిక స్థావరాలను మూసి వేయడానికి అమెరికా నిశ్చయించిన వెంటనే రష్యా ప్రధాని, వచ్చేసంవత్సరం సోవియట్ సైనిక వ్యయాన్ని తగ్గించ దలిచినట్లు ప్రకటించారు. సైనిక దళాల సంఖ్యా బలాన్ని తగ్గించే విషయం కూడా తమ ప్రభుత్వం పరిశీలిస్తున్నట్లు ఆయన తెలిపారు. అయితే ఆయన, ఏ దురాక్రమణ జరిగినా సరే ప్రతిఘటించడానికి సోవియట్ యూనియన్ కు "కావలసిన హంగులన్నీ అవసరాన్ని మించే వున్నా''యని అన్నారు.

1964–65 వ సంవత్సరానికి రష్యా తన సైనిక వ్యయాన్ని 600 మిలియన్ రూబుల్స్ (సుమారు రూ. 396 కోట్లు)కు తగ్గించుకుంటున్నట్లు మాస్కోలో ప్రకటించారు.

పారిస్‌లో దక్షిణ అట్లాంటిక్ ఒడంబడిక మినిస్టీరియల్ కౌన్సిల్ లో చేసిన ప్రసంగంలో అమెరికా స్టేట్ సెక్రటరీ శ్రీ డీన్ రస్క్ రష్యాకూ, చైనా కమ్యూనిస్టులకూ మధ్య ఆధిపత్యం విషయంలో వచ్చిన పోరాటంలో రష్యాకు సహాయం చేయవలసిందిగా పశ్చిమ రాజ్య కూటాల వారిని కోరారు. ఈ ప్రసంగం అసాధారణమైనదిగా పరిగణించ బడుతున్నది. పెకింగ్ ప్రదర్శిస్తున్న సైనిక మనస్తత్వానికంటే మాస్కో అనుసరిస్తున్న శాంతియుత సహజీవన విధానమే పశ్చిమ రాజ్యాలకు చాలా ప్రయోజనకారి అయినట్లు ఆయన పేర్కొన్నారు.

అమెరికా అధ్యక్షుడు శ్రీ జాన్సన్ ఐక్య రాజ్య సమితి జనరల్ అసెంబ్లీలో ప్రసంగిస్తూ శ్రీ కెనెడీ హత్య వల్ల తమ దేశం అనుసరించే విధానాలలో మార్పు ఏమీ వుండబోదని సుస్పష్టంచేశారు.

(1) ప్రచ్ఛన్న యుద్ధాన్ని శాశ్వతంగా తుదిముట్టించడం, (2) ప్రస్తుతం అణ్వస్త్రాలు లేని దేశాలకు ఆ జాడ్యం వ్యాపించకుండా చేయడం, (3) ఆయుధ శక్తిని పెంపొందించుకోకుండాచూడడం, (4) అనాదినుంచీ మానవకోటిని పీడిస్తున్న ఆకలి, అజ్ఞానం, వ్యాధులను జయించడంలో ఐక్యరాజ్యసమితి సభ్యదేశాలన్నింటితో సంపూర్ణంగా సహకరించడమే అమెరికా లక్ష్యమని శ్రీ జాన్సన్ పేర్కొన్నారు.

### ఆఫ్రికాలో నూత్న స్వతంత్ర దేశాల అవతరణ

గత నెలలో ఆఫ్రికా ఖండంలోని రెండు దేశాలు కొత్తగా స్వాతంత్ర్యం పొందాయి. డిశంబరు 9 వ తేదీన జాంజిబార్ సంపూర్ణ స్వాతంత్ర్యం పొందింది. ఈ దేశం 1890 వ సంవత్సరం నుంచీ బ్రిటిష్ రక్షణలో వుంటున్నది. ఇప్పటి జాంజిబార్ సుల్తాన్ "హిజ్ మెజస్టీ" బిరుదం పొందారు. గత 73 సంవత్సరాలుగా ఈ దేశపు సుల్తానులు ''హిజ్ హైనెస్'' అని వ్యవహరింపబడుతున్నారు. జాంజిబార్ జనాభా 300,000. వీరిలో 15,000 మంది భారతీయులు. కామన్వెల్తులో వుండడానికి ఈ దేశం నిశ్చయించింది.

జాంజిబార్ స్వాతంత్ర్యం పొందిన రెండు రోజుల పిమ్మట కీన్యా, ఆఫ్రికాలో 34 వ స్వతంత్రదేశంగా అవతరించింది. గత 60 సంవత్సరాల నుంచీ కీన్యా వలస పాలన క్రింద వుంటున్నది. శ్రీ జోమో కెన్యట్టా కీన్యా తొలి ప్రధాన మంత్రి అయ్యారు. ఈ దేశ జనాభా 8,600,000. వీరిలో ఆసియా వారు 180,000 మంది; యూరోపియన్లు 60,000 మంది. జాతి, భాష, వర్ణ విచక్షణలను పాటించకుండా కీన్యాలోని ప్రజలందరినీ సమంగా చూసుకోవడం జరుగుతుందని శ్రీ కెన్యట్టా ప్రకటించారు. కీన్యా, ఉగాండా, టాంగానికా, జాంజిబార్‌లతో తూర్పు ఆఫ్రికా సమాఖ్యను స్థాపించడానికి కృషి జరుగుతుందని కూడా ఆయన ప్రకటన చేశారు. దక్షిణాఫ్రికాలో కొనసాగుతున్న జాతి విచక్షణను నిర్మూలించడానికి కీన్యా పోరాడుతుంది.

కొత్తగా స్వాతంత్ర్యం పొందిన ఈ రెండు దేశాలు ఐక్యరాజ్యసమితిలో సభ్యత్వం పొందాయి.

శ్రీ జోమో కెన్యట్టా నాయకత్వాన కీన్యాలో సాగిన స్వాతంత్ర్య పోరాటానికి భారతదేశం సానుభూతి ఎల్లప్పుడూ లభించింది. స్వతంత్ర కీన్యాను అభినందిస్తూ మన ప్రధాన మంత్రి సందేశం పంపారు. ప్రెసిడెంట్ జాన్సన్ కూడా అభినందన సందేశం పంపించారు. ఈ నూత్న స్వతంత్ర దేశాన్ని ప్రథమంగా పరిగణించిన దేశాలలో రష్యా, చైనాలు కూడా వున్నాయి.

కీన్యాలో నివసిస్తున్న ఆసియా ప్రజలలో భారతీయులు ఎక్కువ. వారు ప్రభుత్వోద్యోగులుగా, వర్తకులుగా, కళాకారులుగా, వృత్తి పనివారలుగా వుంటున్నారు.

### పాకిస్తాన్‌కు వ్యతిరేకంగా ఐ. రా. సమితి తీర్పు

కాశ్మీర్‌లోవున్న ఐక్యరాజ్య సమితి

తాలూకు ప్రధాన సైనిక పరిశీలకుని నివేదిక ప్రకారం, చాక్ నాట్ సమీపంలో తమ సైన్యాలను సమీకరించి నిర్యుద్ధ రేఖను ఉల్లంఘించింది పాకిస్తానే కాని ఇండియా కాదు. చాక్‌నాట్ వద్ద ఇండియా సైన్యాలను సమీకరించిందంటూ పాకిస్తాన్ చేసిన ఆరోపణలను పురస్కరించుకొని ఆయన జరిపిన దర్యాప్తువల్ల కూడా ఈ అంశమే వెల్లడైంది. నిర్యుద్ధరేఖపై మన భాగంలో నున్న ఈ చాక్‌నాట్ గ్రామం తనదని పాకిస్తాన్ [illegible] ఉల్లంఘించిందంటూ పాకిస్తాన్ సాగిస్తున్న ప్రచారం ప్రపంచాన్ని మభ్యపరిచి ఆ గ్రామాన్ని కాజేయడానికి వేసిన ఎత్తుగడ మాత్రమే.

భారతదేశం సైనిక దళాలను సమీకరించడాన్ని గూర్చి పాకిస్తాన్ చేసిన ఆరోపణలపై తీర్పు నిచ్చే అధికారం ఐక్యరాజ్య సమితి పరిశీలకులకు ఎక్కడిదని పాకిస్తాన్ విదేశాంగ మంత్రి శ్రీ భుట్టో ప్రశ్నించారు. ఈ పరిశీలకులు వెలిబుచ్చిన అభిప్రాయాలను ''అవార్డు'' గా పరిగణించడానికి వీలులేదని ఆయన అన్నారు. ఢిల్లీలో విదేశాంగ మంత్రిత్వశాఖ ప్రతినిధి ఒకరు శ్రీ భుట్టో ప్రకటన సరైనదికాదని పేర్కొంటూ న్యాయ శాస్త్ర రీత్యా ఇది ''తీర్పు'' కాకపోవచ్చు కాని నియమ నిబంధనల క్రింద మాత్రం ఇది ముమ్మాటికీ ''అవార్డు'' యేననీ, కాగా ఈ నియమనిబంధనలకు ఇండియా, పాకిస్తాన్, ఐక్యరాజ్యసమితి — ఇవన్నీ కట్టుబడి వున్నాయనీ అన్నారు.

శ్రీ భుట్టోకూ, పాకిస్తాన్ నాయకులకూ ఇది కొత్త అనుభవమైనట్లు కనిపిస్తున్నది. ఆ నాయకులు తాము ఏమి చేసినప్పటికీ, పరిశీలకుల ఆసరాను పొందడాన్ని మాత్రమే బహుశా ఎరిగి వుంటారు. కనుకనే శ్రీ భుట్టోకు ఆయన బృందానికి ఈ మార్పు భరించ లేనిదిగా వుంది. ఒక వంక పశ్చిమ రాజ్యాలతో సైనిక ఒప్పందాలు కుదుర్చుకుంటూనే మరోవంక నీతి నియమాలు లేకుండా చైనాతో చెలిమిచేస్తూ పాకిస్తాన్ నాయకులు భారత దేశానికి హాని కలిగించడానికి [illegible] త్నించారు. అయితే అంతిమంగా సత్యమే జయించి తీరుతుంది.

## అమెరికా అసంతృప్తి

వచ్చే ఫిబ్రవరి నెలలో తమ దేశాన్ని సందర్శించ వలసిందిగా పాకిస్తాన్ చైనా ప్రధాని శ్రీ చౌ ఎన్‌లైని ఆహ్వానించడం పట్ల అమెరికా అసంతృప్తి వెల్లడించింది. ''సీటో'' లో పాకిస్తాన్ సభ్యదేశం.

అమెరికా స్టేట్ డిపార్ట్‌మెంట్ ప్రెస్ ఆఫీసరు ఒకరు ఈ విషయం ప్రకటిస్తూ ప్రపంచంలో మిగతా దేశాలవారంతా శాంతి సాధనకు కృషి చేస్తూండగా చైనా కమ్యూనిస్టులు మాత్రం అంతర్జాతీయ సంబంధాలలో హింసావిధానాలను అనుసరిస్తూనే వున్నారని అన్నారు.

## నిష్ఫలమైన రాయబారం

ప్రతిపాదిత అలీన రాజ్యాల సమావేశం జరగకుండాచేసి, బాండుంగ్ సమావేశం పద్ధతిలో ఆఫ్రికా, ఆసియా రాజ్యాల సమావేశాన్ని ఏర్పాటుచేసే ఉద్దేశంతో జరిపినట్లు తెలుస్తున్న చైనా ప్రధాని సంయుక్త అరబ్ రిపబ్లిక్ పర్యటన, పాకిస్తాన్ అధ్యక్షుని సింహళం పర్యటనలు ఫలించలేదు.

సంయుక్త అరబ్ రిపబ్లిక్ అధ్యక్షుడు శ్రీ చౌ ఎన్‌లైకి సకల అతిథి మర్యాదలు చేశారు కాని ఈ విషయంలో ఆయన తన వైఖరిని మార్చుకున్నట్లు మాత్రం కన్పించలేదు. చైనా ప్రధానితో సంభాషణలు ప్రారంభించడానికి పూర్వం ఆయనకు యుగోస్లావియా అధ్యక్షుని నుంచీ, శ్రీ కృశ్చేవ్ నుంచీ సందేశాలు వచ్చాయి.

సింహళం ప్రధానమంత్రిణి, పాకిస్తాన్ అధ్యక్షుడు కొలంబోలో తమ చర్చలు ముగి[illegible] సంయుక్త ప్రకటన విడుదల చేశారు. కాని ప్రధాన అంశంపై ఉభయులకూ అంగీకారం కుదిరినట్లు మాత్రం ఈ ప్రకటనలో తెలుపబడలేదు.

ప్రతిపాదిత అలీన రాజ్యాల సమావేశంలో చైనా పాల్గొనడాన్ని యుగోస్లావియా పూర్తిగా వ్యతిరేకించింది.

చైనా, పాకిస్తాన్—ఈ రెండు దేశాలకూ అలీన రాజ్యాల సమావేశంలో పాల్గొనే అర్హత లేదనీ కనుకనే అవి ఈ సమావేశానికి ఇష్టపడవనీ ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ లోకసభలో తెలియ జేశారు. క్రిందటిసారి బెల్గ్రేడ్ సమావేశానికి చైనా, పాకిస్తాన్ దేశాలు ఆహ్వానించ బడలేదు.

అంతర్జాతీయం అవగాహనం పెంపొందడానికీ, ప్రచ్ఛన్న యుద్ధ ఉద్రిక్తతలు సడలడానికీ అలీన దేశాల సమావేశం జరగాలని సంయుక్త అరబ్ రిపబ్లిక్ అధ్యక్షుడు, సింహళం ప్రధాన మంత్రిణి చేసిన ప్రతిపాదనపట్ల భారత దేశం హర్షం వెలిబుచ్చింది. ఈ విషయంలో ఇందుకు సంబంధించిన ఇతర దేశాల అభిప్రాయాలను తెలుసుకోవడం జరుగుతున్నది.

చైనా ప్రధాని, పాకిస్తాన్ అధ్యక్షుడు జరిపిన ఈ పర్యటనలు,

అగ్రనాయకులే స్వయంగా రాయబారం జరిపినప్పటికీ-ముఖ్యంగా అది సద్భావంతో, నిజాయితీతో జరగనప్పుడు - అది మైత్రిని పెంచలేదనీ, ప్రజా దృష్టిని ఆకర్షించలేదనే సత్యాన్ని మాత్రమే వెల్లడించగలిగాయి. కొలంబో, కైరోలలో విడుదలచేసిన ప్రకటనలను జాగ్రత్తగా పరిశీలించినట్లయితే నిజంగా ఏదైనా అంగీకారం కుదిరినదనడానికంటే నమ్రతా వచనాలు ఎక్కువగా వల్లించినట్టుగా మాత్రమే కనిపిస్తుంది.

తటస్థరాజ్యమైన కాంబోడియా అమెరికాకు కోపంకలిగించే రీతిగా వాషింగ్టన్ నుండి తన దౌత్యప్రతినిధిని, దౌత్య కార్యాలయం సిబ్బందిని స్వదేశానికి పిలిపించుకొంది. దక్షిణ వియత్నాం, థాయిలాండ్ల నుండి పనిచేస్తున్న తిరుగుబాటు శక్తులకు అమెరికా మద్దత్తు యిస్తున్నదని దీని ఆరోపణ.

కొద్దికాలం క్రిందటే, అమెరికానుండి వచ్చే అన్నిరకాల ఆర్థిక సహాయాన్ని తిరస్కరించడానికి కాంబోడియా నిశ్చయించింది. ఇప్పుడు యిది అమెరికాను దాని ఆర్థిక, సైనిక సహాయాన్ని ఉపసంహరించుకోమని తెలియజేసింది.

అమెరికా తన రాయబారిని కాంబోడియా నుండి స్వదేశానికి రప్పించుకొంది. అయినా యిది ఏ విధంగానూ దౌత్య సంబంధాల తెగతెంపుకాదని అమెరికా తెలియజేసింది. అమెరికా అధ్యక్షుడు కెన్నెడీ మరణంపై కాంబోడియా రేడియో "సంతృప్తి"ని ప్రకటించిందని అమెరికా ఆరోపణ. ఈ ఆరోపణను కాంబోడియా ఖండిస్తూ సంతృప్తి ప్రకటన, ఉత్సవ నిర్వహణ కేవలం థాయ్ ప్రధాని మరణంపై జరిగినవే గాని వేరుకాదని వ్యక్తం చేసింది.

తటస్థ విధానంపై హామీ యివ్వడానికి ఒక అంతర్జాతీయ సమావేశాన్ని ఏర్పాటు చేయాలనే కాంబోడియా పిలుపుకు ఇంగ్లండు వ్యక్తంచేసిన అసంతృప్తికరమైన ధోరణివల్ల లండన్‌లోని కాంబోడియా దౌత్య కార్యాలయాన్ని మూసివేసినట్టు, అక్కడి దౌత్య కార్యాలయంలోని కాంబోడియా సిబ్బందిని స్వదేశానికి పిలిపించడం జరిగినట్టూ నోరదమ్ సిహనౌక్ రాజు ప్రకటించారు.

కాంబోడియా 60 లక్షలలోపు జనాభా కలిగివుంది. ఐనప్పటికీ ఇది భారత-చైనా ద్వీపకల్పానికి భౌగోళికంగా కీలక ప్రాంతంలోవుంది. పశ్చిమరాజ్యానుయాయుల కూటమికీ, కమ్యూనిస్టు చైనాకూ సరిహద్దు ప్రాంతంగా చెప్పబడుతూ వుంటుంది.

### శుష్క వాగ్దానాలు

ఎర్రచైనా నేపాలులో నిర్మించనున్న కాగితపు మిల్లు ప్రయత్నాన్ని విరమించుకొన్నదన్న విషయం, అదిచేసిన వాగ్దానాల మీద యింకా ఏమాత్రం నమ్మకమున్న యిరుగు పొరుగు చిన్న చిన్న రాజ్యాలకైనా భ్రమను పోగొట్టుతుందని యిటీవలి ఆ సంఘటనే వ్యక్తంచేస్తుంది.

తూర్పు యూరపు దేశాలనుండి అవసరమైన యంత్రాలు లభించని కారణంచేత ఇంతకుపూర్వం అక్కడ సిమెంటు కర్మాగారాన్ని నిర్మించే ప్రయత్నాన్ని చైనా విరమించుకున్నది.

### ప్రణాళికాబద్ధమైన కృషి

లోకసభలో ప్లానింగుమీద జరిగిన చర్చల్లో ప్రధాని కల్పించుకొని ప్లానింగుతో కూడిన ఆర్థికాభివృద్ధిని దేశంలో కల్పించే బృహత్తర కార్యాన్ని, నిరాశను పారద్రోలుతూ విశ్వాసంతో చేపట్టాలని దేశానికి ఒక విజ్ఞప్తిని చేశారు.

ప్లానింగ్ కమీషనును రద్దుచేయాలనే వ్యతిరేక పార్టీవారి వాదనను విమర్శిస్తూ దాని స్వరూపాన్ని మార్పుచేసే సూచనను కూడా ప్రధాని త్రోసిపుచ్చారు. గత రెండేళ్ళలోనూ సంభవించిన లోపాలను—ముఖ్యంగా వ్యవసాయ రంగంలో ఏర్పడిన వాటిని—ప్రస్తావిస్తూ ఏమైనా మొత్తంమీద ప్రణాళిక క్రింద సాధించిన అభ్యుదయం ఆసక్తికరమైనదే కాక అసాధారణమూ, అసమానమూ అని అన్నారు. సర్వులకు సమాన అవకాశాలను పోషిస్తు నమూనా సమాజం కల్పిస్తుంది కనుక, ఆ రకపు సమాజనిర్మాణానికి ఏమాత్రం వెనుకంజ వేయడం కూడదు. ముందుగా, యీ విషయమై జరిగే చర్చలో ఆర్థికమంత్రి శ్రీటి.టి. కృష్ణమాచారి ప్రణాళిక, ప్రణాళికా సంఘంపై వాటిని సమర్థిస్తూ ఉత్తేజకరమైన ప్రసంగం కావించారు.

ప్రణాళికను ప్రారంభించడం అనేది పులి సవారీవంటిది. అయినా దీనినుండి తప్పుకోవాలనే ఆలోచన ప్రభుత్వానికి లేదు. ఆర్థిక పురోగమనం జరగాల్సిందే. ఉత్పత్తి దెబ్బ తినే విధంగా ఒకేచోట ధనం కేంద్రీకృతమవుతున్నదనే భయాలకు తావివ్వరాదు అనేదే ఆయన ప్రసంగంలోని ముఖ్యాంశం, కేవలం ధన కేంద్రీకరణకు అవకాశం లేకుండా ఉండేవిధంగా ఉత్పత్తి ఉండరాదనే దానికన్న ధన కేంద్రీకరణ, ఉత్పత్తి — రెండూ ఉండాలనే నేను భావిస్తున్నాను" — అని ఆయన అన్నారు.

### స్వదేశీ పరిశ్రమలకు ప్రోత్సాహం

కేంద్ర ఆర్థికమంత్రి దేశంలో ఆర్థిక పరిస్థితిని గూర్చి లోకసభలో ప్రకటిస్తూ

పదహారు సరకులపై ధరల కంట్రోలు తొలగించడం జరిగిందనీ, లైసెన్సునుండి మినహాయింపు స్థాయిని రూ. 10 లక్షల నుండి రూ. 25 లక్షలకు పెంచడం జరిగిందని తెలియజేశారు. పెట్టుబడి ధనం కంట్రోలు ప్రయోజనార్థం వాటి పరిమితుల విధింపునుకూడా పెంచడం జరుగుతుంది.

ప్రస్తుతం వున్న లైసెన్సు విధానాలను తేలికపరచడానికి, దేశంలో తయారయ్యే ముడిసరుకుతో స్వదేశీ వస్తు సామాగ్రితో పరిశ్రమలను ప్రారంభించేందుకు ప్రత్యేక సహాయాన్ని కల్పించడానికి యీ చర్యలు తీసుకొనబడాయి.

## గోవాలో ప్రజా ప్రభుత్వం

గోవా, దయ్యూ, డామన్‌లలో 450 ఏళ్ళ తరువాత తొలిసారిగా సాధారణ ఎన్నికలు జరిగాయి. మొత్తం 30 స్థానాలకు 14 స్థానాలను సంపాదించుకొని అధిక బలంకల పార్టీగా వచ్చిన మహారాష్ట్రవాది గోమంతక్ దళానికి సంబంధించిన ముగ్గురితో ప్రజా ప్రభుత్వ మంత్రి మండలి ఏర్పాటైంది. దీనికి ఇద్దరు స్వతంత్రుల మద్దతువుంది. గోవాను తక్షణమే మహారాష్ట్రలో విలీనం చేయాలని యీ పార్టీపట్టుదల. ఇది ఏడు నెలల క్రితమే ఏర్పడింది, ఈ పార్టీ పార్లమెంటు ఉభయ సభల సీట్లనుకూడా గెలుచుకుంది.

దీనితరువాత యునైటెడ్ గోవన్స్ వస్తుంది. దీనికి అసెంబ్లీలో 12 సీట్లు వున్నాయి. స్వతంత్రులకు మూడు, కాంగ్రెసుకు ఒకటి స్థానాలు లభించాయి. కాగా పాపులర్ ఫ్రంట్‌కు ఒక్కస్థానమూరాలేదు.

ప్రస్తుతం గోవాను ప్రక్కరాష్ట్రంలో విలీనం చేయడం యిప్పట్లున సాధ్యంకాదని కొంతకాలంపాటు యీ ప్రాంతం స్వతంత్ర రాష్ట్రంగా ఉంటుందని లోగడ ప్రజలకిచ్చిన వాగ్దానాన్ని గౌరవించవలసి వుంటుందని ప్రధాని జైపూరు సభలో ప్రసంగిస్తూతెలియజేశారు.

గోవాలో ఎన్నికలు జరుగుతున్నప్పుడే ముగ్గురు పోర్చుగీసువారు, ఒక పాకిస్థాను సభ్యుడు గోవా స్వాతంత్ర్యాన్ని గురించి ఐక్యరాజ్య సమితి ధర్మకర్తృత్వ సంఘం ఎదుట ఆ విషయాన్ని ప్రవేశపెట్టే ప్రయత్నాలు జరిగాయి కాని దానిని నిర్దాక్షిణ్యంగా, అధ్యక్షుడు త్రోసిపుచ్చడం జరిగింది.

విచిత్రమైన విషయమేమిటంటే ఆఫ్రికాలోని పోర్చుగల్ స్థావరాలయిన అంగోలా, మొజాంబిక్, పోర్చుగీస్ గినియా దేశాల ప్రజలు తమ రాజకీయ భవిష్యత్తును తామే నిశ్చయించుకోవడానికి హక్కు గలిగివున్నారనే ఐక్యరాజ్యసమితి దృక్పధాన్ని భద్రతాసంఘం ధృవపరిచింది. ఈ మేరకు మూడు రాజ్యాల చిత్తు ప్రతిపాదనను ప్రవేశపెడుతూ; వలస రాజ్యాల ప్రజలకు, రాజకీయ భవిష్యత్తును నిర్ణయించుకునేందుకు పూర్తి స్వేచ్ఛను యిచ్చే విషయంలో అవసరమైన సత్వరచర్యలు తీసుకొనే అంశానికి సంబంధించిన ప్రతిపాదనను అమలు చేయనందుకు తమ నిరసనను తెలియజేస్తూ, స్వయం నిర్ణయాధికారాన్ని కోరిన నిర్బంధితులను విడుదల చేయాలని లిస్బన్‌ను కోరింది.

## టేలర్ యాత్ర

భారత దేశ నాయకుల విధానాలను, వాటి ఆచరణలను తెలుసుకొని అమెరికా క్రొత్త అధ్యక్షుడికి తెలియజెప్పే ఉద్దేశంతో అమెరికా సంయుక్త దళాధిపతుల అధ్యక్షుడు జనరల్ మాక్స్‌వెల్ టేలర్ గత నెలలో క్రొత్త ఢిల్లీకి విచ్చేశారు. ప్రధానమంత్రి, ఆర్థిక మంత్రి, సైన్యాధినేత, మంత్రిమండలి కార్యదర్శి, రక్షణ కార్యదర్శి యితర అధికారులు మొదలయినవారిని వీరు కలుసుకున్నారు. దేశంలో రక్షణశక్తిని పెంపొందించుకోవడానికి అధికారులు ఏ విధంగా కృషిచేస్తున్నారో పూర్తి స్వరూపం టేలర్ తెలుసుకున్నారు. హిందూమహాసముద్రంలో అమెరికా సప్తమ నౌకాదళం ప్రవేశించే ఆలోచన అమెరికా ప్రభుత్వం పరిశీలిస్తున్నదని కూడా ప్రధానికి తెలియజెప్పమని కూడా వీరికి ఆదేశించడం జరిగింది.

ఈ ప్రవేశమూ, దానిఫలితాలూ మన తటస్థ విధానంపై ప్రతిఫలిస్తాయి గనుక అమెరికా సప్తమ నౌకాదళం హిందూ మహాసముద్రంలో ప్రవేశించడంపై, ముందుగా అనుకున్నట్లే, పార్లమెంటులోనూ, బయట కూడా చక్కటిచర్చలు తల ఎత్తాయి. మన తటస్థవిధానంపై జరుగుతున్న యీ చర్చ యింకా కొనసాగి మనం అంగీకరించే సిద్ధాంతాలతో కేవలం తాత్కాలిక ప్రయోజనాల చేతకానీ, భయపడి పోయినందువల్ల కానీ రాజీపడడం కూడదని ప్రతి ఒక్కరూ గుర్తించగలిగితే చాలామంచిది. అంతేకాక ఉత్పన్నమైన ప్రత్యేక పరిస్థితివల్ల కలిగిన నిర్బంధాలను కూడా అలక్ష్యంచేయలేము.

ఉదాహరణకు అంతర్జాతీయ రంగంలో చైనా జగడాలమారి దేశంగా క్రొత్తగా రూపొందడాన్ని కేవలం విస్మరించి అలక్ష్యం చేయకూడదు. దీనిదారి సుగమం అయితే పూర్తి ప్రపంచాన్నే తలక్రిందులుచేస్తుంది. అయితే ప్రస్తుతం దీని ఆగడాన్ని అరికట్టే శక్తి కేవలం రష్యా మరియు అమెరికాలకు మాత్రమే ఉన్నదనే విషయంకూడా వాస్తవమయిన విషయం. వాస్తవ విషయాలను దృష్టిలో ఉంచుకొని చైనాను రష్యా అడ్డగిస్తుందా లేక అమెరికానా అనే విషయంలో తేడా చూపకపోవడమే సరిఅయిన విధానం అవుతుంది. యీ రెండు దేశాలుకలిసి సమిష్టిగా యీ కృషిని నిర్వహించడమే

ఆదర్శంగా ఉంటుంది. ఈ కృషిలో పెట్టుబడిదారీ, కమ్యూనిస్టుల సిద్ధాంత సమస్యతల యెత్తదు. అందువల్ల సప్తమ సౌకాదశ కార్యకలాపాలను గూర్చి పార్లమెంటు, పత్రికలలో కనిపించే అతివాద, మితవాద వర్గాల భావాలను పరిశీలిస్తే అవి అప్రస్తుతమైనవిగా భావించవలసి ఉంటుంది.

చైనా పెనుభూతాన్ని ప్రతిఘటించడం, పెట్టుబడిదారీ, కమ్యూనిస్టు, ఇతర వర్గాలకు చెందిన అన్ని ప్రపంచ నాగరిక దేశాలసమిష్టి పవిత్ర కృషిగా గుర్తించడమే ప్రాథమిక సత్యం. పటుసంఖ్య రోజు రోజుకూ అధికమవుతూనే ఉంది.

నాగరిక దేశం పితానం సుస్పష్టమే. సాధ్యమయినంత త్వరలో చైనా నుండి రక్షించుకోవడానికి వీలుగా బలపడడమే మన వాంఛ. పోయిన మన ప్రాంతాలను తిరిగి పొందాలని మన కోరిక. దీనికై అన్ని విధాల సహాయం అది ఎక్కడినుంచి వచ్చినా హర్షణీయమే. ఇదే విధంగా చైనా బెడదను అరికట్టే చర్యను అమెరికా నుంచి అయినా, రష్యా నుంచి అయినా దాని బాగోగులను బట్టి పరిశీలించాలి. చైనా విస్తరణకాంక్షను ఇక ముందు అరికట్టడానికి వీలుగా రష్యా వహిస్తున్న ముఖ్య పాత్రను (అమెరికా వహించేటంత ముఖ్యం కాకపోయినా) కొందరు గుర్తించడం జరుగుతున్నది.

## విజిలెన్స్ కమీషన్

ప్రభుత్వోద్యోగులలో అవినీతిని నిరోధించడానికై కేంద్ర విజిలెన్స్ కమీషన్ నెలకొల్పాలనే ప్రభుత్వ నిర్ణయాన్ని పార్లమెంటులో ప్రకటిస్తూ యీ కమీషన్ అధికార పరిధి మొత్తం కేంద్ర ప్రభుత్వోద్యోగులకు వర్తిస్తుందని కేంద్ర హోం మంత్రి అన్నారు. ప్రతి మంత్రిత్వశాఖలో ఒక చీఫ్ విజిలెన్స్ అధికారినీ, సబార్డినేటు ఆఫీసులలోనూ, అనుబంధ ఆఫీసులలోనూ, ప్రభుత్వ రంగంలోని పరిశ్రమలలోనూ విజిలెన్స్ అధికారులను నియమించడం జరుగుతుంది.

యీ కమీషన్ విధులు, పబ్లిక్ సర్వీసు కమీషన్ విధుల మాదిరిగానే సలహా రూపంలో ఉంటాయి. యీ కమీషన్ స్వతంత్రత, విధి నిర్వహణాస్వరూపం, దీని నివేదికను పార్లమెంటుకు సమర్పించడం దృష్ట్యా "ప్రభుత్వోద్యోగులలో అవినీతిని నిర్మూలించడానికి పటిష్టమైన శక్తిగా యీసంస్థ వ్యవహరిస్తుందని" శ్రీ నందా అన్నారు.

భారత ప్రధాన న్యాయమూర్తి శ్రీ బి. పి. సిన్హా, జనవరిలో పదవీ విరమణ చేసిన తర్వాత కేంద్ర విజిలెన్స్ కమీషనర్‌గా నియమింపబడవచ్చునని భావించబడుతున్నది.

రాష్ట్రాలలో కూడా యిటువంటి సంస్థలను నెలకొల్పాలని నిర్ణయించారు. అవినీతి చర్యలను తగ్గించడానికి వీలుగా పరిపాలన విషయాలలో నిర్ణయాలు చేయడంలో జాగు చేయరాదని కూడా నిశ్చయించారు. యీ సమస్య చాలా జటిలమైనదీ, ప్రమాద భరితమైనది. అయితే దృఢ చిత్తంతో, విధేయతతో పనిచేస్తే యీ క్రొత్త వ్యవస్థ శుభారంభం కాకపోవడానికి కారణం కనిపించదు.

## సాంకేతిక విద్య

సాంకేతిక విద్యా వ్యాప్తి అభివృద్ధికై కేంద్ర పరిశోధనా సంస్థను నెలకొల్పాల్సిన అవసరాన్ని గూర్చి కేంద్ర విద్యా మంత్రి శ్రీ యం. సి. చాగ్లా నొక్కి చెప్పారు. గత పదిహేను సంవత్సరాల కాలంలో భారత దేశంలో ఇంజనీర్లు, సాంకేతిక సిబ్బందికి శిక్షణ సౌకర్యాలను 6 నుంచి 8 వంతులు ఎక్కువ చేయడాన్ని గూర్చి వర్ణిస్తూ "అభివృద్ధిదశలో ఉన్న ఏ దేశంలోనూ యీ విధంగా జరగలేదని" ఆయన అన్నారు. అయితే సాంకేతిక విద్యాస్థాయి, ప్రమాణాలకు గల ప్రాముఖ్యాన్ని విస్మరించ వీలు లేదు. క్రొత్త సంస్థలను నెలకొల్పడం వల్లనూ, ప్రస్తుతం ఉన్న కళాశాలలను విస్తరింపజేయడంవల్లనూ ప్రస్తుత సంవత్సరంలో డిగ్రీ కోర్సులో 20,000, డిప్లొమా కోర్సులలో 40,000 ప్రవేశాల సంఖ్య పెరిగింది. 1965–66 సంవత్సరానికి డిగ్రీ కోర్సులో ప్రవేశసంఖ్యను 24000, డిప్లొమా కోర్సులలో 50,000కు పెంచాలని ప్రతిపాదించారు. జీతాల స్కేళ్ళను పెంచడం, క్రొత్త సంస్థలను ప్రారంభించడం ద్వారా యీ సంస్థలలో ఉపాధ్యాయుల కొరతను రాష్ట్రాలు తీర్చవచ్చు.

అఖిల భారత సాంకేతిక విద్యా మండలి 16 వ సమావేశాన్ని ఉద్దేశించి శ్రీ చాగ్లా మాట్లాడారు.

## భిల్లాయ్ నుండి ప్రత్యేక ఉక్కు

శ్రీ సి. సుబ్రమణ్యం, కేంద్ర ఉక్కు శాఖ మంత్రి గత నెలలో అఖిల భారత ఇంజనీరింగ్ సంఘం సమావేశంలో ప్రసంగిస్తూ భిలాయ్ ఉక్కు కర్మాగారంలో సంవత్సరానికి 150,000 నుంచి 200,000 టన్నుల మేరకు ప్రత్యేక ఉక్కు ఉత్పత్తి అవుతుందని అన్నారు. యీ ఫ్యాక్టరీ నుండి 41 రకాల ప్రత్యేక ఉక్కును ఉత్పత్తి చేయడానికి యీ ఫ్యాక్టరీలోని సోవియట్ సాంకేతిక నిపుణులు తమ సహాయ సహకారాలను అందజేస్తున్నారు. దీని వల్ల ప్రత్యేక ఉక్కు ఉత్పత్తికై ఫ్యాక్టరీలను నెలకొల్పే ఖర్చు కలిసి వస్తుంది. జటిలమైన పరిశ్రమలను నెలకొల్పడంలో విదేశాలపై ఆధారపడనక్కరలేకుండా ఉండేందుకు వీలుగా భారతదేశం స్వదేశీయులకు శిక్షణం ఇవ్వడం, క్రొత్త సాంకేతిక విధానాలను అభివృద్ధి పరచడం ఎంతో అవసరం. విదేశసహాయం పై చాలా తక్కువగా ఆధారపడే దశకు అతి త్వరలో చేరుకోగలమని ఆయన తన ఆశాభావాన్ని వ్యక్తంచేశారు. ★



క. విశ్వనాథన సరోజినీదేవి

బైజాన్‌టైన్ చిత్రకళ పిమ్మట మరల చిత్రకళ చరిత్రలో చెప్పుకోదగిన చిత్రకళలు ఐరోపాఖండ మధ్య యుగాంత్య చిత్రకళలు. ఇందు పన్నెండవ శతాబ్దము నుండి పదునైదవ శతాబ్దము వరకు అలరారిన చిత్రకళలను రెనైసాన్స్ కాలమునాటి వారు 'గోతిక్' చిత్రకళగా ('గోతిక్' అను పదమునకు అనాగరికమైన, మోటైన అని అర్థము గలదు) పేర్కొని యున్నారు. ఇందులకు రెనైసాన్స్ చిత్రకారులకు ఈ చిత్రకళయందుగల యేహ్యాభావమే కారణము. ఈ గోతిక్ చిత్రకళ విశిష్టతను ప్రజలు పందొమ్మిదవ శతాబ్దమువరకు గ్రహించలేక పోయిరి. గ్రీకు, ఈజిప్షియన్ చిత్రకళల వలెనే ఇదీ ఒక ప్రత్యేకతను కలిగియున్నది. ఈ శతాబ్దమునందు సైతము అక్కడక్కడ, చర్చిల నిర్మాణమునందు ఈ గోతిక్ శైలి అనుకరింపబడుచున్నది.

ఈ చిత్రకళ రెండు విధములుగా నున్నది. ఒకటి క్రైస్తవమత సంబంధమైనది. మరొకటి సామాన్య జీవులకు సంబంధించినది. ఇందు మొదటి చిత్రకళ పూర్తిగా చర్చిల అధికారములో నుండెడిది. చిత్రకారులే చర్చిగోడలపై యే చిత్రము చిత్రింపవలయు నన్నది కూడ చర్చి అధికారులే నిర్ణయించెడివారు. రెండవ విధమైన చిత్రకళలో ఈజిప్షియన్ ఛాయలు కొంత వరకున్నను, ఆ చిత్రకళయందు సైతము గోతిక్ చిత్రకళ ప్రత్యేకతను మనము చూడ కలము. కానీ రెండవ చిత్రకళ నేటికి పూర్తిగా అంతరించినది. ఆ చిత్రకళను మధ్యయుగపు చిత్రకారులొక చిత్రకళగనే తలంచకపోవుటచే దాని నేమాత్రము వారు జాగ్రత్త పరచలేదు. కానీ ఏ దేశమునందైన చిత్రకళ కేవలము మత సంబంధమైనదేనై సామాన్య జీవితమునకు సంబంధించక పోయినయెడల యెక్కువకాలము నిలువ లేదేమో.

గోతిక్ చిత్రకళలో బైజాన్‌టైన్ చిత్రకళ వలెగాక ప్రకృతికి స్థానము కలదు. ఆ నాటి ప్రజలు భగవంతుని సర్వాంతర్యామిగా తలంచుటచే వారి మత సంబంధమైన చిత్రములందు కూడ ప్రకృతికి స్థానము లభించినది. కాగా నాటి చిత్రములందలి ప్రకృతికి స్వకీయమైన వ్యక్తిత్వము లేదు. ఇదే గోతిక్ చిత్రకళందుగల విభిన్నత. ఈ చిత్రకళలోని మరియొక విశిష్టత, ఆ చిత్రములందు చిత్రింపబడిన మానవుల వ్యక్తిత్వమునకు వారిచ్చిన ప్రాముఖ్యత. బైజాన్‌టైన్ చిత్రకళందు మానవులందరు కేవలము దుష్టులుగనో, సాధువులుగనో చిత్రింపబడెడివారు. కానీ చిత్రకళందు అట్లుగాదు. ఈ అంశముతోనే చేదోడువాదోడుగా నడిచిన మరియొక అంశము సహజత్వము. ఈ గోతిక్ చిత్రకారులు జీవించియున్నవారి ప్రతిరూపములను చిత్రింపకపోయినప్పటికి వారి చిత్రములందు బైజాన్‌టైన్ చిత్రములందుకన్న సహజత్వపు పాళ్లెక్కువ. మరియు ఈ చిత్రకళ బైజాన్‌టైన్ చిత్రకళవలె కేవలము సాంకేతికమైనదే కాకపోయినప్పటికిని, దీనియందుకూడ సాంకేతిక చిత్రీకరణ కొంతవరకు చోటు చేసుకొన్నది. ఆ నాటి చిత్రకారులు సాధుత్వమును గొఱ్ఱెపిల్లగాను, పిరికితనమును కుందేలు బారినుండి పారిపోతున్న యోధుని వలెను, గర్వమును పనివానిని తన్నుతున్న శ్రీమంతురాలిని వలెను, రాజుకు బదులు కిరీటమును, సాధువుకు బదులు అతను ధరించే గౌనును చిత్రించెడివారు.

గోతిక్ చిత్రకళందలి మరియొక ప్రత్యేకత, ఆ నాటి చిత్రకారులు బైబిలులోని యేదో ఒక ఘట్టమును తీసుకొని దానిని సినీమా రీళ్లవలె వరుసగా చిత్రించెడివారు. వారీ జగత్తు అనంతమైనదిగా తలచుటచే యిట్లు చిత్రించెడివారేమో. అందుచేతనే కాబోలు వారు తమ చర్చిలను సైతము పూర్తిగా నిర్మించక, కొద్ది అసంపూర్తిగా వదలివేసెడివారు. అధునాతన చిత్రకళలో కానవచ్చు సంక్షేపమునకు యిది పునాదేమో.

గోతిక్ చర్చిలు ప్రపంచప్రసిద్ధి గాంచి యున్నవి. ఇవి చాలా యెత్తున వుండి నియమిత పరిమితులలో నిర్మింపబడెడివి. వీటికి పెద్దపెద్ద కిటికీ లుండెడివి. గోడ బాగము చాలా తక్కువ. ఈ కిటికీలు పలు వర్ణపు గాజు ముక్కలతో, రాతి కమ్ముల మధ్య పలు ఆకారములలో బిగింపబడెడివి. ఇందు గుండ్రటి ఆకారమెక్కువ వాడుకలో నుండెడిది. ఈ చర్చిలు పటిష్ఠముగా నుండుటకై ఆనాటి వారు 'బట్‌రస్' లను సహాయ గోడలను నిర్మించెడివారు. మరియు, వారు తమ కట్టడములందలి స్తంభములను మొట్ట మొదట అతిసామాన్య ఆకారములలో మలచెడివారు. కాని పోను పోను వారు వాటిని వివిధ ఆకారములలో మలచసాగిరి. వారీ చర్చి గోడలపై (వెలుపల, లోపల రెండు వైపుల) వర్ణములు పూసెడివారు. ఆకాలమున కుడ్య చిత్రములవాడిక తగ్గినది. వాటి స్థానే చట్రములలో బిగింపబడిన బల్లలపై చిత్రింపబడిన చిత్రపటములు బహుళవ్యాప్తి నొందసాగినవి. ఈ చర్చిలందు రాతి, చెక్క, కంచు, దంతము,

చలువరాతితో వేయబడిన చక్కటి ప్రతిమలు కూడ వుండెడివి. వీటికి కూడ ఆనాటివారు వర్ణములను పూసెడివారు. ఈ ప్రతిమలలో కొన్నొకొక్కసారి చర్చిగోడలను దే తొలచబడెడివి. మరొకొక్కసారి వేరేగా మలచబడి, ఈ చర్చిలందు ప్రతిష్ఠింపబడెడివి మరి కొన్ని సమయములందు కేవలము పలువర్ణపు (తెలుపు, నలుపు, ఎఱుపు గులాబి, పచ్చ, గోధుమ) చలువ రాళ్ళతోనో, పలువర్ణపు చిత్రవర్ణపు పని తోనో [illegible].

పన్నెండవ శతాబ్దపు గోతిక్ శిల్పములందు కొంతవరకు బైజాన్‌టైన్ శిల్పకళా ఛాయలను చూడగలము. కాని పదమూడవ శతాబ్దకాలమునాటికి ఈ గోతిక్ శిల్పములు బైజాన్‌టైన్ శిల్పముల కన్నను సహజముగా మలచబడెడివి. ముఖ్యముగా ఆ ప్రతిమల వస్త్రముల మడతలు చక్కగా (వారు ముతకబట్టలు కట్టుకొనినట్లు.) చెక్కబడెడివి మరియు ఆ శతాబ్దపు మధ్య కాలము నాటికి ప్రతిమలలో సహజత్వమే గాక చైతన్యము కూడ కానరాసాగినది.

ఈ గోతిక్ శిల్పులు మాను ప్రతిమలు చెక్కునప్పుడు చెక్కకుండ విడిచిపెట్టిన చెక్కభాగమునకు నీలివర్ణము పూసెడివారు మలచిన భాగమునకు మొదటొక విధమైన తెల్లని పదార్థమును పూసి, దానిపై పె రా వర్ణములు పూసెడివారు. ఆ తెల్లటి పదార్థమువలన ఆ పెంపరా వర్ణములు యెనామిల్ వలె మెరువసాగెడివి. వీటిపై యి కా లవర్ణపు విలువైనరాళ్ళను ముత్యములను స్పటికములను కూడ అతికించెడివారు మొత్తమునముందునుండి చూచుటకిది చక్కటి చిత్రపటమువలె నుండెడిది. కాని వారు ప్రేక్షకులకు కన బడని ఆ చెక్కప్రతిమ వెనుకవైపునందు మాత్రము శ్రద్ధ చూపించెడివారు కాదు.

గోతిక్ చిత్రకళలో శిల్పమున కున్న స్థానము చిత్రలేఖనమునకు లేదు. కుడ్య చిత్రములు బహు అరుదు. చట్రములలో బిగింపబడిన బల్లలపై చిత్రింపబడిన చిత్రపటములే యెక్కువ వాడుకలో నుండెడివి. తైలవర్ణ చిత్రములప్పటికి వాడుకలో లేవు.

గోతిక్ చిత్రకారులలో పేరుగాంచినవారు గియాటో. ఇతని చిత్రములు కొంతవరకు [illegible] వుండెడివిగాని, చేతులు మణికట్టులు మాత్రము మరీ చిన్నవిగా వుండెడివి. ఇతని కాలమున కుడ్యచిత్రములు 'ఫ్రెస్కో' విధానమున చిత్రింపబడెడివి. వారు వర్ణములను పొడిచేసి సున్నపు నీటిలో కలిపి, గోడపై గిలాబా చేయబడిన భాగము తడియారక ముందే చిత్రించెడివారు. యువతీ యువకుల ముఖములను చిత్రించునప్పుడు ఈ గోతిక్ చిత్రకారులు వర్ణములనొక గ్రామపు కోడి యొక్క గ్రుడ్డులోని పచ్చటి భాగముతో కలిపియు, వృద్ధుల ముఖములను చిత్రించునప్పుడు వర్ణములను పట్టణపు కోడి యొక్క గ్రుడ్డులోని పచ్చటి భాగముతో కలిపియు చిత్రించెడివారు. గ్రామపు క్రోడి గుడ్డుతో కలిపిన వర్ణము పట్టణపు కోడి గ్రుడ్డుతో కలిపిన వర్ణముకన్న ఒక ఛాయ తక్కువగా నుండునట.

ఆనాటి చిత్రకారులు వ్రాతప్రతులపైకూడ చక్కగా చిత్రించెడివారు. 13 శతాబ్దములో వారు బంగారు వన్నె పూయబడిన చర్మపు కాగితముపై యెఱుపు, నీలము మొదలగు నదురువర్ణములతో చిన్నచిన్న చిత్రములు చిత్రించెడివారు. ఈ చిత్రములు కూడ సినిమారీళ్ళవలె వరసగా చిత్రింపబడెడివి. ఈ చిత్రములందలి ప్రతిమలు వారి శిల్పములను పోలియుండెడివి పదునాలవ శతాబ్ద



డేవిడ్. శిల్పి : డొనటెల్లో.

ములో కాగితమునకు ముందు బంగారు వన్నె పూయు వాడుకపోయినది. అందులకు బదులొకొక్కపుటకు చుట్టు అంచువలె లతలతో, పూవులతో పిట్టలతో చిత్రింపసాగిరి.

అలంకారము కొరకు వ్రేలాడగట్టు పటు, జలతారు మొదలగు వాటితో చేసే అల్లిక



రెనైసాన్స్‌నాటి ఒక కుడ్యచిత్రానికి రేఖామకరణ

పనియందుకూడ వారు నేర్పరులు. ఇవి పరదాలగనో, లేక కేవలము అందానికి గోడలమీదనో తగిలించబడెడివి. దేవతల ఊరేగింపులప్పుడుగాని, ప్రభువుల పట్టాభిషేక వివాహమహోత్సవ సందర్భములలో గాని యివి వీధులలోకూడ పరచబడెడివట. ఇట్టివస్త్రములను ఆనాటివారు పలువర్ణములలో అనేక విధములైన చిత్రములతో అతి మనోహరముగా నేసెడివారు. ఈచిత్రములు ముందు చిత్రకారులచే వర్ణములలో చిత్రింపబడి, ఆటుపిమ్మట ఆ వస్త్రములందు అనుకరింపబడెడివి. ఆనాటివారు వస్త్రములపై చక్కటి చేతికుట్టుపనికూడచేసెడివారు.

గోతిక్ శిల్పులు రాగి పాత్రలపై చక్కగా చెక్కెడివారు ఒక్కొక్కసారి వాటిపై యెనామిల్ పనికూడ చేసెడివారు. వీటిపై చెక్కెడి చిత్రములుకూడ సాధారణముగా మత సంబంధమైన చిత్రములేనై వుండెడివి.

గోతిక్ చిత్రకళ చాలావరకు చర్చి సంబంధమైన చిత్రకళే అయినా ఆనాటి శిల్పులు సామాన్యముగా గృహములందు వాడుకొనెడి కుర్చీలు, బల్లలు మొదలగు సామాన్లపై కూడ చక్కటి నగిషీపని చేసెడివారు.

ఐరోపా ఖండముయొక్క మధ్య యుగాంతపు చిత్రకళలలో మరియొకటి రెనైసాన్స్ చిత్రకళ. ఈ చిత్రకళ మధ్య యుగాంతపు చిత్రకళ కాదని అభిప్రాయ భేదములున్నవి. కొందరిది 15, 16, 17 శతాబ్దములకు చెందినదనియు, మరికొందరిది 14, 15, 16 శతాబ్దములకు చెందినదనియు, యింకను మరి కొందరిది 15, 16 శతాబ్దములకు మాత్రమే చెందినదనియు అభిప్రాయ పడుచున్నారు.

ఈ రెనైసాన్స్ చిత్రకళకు ఇటలీ జన్మస్థానము. రెనైసాన్స్ అనగా పునరుద్ధరణ మని అర్థము. ప్రాచీన గ్రీకు రోమన్ చిత్రకళల పునరుద్ధరణ ఈ రెనైసాన్స్ చిత్రకారుల ధ్యేయము. వీరు ప్రాచీనులవలె చిత్రకళను చిత్రకళ కోసమే అవలంబించెడివారు. ఈ చిత్రకళందు మతమునకు కొంత స్థానమున్నను మతముకొరకే జన్మించిన చిత్రకళల జాబితాలోకి మాత్రమెదిరాదు. ఈ చిత్రకళ గ్రీక్, రోమన్ చిత్రకళల పునరుద్ధరణ రూపమేనైనను ఒక ముఖ్య భేదమును మాత్రము కలిగియున్నది, రెనైసాన్స్ చిత్రకళలో భావమునకు, చిత్రకారుని వ్యక్తిత్వమునకు ఒక ముఖ్యస్థానము

కలదు ఏ చిత్రమునైన అందు చిత్రింపబడిన విషయమును బట్టిగాక అది చిత్రకారునిచే చిత్రింపబడిన విధానమును బట్టి దానికి విలువ కట్టెడివారు మరియు సాంకేతిక చిత్రీకరణ కనుమరుగవసాగినది

రెనైసాన్స్ చిత్రకారులు కేవలము క్రైస్తవ మత చిత్రములనే గాక వారి పురాణగాథలకు సంబంధించిన చిత్రములను సామాన్య చిత్రములనుకూడ చిత్రించెడి వారు మతసంబంధమైన చిత్రములను చిత్రించునప్పుడుసైతము అందలి దేవతలను సాధువులను సామాన్య మానవులవలెనె చిత్రించెడివారు కొందరు రెనైసాన్స్ చిత్రకళలో మతమునకు చోటు లేదని అందురు కనది వాస్తవము కాదు ఆ కాలములో చిత్రింపబడిన కొన్ని మత సంబంధమైన చిత్రములు ఎలుపుర మన్నన లను బడసినవి రెనైసాన్స్ వాస్తుశాస్త్రము నందు శిల్పమునందు కూడ మతమునకు కొంత స్థానముకలదు గాని గోతిక్ చిత్ర కళవలె నిర్విమితాధీనములు కావు వాస్త వానికి మనము రెనైసాన్స్ మహోన్నత శిల్పకళను చర్చిలలో కన్న సమాధులలోను రాజ సౌధములలోను స్మృతి మందిరముల లోను యెక్కువగా చూడగలము

ఆ నాటి చిత్రకారులు గ్రీక్ రోమన్ చిత్రకారులవలె తమ చిత్రములందలి మానవ మృగ ప్రతిమలను అతి శాస్త్రోక్తముగా చిత్రించెడివారు రెనైసాన్స్ చిత్రకారు లందరు అతి సహజముగా చిత్రించెడివారను నది పూర్తిగా నిజముకాదు వారి చిత్రము లలో సహజత్వమే వున్నను అది శాస్త్రోక్త మైన సహజత్వమేగాని వాస్తవమైన సహ జత్వము మాత్రము కాదు పుస్త జ్ఞానము నకు ప్రపంచ జ్ఞానమునకు భేదమున్నట్లే శాస్త్రోక్తమైన సహజత్వమునకు వాస్తవ మైన సహజత్వమునకు చాలా భేదమున్నది వారు ప్రకృతిలో మానవుడున్న విధముగా గాక వుండవలసిన విధముగా చిత్రించెడి వారు




కుడ్యచిత్రం జూడిత్ హోలోఫెర్నస్ చిత్రకారుడు మైఖేలేంజిలో

రెనైసాన్స్ చిత్రకళలో గోతిక్ చిత్ర కళలో వలెగాక చిత్రలేఖనమునకు శిల్పము నకు సమాన స్థానమేర్పడెను చిత్రకారులు జీవించియున్నవారి ప్రతిరూపములనుకూడ చిత్రించెడివారు అంతేగాకుండ వారు బోను బోను ముఖ్యముగా మైకేలాంజెలో కాలము నాటికి చర్చిలలో సైతము నగ్నమానవ రూపములను చిత్రింపసాగిరి

ఈ రెనైసాన్స్ చిత్రకళ యొక్క మరి యొక ముఖ్యలక్షణము ఆ చిత్రకళందు పెన్సిలు చిత్రములకు లభించిన స్థానము అంతవరకు పెన్సిలు చిత్రములకు యిరోపా చిత్రకళలో యెటువంటి స్థానము లేదు వర్ణములు లేనిచిత్రము చిత్రమనిపించు కొనెడిదిగాదు కాని రెనైసాన్స్ కాలము నాటికి ప్రజలు ఈ పెన్సిలు చిత్రములకు

విలువియ్య మొదలిడిరి. ఆనాటి చిత్రకారులు కూడ పెన్సిలును కుంచెవలె వాడి ఒకొక్కచోట సన్నగాను, ఒకొక్కచోట మందముగాను, ఒకొక్కచోట మెల్లగాను, ఒకొక్కచోట గట్టిగాను గీయుచు చక్కగా చిత్రములను చిత్రించెడివారు. సాధారణముగా ఈ చిత్రములలో ఒక్క ప్రతిమో, వస్తువో మాత్రమే చిత్రింపబడుటవలన దానిపై మనము మన దృష్టియంతా కేంద్రీకరించి ఆనందించగలము.

ఈ చిత్రకళ కాలములో గోతిక్ చిత్రకళనాడు మూలబడిన కుడ్యచిత్రములు మరల వాడుకలో వచ్చినవి. తైలవర్ణ చిత్రములు కూడ బహుళ ప్రచారము పొందసాగినవి. ఆ నాటికి శాస్త్రముకూడ అభివృద్ధి చెందియుండుటచే ఆ నాటి శిల్పులు పలుపదార్థములపై చెక్క నారంభించిరి.

ఇట్లీ రెనైసాన్స్ చిత్రకళ చర్చి ఆదరణే గాక ఆనాటి ప్రభువుల, సామాన్యప్రజల ఆదరణగూడ పొందుటచే ఆ చిత్రకారుల జీవనోపాధి సాఫీగా గడిచిపోయెడిది. మైకలాంజెలోవంటి చిత్రకారులు రెండు చేతుల డబ్బు గడించెడివారు.

ఈ రెనైసాన్స్ చిత్రకారులలో పేరు గాంచినవారు వాన్ ఐక్, బోటిసెల్, లియనార్డోడీ వెన్సి, రాఫెల్, మైకలాంజెలో, టిటాన్ మొదలగువారు. కొందరు ఎల్ గ్రీకోనికూడ రెనైసాన్స్ చిత్రకారుల జాబితాలోకి చేర్చియున్నారు. వాన్ ఐక్ చిత్రములు గోతిక్ చిత్రములకన్న కొద్దిగా సహజముగా నున్నను, పెద్దసహజముగా వుండెడివి కావు. ఇతని కాలములో తైలవర్ణ చిత్రములు బహుళ ప్రచారములోనికి వచ్చినవి. వాన్ ఐక్ బహుశ తన చిత్రములను తైల-టెంపరా విధానమున చిత్రించియుండవచ్చు.

బోటిసెల్ చిత్రములలో శాస్త్రీయమైన సహజత్వమును చూడగలము. ఇతని చిత్రములలో 'వీనస్ పుట్టుక' చిత్రము ప్రపంచ ప్రసిద్ధి గాంచినది. గాలికి యెగురుతున్నట్లున్న వీనస్‌దేవత వెంట్రుకలు, (వీనస్ నగ్నముగా చిత్రింపబడినది) ప్రక్కనున్న స్త్రీ యొక్క యెగురుతున్న దుస్తులు సహజముగా చిత్రింపబడియున్నవి.

లియనార్డోడీ వెన్సి రెండుచేతులతోను చిత్రించెడివాడట. ఇతని చిత్రములలో 'ఆఖరి భోజనము' 'మోనోలిసా' పేరు గాంచినవి. ఇందులో 'ఆఖరి భోజనము' టెంపరా విధానమున గోడపై చిత్రింపబడినది. ఇతని కాలమునాటికి రెనైసాన్స్ చిత్రకళలో మరియొక ముఖ్యఅంశము ప్రవేశించినది. అది భావము. ఈ 'ఆఖరి భోజనము' చిత్రములో అందు చిత్రింపబడిన మనుష్యుల ముఖములలోనే గాక, వారి అంగములలోను, కదలికలలోను కూడ భావము ద్యోతకమగుచున్నది. 'మోనోలిసా' చిత్రపటమునందలి ఆమెయొక్క జీవకళనుట్టిపడుతున్న వుత్సాహపూరితమైన నేత్రములు భావోక్తమైన మృదు మందహాసము ఆ చిత్రపటమునకు అఖండ ఖ్యాతిని తెచ్చినవి. ఇందులో 'మోనోలిసా' రూపము పిరమిడ్ ఆకృతిలో చిత్రింపబడుటము మరియొక విశేషము.

మైకలాంజెలోకి చిత్రలేఖనముకన్న శిల్పమన్ననే యెక్కువ ప్రీతి. అయినను, యితని చిత్రములు అనన్యసామాన్యములు. ఇతను మానవ రూపములనే యెక్కువగా చిత్రించెడివాడు. ఇతని చిత్రములు, శిల్పములు అతి సహజముగా నుండెడివి. ఈ సహజత్వము శాస్త్రీయమైన సహజత్వము గాక వాస్తవమైన సహజత్వము. ఇందులోనే వున్నది యితని ఘనత. మరియు, యితని చిత్రములలో భావముకూడ ద్యోతకమగుచుండెడిది. ఈ శిల్పి తన "మోసస్" శిల్పమునందు కోపముతో ముడిబడిన కనుబొమ్మలను, బాధతో నిండిన నేత్రములను, యేహ్యభావమును కనపరచుచున్న పెదవులను యెంతో చక్కగా మలచియున్నాడు. ఇతనింకా 'సిస్‌టైన్' చాపెల్ పై కప్పుపైన యెంతో చక్కగా 'నోహా' కథ 'ఆడమ్, ఈవ్' కథ మొదలగు పురాణగాథలను చక్కగా చిత్రించియున్నాడు. ఇందులో నగ్న రూపము లెక్కువ. మొత్తము మానవరూపములు 343, అందులో 225 రూపములు 10, 18 అడుగుల మధ్య యెత్తున వుండెడివట. కప్పుపై అంత పెద్ద పెద్ద ప్రతిమలను అంత అతి సహజముగాను, భావోక్తముగాను, సుందరముగాను చిత్రించటమన్న మాటలుగాదు. ఒక పెద్ద వేదిక గట్టి, దాని మీద వీపువైపు పండుకొని యెంతో యేకాగ్రతతో చిత్రించాడట. అన్నపానీయములు సైతము వేదికపైకే పంపబడేవట. నిద్రకి మాత్రమే దిగివచ్చెడివాడట. దుస్తులు కూడ అతి అరుదుగా మార్చెడివాడట. ఒకసారి అతను తన బూట్లు తియ్యబోగ అవి తన కాలి చర్మమునకు అతుక్కు పోయినట్లు గ్రహించాడట. అట్టిది అతని యేకాగ్రత! ఇహ శిల్పచాతుర్యమా అనన్యసామాన్యము. అందుచేతనే అతని పేరు చిత్రకళా చరిత్రలో చిరస్థాయిగా నిలచిపోయినట.

రాఫెల్, లియనార్డోడీ వెన్సి శైలిని మైకలాంజెలో శైలిని యేకముచేసి తన ప్రత్యేక శైలినొకటిని యేర్పరుచుకో ప్రయత్నించినాడు. అతని చిత్రకళ స్వచ్ఛమైన 'హై రెనైసాన్స్' చిత్రకళ. అతని ఫ్రెస్కోలు అతని ప్రపంచ ఖ్యాతికి మూలములు. అందులో ముఖ్యంగా 'స్కూల్ ఆఫ్ ఏథెన్స్' అనునది ఒక విశిష్టమైన చిత్రము.

ఇందు చిత్రింపబడిన మానవ రూపములు సమకోణ చతురస్ర ఆకారములో అమర్చబడియున్నవి. ఆ చిత్రమునందు అన్ని మానవ రూపములు చిత్రింపబడినప్పటికి, అందు యేకస్వరముండుటచే యెబ్బెట్టుగా లేదు. మరియు ఆ మానవరూపముల అంగములలోను, కదలికలలోను భావము ద్యోతకమగుచున్నది.

టిటాన్ ఒక ప్రఖ్యాత వెనీషియన్ చిత్రకారుడు. ఇతని చిత్రములలో సహజత్వపు పాళ్ళెక్కువ. ఇతను తన చిత్రములందు వాడిన వర్ణములు కనులపండువుగానున్నవి. ఇతను సజీవుల ప్రతిరూపములను కూడ చిత్రించెడివాడు. ఇతని చిత్రములలో 'వీనస్ అండ్ ది ల్యూట్ ప్లేయర్' 'వీనస్ విత్ ది మిర్రర్' అనునవి అతి చక్కటి చిత్రములు. వీటి రెండింటిలోను వీనస్ దేవత శరీరము (నగ్నముగా), ఆమె వెంట్రుకలు, ఆమె చుట్టూనున్న బట్టలు యెంతో సహజముగా (శాస్త్రోక్తమైనదే నయినా) చిత్రింపబడినవి. ఈ చిత్రకారుడు తన తొంబై తొమ్మిదవ యేట ప్లేగువలన మృత్యువాతపడువరకు ఇతనిలో చిత్రకళాశక్తి నశించలేదు.

వాస్తుశాస్త్రమునందు కూడ రెనైసాన్స్ శిల్పులు గ్రీక్, రోమన్ కట్టడములను కొంతవరకు అనుకరించినను, తమ శీతోష్ణ కాల పరిస్థితులకు తగినట్లు మార్పుచేసి యున్నారు. వారు చర్చిలనేగాక చక్కటి సమాధులను, రాజసౌధములను కూడ కట్టియున్నారు. వారి కట్టడముల కప్పులో అంత ప్రాముఖ్యత నిచ్చెడివారు గాదు. వారి వాస్తుశాస్త్ర చాతుర్యమునకు పారిస్‌లోని 'లోవ్ర్' చక్కటి నిదర్శనము. ఇది పూర్వమొక రాజసౌధము. ఇప్పుడు వస్తుప్రదర్శనశాల.

రెనైసాన్స్ కాలమునాటి స్త్రీ పురుషులిరువురు దుస్తులకు, నగలకు ప్రాముఖ్యత నిచ్చెడివారు. వారి నగలు పలువిధ మాదిర్లతో చక్కగా చేయబడెడివి. కుర్చీలు, బల్లలపైకూడ చక్కటి నగిషీ చేసెడివారే గాని, ఆ సామానులు మరీ బరువుగా నుండి, వసతిగా నుండెడివి గావు. వీరు మృణ్మయ పాత్రలు చేయుటయందుకూడ నేర్పరులు. వీరు యినుముతో చక్కటి కవచములు గూడ చేసెడివారు.

ఇట్టి ఐరోపా మధ్య యుగాంతపు చిత్రకళలు రెండూ విభిన్న దృక్పథములు కలవి. ఒకటి భగవదర్పితమైన, మరియొకటి కళకే అర్పితము. ఒకటి ఆత్మానందము కలిగించునదైన, మరియొకటి హృదయానందము కలిగించునది.

(ఈ వ్యాసంలోని చిత్రాలకు ప్రతికృతులు శ్రీ శీలా వీర్రాజు)

# అఖండ కృషి : ఆహారోత్పత్తి

ప్రపంచంలో బాగా అభివృద్ధి చెందిన దేశాలలో మాదిరిగానే ఇండియాలో కూడా చాలినంతగా ఆహారంలేదు. దీనికి తోడు బలమైన భోజనం కూడా లభించకుండా పోయింది. సాధారణంగా ఒకరికి రోజుకి 3200 కాలరీల శక్తినిచ్చే భోజనముండాలి. కాని మనకు 2100 కాలరీల శక్తినిచ్చే భోజనం మాత్రమే లభిస్తున్నది. ఆహార ధాన్యాలతో పాటు, మాంసకృత్తులు, విటమినులు, రక్షకాహారాలు గల వస్తువులు లోపంగా ఉన్నాయి. అందువల్ల సమృద్ధిగాను బలకరంగానూ ఉండే ఆహారవస్తువుల ఉత్పత్తికై మనం కృషిచేయాలి

దీనికితోడు ప్రతి నిమిషానికి పెరుగుతూవున్న మన దేశ జనాభా ఒకపెద్దసమస్యగాఉన్నది. 1950లో ఇంచుమించు 36 కోట్ల జనాభా ఉంటే ఇప్పుడు 45 కోట్లు. ఈ పెరిగే జనాభా క్రమాన్ని అదుపులో ఉంచాలంటే పరిమితి కుటుంబం కొరకు తగినపద్ధతులను ప్రతివారూ అమలుపర్చాలి. కాని ఇది అంతగా జరగలేదు. మనకు ఆహారం అవసరాలు క్షణక్షణానికి ఎక్కువైపోతున్నవి; కాని సాగు నేలలు మాత్రం పరిమితంగానే ఉన్నవి. కనుక ఈ సాగునేలలలోనే తగిన క్రొత్త పద్ధతులు ప్రవేశపెట్టి ప్రతి యెకరాలోనూ ఎక్కువ పండించే ప్రయత్నంతో మనమంతా పనిచేయవలసి ఉంది. ఇది యీవిధంగా ఉండగా చైనాదాడివల్ల కలిగిన విపరీత పరిస్థితి మన యత్నాలను మరింత వేగిరపరుస్తున్నది.

శాస్త్రీయ పద్ధతులలో వ్యవసాయము చేస్తూన్న కొన్ని దేశాలతో పోల్చి చూస్తే మనదేశంలో ఎకరా దిగుబడి పంటలు తక్కువగానే ఉన్నవి. దీనికిగల కారణమేమోనని దూరం ఆలోచించనక్కరలేదు. వసుంతే ఎక్కువ పంటకు అవకాశంగల సారమైన భూములు, పారుదలకు నీరు మొదలయినవి ఉన్నప్పటికీ వాటిశక్తిని పూర్తిగా వినియోగించు



డి. విశ్వనాథరెడ్డి

కోనలేదు. మంచిజాతి విత్తులు, చాలినంతగా యెరువులు, క్రమమైన నీటి పారుదల, సస్యరక్షణ మొదలైన వాటిని ప్రతి రైతుకూడా అవలంబించినట్లయితే అధికోత్పత్తి సాధ్యమవుతుంది. ఇటువంటిచర్య ఇప్పుడు అవసరం కనుక, ఈ కార్యక్రమం దృష్టిలో వుంచుకొని పంచవర్ష ప్రణాళికలలో పథకాలు తయారయినాయి.

వీటి అమలుఫలితంగా గడచిన పదేళ్ళలో వరిపంటలో నూటికి 26 పాళ్ళు, జొన్నలలో 60 వంతులు ఎకరా దిగుబడి ఎక్కువయ్యాయి.

అయితే ఇంతమాత్రంతోనే మనలక్ష్యం నెరవేరలేదు. మొదటి ప్రణాళిక అమలు కాకపూర్వం ఉన్న ఆహారధాన్యాల ఉత్పత్తిని మూడవ ప్రణాళిక అంతమయ్యేసరికి రెండింతలు చేయాలని మన లక్ష్యం.

రెండవ పంచవర్ష ప్రణాళిక 1960-61 లో అంతమయింది. అప్పటికి 60 లక్షల 34 వేల టన్నుల ఆహారం ఉత్పత్తి అయింది. మూడవ ప్రణాళికా కాలంలో ఉత్పత్తిని 87 లక్షల 11 వేల టన్నుల స్థాయికి పెంచాలని పథకాలు వేయడం జరిగింది. ఆహారధాన్యాలకు తోడు నూనెగింజలు, ప్రత్తి, చెరకు, పైర్లలో కూడా ఉత్పత్తులు ఎక్కువ చేయడానికి తగిన పథకాలు వేయడం జరిగింది.

ఈ అత్యవసర పరిస్థితిలో అటు యుద్ధరంగంలోని సైనికులకూ, ఇటు పెరుగుతూవున్న జనాభాకూ చాలినంత ఆహారోత్పత్తి చేయడానికి భారత ప్రభుత్వ ఆదేశానుసారం మన రాష్ట్రంలోకూడా కొన్ని క్రొత్త పథకాలను అమలు పరచాము. ఇదివరకే ఉన్న ఉత్పత్తి పథకాల గమనంలో కొంత త్వరితగతిని ప్రవేశపెట్టాము.

పంటల ఉత్పత్తిని ఎక్కువ చేయడానికి సాంద్ర వ్యవసాయమనే క్రొత్త పథకం పశ్చిమ గోదావరిజిల్లాలో 1960 సంవత్సరం అక్టోబరు 1వ తేదీన అమలు

పర్చబడింది. ఇందులో కావలసిన మేలు రకం విత్తనాలు, సమృద్ధిగా రసాయనకపు ఎరువులు, మంచి పనిముట్లు, సస్యరక్షణకు తగిన మందులు, యంత్రాలు, ఋణ సహాయం, మురుగునీటి వసరులు మొదలైనవాటిని రైతులకు అందజేస్తారు. ఈ రెండేళ్ళలో కనబడిన ఫలితాలబట్టి ఆహారోత్పత్తి నెక్కువ చేయాలంటే సాంద్ర వ్యవసాయ పథకంవంటి కార్యక్రమాలను అమలుపరచడం ముఖ్యమని తెలిసింది. అందుచేత వరిపంటను ఎక్కువ చేద్దామనే ఉద్దేశంతో ఒక కొత్త పథకాన్ని ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం 1963 సంవత్సరం ఖరీఫ్ పంట కాలంలో 10 జిల్లాలలో ప్రవేశ పెట్టింది. ఇందులో వరిపంటతోపాటు జొన్న, రాగి, చెరకు, వేరుసెనగ, ప్రత్తి, అరటి, కూరగాయలు కూడా చేర్చబడినవి. పది జిల్లాలలోని 150 బ్లాకులలో పైన పేర్కొన్న పంటల విస్తీర్ణంలో మొదటి సంవత్సరం 40 శాతం, రెండవ యేడు 70 శాతం, మూడవ ప్రణాళికాంతానికి పూర్తి విస్తీర్ణంలోను ఈ పథకం క్రిందకు తేవడానికి ఉద్దేశించబడింది.

ఇంతేకాకుండా వర్షాలు తక్కువగా వున్న మెట్టప్రాంతములోకూడా వ్యవసాయోత్పత్తిని అధికం చేయడానికి మరో పథకం 1963-64 సంవత్సరం రాబీ పంట కాలంలో అనంతపురం, ఆదిలాబాదు జిల్లాలలో అమలు పర్చబడింది. ప్రస్తుతం జొన్నపైరుకూ తరువాత ఇతర పైరులకూ వర్తింపచేస్తారు.

ఆహార ధాన్యాల ఉత్పత్తితోపాటు వ్యాపార పంటల ఉత్పత్తినికూడా ఎక్కువచేయడం అవసరమే. కనుక ప్రత్తి వేరుసెనగ పంటలపై ప్రత్యేకంగా ఒక సాంద్రవ్యవసాయపథకం ప్రారంభించారు. కృష్ణా, గుంటూరు జిల్లాల్లో తక్కువకాలపు వరిపంట కోసినతర్వాత పి. 216 యఫ్ అనే ప్రత్తిరకాన్ని బాగా పెంచడానికి అవకాశముంది. కనుక ఈ రెండు జిల్లాలలో మూడవ ప్రణాళిక అంతమయేసరికి 50 వేల ఎకరాలలోనూ, నాల్గవ ప్రణాళికలో 50 వేల ఎకరాలలోనూ ఈ పంటను వ్యాప్తిచేద్దామని కార్యక్రమం తయారయింది. ఇందులో సస్యరక్షణకు మందులకై ఎకరాకు 10 రూపాయలు ఈ పంట పండించే రైతులకు ప్రత్యేకంగా సరఫరా చేసేందుకు 2000 టన్నుల అమోనియం సల్ఫేటు కేటాయించబడింది. ఖాదీ గ్రామోద్యోగ సంస్థవారి సహాయంద్వారా ప్రత్తివిత్తనాలు తీయడానికి అమ్మడానికి సౌకర్యాలు కల్పించబడతాయి. కర్నూలు జిల్లా యెమ్మిగనూరు ప్రాంతంలో 100 ఎకరాల మేర యాంగ్రూస్ రకం "సి అయిలాండు" రకం శ్రేష్ఠమయిన ప్రత్తిని విస్తరింప చేయడానికి కూడా ఒక పథకం ప్రవేశపెట్టబడుతుంది. ఆ ప్రాంతంలో సి అయిలాండు ప్రత్తిబాగా పండుతున్నది.

రైతులు తీసుకుంటున్న శ్రద్ధకు తగిన ఫలితంకూడా కనపడింది. వేరుసెనగ పంటనుకూడా సాంద్రవ్యవసాయ పద్ధతిలో అభివృద్ధి చేద్దామని గత సంవత్సరం కర్నూలుజిల్లా తుంగభద్రా ఆయకట్టు ప్రాంతంలోనూ 1963 సెప్టెంబరు నుండి చిత్తూరు, మహబూబ్‌నగరు జిల్లాలలోనూ ఈ పథకాన్ని అమలుపర్చారు. మూడవ పంచవర్ష ప్రణాళికాంతానికి 50,000 యెకరాలలో దీనివ్యాప్తికి ప్రయత్నాలు చేయబడుతున్నాయి.

మొక్కజొన్న పంటలో దక్కను హైబ్రిడు మొక్కజొన్న రైతులు వాడే విత్తనంకంటె మూడు నాలుగింతలు ఎక్కువగా పండగలదు. కనుక ఈ విత్తనపు అభివృద్ధిలో విస్తరణకుకూడా ప్రత్యేక శ్రద్ధ తీసుకోనబడు తున్నది.

పుష్టికరమైన ఆహారాన్ని పండించి దేహ ఆరోగ్యాన్ని కాపాడడం చిన్నతనంలోనే నేర్వాలి. ఈనాటి బాలబాలికలు పెరిగి పెద్దవారయినపుడు బలకరమైన కూరగాయల పెంపకంలోనూ, వాటి వాడుకలోనూ ఎక్కువ శ్రద్ధ, నేర్పు చూపించగలరు. అందుచే బడితోటలలో పుష్టికరమైన ఆహారాన్నిచ్చే కూరగాయలను బాలురు పెంచే కార్యక్రమం అమలులో వున్నది. ఇంతవరకు 161 బడితోటలు ఏర్పాటుచేయడం జరిగింది. ఇందుకుగాను 171 మంది ఉపాధ్యాయులకు శిక్షణకూడా ఇచ్చారు.

బడితోటలకు నీటి సరఫరా కొరకు ఇంతవరకు 56 అయిల్ ఇంజను పంపుసెట్లు 17 ఎలక్ట్రిక్ మోటారులు 80 సెట్ల తోటపనిముట్లు ఇవ్వబడ్డాయి. కూరగాయ విత్తనాలు 98 పౌన్లు అమ్మబడినాయి.

కూరగాయల పెంపకంలో ఉత్సాహం పట్నవాసులకుకూడా కల్గించాలి. ఇంటి ఆవరణంలోనే ఎవరికి కావలసిన కూరగాయలు వారు పండించుకొన్నపుడు ఆహారోత్పత్తికి తోడ్పడినవారవుతారు. అదికాక, పెరుగుతూఉన్న కూరగాయల ధరనుకూడా అదుపులో ఉంచినవారవుతారు. ఈ సంవత్సరం హైదరాబాదులో యింటింటికి వెళ్ళి కూరగాయ విత్తనాలు, నారుమొక్కలు, ఎరువులుకూడా కొన్ని ప్రాంతాలలో ఇవ్వడంజరిగింది. ప్రతి పెరటితోటకు 4 రూపాయల విలువకుమించకుండా విత్తనాలు ఎరువులు ఉచితంగా

(తరువాయి 109 వ పేజీలో)

# సంక్రాంతి

సంక్రాంతి మనకు పెద్దపండుగ. సూర్యుడు మకరరాశిలో ప్రవేశించడంతో ఈపండుగ ప్రారంభమవుతుంది. అందుకేదీనిని మకర సంక్రాంతి అని కూడా అంటారు. నాలుగు రోజులపాటు ఉత్సాహంగా, ఆనందంగా, నిండుగా పండుగ దినాలు గడుపుతారు. సాధారణంగా ఈ పండుగ మార్గశిర, పుష్యమాసాలలో వస్తూ వుంటుంది. మకరం నుండి కటకం వరకూ సూర్యుడు ఉత్తర దిశగా ప్రయాణం చేయడం వలన ఈ కాలాన్ని ఉత్తరాయణం అంటారు. హిందువులు యీ కాలాన్ని పవిత్రంగా భావిస్తారు. కటకంనుండి తిరిగి మకరం వరకూ సూర్యుడు దక్షిణ దిక్కుగా ప్రయాణం చేయడంవలన ఆ కాలాన్ని దక్షిణాయన మని పిలుస్తారు. దక్షిణాయనంలో యుద్ధంలో దెబ్బతిన్న భీష్ముడు ఉత్తరాయణం వరకూ వేచివుండి, ఆ తర్వాత ప్రాణాలను వదిలివేశాడు.

సంక్రాంతి పండుగ అనాదిగా ఆచరింపబడుతూనే వున్నది. వ్యవసాయిక దేశమైన మన దేశానికి యీ పండుగ ప్రాధాన్యత చాలా అధికంగా వున్నది. ఎటుచూసినా పచ్చటి పైర్లు, పాలుపోసుకుని, నిండుగా చిరునవ్వులు చిందుతూన్నట్టు వరికంకెలు, పొడుగ్గా ఆకాశంలోకి ఎదిగి గాలికి తలలు ఊపే జొన్న, సజ్జమొక్కలు. పొట్టలు ఉబ్బి, గింజ గట్టిపడి భారంగా నిలుచున్న పెసర, కంది, సెనగ, నూవు చేనులు. తోటల్లో, దొడ్లల్లో చెట్లనిండా కాసినకాయగూరలు. పెరటి దొడ్లల్లో, స్త్రీల సిగల్లో అరవిచ్చిన బంతిపూలు! — ప్రకృతి కన్య నిండుగా అలంకరించుకున్నట్టు ఎటుచూచినా కళ్ళను చెదర్చే కాంతులే. ఒకచోట పండిన మిరపలు కెంపుల్లా మెరుస్తూ వుంటే, మరోచోట వంగపూలు పచ్చల్లా కాంతులీనుతూంటే, ఇంకోవైపు ముద్దబంతిపూలు స్వర్ణదీప్తులతో మిరుమిట్లు గొల్పుతూంటే— ఆ దృశ్యం కన్నుల పండువుగా రసమయ జగత్తుగా, కవిజన భావోత్పేరణగా కాకమానదు.

గొంగళి పురుగుల్లా గొంగళ్ళ మధ్య గూళ్ళల్లో చలికి ముడుచుకుపోయిన జనానికి వెచ్చటి సూర్యకిరణాలు తగలడం ప్రారంభమవుతాయి. నిరాశలా పెరిగిపోయిన రాత్రి క్రమక్రమంగా తగ్గి పగలు అధికం కావడం మొదలవుతుంది. ఆకాశం నిర్మలంగా, నీలంగా మెరుస్తూ వుంటుంది. పండిన పంటనుచూసుకుని రైతులుకళ్ళల్లో ఆనందపు జ్యోతుల్ని వెలిగించుకొంటుంటారు. వాళ్ళ ముఖాల్లో పెదవులమీద చిరునవ్వు పూలు పూస్తుంటాయి. ఒకవైపు పంటకొట్టించి నూర్పించి ధాన్యం బస్తాల్లోకి ఎక్కించి ఇళ్ళకు చేరవేస్తుంటారు. సంవత్సరం పొడుగునా పడినశ్రమకు తగిన ప్రతిఫలం కళ్ళముందు నిలుస్తుంది.

కళ్ళాల్లో ఇళ్ళల్లో ధాన్యలక్ష్మి నృత్యం చేస్తూ వుంటుంది. వెల్లవేసి, ఆవుపేడతో అలికి, ముగ్గులు తీర్చిన యిళ్ళు శోభాయమానంగా వెలుగుతూ వుంటాయి. కొట్టాల్లో పశుగ్రాసం సమృద్ధిగా పడివుంటుంది. ఆనందంతో గంతులువేస్తున్న ఆవుల మెడల్లో మువ్వలు, లేగదూడల మెడల్లో చిరుగంటలు గాలిలోకి ఎగురుతుంటాయి. కూలి వాళ్ళకు తగినంతపని, బిచ్చగాళ్ళకు జోలెనిండా బిచ్చం. ఎటుచూసినా, ఎక్కడ చూసినా ఆనందం వెల్లివిరుస్తుంటుంది. ఉత్సాహం ఉరకలు వేస్తూంటుంది.

సంక్రాంతి ముందురోజు భోగి. ఆ రోజు రాత్రి పెద్ద ఎత్తున భోగిమంట వేస్తారు. ఈ చలిమంటకొరకని పిల్లలు నెలగంట పెట్టినప్పటినుండి దుంగలు, దూలాలు సేకరించే పనిలో వుంటారు. పొలాల్లోకి పోయి తాటితోపుల్ని, యీత తుప్పల్ని లాక్కొచ్చే పనిలో పిల్లల ఆనందానికి హద్దులుండవు. ఆడపిల్లలు గొబ్బిపిడకలు చేసి, దండలు అల్లడంలో పోటీలు పడుతుంటారు.

ఎదిగిన పంటను రక్షించుకోవడానికని రైతులు నలుగురూ కలిసి ఊరుచుట్టూ తిరిగి చలికి మంటలు వేసుకుంటూ కాపలాకాసే అలవాటే కాలక్రమేణ ఒక ప్రత్యేకతను సంపాదించి భోగి అయివుంటుందని భావించడంలో అసంబద్ధమేమీ ఉండబోదు.

సంక్రాంతికి నెలరోజుల ముందునుండి ధనుర్మాసం. భజనలు, కీర్తనలతో గ్రామం యావత్తూ భగవన్నామ సంస్మరణతో మార్మోగుతూ వుంటుంది. శుచియై, అభ్యంగన స్నానం చేసిన స్త్రీలా కనిపిస్తుంది గ్రామం. రంగులతో యిళ్ళు కిలకిలలాడుతుంటాయి. ప్రతియింటి కోడళ్ళూ, కూతుళ్లూ చీకటితోనే లేచి, కలాపిచల్లి పోటీలు పడుతూ ముగ్గులు పెడుతుంటారు. గొబ్బెమ్మలు చేసి

(తరువాయి 108 వ పేజీలో)

# పంటల రక్షణ

సి. శ్రీనివాసన్

పంటలను చీడ పీడలనుండి కాపాడటం అత్యవసరం. విత్తనాలు వేసినప్పటి నుండి పంటలను పూర్తిగా వాడుకొనే వరకూ పురుగుల వల్లగానీ, ఫంగల్, బ్యాక్టీరియా మొదలైన సూక్ష్మజీవుల వల్లగానీ నష్ట పడుతూనే ఉంటాయి. ముమ్మరవ్యవసాయ పద్ధతుల, సమృద్ధిగా రసాయన ఎరువులువాడి ఆంధ్రప్రదేశ్‌లోని విశాల భూభాగాలందు రకరకాల పంటలు పండించబడుతున్నాయి. వాటి నన్నింటినీ పురుగులు, రోగాలు ఆవరిస్తున్నాయి. సుమారు నూటికి 10 వంతుల పంట నష్టమవుతుందని అంచనా వేసినా మన రాష్ట్రంలో 529 కోట్ల రూపాయల విలువైన ఉత్పత్తిలో 52 కోట్ల రూపాయల పంట నష్టమవుతున్నది.

అయినప్పటికీ యిందులో చాలా భాగం చీడ పీడలు ముందుజాగ్రత్తలవల్ల గానీ, సరైన మందులు వాడడంవల్లగానీ రోగాలను నిరోధించడమేగాక కొన్నింటిని పూర్తిగా నిర్మూలించడానికి వీలౌతుంది. ఈ కార్యక్రమాలద్వారా పైరులను కాపాడుకోవడమే సస్యరక్షణ. గడచిన రెండు దశాబ్దాలనుండి నూతన శాస్త్రీయ పరిశోధనల వల్ల సస్యరక్షణ మందులువాడి పంటల రోగాలను కాపాడుకోగలుగుతున్నాం. జనాభా పెరుగుదలవల్లా, ప్రజల జీవనస్థాయి ఎక్కువగుటవల్లా, యింకోవైపు అత్యవసర పరిస్థితివల్లా ఆహారోత్పత్తిని యితోధికం చేయాలి. ఈ లక్ష్యసాధనకు శాస్త్రీయ పద్ధతులను అవలంబించాలి. మేలురకం విత్తనాలు, రసాయనిక ఎరువులు, శాస్త్రీయ వ్యవసాయ పద్ధతులు, సకాలంలో సస్యరక్షణ మొదలైన సౌకర్యాల ద్వారా ఆహారధాన్యాలు, పుష్టికరమైన పోషక పదార్థాలు ఉత్పత్తి ఎక్కువ చేయాల్సిన అవసరం ఎంతైనావుంది. ఇవి చేయందే మనం విజయం సాధించలేము.

రైతాంగానికి సస్యరక్షణ క్రమాలలో సహాయపడడానికి వ్యవసాయ శాఖవారు కొంత సాంకేతిక సిబ్బందికి శిక్షణయిచ్చి తయారుచేశారు. ఆంధ్రప్రదేశ్‌లో ఇటువంటి సిబ్బంది 1948 నుండి రైతులకు సస్యరక్షణలో సహాయపడుతూ ఉంది. చీడలు, తెగుళ్ళనుండి పంటలను కాపాడవలసిన అవసరాన్ని రైతులు గుర్తించిన కొద్దీ ఈ సాంకేతిక సిబ్బందిని అన్ని ప్రణాళికలలోఎక్కువచేయాల్సివచ్చింది. ప్రస్తుతం వారు పంటలకు పెద్ద ఎత్తున వచ్చే చీడలను ఎదుర్కొని నివారించ గలుగుతున్నారు. రైతులను సక్రమమైన సస్యరక్షణ పద్ధతులు అవలంబించేటట్లు చేస్తున్నారు. రైతులకు కావలసిన సస్యరక్షణమందులు, వాటిని ఉపయోగించు పనిముట్లను రైతాంగానికి తెలియజేసి, పంటలకు వచ్చే పురుగులు, తెగుళ్ళను నిర్మూలించగలుగుతున్నారు. ఈ విధంగా ప్రతియేడూ 20 లక్షల ఎకరాల పంటకు తక్కువలేకుండా రక్షించగలిగాము. చీడ పీడలు భారీ ఎత్తున విశాలభూభాగాలలో



వచ్చినయెడల వ్యవసాయశాఖ వారు ప్రత్యేక ఏర్పాట్లుచేసి పంటల నష్టాలను అదుపులోకి తెస్తున్నారు. ఇంతేకాకుండా పురుగు వ్యాప్తిలోనున్న ప్రాంత గ్రామాలకు స్వల్ప కాలంలోనే తగినన్ని మందులు, పరికరాలు సస్యరక్షణ వ్యానులద్వారా అందరికీ అంద జేయబడుతున్నాయి. ఒకవేళ ఆ ప్రాంతపు సిబ్బంది చాలదని తోచినట్లయితే ప్రక్క జిల్లాలనుండి కూడా అదనపు సిబ్బందిని రప్పించుటకు ఏర్పాట్లున్నాయి.

ఇటీవల విస్తార ప్రాంతంలో విమానాల సహాయంతో సస్యరక్షణ కార్యక్రమాలు కూడా రైతుల అనుభవంలోకి వచ్చాయి. ఈ పద్ధతిద్వారా చౌకగానూ, త్వరగాను విశాల భూభాగంలోని పంటలకు వచ్చు చీడలు అరికట్ట బడుతున్నాయి గడచిన రెండు సంవత్సరాలలో కర్నూలు, గుంటూరు, కృష్ణా జిల్లాలలో విమానాల ద్వారా దాదాపు 35,000 ఎకరాలలోని పంటలు చీడలనుండి రక్షించబడ్డాయి. రాష్ట్రంలో ఎక్కడనైనా విశాల ప్రాంతంలో ఒకే దఫాగా చీడలు ఆవరించినట్లయితే అచ్చటి రైతులకు యకరాకు 3 రూపాయల వంతున మందుల ఖరీదులో సగం ఖర్చు వ్యవసాయ శాఖ భరించేటట్లు ఏర్పాట్లుకూడా ఉన్నాయి. ఇంతవరకుపొందినఅనుభవాన్నిబట్టి రైతులు చాల ఉత్సాహంగా ఉన్నారు. విమానాల ద్వారా సస్యరక్షణ విజయవంతంగా ఉంది.

పంచాయతి రాజ్యం వచ్చిన తరువాత ప్రజా అవసరాలను సాముదాయకంగా తీర్చ డానికి అవకాశం ఏర్పడింది. పంచాయతీ సమితులకు సస్యరక్షణ కార్యక్రమాలుకూడా అప్పగించ బడ్డాయి. ఈ క్రొత్త విధానంలో చీడల నివారణకు రైతులను కూడకట్టడం సమితుల కర్తవ్యం. అందుకు కావలసిన మందులు, పరికరాలు, ఋణాలు, ఇతర సాంకేతిక సహాయం వ్యవసాయశాఖ చేస్తుంది. సమితులకు ఇచ్చిన ముఖ్య పనులలో సస్యరక్షణ ఒకటి. అందువల్ల రైతుల సహకారాన్ని ఉత్సాహాన్ని ఈ కార్య క్రమానికి అనుకూలంగా చేయడం సమితుల బాధ్యత.

వ్యవసాయోత్పత్తి కృషి విజయవంతం కావాలంటే చీడలనుండి పంటలను కాపా డటం ముఖ్యం. ఇప్పుడున్న అత్యవసర పరిస్థితులలో ఆహారోత్పత్తిని ఎక్కువ చేయాలని దేశనాయకులు హెచ్చరిస్తున్నారు. ఆహారరంగంలో జయప్రదం కావాలంటే సస్యరక్షణలో ప్రధానశ్రద్ధ తీసుకోవాలి. పంచాయతీ సమితులు రైతాగం ఈ సత్యాన్ని గుర్తించి ఆ లక్ష్యాన్ని అందుకొనేటట్లుగా ప్రయత్నించాలి. ఇందువల్ల ఆహారోత్పత్తినే గాక దేశరక్షణకు కూడా సహాయపడినవా రవుతారు. ఈ విషయంలో ఆంధ్రప్రదేశ్ రైతులు ముందంజ వేయగలరనడంలో సందేహంలేదు



# క్రాంతి సంక్రాంతి లక్ష్మి

శ్రీవాత్సవ

బృందగీతి : స్వాగతమిదె సంక్రాంతిలక్ష్మికి
స్వర్ణకాంతి సౌభాగ్యలక్ష్మికి ;
తరలివచ్చె సంక్రాంతిలక్ష్మి
మరల తెచ్చె మనభాగ్యలక్ష్మి
ఆంధ్రభూమి సస్యములు పండగ
అదిగో ధాన్యము గాదెలనిండగ

పిల్లలు : అక్కకు బావకు ఇది తొలిపండుగ
అమ్మకు నాన్నకు కన్నులపండుగ
ఎప్పుడెప్పు డను పెద్దల పండుగ
ఏడాది పండుగ పిల్లల పండుగ

రైతుజనములు : ఒలియా...ఒలియా...పొలియో పొలి
రావేలుగలవాడ, రారపొలిగాడ
రతనాలు కురిసేటి రాశిగలవాడ
బంగారు మెఱపించు పంటగలవాడ ॥
పాలుతేనెలు వెలిసే పాడికలవాడ
తిరుపతివెంకన్నపొలి, సింహాద్రి అప్పన్నపొలి
శ్రీశైలమల్లన్నపొలి, బెజవాడకనకదుర్గపొలి

పనివారు : వత్సరశ్రమము ఫలియించినది
భాగ్యలక్ష్మి మము కరుణించినది
ఇంటింటను ఐశ్వర్యసంపదలు
ఎందుకన్న పలువిందు సందడులు
అందరి వాకిట అలికిన ముగ్గులు
కుందనకాంతుల విరి చేమంతులు
గుమ్మముముంగిటలో గొబ్బిళ్లు
కోరిన పంటలు మా కిబ్బళ్ళు

బిచ్చగాళ్లు : అన్నపూర్ణ యీ యాంధ్రావనిలో
అన్నమునకు కరువా, అతిథుల
ఆదరణకు బరువా ?

ఒకడు : కృష్ణ గోదావరీ నదుల్ కృపవహించ
ఇచట కర్షకు లేమి సాధించలేరు ?
ఇసుకనేలల పైరు పండించగలరు
ఎండు బీడుల చక్కెర పిండగలరు ;

మరొక రైతు : ఇయ్యగల రిచ్చి ఒరుల పోషించగలరు
తమకుగలదాని దానప్రదానములుగ
పరులకొసగుచు సమముగా పంచగలరు
ఇచట పుట్టిన చిగురు కొమ్మైని చేవ ॥

ఇంకొక రైతు : మిట్టపల్లములను బీళ్లు నెట్టివైచి
నాగలికి లొంగు స్థలమెల్ల సాగుచేసి
మట్టిలోపల బంగారు మట్టినారు
మాత భూదేవి నమ్మిన మా కృషికులు

మరొకబిచ్చగాడు : పేదసాదల భేదముల్ పెరుగనీక
కలిమిలేమికి కాన్కగా చెలిమియొసగి
పంచుకొనుటకే సుమీ పెద్ద పండుగనుచు
కోరియిత్తురు కలవారు కూలిప్రజకు

కథకుడు : అత్తవారింట క్రొత్తగా అడుగుపెట్టు
బావచేష్టల మరదలు పరిహసింప
తలుపుచాటున సిగ్గుతో తలను వాల్చి
మరియు ముసిముసి నవ్వుల ముద్దరాలు.

మరదలు : సంక్రాంతికి వచ్చారా అల్లుడుగారూ, మీ
పెంకితనం మానారా అల్లుడుగారూ ?
అవితెమ్మని యివి తెమ్మని అల్లుడుగారూ మీ
అలుక మాని వచ్చారా అల్లుడుగారూ
పెళ్ళయినా యేడాదికి అల్లుడుగారూ పెద్ద
పండుగ యిదేనండీ అల్లుడుగారూ
ముచ్చటగా వచ్చారూ అల్లుడుగారూ ముద్దు
ముచ్చటలు జరుపుకోండి అల్లుడుగారూ !

కథకుడు : అలుకన్ బూనిన క్రొత్తయల్లు డెవియో
ఆకాశ పుష్పాలు కా
న్కలుగా కోరిన తల్లిదండ్రు లిట బెం
గన్ బూని యెట్లో యనన్
వలపే ముఖ్యమటంచు ప్రాణధవునిన్
ప్రార్థించి ఒప్పించి తొ
య్యలి తోడ్తెచ్చిన నూత్నదంపతుల కా
హ్వానంబు సంక్రాంతికిన్
కాంతి చెలువొందు మకరసంక్రాంతివేళ
కూడి యింటిల్లిపాది సంకరుని గొలువ
తోడుతెచ్చిరి పుట్టింటి ఆడుపడుచు
పండుగకు చేరవచ్చెను భాగ్యలక్ష్మి.

వధువు : ఈ చల్లనిరేయి ఎంతహాయి
నీ యుల్లము కొల్లగొన్నదోయి

వరుడు : రేయిలోని హాయికాదు

తీయని నీ కన్నుదోయి
పాయరాని వలపులతో
పలుచును తలపులు వేయి ॥

మధువు : ఈ నీలిమ ఆకాశపు
చుక్కకన్నె సొగసు చూడ
తలపులు ముంచుకరావా ?
వలపులు త్రెంచుకుపోవా ?

నరుడు : చుక్కకన్నె సొగసు చూచి
చందమామ కా వలపు ?
చందమామ సరసనున్న
చుక్కకన్నె కా సొలపు ?

మధువు : చంద్రునితోనే చుక్కలు
చుక్కలతోనే చంద్రుడు
ఒకరికొకరు తోడునీడ
ఒండొరు లెడబాయలేరు

యువకులు : ఇంటింటను సంబరాలు
ఎటుచూచిన సరదాలు
సంకురాత్రి వినోదాలు
సరసాలూ సరాగాలు ॥
పంటలక్ష్మి భాగ్యలక్ష్మి
వరాలిచ్చి వచ్చినది
భోగాలూ భాగ్యాలూ
రాగాలూ తెచ్చినది
ఉన్నవాళ్లు లేనివాళ్ళు
అన్ని నోములూ పండగ
మూన్నాళ్ళ సిరినిండగ
ముచ్చట తీర్చే పండగ

కథకుడు : కనుముపండుగ పశువుల కనుమటంచు
పాడిపశువులు కలవారు పసుపురాసి
పూలదండల కొమ్ముల పూజచేసి.
గోపు నారాధనముచేసి కొలుచుచుంద్రు
రామలక్ష్మణులట్లు గారాముతోడ
పెంచి కొమ్ములు దీరిన మంచిజతలు
కాడియెద్దైన లేనట్టి కాపులేడు
జాతిపశువుల కాంధ్ర ప్రఖ్యాతిజెందె ॥

రైతులు : ఎద్దులే రైతుపాలి ముద్దులూ
కోడెలే కాపుపాలి మేడలూ ॥
గోవులే రైతు చిరంజీవులూ
గొడ్డులే రైతులకు బిడ్డలు
దూడలే రైతు తోడునీడలూ
పశువులే రైతుకోరు శిశువులూ ॥
నోరువాయిలేకున్నా
తీరుతీయములుకలవు
పేరుపెట్టి పిలిచినంత
ప్రియముగ అంబా యనును ॥
పొలములన్ని దుక్కిదున్ని
ఫలముల నందించగలవు
బరువులాగి బండిలాగి
భారము వహియించగలవు ॥
ఎండవాన యని తక్కవు
తిండిపెట్టమని యడుగవు
మనిషికంటె మచ్చికగా
కానుకలు చేసిపెట్టు ॥

కథకుడు : సమ్మెటపోటుల సరిచేయు కమ్మరి
కొడవలి సుత్తుల కొలిమి .యదిగో
వంపు మంచపుకోళ్లు వడ్రంగి సరిపెట్ట
తిరిగెడి చక్రాల తరిమెన యది
చేతివాటమ్ముతో మూతిలో మొనదేర్చు
చడిజారు కుమ్మరిసారి అదియె
ఆసులో కండె తారాడగా చేనేత
మగ్గమ్ము రొదసేయు మంచెయదిగో
పలుబడిసేయు మామిడి యేలునేడు
ఎవరివృత్తులు వారల కెంతప్రీతి ?
పూజసేతురు తమపనిముట్లు తెచ్చి
పసుపు కుంకుమ పుష్పాల పండుగయని
మేళతాళాలతో సందెవేళయందు
ఉత్తరాయణ పుణ్యముహూర్తమేనను
స్వామి మావూరి వేణుగోపాలమూర్తి
వచ్చి ఊరేగు "కనక సవారి" పైన ॥

అందరు : మంగళం శుభమంగళం
మానిత భూదేవి మహిత మహాలక్ష్మి
జానపదములకు సౌభాగ్యలక్ష్మి ॥
సిరుల సంపదల స్థిరముగా చిరముగా
వరము లొసంగెడి వాంఛా ప్రదాయకి
రైతుజనము పాలిటి రంగనాయకి
మంజులగాయకి మణిగణనాయకి ॥
సంతతమ్ము నీ చరణకమలములు
శాంతినందెదము చింతలబాపుము
శాంతిదాంతి గుణకాంతి ప్రదాయకి
క్రాంతిరూప సంక్రాంతి విధాయకి ॥ ★

# చెఱకు - పరిశోధనా ప్రగతి

యస్ వి మోహనరావు

మన రాష్ట్రంలో చెఱకు ముఖ్యమైన వాణిజ్యపు పంట. పంచదార ఉత్పత్తి ముఖ్య పరిశ్రమ. 1962_63 సం॥లో 2.33 లక్షల ఎకరాలలో చెఱకు పండించబడింది. సుమారు 4.5 లక్షల టన్నుల బెల్లం, 1.71 లక్షల టన్నుల పంచదార ఉత్పత్తి చేయబడింది. మన రాష్ట్రం స్వయంసమృద్ధమవ్వడమేకాక యితర రాష్ట్రాలకు చక్కెర, బెల్లము _ ఒక్కొక్కటీ సుమారు 90 వేల టన్నులు యెగుమతి చేయబడ్డాయని అంచనా.

క్రిందటి శతాబ్దములో తూర్పు గోదావరి జిల్లాలో సాగుచేయబడినచెఱకురకాలకు ఏదో తెగులు తగిలి కొన్ని మొక్కలు చనిపోతూ వుండేవి. ఈ సందర్భంలో డా॥ బార్బర్ అనే శాస్త్రవేత్త సామర్లకోటలో చెఱకు రకాలను పరీక్షించి మొక్కలు చనిపోవ డానికి కారణం _ యెఱ్ఱకుళ్ళు తెగులు అని నిర్ధారణ చేశాడు. ఇటువంటి జబ్బులను ఆపగల శక్తిగల నూతన రకాలను సృష్టి చేయడమే వీటిని అరికట్టడానికి ముఖ్య సాధనమని అతడు విశదీకరించాడు. ఆ సలహా ప్రకారమే కోయంబత్తూరు చెఱకు రకాల ఉత్పత్తి స్థానము 1912 సం॥లో నెల కొల్పబడింది. ఈ కేంద్రం ప్రపంచమంతటా పేరుపొందింది. కనుక హిందూదేశంలో చెఱకురకాల ఉత్పత్తి కార్యక్రమాన్ని ఆరంభించడానికి ఆంధ్ర రాష్ట్రం చాలావరకు కారణమని చెప్పవచ్చును.

రాష్ట్రంలో చెఱకు సాగుచేయు ప్రదేశాలను మూడు భాగాలుగా విభజించ వచ్చును. మొదటిది శ్రీకాకుళం, విశాఖ, గోదావరి, కృష్ణా జిల్లాలుగల కోస్తాప్రాంతం. రెండవది చిత్తూరు. అనంతపూరుతో కూడిన రాయలసీమ ప్రాంతం. మూడవది నిజామాబాద్, మెదక్ జిల్లాలతో కలసిన తెలంగాణా ప్రాంతం. ఈ వివిధ ప్రాంతాలలో భూసారము, శీతోష్ణ పరిస్థితి, నీటి పారుదలసౌకర్యాలలో బేధాలువున్నాయి. ఈ పరిస్థితుల కనువయిన అభివృద్ధి సాగు విధానాలు సిఫారసు చేయడానికై అనకాపల్లి, రుద్రూరు, పెరుమాళ్ళపల్లి పరిశోధన స్థానాలలో కృషి జరుప బడుచున్నది. ఈ రాష్ట్రానికంతా కేంద్ర పరిశోధన స్థానం అనకాపల్లి. ఇక్కడ 1947 సం॥ నుండి చెఱకు పరిశోధనను విస్తృతపరచి వివిధ శాఖలలో కార్య క్రమాన్ని నడుపుతున్నారు. ఈ పరిశోధన స్థానాలలోని కృషి ఫలితంగా లభించిన ఆచరణ యోగ్యమైన సిఫారసులు యీ క్రింద పొందుపరచ బడ్డాయి.

## రకాలు

రాష్ట్రపు చెఱకు విస్తీర్ణంలో సుమారు 99.5% అనకాపల్లి పరిశోధన స్థానంనుండి వెలువడిన అభివృద్ధికరమయిన రకాలతో సాగవుతున్నది. ఈ రాష్ట్రంలో బాగా వ్యాప్తిచెందిన మొట్టమొదట కోయంబత్తూరు చెఱకు రకం కో 213. ఇదికాక 1930 సం॥ ఆ తరువాత కొన్ని సంవత్సరాలు కో 218, కో 390, కో 313, కో 243, అనేరకాలు కూడా కొంతవరకు వ్యాపించి తరువాత క్షీణించి పోయాయి. కో 213 తీవ్రమయిన తెగుళ్ళకు లోనై క్షీణించిపోగా అనకాపల్లి నుండి కో. 419, 1936 లో విడుదల చేయబడింది. ఇది ఉష్ణమండలపు అద్భుతమయిన చెఱకు రకంగా భావించవచ్చును. ప్రస్తుతం మన రాష్ట్రంలో సుమారు 80% విస్తీర్ణం ఈ రకం క్రిందే సాగుచేయబడుతున్నది. పంట పోటీలలో కో 419 సాటిలేని రకమని నిర్ధారణ అయింది. సుమారు 5 సం॥ క్రితం జరుపబడిన అఖిల భారత చెఱకు పంటపోటీలలో ఈ చెఱకు రకంనుండి మన రాష్ట్రంలో యెకరానికి 150.52 టన్నుల చెఱకు దిగుబడి వచ్చింది. ఈ దిగుబడి 13 మాసముల వయస్సులో ప్రపంచంలోని యేదేశంలో నయినాసరే కొట్టబడిన చెఱకు తూకాలన్నిటి కంటె అధికమని చెప్పడానికి ఏలాంటి సంశయమూలేదు.

ముందుగా పక్వమయి త్వరగా ఆడడానికి పనికివచ్చే రకాలను యెంచడానికి రాష్ట్ర

పరిశోధన స్థానంలో నిర్విరామంగా కృషి జరుగుతున్నది. దీని ఫలితంగా 1943 సం॥ కో 527 ప్రథమంగా ఆడడానికిన్నీ, కో 449 దీని తరువాత ఆడడానికిన్నీ సిఫారసు చేయబడింది. ప్రస్తుతం కో 997 అనే చెఱకు రకం కో 527 రకం స్థానే ముందుగా ఆడడానికి సిఫారసు చేయబడుతున్నది. ఇంతకు ముందుగాని యిప్పుడుగాని విస్తృతంగా



కో 997

సాగు చేయబడిన రకాలలో యిది అత్యధికమయిన పంచదార పాలు కలదిగా కనబడింది. గత రెండు సం॥ నుండి అక్టోబరు, నవంబరు మాసాలలో బెల్లం ధరలు హెచ్చుగా వున్నప్పుడు రైతులు యీ రకంనుండి బెల్లం—చేసి మంచి లాభాన్ని ఆర్జించగలిగారు. ఈ రకం — చల్లపల్లి, తణుకు, సామర్లకోట, తుమ్మపాల ఫ్యాక్టరీ ప్రాంతాలలో బాగా వ్యాప్తి చెందుతున్నది. ఈ రకాన్ని మెరకగా వున్న మాగాణీ భూముల్లో గానీ, గరువు భూముల్లోగానీ సాగుచేయాలి. అనువయిన పరిస్థితులలో ఈ రకంనుండి లభించిన అత్యధికమైన చెఱకు దిగుబడి ఎకరానికి 105 టన్నులకు కొంచెం పైగా వుంది




కో 997

సాధారణమయిన సాగుపరిస్థితులలో కో 449 బదులు కో 975 సాగుచేయడానికి సిఫారసు చేయబడుతున్నది. ఈ రకానికి నీటిముంపు నాపగలశక్తి హెచ్చుగా కనిపించింది.




నీటి యెద్దడి ప్రాంతాలకు కో-449 చాలా అనువయిన రకం. తెలంగాణాలో అడ్సాలి పంటకు కో 775 అనేరకం సిఫారసు చేయబడుతున్నది.

## కృషి పద్ధతులు

ఆంధ్ర ప్రాంతంలో జనవరి ఫిబ్రవరి మాసాలు, తెలంగాణాలో నవంబరు, డిసెంబరు మాసాలు సుమారు 12,13 నెలల్లో కొట్టే తోటలకు అనువయినవి. పద్దెనిమిది నెలలు యెదిగిన తరువాత కొట్టబడే అడ్సాలి అనేపంట వీలును బట్టి జూన్ మొదలు సెప్టెంబరు మాసాల వరకూ నాటవచ్చును.

ఏపుగా పెరగడానికి తోటలు నిలబడడానికి లోతు చాళ్ళలో నాటడం చాలా అవసరం. ఇవి 8 అం॥ లోతు 16 అం॥ వెడల్పుండి, అడుగున కనీసం 4 అం॥ మెత్తని మన్ను కలిగి వుండాలి. చాలుకు చాలుకు మధ్య దూరం 40 అం॥ వుండాలి. ఈ పద్ధతిలో తొలకరించే వరకు వాడే నీటి పరిమాణమును నూటికి 15 వంతులు మిగల్చవచ్చును. పీక పురుగు బాధ సగం వరకు మందు లేకుండగనే తగ్గిపోతుంది. ఇవక తీయడానికై లోతైన మురుగు కాలవలు, మడి నాటుటకు ముందే తయారు చేయవలెను.



లోతు చాళ్లలో చెఱకు నాటడం

పురుగు పుట్రలేని పుష్టికరమయిన లేత చెరకుదవ్వ నాటడానికి—శ్రేష్ఠమయినది. ఎకరానికి సుమారు 15,000 మూడేసి కళ్ళ ముచ్చెల్ని నాటాలి. మొలక జబ్బిచ్చి ఖాళీ లేర్పడినవాటిని మొలకెత్తిన ముచ్చెలతో 30 రోజుల లోపున నాటి భర్తీచేయాలి. ఒక మడిలో ఖాళీలు 100 కి 10 వంతులు వున్నయెడల ఎకరానికి సుమారు 7 టన్నుల చెరకు దిగుబడి తగ్గిపోతుంది. తోట నాటిన

60 రోజుల వరకు జాగ్రత్తగా కలుపు తియడం అత్యవసరం. అలా కలుపుతియని మళ్ళలో సగటున ఎకరానికి సుమారు 3 టన్నుల చెరకు దిగుబడి తగ్గిపోతుంది. వేసవిలో కనీసం వారానికి ఒక తడి నివ్వడం అత్యవసరం. 6 రోజుల కొక తడిగాక 18 రోజులకొక తడి పెట్టినట్ట యితే ఎకరానికి చెరకుదిగుబడి 16 టన్నుల వరకు తగ్గిపోతుంది.

పంట యెదిగిన తరువాత పడిపోకుండా నిలగట్టడానికి జడచుట్టు పద్ధతి చాలాచవుక. దీని వలన ఎకరానికి చెఱకు ఉత్పత్తి ధరలో వెదుళ్ళుపయోగించి తోట నిలగట్టడం కంటే రూ 150/- తగ్గించడానికి వీలయ్యింది. ఎకరానికి సుమారు 40-45 టన్నుల పంటనిచ్చే తోటలనుజడచుట్టు పద్ధతిలోనిలగట్టవచ్చును.

జడచుట్టు

వర్షాకాలంలో తోటలచుట్టూ లోతయిన యివక కాలువలను త్రవ్వి ఒకే కాలువ లోనికి యువక నీటిని తీసి పైకి పంపి వేయాలి. సెప్టెంబరు, అక్టోబరు మాసాలలో పుట్టే పిలకలను సాధ్యమయినంత త్వరగా అప్పుడప్పుడు తీసివేయవలెను. చెఱకు పడిన మరునాటి నుంచి రసంలోని పంచదారపాలు తరుగ నారంభిస్తుంది. ఫిబ్రవరిమాసంలో పడిన చెఱకులు వెంటనే కొట్టివేయాలి. చెఱకును నేలమట్టానికిగాని, వీలయినంత వరకు నేల మట్టానికి కొద్దిగా క్రిందుగాగాని నరకాలి.

## ఎరువులు

ఎకరానికి 10 టన్నుల చొప్పున పశువుల గెత్తాన్ని చాళ్ళలోవేసి మన్ను తో కప్పాలి. తోట పెరిగేకాలంలో 100 పౌ॥ నత్రజని యిచ్చే రసాయనిక ఎరువులను విశాఖ శ్రీకాకుళం జిల్లాలలో ను, 150 పౌ ॥ నత్రజనిని ఉభయ గోదావరి కృష్ణా జిల్లాలలోను 200 పౌ ॥ నత్రజనిని చిత్తూరు అనంతపురం జిల్లాలలోను మొక్కతోటలకు వేయాలి. కార్శితోటలకు అదనంగా ఎకరానికి 50 పౌ ॥ నత్రజని వేయడం అవసరం. ఎరువులు చెఱకు దుబ్బులమొదట చిన్నగోతులు 3 లేక 4 అం ॥ దూరంలో తీసి అందులోవేసి కప్పితే పైపైన వేసినప్పటి కంటె దిగుబడి అధికంగావుంటుంది.



ఎరువు వేసే విధానం

మొక్కతోటకు రెండు సమపాళ్ళలో నాటిన 45, 90 రోజులలో నత్రజని వేయాలి. కార్శి తోటలకు మొక్కతోట కొట్టిన 45 రోజుల లోపుగా వేయవలసిన ఎరువంతా వేయాలి. నీటి ముంపు దు భూముల్లో తోటలకు 60 రోజుల లోపుగా ఎరువులు వేయడం ఉత్తమం. నత్రజని యెరువులను యెక్కువగా వేసిన తోటకు తడులుకూడా తరచుగా యివ్వాలి. లేకపోతే దిగుబడి [illegible] తగ్గిపోతుంది. అమ్మోనియం సల్ఫేటు, యూరియా, అమ్మోనియంసల్ఫేటు నైట్రేటు, కాల్షియం అమ్మోనియం నైట్రేటు మొదలయిన రూపాలలో ఒకే పరిమాణములో నత్రజని వేసి పరీక్షించగా పంట దిగుబడిలోగాని, నాణ్యతలోగాని బేధ మేమీ కనుపించలేదు.




కాబట్టి వీటిలో యేది దొరికినప్పటికీ సాధారణంగా వాడవచ్చును. అనకాపల్లి భూమికి ఏటేట అమ్మోనియం సల్ఫేటు పదియేళ్ళు ఎరువుగా వేసినప్పటికీ భౌతిక స్వభావంలోగాని రసాయనిక సంఘటనలో గాని చెప్పుకోతగ్గ మార్పులు కనబడలేదు. కాబట్టి అటువంటి భూములకు యీ ఎరువు ప్రతియేడూ వేస్తే నష్టమున్నట్లు కనబడదు



భాస్వరము, పొటాషియం యెరువులు వేసినందువల్ల రసము నాణ్యంలోగాని, చెఱకు దిగుబడిలోగాని తగినంత అభివృద్ధి కనబడలేదు.

తెలంగాణాలో ఎకరానికి 225 పౌ॥ నత్రజని ఏక్సాలీ పంటకు 350 పౌ॥ నత్రజని అడ్సాలీ పంటకు వేయాలి. పొటాషియం వేసినందువల్ల ఆట్టే లాభమున్నట్లు కనబడలేదు. కాని భాస్వరపు ఎరువువల్ల రేగడి భూముల్లో దిగుబడిలో చెప్పుకోతగ్గ అభివృద్ధి కనబడింది. కాబట్టి ఈ భూములకు ఎకరానికి 100 పౌ॥ స్ఫురత్ పంచామ్లజనిదమును తోట నాటేముందు వేయాలి. చెల్కా భూములలోమాత్రము భాస్వరపు ఎరువులు నిష్ప్రయోజనమని తేలినది.

చెఱకు చెత్తను త్వరగా చివకబెట్టడానికి 100 కి 10 వంతులు పంది యెరువుగాని, ఫిల్టరు మడ్డిగాని, డిష్టలరీ నీళ్ళ కడుగుగాని కలిపి కుళ్ళబెట్టినట్టయితే సుమారు నాలుగు నెలల్లో మంచి కంపోస్టు యెరువు తయారవుతుంది.

## బెల్లం వండుట, దానిని నిలవ చేయుట

పశువుల గానుగలలో అశ్విన్‌కుమార్ మండల్‌వారి గానుగ, యంత్రసహాయమున నడుపబడే సాధారణ గానుగలలో కిర్లోస్కార్ కంపెనీవారి "సారథ్" గానుగలు మంచివి.



అనకాపల్లి పొయ్యి — పెనం

వెడల్పయిన (7-8 అ. వ్యాసముగలవి) లోతు తక్కువగల (18 అం॥) పెనములలో రసాన్ని కాస్తే శీఘ్రంగా మరుగుతుంది. త్వరగాను, తక్కువ వంటచెఱకు నుపయోగించి బెల్లాన్ని వండడానికి అనకాపల్లి పొయ్యి మంచి ప్రయోజనకరమయింది. సుమారు 800 పౌ॥ రసాన్ని నూటికి 38 వంతులు తూకంగల, గాలిలో ఆరబెట్టిన పిప్పితో మరగబెట్టితే 105 నిమిషాలలో యీ పొయ్యిమీద బెల్లం వండవచ్చు.

రసంలో భాస్వరం, సున్నం యెక్కువగా వుండి, ఆల్కహాలులో కరిగే పంచదారలేని సేంద్రియ పదార్థాలు, గ్లూకోజు, నత్రజని తక్కువ వున్నట్టయితే శ్రేష్ఠమయిన బెల్లం లభ్యమవుతుంది. రసాన్ని శుభ్రపరచే వస్తువులలో సున్నము, పోతడిచెట్టు బెరడు చాలా సంతృప్తికరమయిన ఫలితాలను ఇచ్చాయి. తణుకు, హిందూపురం, చిత్తూరు మొదలయిన ప్రదేశాలలో "హైడ్రాస్" అనే పదార్థాన్ని ఉపయోగించి బెల్లానికి మంచి రంగును తీసికొనివచ్చే అలవాటు కలదు. దీనివలన బెల్లంరంగు తాత్కాలికంగా బంగారువన్నెకు వచ్చినప్పటికీ ఒకవారం దినాలలో రంగు మారి బెల్లం నల్లబడిపోతుంది. రుచికూడా ఉప్పబడుతుంది. ఈ "హైడ్రాస్" 400 పౌ॥ రసానికి ½ ఔన్సు కన్నా ఎక్కువ వేసి తయారుచేసిన బెల్లం ప్రజల ఆరోగ్యానికి భంగకరమైనది.

బెల్లపు దిమ్మలను మొదట "150 గేజి" ఆల్కాథిన్ ఫిల్ములో చుట్టి పైని కల్తాను వేసి కుట్టినట్టయితే వానాకాలమంతా తడిగాలి తగిలినప్పటికీ దిమ్మ రూపము చెడదు. ప్రత్యేకంగా కట్టబడిన గోదాములలో నేలమీద ఊకను పరచి తగులబెట్టగా పైకివచ్చే వేడి పొగద్వారా తడిగాలిని గోదాములలోకి రానీయకుండా చేయడం వీలవుతుంది. దీనిలో పెట్టబడిన బెల్లం తూకంలో తరుగు రాకుండా స్వభావం మారకుండా వుంటుంది.

## చీడలు, తెగుళ్ళ నివారణ

సుమారు ఒక డజను తెగుళ్ళు ఈ రాష్ట్రంలో చెఱకు పంటకు తగులుతున్నట్లు కనబడ్డాయి. వీటిలో 'కాటుక' తెగులు యెక్కువగా వ్యాపించిన ముఖ్య మయిన జబ్బు. "ఎఱ్ఱకుళ్ళు" తెగులు రెండవస్థానాన్ని ఆక్రమించింది. ఇటీవల కొంత ప్రాముఖ్యతకు వస్తున్న జబ్బుల్లో "పచ్చ మచ్చ" తెగులు ఒకటి. కాటుక తెగులువలన చెఱకు దిగుబడిలోను రసపు నాణ్యతలోను విస్తారమయిన నష్టం కలుగుతున్నది. తెగులు తగిలిన మొక్కలను సమ్మూలంగా త్రవ్వి తీసివేసి, వాటిని తగులబెట్టడం, తెగులు కనబడిన తోటలను విత్తనాలకొరకు ఉపయోగించకుండడం, వాటినుండికార్శితోటలను తీసికొనకుండడం యీ తెగులు నివారించడానికి ముఖ్యమైన సాధనాలు.

నీటిముంపుకు ఆకరమయిన చెఱకు తోటలు ఎఱ్ఱకుళ్ళు తెగులుకు తేలికగా లోనవుతాయి. కనుక తోటలలో నీరు నిలువకుండా చూడడం అతిముఖ్యం. జబ్బు తగిలిన తోటలను సాధ్యమయినంత త్వరలో

గానుగాడి తెగులు వ్యాప్తిని అరికట్టాలి. జబ్బులేని విత్తనాన్ని నాటితే ఈ తెగులు రాకపోవచ్చు. ఈ జబ్బును నిరోధించగల క్రొత్త చెఱకు రకాలను నాటుటవలనకూడా దీనిని అరికట్టవచ్చును.



ఎఱ్ఱకుళ్ళు తగిలిన చెఱకు

పీకపురుగు మన రాష్ట్రంలో ప్రతి సంవత్సరమూ చాలా నష్టాన్ని కలిగిస్తున్నది. ఈ పురుగు పట్టుటవలన దిగుబడిలో నూటికి 25 పాళ్ళవరకు నష్టముంటుంది. ముచ్చెలను లోతైన కాలువలలో పాతితే యీ పురుగు వలన నష్టం కొంత తగ్గుతుంది. డి. డి. టి. (0.32%) లేక ఎన్‌డ్రిన్ (0.02%) అనే రసాయన పదార్థాలు మార్చి నెలలో నాటిన తోటకు నాలుగు, ఆరు, తొమ్మిది వారాలలో నీటిలో కలిపి చల్లినట్టయితే యీ పురుగులను బాగా అరికట్టవచ్చును.



పీకపురుగు — దొలుపుడు పురుగు

పీకపురుగు తరువాత దొలుపుడుపురుగు, దూదేకుల పురుగు, తెల్లనల్లి, పిండినల్లి, చెదపురుగులు ముఖ్యమైనవి. వీటినికూడ రసాయన పదార్థాలు చల్లి అరికట్టవచ్చును.

## చెఱకు అభివృద్ధి

పరిశోధన స్థానంనుండి వెలువడిన సూచనలను రైతుల కందజేయడానికిగాను చెఱకు అభివృద్ధి ప్రణాళిక మొదటగా 1949వ సం॥లో అమలు పెట్టబడి 1956–57 లో విస్తృతం చేయబడింది. ఈ అభివృద్ధి కార్యక్రమం రెండు భాగాలుగా వున్నది. అవి (1) చెఱకు ఫ్యాక్టరీ పరిసర ప్రాంతాలలో పరిశోధనా ప్రసార కేంద్రాలను నడపడం, (2) విరివిగా చెఱకు సాగుచేసే తాలూకాలలో ప్రత్యేక సిబ్బంది యేర్పరచి రైతులకు సలహాలు యివ్వడం.

ఇలాంటి ప్రసారకేంద్రాలు ఇప్పుడు బొబ్బిలి, యలమంచిలి, సామర్లకోట, తణుకు, వుయ్యూరు, చిత్తూరులలో నెలకొల్పబడ్డాయి. ఈ కేంద్రములు, అనకాపల్లి పరిశోధన స్థానమునుండి వెలువడిన సూచనలను ఆయా ప్రాంతాల కెంతవరకు అనుగుణ్యమో పరీక్షించుటయేకాక ఆయా ప్రాంతీయ సమస్యలనుకూడా పరీక్షించి తగు సలహాలను యివ్వడానికి యేర్పడ్డాయి.

ప్రత్యేక చెఱకు అభివృద్ధి సిబ్బంది ప్రస్తుతం 20 తాలూకాలలో పనిచేస్తున్నారు. ఈ అభివృద్ధి కార్యక్రమం సుమారు 1.30 లక్షల ఎకరాలకు వర్తిస్తున్నది. చెఱకు పరిశోధన, ప్రసార కేంద్రాలనుండి సూచించిన ఆచరణ యోగ్యమయిన అంశాలను ఈ ప్రత్యేక సిబ్బంది రైతుల సహకారంతో వారి పొలాలలో ప్రవేశపెట్టి అభివృద్ధి కార్యక్రమాలను అమలు జరుపుతున్నారు.

మన రాష్ట్రంలో 1956–57 సం॥లలో సుమారు 40 లక్షల టన్నుల చెఱకు ఉత్పత్తి అయింది. 1962–63 సం॥ నాటికి 71.97 లక్షల టన్నీలకు పెరిగింది. రాష్ట్రంమీద ఎకరానికి 26 టన్నీలనుండి 30.83 టన్నీలకు పెరిగింది. రాష్ట్రం మొత్తంమీద మూడవ పంచవర్ష ప్రణాళికాంతానికి 31.16 టన్నీలకు పెరుగుటకు అభివృద్ధి కార్యక్రమం అమలు జరుగుతున్నది.

## పంచదార పరిశ్రమ

గానిపొరని పెనములను ఉపయోగించి పంచదారను తయారుచేసే పరిశ్రమ పరిస్థితి 1931 సం॥లో ఇండియా ప్రభుత్వంవారి ఆదేశానుసారం టారిఫ్ బోర్డువారు పరిశీలించి ఒక నివేదికను వ్రాశారు. దేశీయ పంచదార పరిశ్రమను ప్రోత్సహించేందుకు దిగుమతి చేయబడే పంచదారమీద సుంకాన్ని విధించాలని వీరు సిఫారసు చేశారు. ఇండియా ప్రభుత్వంవారి సలహాల ననుసరించి 1932 సం॥లో దిగుమతి సుంకాన్ని విధించారు. తరువాత బ్రహ్మాండంగా పంచదార పరిశ్రమ విస్తృతమయ్యింది. మన రాష్ట్రంలో ఫ్యాక్టరీల సంఖ్య ఒకటినుండి ప్రస్తుతం 17 వరకు పెరిగింది.

ఆంధ్రరాష్ట్రంలో మొట్టమొదట నాటి బెల్లాన్ని కరిగించి పంచదార ఉత్పత్తి చేయడాన్ని సామర్లకోట ఫ్యాక్టరీలో చేస్తుండేవారు. తర్వాత 1934 సం॥లో మొదటి పంచదార మిల్లు బొబ్బిలిలో నెలకొల్పబడింది. ప్రస్తుతం మన రాష్ట్రంలో 7 ఫ్యాక్టరీలు సహకార సంఘాల యాజమాన్యంలో నడుస్తున్నాయి. 9 ఫ్యాక్టరీలు కంపెనీవారి యాజమాన్యంలోను, ఒకటి గవర్నమెంటువారి ఆధిపత్యంక్రింద నడుపబడుతున్నాయి. ప్రస్తుతం పనిచేస్తున్న ఫ్యాక్టరీల పేర్లు, అవి రోజుకు ఆడగల చెఱకు తూకం ఈ క్రింద యీయడం జరిగింది.*

ఈ సం॥ (1962–63) సుమారు 20,000 టన్నుల పంచదార విదేశాలకు యెగుమతి చేయబడినది. ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటువారు భారతప్రభుత్వంవారి ఎసెన్షియల్

కమోడిటీస్ ఆకు ననుసరించి చెఱకు సర శాసనము చేశారు ఆర్థికాభివృద్ధికి పంచదార పరిశ్రమకు

ఫరా పద్ధతులను నిర్ణయిస్తూ ఇటీవల ఒక ఈ విధంగా చెఱకు పరిశోధన రైతు ఎంతో దోహదకారి అవుతున్నది

## రాష్ట్రంలోని పంచదార ఫ్యాక్టరీలు, వాటి వివరాలు

| ఫ్యాక్టరీ పేరు | గ్రామం | జిల్లా | దినానికి ఆడగల చెఱకు తూకం |
|---|---|---|---|
| 1. శ్రీ రామా షుగర్స్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్ | బొబ్బిలి | శ్రీకాకుళం | 600 |
| 2. శ్రీ రామా షుగర్స్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్ | సీతానగరం | ,, | 450 |
| 3. ఆముదాలవలస కోఆపరేటివ్, & ఇండస్ట్రియల్ సొసైటీ లిమిటెడ్ | ఆముదాలవలస | ,, | 1000 |
| 4. అనకాపల్లి కోఆపరేటివ్ & ఇండస్ట్రియల్ సొసైటీ లిమిటెడ్ | తుమ్మపాల | విశాఖపట్టణం | 500 |
| 5. ఏటికొప్పాక కోఆపరేటివ్ & ఇండస్ట్రియల్ సొసైటీ లిమిటెడ్ | దార్లపూడి | ,, | 1000 |
| 6. ది చోడవరం కోఆపరేటివ్ & ఇండస్ట్రియల్ సొసైటీ లిమిటెడ్ | చోడవరం | ,, | 1000 |
| 7. తాండవ కోఆపరేటివ్ & ఇండస్ట్రియల్ సొసైటీ లిమిటెడ్ | పాయకరావుపేట | ,, | 450 |
| 8. కిర్లంపూడి షుగర్ మిల్సు లిమిటెడ్ | పిఠాపురం | తూర్పుగోదావరి | 900 |
| 9. దక్కన్ షుగర్స్ & అబ్కారి కో. లిమిటెడ్ | సామర్లకోట | ,, | 1000 |
| 10. సర్వారాయ షుగర్స్ లిమిటెడ్ | చెల్లూరు | ,, | 1000 |
| 11. ఆంధ్రా షుగర్సు లిమిటెడ్ | తణుకు | పశ్చిమగోదావరి | 1200 |
| 12. పాలకొల్లు కోఆపరేటివ్ అగ్రికల్చర్ & ఇండస్ట్రియల్ సొసైటీ లిమిటెడ్ | పాలకొల్లు | ,, | 1000 |
| 13. వి. వి. యస్. షుగర్సు | వాగల్లు | ,, | 800 |
| 14. కె. సి. పి. లిమిటెడ్ | వుయ్యూరు | కృష్ణా | 2500 |
| 15. చల్లపల్లి షుగర్సు లిమిటెడ్ | చల్లపల్లి | ,, | 800 |
| 16. చిత్తూరు కోఆపరేటివ్ అగ్రికల్చరల్ & ఇండస్ట్రియల్ సొసైటీ లిమిటెడ్ | చిత్తూరు | చిత్తూరు | 1000 |
| 17. నైజామ్ షుగర్సు లిమిటెడ్ | షక్కర్‌నగర్ | నిజామాబాద్ | 1200 |
| 18. నైజామ్ షుగర్సు లిమిటెడ్ | షక్కర్‌నగర్ | నిజామాబాద్ | 2000 |

# సంఘ సంస్కరణ కవిత్వం-2

డా॥ సి. నారాయణరెడ్డి

## 2. వర్ణవ్యవస్థానిరసనం

మానవోద్యమం కులమత వర్ణవ్యత్యాసాలను కూకటివేళ్ళతో పెల్లగించవలె నని విజృంభించిన మహోద్యమం. తెలుగునాట వెలసిన బ్రహ్మసమాజం ఈ దృక్పథాన్నే ప్రచారం చేసింది. బ్రహ్మసమాజం చేత ప్రభావితుడైన నాటి యువ భావకవి వర్ణ విద్వేష శృంఖలాల్ని త్రెంచాలని ఉద్ఘోషించాడు.

'గుణములేని వాని దే కులమైతేనేమి
తృణమైతేనేమి శ్రీ చరణమంటునేని
ఏ కౌటిల్యము వాని నేర్పరిచిందో కాని
చీకటి గదులన్నే జగదీశ్వరాలయము
లోన్నే'.[1]

అనే గేయంలో పరమేశ్వర సన్నిధానంలో వర్ణప్రసక్తి లేదని స్పష్టం చేశాడు. అయితే ఈ ప్రబోధం భక్తిని కేంద్రంగా పెట్టుకొని సాగింది. ఇది మనకు కొత్తకాదు. భక్తి జ్ఞానాలకు వర్ణప్రసక్తి లేదని భారతంలోని ధర్మవ్యాధుని చరిత్రం నిరూపిస్తుంది. భగవద్రామానుజుల వైష్ణవ మతం దీనినే ప్రతిపాదించింది. 'వల్మాటి చాపకూడు' ఇందుకు నిదర్శనం. శైవమతం దీనినే నొక్కి చెప్పింది. పాలకురికి బసవపురాణంలోని శివభక్తుల చరిత్రలు దీనికి ప్రబల సాక్ష్యాలు. కాబట్టి భగవత్సన్నిధిలో కుల ప్రసక్తి లేదనే విషయం ఈనాటిది కాదు.

అయితే వర్ణవ్యవస్థను భక్తి భావం దృష్ట్యా కాకుండా సాంఘిక చైతన్యం దృష్ట్యా నిరసించడం ఈ యుగంలోనే ప్రారంభమైంది. పూర్వకాలంలో భక్తి విషయంలో అన్ని కులాల వారికీ సమాన ప్రతిపత్తి ఉందేమో కాని సాంఘిక విషయంలో వర్ణ వ్యత్యాసం చాలా లోతుకు దిగి వుండేది. నవ్యకవి ఈ వర్ణవ్యవస్థకు ఎదురు తిరిగాడు. గుణాన్నిబట్టి కాక కులాన్నిబట్టి మానవుల హెచ్చు తగ్గులను నిర్ణయించే వ్యవస్థను ఇతడు నిరసించాడు. కడజాతి వానికి సంఘం చూపిన నిర్దాక్షిణ్యానికి ఎదురుదిరిగి కావ్య రూపంలో సవాలు చేశాడు. గగనగంగ కూడ కడజాతివాని తలమీద పులుమబడిన పంకాన్ని కడిగి కరుణించ లేదయ్యె నని ఆక్రోశించాడు. ఈ రకమైన ఆక్రందనలకు జాషువాగారి 'గబ్బిలము'లో అక్షర రూపం సిద్ధించింది. 'భరతోర్వరకున్ కడగొట్టు బిడ్డయైన అరుంధతీ సుతుడు తన దుస్థితిని కైలాస పతితో విన్నవించవలసిం దని గబ్బిలంతో తెలిపిన సందేశ మిది. ఈ కావ్యంలో జాషువాగారి కవితాహృదయం పరిపూర్ణ పరిణతి నందింది. కవి ఈ కావ్యంలో ఆనాడు బిగుసుకొనిపోయిన వర్ణవ్యవస్థలోని కుళ్ళును వెలి జిమ్మడానికి ప్రయత్నించాడు. అంటరాని వానికి 'సనాతన ధర్మధేనువుల్ పిదికిన పాలు' లభించ వని, అతని గాలిసోకగా 'నాల్గు పడగల హైందవ నాగరాజు' కసరి బుసకొడుతాదని, 'ప్రతిమల పెండ్లి సేయుటకు వందలు వేలు వ్యయింత్రుగాని దుఃఖితమతులైన' వారి పాత్రల్లో భరత మేదిని మెతుకు విదల్పదని, సశక్తమైన వ్యంగ్యంతో వర్ణవ్యవస్థాగత దురాగతాలను, దుస్థితులను ఎత్తిపొడిచారు.

## 3. సంఘవ్యవస్థా నిరసనం

జాషువాగారు కేవలం సంఘంలో వర్ణవ్యవస్థవల్ల జరుగుతున్న అన్యాయాలనే విమర్శించారు. ఒక్క వర్ణవ్యవస్థే కాదు, సంఘంలోని సమస్త వ్యవస్థ కుళ్ళిపోయిందని హుంకరించి తెలుగునాట విప్లవశంఖం పూరించిన వారు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు. సంఘశరీరానికి వర్ణవ్యవస్థ ఒక అంగం. ఈ ఒక్క అంగానికి చికిత్సచేసినంత మాత్రాన అది బాగుపడదు. అందుకు మొత్తం అంగాలను పరిశీలించాలి. అంతే రుగ్మతకు మూలకారణ మేమిటో కనుక్కోవాలి. ఈ దృష్టితో చూసిన త్రిపురనేని వారికి సమస్త సంఘవ్యవస్థ వ్యాధిగ్రస్తమై యున్నట్లు అనిపించింది. సంఘంలో అధికారముద్రవహించిన పురాణాలు, ధర్మశాస్త్రాలు, ఇతిహాసాలు అగ్రజాతుల వారు తమ స్వార్థంకోసం కల్పించుకున్న కట్టుకథలనీ, వారిచ్చిన పురాణాల నల్లమందుతో తతిమ్మా వర్ణాలవారు మైకంలో మౌఢ్యంలో

1 కృష్ణశాస్త్రిగారి గేయం ( బ్రహ్మసమాజ గీతాల్లోనిది )

పడియున్నారనీ, సంఘవ్యవస్థను ఆమూలాగ్రంగా మారిస్తేనే గాని కడమ జాతులకు విముక్తి లేదని చౌదరిగారి సిద్ధాంతం. ఈ సిద్ధాంతాన్ని పురస్కరించుకొని వారు పురాణాల్లోని కథలు బూతులనీ బూటకాలనీ నిరూపించడానికి ప్రయత్నించారు. ఆర్యులు ద్రావిడులకు చేసిన అన్యాయాలను వెల్లడించారు. రాక్షసు లెవరో కాదు ద్రావిడులే అని, రామాదులద్వారా ఆర్యులు దక్షిణ దేశంలో ఉన్న ద్రావిడులను అన్యాయంగా హతమార్చారని ఎలుగెత్తి చాటారు. పూర్వులు 'ఆర్యాస్త్రైవర్ణికః' అని చెప్పగా స్వార్థపరులు రానురాను శూద్రు లనే తెగను సృష్టించారని - వీరు ఈసడించారు. తమ పరిశోధన ఫలితంగా తేలిన చాతుర్వ్యగ లక్షణాలను నరిక్రొత్తగా వినిపించారు. శంబుకవధ, ప్రహ్లాద చరిత్ర మొదలైన వాటిలో ఆర్యులు ద్రావిడులకు (రాక్షసులకు) వ్యతిరేకంగా చేసిన పన్నాగాలను ఎత్తిచూపి పాతకులను దిగ్భ్రాంతులను చేశారు. భగవద్గీతలోని 'చాతుర్వర్ణ్యం మయాసృష్టం అనే సూత్రానికి ప్రతికూలంగా బ్రహ్మనాయుడే కృష్ణుడుగా మరో భగవద్గీతనే రచించారు. 'సూతపురాణము'లో వారు తమ సిద్ధాంతాలన్నిటినీ ప్రవేశపెట్టారు. పురాణాల్లోని కొన్ని కథలు ఏవిధంగా కల్పితాలో, వాటి యదార్థ మేమిటో సూతమహర్షి కవికి వివరించినట్లుగా ఈ పురాణం సాగిపోయింది. రచనా విషయంలో అచ్చంగా తిరుపతివేంకట కవుల ఒరవడిలో సంప్రదాయ సిద్ధంగా సాగినగ్రంథ మిది. కాని వస్తు దృష్ట్యా నవ్యకవిత్వంలోకే వస్తుంది.

## 4. గాంధీయ దృక్పథం

మానవోద్యమాన్ని వ్యక్తి స్వాతంత్ర్య పరిధినుంచి సమష్టిమానవశ్రేయో మార్గంలో ప్రవేశపెట్టిన మహనీయుడు గాంధీజీ. మతం, వివాహం మొదలగు సమస్యల కంటె ఆర్థిక దుస్థితి, భావదారిద్ర్యం తీవ్రసమస్య లని గాంధీజీ గ్రహించాడు. ఈ దృష్ట్యానే అతడు ప్రాచీన ఋషులు ప్రబోధించిన ధర్మసూత్రాలకు క్రొత్త వ్యాఖ్యానం రచించాడు. భగవద్గీతలోని కర్మయోగానికి ప్రాముఖ్య మిచ్చాడు. మానవుని మనస్సును జయించడానికి కత్తి కన్న కారుణ్యమే ప్రబలమైనదని నిరూపించాడు. జాత్యభ్యుదయానికి గ్రామవికాసం అత్యవసరమని ప్రబోధించాడు. సత్యం, ధర్మం, ప్రేమ అనే విశాల సూత్రాలద్వారా తన దృక్పథాన్ని దేశీయుల కందించాడు.

గాంధీజీ సిద్ధాంతాల ప్రభావం నవ్యకవుల్లో కొందరిమీద విశేషంగా ప్రసరించింది. వారిలో తుమ్మల సీతారామమూర్తి చౌదరి గారు అగ్రేసరులు. వారి 'ధర్మజ్యోతి' అనే కావ్యం ధర్మవీరానికీ, 'ఆత్మార్పణము' అనేది ఆత్మార్పణ తత్వానికీ (దయావీరానికీ) మచ్చు తునకలు. ఈ రెండు కావ్యాల్లో మొదటిది వారి తండ్రిగారి ధర్మతత్పరతనూ, నిస్వార్థచిత్త వృత్తినీ చాటేకథ. కవిగారి తండ్రిగారు తన ముంగిటికి వచ్చి వాలిన బంగారు ముద్దలను 'నా కెందు'కని త్రోసిపుచ్చిన ఉదంతం చిత్రింపబడిందికావ్యంలో. రెండోది భారతంలోని 'లుబ్ధకపోతోపాఖ్యానము'ను అనుసరించి పెంచి వ్రాయబడిన కావ్యం. ఒక కపోతం తన పెంటినే పొట్టబెట్టుకొన్న కలుకు పెలుకువాని కడుపుమంట చల్లార్చడానికి కనికరించి ఆత్మార్పణం చేస్తుంది. అనంతరం ఆ కలుకు పెలుకు వానిలో మనః పరివర్తనం కలుగుతుంది. ఈ వృత్తాంతం ఎంతో రమ్యంగా చిత్రింపబడింది. ఈ కావ్యంలో ఆత్మార్పణ తత్వం ప్రధానంగా నిర్దేశింపబడింది. జీవకారుణ్యం యొక్క ఆవశ్యకం ప్రతిపాదింపబడింది.

ఈ రెండు కావ్యాలూ గాంధీజీ బోధనల ప్రభావం కలిగియున్నవే. ఈ కావ్యాలే కాక గాంధీగారి ప్రభావానికి సంపూర్ణంగా లోనై తుమ్మలవారు గాంధీగారి ఆత్మకథను రసవన్మహాకావ్యంగా రచించారు. ఇది అనువాదమే కాబట్టి రచనా విషయంలో నవ్యతా ప్రసక్తి లేదు. అయితే గాంధీగారి జీవితాన్ని కావ్యవస్తువుగా చేసుకోవడంలో ఉన్న నవ్యత గమనింప దగింది.

గాంధీయ దృక్పథంలో విశ్వమానవ ప్రేమ, జీవకారుణ్యం గణనీయమైనవి. పింగళి కాటూర్ల 'సౌందరనందము' స్థూల దృష్టికి ప్రణయకావ్యం లా కనిపించినా, విశ్వమానవప్రేమను, జీవకారుణ్యాన్ని ధ్వనింపజేసిన కావ్యం. విశ్వనాథ వారు ఈ కావ్యాన్ని గూర్చి వ్రాస్తూ ఇలా అన్నారు. 'ప్రమోద కుమారచటర్జీ శిల్పపు బొత్తిడి ఆకృతి కట్టి శ్రీ ముట్నూరి కృష్ణారావుగారి ప్రభావముతో కలిసి సౌందరనందంగా మూర్తి కట్టినది.' (నవ్యసాహిత్యము (వ్యాసము) భారతి 1940 ఏప్రిలు) ప్రస్తుతం మనకు ఈ కావ్యంలోని శిల్పం ప్రసక్తం కాదు; వస్తువు మాత్రమే. ఆ వస్తువు మీద ముట్నూరివారి ప్రభావముందని పైమాటల్లో చెప్పబడింది. ముట్నూరు వారు మానవోద్యమానికి సంబంధించిన గాంధీవాదులు. వారి ధ్యేయాల్లో విశ్వమానవ ప్రేమ, జీవకారుణ్యం, సత్యాన్వేషణ ముఖ్యమైనవి. ఈ కావ్యంలో ఈ లక్షణాల ప్రభావం ఎంతో ఉన్నది. ఈ కావ్యంలోని సుందరీ నందుల గాథ అశ్వఘోషుడు రచించిన 'సౌందరనందము'లోనిది. ఈ రెండు కావ్యాలకు పోలిక ఈ మాత్రమే. తెలుగు కృతిలోని శిల్ప విన్యాసం, భావరామణీయకం, వస్తు సమున్మీలనం, పాత్రపోషణం ఈ కవుల యొక్క స్వోపజ్ఞములే. ఇక ఈ కావ్య

# జయభేరి

జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి

పరుగెత్తి రావోయి మొనగాడ!
అరిబలము హతమార్చ గలవాడ!

మాతృ రక్షా దీక్ష మహిత కర్తవ్యమ్ము
వజ్ర సంకల్పయుత వక్షస్థలమ్ముతో
ఉక్కు నరములనిండ ఉడుకు రక్తము పొంగ
ఇనుపకండలు తిరిగి ఇంద్రశక్తులు కలిగి ॥పరు॥

పాంచజన్యము నూదె పార్థసారథి నేడె
పాశుపతాస్త్రమ్ము ఫల్గుణుడు సంధించె
దశదిశలు మార్మ్రోగి దద్దరిలి పోయినవి
అన్యాయ శక్తులకు అంతమ్ము ఈనాడె ॥పరు॥

ఇంద్రకీలాద్రిపై ఇలవేల్పు దుర్గమ్మ
అసురశక్తుల జంప అంగలై చీ నిలచె
పూరీజగన్నాథ పుణ్యరథ చక్రాలు
గిరగిరా ముసుముందు దొరలిపో సాగినవి ॥పరు॥

కలకత్త లోనున్న కాళికా జగన్మాత
నిజరౌద్ర రూపాన నిల్వబడి చూచినది
కైలాసగిరిపైన గరళకంఠుడు వేగ
ప్రళయ తాండవముతో ప్రత్యక్షమైనాడు ॥పరు॥

దైవశక్తులు [illegible]
సత్యమ్ము నిత్యమ్ము జగతిలో జయమందు
భారతమ్మొక్కపై ఖండనము గావింప
యావత్ప్రపంచమ్ము ఆశ్చర్య పడిపోయె ॥పరు॥

చైనా విరోధమ్ము సరిహద్దు యనికాదు
సామ్రాజ్య విస్తరణ స్వార్థసంఘాతమ్ము
స్వాతంత్ర్య హక్కుకే వజ్రసంఘాతమ్ము
విశ్వమ్ము నీ ధర్మ విజయమ్ము కాంక్షించె ॥పరు॥

---

వస్తువుపై గాంధీయ దృక్పథం యొక్క ప్రభావ మెంతవరకుందో చూద్దాం.

భార్యాలోలుడై సమస్త లోకాన్ని మరచిన నందునికి బలవంతంగా బుద్ధుడు సన్యాస మిస్తాడు. అతని మనస్సును మారుస్తాడు. నందు డనుకుంటున్న ప్రేమ 'అఖిలజంతు సామాన్యమై'నదని. అచ్ఛమైన ప్రేమకు విషయాది వికారాలుండ వని ప్రబోధిస్తాడు. బుద్ధు డతనికి బోధించిన ధర్మసార మిది.

'కొడుకులులేని వారలకు
కూరిమి బిడ్డవు; మాతృహీనులౌ
బుడుతలకెల్ల తల్లివయి
పోషణ సేయుము, 'నా'యనంగలే
కడలెడు దీనులకా మనుపు.
మార్తుల కాదటవై భజింపు, మీ
పుడమి దివమ్ము సల్పు, మిదెపో
పరమార్థము బౌద్ధజాతికిన్'

ఎల్లలులేని ప్రేమ, వెల్లివిరిసే జీవకారుణ్యం బౌద్ధజాతి లక్ష్యాలని, అవే అందరికీ ఆదరణీయా లని ఈ పద్యంలో ప్రబోధింపబడింది. గాంధీగారు ప్రబోధించిన లక్ష్యాలూ ఇవే. గాంధీగారి ప్రభావం వల్లనే ఈ కవుల దృష్టి బౌద్ధంవైపు మళ్ళింది. అప్పటికి భారత దేశంలో బౌద్ధమతం ప్రచారంలో లేదు. దాని ఊసెత్తిన వా రెవరూ లేరు. కాబట్టి నేరుగా బౌద్ధమత ప్రభావంతో వచ్చిన కావ్యం కా దిది. తిరుపతి వేంకటకవులు గూడ ఈ శతాబ్ది ఆరంభంలో బుద్ధ చరిత్రం రచించారు. ఇందులో విశ్వమానవ ప్రేమ, జీవకారుణ్యం ఇంతవిశిష్టంగా రూపు దిద్దుకో లేదు. గాంధీగారి ప్రభావం అప్పటికి వారిపై సోకలేదు. సౌందరనందం తొలుత 1932 లో ప్రచురింపబడింది. అప్పటికే గాంధీజీ భారత దేశానికి మహాత్ముడూ, పితామహుడూ అయ్యాడు. అతని మాటలు మంత్రాలైనవి. అతడు మెట్టినచోట ప్రయాగయైనది. పింగళి కాటూర్లలో కాటూరి వారు గాంధీయ దృక్పథం ఉన్నవారని వారి 'గుడిగంటలు' అనే కావ్యంద్వారా నిరూపితమైంది. 'సౌందరనందం' గాంధీయ దృక్పథాన్ని ధ్వనింపజేసే కావ్యాల్లో కోటీర స్థాయిలో నిలిచిపోయింది.

(సశేషం)

# అభ్యుదయముఖంగా వరి పంటలు

ఎన్. ఎచ్. వి. కృష్ణమూర్తి

ఆంధ్ర ప్రదేశ్‌లో వరిపంట 7.2 లక్షల ఎకరాలలో సాగుఅవుతున్నది. సాలీనా 6-8 లక్షల బియ్యం చుట్టు ప్రక్కల వుండే బొంబాయి, మద్రాసు, కేరళ రాష్ట్రాలకు ఎగుమతి అవుతున్నది. అందువల్లనే భారత దేశానికి మన రాష్ట్రం అన్నపుగని అని చెప్పవచ్చు. మన రాష్ట్ర వరిపంట దేశపు మొత్తం పంటలో 10 శాతం విస్తీర్ణం, 12 శాతం ఉత్పత్తి కలిగివుంది.

అనేక రకాల శీతోష్ణస్థితుల నేలలో సాగు అవడంవల్ల వరి పండించే రైతుల సమస్యలు చాలా రకాలుగా వున్నాయి. ఈ సమస్యలను పరిష్కరించడం కోసం వరిపై పరిశోధనలు చెయ్యడం సుమారు 40 ఏండ్ల క్రితం మొదలైంది. ప్రాంతీయ కేంద్రాలు కూడా స్థాపించబడ్డాయి.

ఇప్పుడు మన రాష్ట్రంలో వరి పరిశోధన కేంద్రాలు 15 ఉన్నాయి.

ఈ కేంద్రాల్లో జరిగిన సక్రమమైన కృషి వల్ల 90 నుంచి 220 రోజుల్లో పండే 80 మేలైన వరి రకాలు తయారు చేయబడ్డాయి. వీటిలో 33 రకాలు రైతులకు విరివిగా అందు బాటు చేయబడుతున్నాయి.

ఏటేటా 3000-3500 టన్నుల మేలైన విత్తనాలు రైతులకు సరఫరా ఔతున్నాయి. ఇప్పుడు మొత్తం వరి విస్తీర్ణంలో సుమారు 70 శాతం మేలు రకాలక్రింద సాగు అవు తున్నది. మేలైన కృషివల్లనూ, విరివిగా ఎరువుల ఉపయోగం వల్లనూ, ఎకరా దిగుబడి ఒక దశాబ్దంలోనే 787 పౌనుల నుంచి 1122 పౌనులదాకా పెరిగింది.

## వరి పరిశోధనలోని విశేషాంశాలు

*1. ఎక్కువ ఎరువులను తట్టుకునే రకాలు :*

బలమైన నేలల్లో అమలులో వున్న ఉత్తమకృషి పద్ధతుల వల్ల ప్రస్తుతం వాడుకలో ఉన్న వరి రకాలుఅన్నీ కోసే ముందు వాలిపోతాయి. ఈ సమస్య కోస్తా జిల్లాలలో చాల విషమసమస్యగా అయింది. పంట కొంచెం ఎరువులను కూడా తట్టుకో లేక పడిపోతుంది. అందువల్ల ఎక్కువ ఎరువులను తట్టుకునే రకాల ఉత్పత్తి చాల అవసరం. సుమారు పది సంవత్సరాల నుంచి ఎక్కువ ఎరువులను తట్టుకునే జపాను రకాలతో మన దేశవాళీ రకాలు సంపర్కించబడి, పరిశోధనలు సాగు తున్నాయి. వీటిలో 6 రకాలు కొంత బాగా కనిపించేవి. ఈ రకాలను గురించి ఇంకా వివరంగా పరిశోధనలు సాగాలి.

*2. పంట వాలిపోని అక్కుళ్ళ రకాల ఉత్పత్తి :*

గోదావరి కృష్ణా డెల్టా ప్రాంతాల్లో అక్కుళ్ళ రకం. ఎక్కువ సాగుబడిలో వుంది. MTU1, SLO13 అనే అక్కుళ్ళ రకాలు, రకరకాల నేలలలోను సాగుబడి పద్ధతులలోను పంట బాగా ఇస్తాయి. ఉప్పు నేలల్లోను కొంచెం మురుగుడు ప్రాంతాలలోను కూడ ఈ రకాలు బాగా పండుతాయి.

కాని ఈ రకాలు కొంచెం మాత్రం రసాయనికపు ఎరువులు వేస్తేనే వాలి పడి పోతాయి. ఈ రకాలు, సెప్టెంబరు, అక్టోబరు నెలల్లో పూతకు వచ్చి తుఫానులో చిక్కు కొని గింజ చాలా భాగం వొల్లు అయి రైతు లకు నష్టం కలుగుతున్నది. ఈ సమస్యను పరిష్కరించడం కోసం మారుటేరు పరి శోధన కేంద్రంలో 1956 సంవత్సరం నుంచి ఒక ప్రణాలిక మొదలైంది. MTU1, SLO13 రకాలు గట్టి కర్రగల MTU3 అనే బసంగి రకంలోను, Book, Apostol అనే ఇంకా రెండు ఇండోనీషియా రకాలతోను సంపర్కింపబడ్డాయి. ఈ సంతతులలో, రెండు రకాలు అంతిమ పరీక్షలలో ఉన్నాయి.

## రెండవ పంటకు పనికివచ్చే చిన్న వరి రకాలు

నవంబరు, డిశంబరు-ఎప్రిల్, మే నెలల వరకూ సాగయ్యే రెండవ పంట మొత్తం పంటలో 10 శాతం గోదావరి డెల్టా ప్రాంతం లోనే సుమారు 4 లక్షల ఎకరాలు రెండవ పంటకాలంలో సాగవు తున్నాయి. మార్చి నెలలో నీట ఎద్దడివల్ల డెల్టా చివరి ప్రాంతాల్లో పంట దెబ్బతింటున్నది. సాధారణంగా రెండవ పంటకు జనవరిలో నారు పోసి ఫిబ్రవరిలో నాటుతారు. జనవరి నెలకన్న ముందు నాటు పెడితే గొట్టంపురుగు పంటను బాగా నష్టపరుస్తుంది.

ఇప్పుడు అందుబాటులో ఉన్న MTU9 MTU15 రకాలు, 4 నెలలకంటె ఎక్కువ కాలంలో పంటకు వస్తాయి కనుక, నీటి ఎద్దడివల్ల దెబ్బతింటాయి. ఈ రకాలకన్నా కొంచెం తక్కువ కాలంలో కోతకు వచ్చే రకాల ఉత్పత్తికోసం, MTU3, MTU15 MTU20 అనే రకాలు త్వరగా పూతకువచ్చే చైనా, జపాను వరిరకాలతో సంయోగం చేయబడ్డాయి. వీటిలో 3312, 3318, 3343 నెంబర్లు మారుటేరు కేంద్రంలోని పరి

శోధనలలో బాగా పండాయి

ఇవిగాక రాజగరికలు, తెల్ల గరికలు, ఓమ సన్నాలు, బుడ్డ గరికలు, దుబ్బ సన్నాలు, మైల సన్నాలు అనే చిన్నపంట రకాలతో హిమాయతుసాగరు, రుద్రూరు, డిండి కేంద్రాలలో పరిశోధన జరుగుతున్నది.

### చెరువులు, బావులక్రింద పండే రకాలు

విశాఖపట్టణం, నెల్లూరు, చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపూరు జిల్లాలలోను, ఇంకా తెలంగాణాలోని చాల భాగంలోను, సుమారు 15 లక్షల ఎకరాలలో వరిపంట చెరువులు, బావుల ఆధారంగా సాగు అవుతున్నది. ఈ ప్రాంతాలకు అనువైన రకాల ఉత్పత్తికోసం కడప జిల్లాలోని కమలాపురంలో (ఇప్పుడు ఈ కేంద్రం ఊటుకూరుకు మార్చబడింది) 1956 లో కృషి మొదలయింది.

రాయలసీమ జిల్లాలలో వరిపంట సాగు పద్ధతి రకాలుకూడ విపులంగా పరీక్షించి 309 దేశవాళీ రకాలు సేకరించబడ్డాయి.

MTU1, MTU3, MTU20, BCP3, రకాలు అనువుగా ఉన్నట్లు తేలింది.

శ్రీకాకుళం జిల్లాలోని రాగోలు పరిశోధన స్థానంలోను, ఖమ్మం జిల్లాలోని వైరా కేంద్రంలోను కూడ ఈ రకం పరిశోధనలు జరుగుతున్నాయి.

### అగ్గి తెగులు నిరోధించే రకాలు

పైరిక్యులేరియాఒరైజీ అనే శిలీంధ్రం ఏటేటా నెల్లూరు, చిత్తూరు జిల్లాలలో వరి పంటను నాశనం చేస్తున్నది. ఈ ప్రాంతాల్లో పంట ఆలస్యంగా నాటుతారు. డిశంబరు, జనవరి నెలలలో, గాలిలో తేమ, ఉష్ణోగ్రత ఈ తెగులుకు చాల అనువుగా వుంటాయి.

ఈ మధ్య హెచ్చుగా రసాయనికపు ఎరువులువాడం, ఉత్తమ కృషి పద్ధతులు అవలంబించడంవల్ల ఈ తెగులు మిగతా వరిపండించే ప్రాంతాల్లోకూడ వ్యాప్తి చెందింది. తెగులు నివారించే పద్ధతులలో తెగులును తట్టుకునే రకాలను సేకరించడం చాల చవకబారు పద్ధతి. అందువల్ల 1953 సంవత్సరంనుండి బుచ్చిరెడ్డిపాలెంలోని పరిశోధన కేంద్రంలో (ఇప్పుడు నెల్లూరు వరి పరిశోధన కేంద్రం) కృషి మొదలైంది.

BCP1, BCP2 అనే మొలగొలుకుల రకాలు తెగులును కొంత తట్టుకుంటాయి. BCP1, BCP2, M1834 అనే మొలగొలుకుల రకాలు, ఇంకా GEB 24, MTU19 రకాలు 604. Co19, Co25 అనే అగ్గి తెగులును నిరోధించే రకాలతో సంపర్కింపబడ్డాయి. వీటి సంపర్క సంతతితో 2092 (Co4×M1834) 5352, 5392 (Co4×BCP2) ఇంకా 6517, 6522, (Co13×Co4) రకాలు ఈ తెగులును చాలాభాగం నిరోధిస్తాయి. ఈ రకాలల్లో అగ్గి తెగులువల్ల మెడవిరుపు 8 శాతంకన్నా మించలేదు.

### ముంపుడు వరి రకాలు

పశ్చిమ గోదావరి జిల్లాలోని కొల్లేరు సరస్సు తీరాల్లోను, ఇంకా మిగిలిన, జిల్లాలలోని ముంపుడు ప్రాంతాలలోను సుమారు 2 లక్షల ఎకరాలలో వరిపంట ముంపుడు వల్ల నష్టపోతున్నది. పుళ్ళలోని ముంపుడు వరి పరిశోధనా కేంద్రంలో, 1950 లగాయతు పరిశోధనవల్ల P L A 2,3,4 అనే రకాలు సేకరించ బడ్డాయి. వీటిలో మొదటి రెండు రకాలు MTU16 తో PTB15 సంపర్కించి తయారు చేయబడ్డాయి. కొల్లేరు ప్రాంతంలోని ఎక్కువగా ముంపుడు అంటే 4′×6′ నిలిచే భూములకు అనువుగా ఉంటాయి. PLA4 అనే బర్మా అక్కుళ్ళ రకం కొల్లేరు అంచుల దగ్గరచేలకు ముంపుడు అప్పుడప్పుడు అయే ప్రాంతాలకు సరిపోతుంది.

### ఉప్పునీటి వడ్లు

రాష్ట్రంలోని 600 మైళ్ళ పొడవు సముద్రతీర ప్రాంతంలోను సుమారు 2 లక్షల ఎకరాలు భూమిలోని ఉప్పువల్ల నష్టపడుతున్నాయి. ఈ భూములలో పంట పండిస్తే రైతులకు చాలా నష్టం అవు

కుప్ప కొట్టడం



తున్నది. SR26 B అనే ఉప్పునీటి రకం, గింజపొడుగుపల్లి నూకలు ఎక్కువగా అవుతుంది. మచిలీపట్నంలోని వరిపరిశోధన కేంద్రం 1953 లో మొదలయింది. 10022, 10034 అనే (MTU1×SR26 B) రకాలు మొదటి పంటకు బాగున్నాయి. MTU9 (గరికసన్నం) బుడ్డ మొలగొలుకులు రకాలు రెండవపంటకు బాగున్నాయి.

ఇవికాక 75, 87 నంబర్లు (Co18× కుధిర్) 1827, 1032 రకాలు జిల్లాలో పరిశోధింపబడుతున్నాయి.

## రెండవ పంటలో ముందుగా సాగయ్యే రకాలు

అక్టోబరునుంచి డిశంబరు నెలవరకూ గోదావరీనది జలాలు వృథా అవుతాయి. అక్టోబరులో నాటుకు సరిపోయే వరి రకాలు చేరిస్తే ఈ నదీజలాన్ని ఉపయోగించి, వరి దిగుబడి ఇంకా ఎక్కువ చేయవచ్చు. ఈ కాలంలోని చలివల్ల పంట బాగా పెరగదు. తెల్ల వెన్ను పురుగు కూడా పంటను బాగా నష్టపరుస్తుంది. చాలాకాలం పరిశోధన చేసి ఈశ్వర కొర్రరకం అన్ని రకాలకంటె బాగా అందరికి రుజువు అయింది. కాని ఈ రకంగింజ లావుగా వుండి, ఎర్రబియ్యం కలిగి ఎక్కువమంది రైతులకు సరిపోయే సామర్లకోట, మారుటేరు పరిశోధన స్థానాలలోని కృషివల్ల, 289 నెంబరు (MTU3×SLO16) రకం బాగుందని తేలింది. ఈ రకం కొంచెం అధికంగా నూక అవుతుంది.

## వర్షాధారపు వరిపంట రకాలు

తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాలలోను, కృష్ణా జిల్లా, ఆదిలాబాదు, మెదకు, నిజామాబాద్ ప్రాంతాల్లోను, వర్షాధారపు వరి రకాలు చాల అవసరంగా వున్నాయి. MTU17, 18 అనే కోడిబుడమ, కోడికిలయ రకాలు ఎర్రబియ్యం కలిగి చాలమంది రైతులకు పసందు అవడంలేదు. 1958 లో ఈ వర్షాధారపు వరిపంటను అభివృద్ధి చేయడం కోసం ఆదిలాబాదులో ఒక ప్రణాళిక మొదలయింది. పని యింకా బాగా విస్తరించలేదు.

## వేసంగి వరి

నీరు ధారాళంగా దొరికితే మార్చినుంచి జూన్, జులై నెలలకాలంలో కూడ వరిపంట పండించవచ్చు ఈ వేసవిపంట, నల్గొండ, కరీంనగర్, మహబూబ్‌నగర్, మెదక్ హైదరాబాద్ జిల్లాలలో సుమారు 2 లక్షల ఎకరాలలో సాగు అవుతున్నది. ఈ పంట రకాలు చాల ఎక్కువ దిగుబడి యిచ్చి పురుగులు, తెగుళ్ళ బారినుండి ఎక్కువగా నష్టపడకుండా నిలుస్తాయి. బియ్యం నాణ్యంగా ఉంటుంది. అశ్వనీకార్తి వడ్లు, కథారస వడ్లు, ఓమగొడలు, కుంకుమ గుత్తులు, లక్ష్మీభోగాలు, గౌరీభోగాలు అనేరకాలు చాల చెప్పదగినవి. ఈ రకాలపై పరిశోధన బాగా వృద్ధి చెయ్యాలి.

## తెల్లగొట్టపు పురుగును తట్టుకునే రకాలు

వరంగల్లు, ఖమ్మం జిల్లాలలోను, నిజామాబాద్, కరీంనగర్, మహబూబు నగర్ జిల్లాలలోని కొన్ని ప్రాంతాలలోను తెల్లగొట్టపు పురుగులవల్ల వరిపంట ఏటేటా నష్టపడుతున్నది. ఒక్కొక్కప్పుడు పంటలో సుమారు 60–70 శాతం నష్టపడుతున్నది. ఈ పురుగును నిరోధించే రకాలను ఉత్పత్తి చేస్తే సులభంగా, ఈ నష్టాన్ని నివారించవచ్చు. వరంగల్లులో 1959 సంవత్సరంనుంచి ఒక ప్రణాళిక అమలులో వుంది. పాలసన్నాలు HR41, 42, 63, 63, 64 అనే రకాలు. ఈ పురుగును చాల భాగం తట్టుకుంటాయి. కాని ఈ పరిశోధనలు ఇతోధికంగా చెయ్యాలి.

## ఇంకా సాధించవలసిన సమస్యలు

*(1) ఏజన్సీ ప్రాంతాల్లోను, కొండవాలుల్లోను పండించే వరి రకాలు :*

తూర్పు పశ్చిమ గోదావరి, ఖమ్మం, వరంగల్లు జిల్లాలలోని ఏజన్సీ ప్రాంతాల్లో సుమారు 2 లక్షల ఎకరాలలో వరి సాగవుతున్నది. ఈ ప్రాంతాల్లో వర్షపాతం, శీతోష్ణస్థితి మిగతా ప్రాంతాలకంటే వేరుగా ఉంటాయి. ఈ రకాలను గురించి పరిశోధనలు ఇంకా ఎక్కువ చేయ్యాలి.

*(2) గొట్టంపురుగును తట్టుకునే రకాలు :*

కృష్ణా, గుంటూరు జిల్లాలలో MTU19 (కుసుమ) రకం చాల విరివిగా సాగవుతున్నది. ఎకరాకు 4000–5000 పౌనుల దిగుబడి కూడ యిస్తున్నది.

1954 వ సంవత్సరం మొదలు ఈ రకం తెల్ల కంకిపురుగు బాధకు తట్టుకోలేక దిగుబడి బాగా పడిపోయింది. ఒక్కొక్క ఏడాది పంటలో 90 శాతం దెబ్బతింటున్నది. ఈ ప్రాంతాల రైతులు ఇప్పట్లో MTU19 కన్న దిగుబడి బియ్యంలోను నాసిగా ఉన్న SLO13 (అక్కుళ్ళు) MTU22 (అట్రగడ) రకాలను వాడుతున్నారు.

ఎండ్రిను వగైరా రసాయనాలవల్ల ఈ పురుగు బాధ ఇంకా తీరని సమస్యలాగానే వుంది.

ఈ తెల్ల వెన్నుపురుగును తట్టుకునే రకాలను పరిశోధించి విడుదల చేయడం కోసం తెనాలి ప్రాంతంలో ఒక పరిశోధన కేంద్రాన్ని స్థాపించడంకోసం ప్రభుత్వం ఆలోచిస్తోంది.

## క్రొత్త ఇరిగేషన్ ప్రాజెక్టులకు అనువైన వరి రకాలు

నాగార్జునసాగరు ప్రాజెక్టు మొత్తం

# వీరమాత

శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి

ఆమె యొక వృద్ధురాలు; దురాక్రమణము
చేసివచ్చిన చైనాను చెనకి పోర
బంపె నేకైక పుత్రుని భరతమాతృ
గౌరవమ్మును స్వేచ్ఛయు గాచుకొరకు.

జననిదాస్య విముక్తికై మునుపు సుతను
తీసికొని రాగ తన తల్లి దీవనలను
బడసి యమరావతికి నేగు వైనతేయు
మనసునకు వచ్చి నీఫాకు తనయుడరిగె

జయము [illegible] స్వర్గ[illegible]
నూజునకు ప్రసాదింపగా రోజు రోజు
భక్తితో పూజలొనరించి భారమెల్ల
దైవమున కప్పగించె నా ధన్యచరిత

ఘోరమైనట్టి మరఫిరంగుల నెదిర్చి
తుట్టతుది రుధిరంపుబిందువులు రాల్చి
ధైర్య సాహసములకు శాత్రవులు కూడ
అబ్బురంపడ జేసె ప్రాణార్పణమ్ము

ఏక పుత్రుని మరణమ్ము నెరిగి తల్లి
యెంతగా విలపించెనో యెడద కుమిలి
అనుచు మంత్రులు దలచి ఓదార్చుకొరకు
చేరి రా వృద్ధమాత కుటీరమునకు

[illegible] వీరస్వర్గ [illegible]
వార్తవిని ధన్యమయ్యెను బ్రతుకటంచు
శోకమెల్లను దిగమ్రింగి వాకొనినది
తన మనమ్మున గలకోర్కె తల్లి యిట్లు

"నే నభాగ్యను మఱియొక సూనుడేని
లేకపోయెను మాతృదేశైకభక్తి
సంగరంబున కేగి యశంబునొంద
బంపి వీరమాతృత్వ సాఫల్యమొదవ."

---

ఆయకట్టు 32 లక్షల ఎకరాలలో సుమారు 16 లక్షల ఎకరాలు వరి సాగుక్రిందకు వస్తుందని అంచనా. ఈ ప్రాజెక్టులోని కుడి, ఎడమ కాలువల క్రింద వచ్చే భూములు, భూసారం, వర్షపాతం, శీతోష్ణస్థితులలో కొంత తేడా వుంది. అందువల్ల ఆంధ్ర ప్రాంతానికి అమరావతిలోను తెలంగాణాకు గరికపాడులోను పరిశోధన కేంద్రాలు నెలకొల్పబడ్డాయి. ఇక్కడ వరి రకాలు, పంట సాగు పద్ధతులను గురించి కృషిచెయ్యాలి.

## పంట సాగు పద్ధతులు, ఎరువులు గురించి కృషి

ఇంతవరకు జరిగిన పరిశోధనలలో ఆయా ప్రాంతాల్లో వరి పంటకు అనువైన ఎరువులు సాగు పద్ధతుల గురించి పరీక్షించారు. ఈ పరిశోధనలు చాలభాగం సాధారణంగా ఇవ్వబడ్డాయికాని యిప్పుడు ప్రత్యేక ప్రాంతాలకి అనువైన ఎరువులు. పంటసాగు పద్ధతులను గురించి కృషి జరగాల్సిన అవసరం చాల ఉంది. విత్తనాలు, నారు పాతినప్పుడు మొక్కలమధ్య దూరం ఎరువుల వుపయోగం గురించి ఆయా ప్రాంతాలకు విశిష్టంగా పరిశోధన చెయ్యాలి. ఈ సంబంధమైన కృషి ఇకముందు ఇంకా అధికంగా చెయ్యాలి.

మొత్తంమీద గడచిన నాలుగు దశాబ్దాలలోను వరిపంట గురించి కృషి బాగానే జరిగిందని చెప్పవచ్చు కాని ఇంకా ముందు ముందు చెయ్యవలసిన కృషి చాలా ఉంది. ఎక్కువ దిగుబడి ఇచ్చే రకాలు వాటికి తగిన ఎరువులు సాగు పద్ధతులు ఆయా ప్రాంతాలకు అనువైనట్లు పరీక్షించి రైతులకు ఫలితాలు అందచెయ్యాలి. మూడవ పంచవర్ష ప్రణాళిక మిగతా కాలంలోను, ముందువచ్చే పంచవర్ష ప్రణాళికలలోను ఈ కృషిని బాగా వృద్ధిచెయ్యాలి.

# పండ్లు, కూరగాయల అభివృద్ధి - వాటి సాగుబడి

ఎ. ఘజం..రావు

పళ్ళు, కూరగాయల్లో విటమినులు, లవణ పదార్థాలు, తదితర ఆరోగ్యాన్ని పెంపొందింప చేసే పదార్థాలు ఉండడంవల్ల అవి పోషక ఆహార పదార్థాలుగా పరిగణింప బడుతున్నాయి. మనం తినే ఆహారంలో ఇవి లోపించినట్లయితే పుష్టిలేక పోవడం, పెరుగుదల తగ్గడం, వ్యాధులు మొదలయినవి రావడం సంభవిస్తాయి. మనం నిత్యమూ తినే ఆహారంలో పళ్లూ, కూరగాయలూ తగినంత పరిమాణంలో చేర్చి వుపయోగించినట్లయితే తృణధాన్యాల వాడుకలో మంచి పొదుపు చేకూర్చుకొన వచ్చు. అంతే గాక పళ్ళు, కూరగాయలు పండించుటవల్ల ఒక ఎకరాకు వచ్చే ఆదాయం ఏ ఇతర పంటలకన్నా మూడు, లేక నాలుగు రెట్లు వుంటుందన్న విషయం ఎరిగినదే. పళ్ళు, కూరగాయలు ప్రజానీకానికి మంచి ఆరోగ్యాన్నీ, శక్తినీ ఇవ్వడమే కాక వారి ఆరోగ్యాన్ని పోషించి అధిక ఆదాయాన్ని యిస్తాయి.

మన రాష్ట్రంలో నేడు పళ్ళక్రింద దాదాపు 3.20 లక్షల ఎకరాలు, కూరగాయల క్రింద 1.8 లక్షల ఎకరాలు సాగవు తున్నాయి. పళ్ళ క్రింద, వున్న విస్తీర్ణంలో ఎక్కువ భాగం మామిడిపండ్ల క్రింద, అనగా 2.27 లక్షల ఎకరాలుంది. అరటిపండ్ల క్రింద 0.20 లక్షల ఎకరాలు, నిమ్మజాతి పళ్ళక్రింద 0.34 లక్షల ఎకరాలు. మిగతా 0.22 లక్షల ఎకరాలు ఇతర ముఖ్యమైన పళ్ళ క్రింద సాగులో వుంది. ద్రాక్ష పండ్ల పెంపకం ఇప్పుడిప్పుడే విస్తరింప బడుతున్నది. కూరగాయల క్రింద వున్న విస్తీర్ణంలో ఎక్కువగా అంటే 0.36 లక్షల ఎకరాలలో ఉల్లిగడ్డలు, మిగతా విస్తీర్ణంలో, బంగాళా దుంపలు, చిలగడ దుంపలు, తదితర శీతాకాలపు, వేసవికాలపు కూరగాయలు పండించబడుతున్నాయి. మన రాష్ట్రం నుండి ఏటా దేశంలోని ఇతర అన్ని రాష్ట్రాలకు దాదాపు 2.0 లక్షల టన్నుల మామిడిపండ్లు, మహారాష్ట్ర, మైసూర్, మద్రాసు, బెంగాలు రాష్ట్రాలకు 0.15 లక్షల నిమ్మజాతిపండ్లను, 0.3 లక్ష టన్నుల అరటి పండ్లను ఎగుమతి చేస్తున్నట్లు అంచనా వేయబడింది. ఇప్పుడిప్పుడే ద్రాక్షపండ్లు, ఎక్కువగా అనబెషాహి రకము చెప్పుకోదగ్గంత పరిమాణములో ఇతర రాష్ట్రాలయిన మద్రాసు, మహారాష్ట్ర, బెంగాలు, ఢిల్లీ ప్రాంతాలకు ఎగుమతి చేయబడుతున్నాయి. ఈ రకము పళ్ళు ఎక్కువగా హైదరాబాదు నగరపు పరిసర ప్రాంతాలలోను, కర్నూలు, కడప మరియు చిత్తూరు ప్రాంతాల లోనూ ఎక్కువగా పండింపబడుతున్నవి. కూరగాయలలో ఎక్కువగా ఉల్లిగడ్డలు, ఇతర ప్రక్క రాష్ట్రలకే కాక, దూరప్రాచ్య దేశాలకుకూడ ఎగుమతి చేయబడుతున్నవి. పై చెప్పబడినపళ్లు, కూరగాయలే కాక ఆంధ్రరాష్ట్రంలో సీతాఫలాలు, అడవి ప్రాంతాలలో ఏ పోషణ లేకయే పెరుగుతున్నాయి. దీనిక్రింద వున్న విస్తీర్ణము ఒక లక్ష ఎకరాలకు

అరటిపండ్ల పరిశోధనా కేంద్రం. తణుకు.



పై బడియుంటుంది. సీతాఫలము, "బీదవాని ఫలము"గ పరిగణింప బడుతున్నప్పటికీ మహానగరాలైన ఢిల్లీ మొదలయిన నగ రాలలో దీని గిరాకీ యెక్కువ. ప్రతి ఏటా 3 లక్షల రూపాయలకు పైగా విలువగల ఈ పళ్ళు మన రాష్ట్రం నుండి ఎగుమతి చేయబడుతున్నవి. కాబట్టి మన రాష్ట్రం ఆహారధాన్యాలకే కాక ఆరోగ్యానికి ఆలవాల మని చెప్పవచ్చును.

## అభివృద్ధికి అవకాశాలు

ఉద్యానవనకృషి రీత్యా ఆంధ్రరాష్ట్రాన్ని నాలుగు భాగాలుగ విభజించ వచ్చు.

*1 తూర్పుతీరంలోని కొండ ప్రాంతాలు :* ఈ ప్రాంతంలో ఎక్కువగా 'మాండరిన్' లేక కమలా పళ్లు, అనాస, లీచిపండ్లు, అక్కడక్కడ కాఫీ తోటలు, అరటి, దానిమ్మ మొదలైనవి పెంచబడు తున్నాయి. శ్రీకాకుళం, విశాఖ పట్టణం, తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాలలోని సముద్రపు మట్టానికి ఒక వేయినుండి నాలుగు వేల అడుగులఎత్తుకు పైగావున్న ప్రాంతాలలో ఎక్కువగా కాఫీ, కోకో, పైరిత్రము, కర్పూరము, లవంగపు పట్ట (దాల్చిని), జిరేనియం లను పండించుటకు అనువుగ వున్నట్లు, అరకులోయ, రంప చోడవరంలలోని వ్యవసాయ క్షేత్రాలలో జరిగిన ప్రయోగాలనుబట్టి తేలింది. అంతేకాక విదేశీయ కూరగాయలయిన గోబి, పూగోబి, గడ్డ గోబి, బీటుదుంప, మొదలయిన వాటినికూడ ఈ ప్రాంతాలలో పండింప వచ్చునని, వాటి విస్తరణావకాశాలు కూడ ఎక్కువగా వున్నవని ప్రయోగము చేసి చూపెట్టబడింది. ఈ పై చెప్పబడిన ప్రాంతాలు ఎత్తైన ప్రదేశాలుగా వున్నందువ ఎగువ ఏజెన్సీ ప్రాంతమని, 1,000 నుండి 1,800 అడుగుల ఎత్తులోవుండి, సంవత్స రానికి 40 నుండి 60 అంగుళాల వర్షపాత



పండిన అనబిషాహా ద్రాక్ష

మున్న సమతల ప్రాంతాలను దిగువ ఏజెన్సీ ప్రాంతాలని విభజింప బడినవి. దిగువ ఏజెన్సీ ప్రాంతాలనబడే పోలవరము, రంప చోడవరము, గోలుకొండ, గూడెముల పరిసరాలు తియ్య నారింజ, నిమ్మ, గజ నిమ్మ, కోకో, అరటి, లీచి, బేరికాయలను పండించడానికి అనువయినవి. ఈ ప్రాంతంలో వున్న కొన్ని ఎత్తైనప్రాంతాలు, అంటే రంపచోడవరం తాలూకాలోని కుట్రవాడ, గుజ్జ మామిడి, వలస ప్రాంతాలలో కాఫీ, లవంగాలు, జాపత్రి, జాజికాయ, ఖర్జూరం జిరేనియం మొదలయిన వాటిని పండించ వచ్చును. రంపచోడవరంలోని ఫల పరిశోధన స్థానంలో "క్రయ్యల్లో" అనే శ్రేష్ఠ మయిన రకం 'కోకో' బాగా పండించబడి, విస్తరింపజేయబడింది. ప్రస్తుతం ఈ రకపు మొక్కలు 350 పైగా పెంచబడు తున్నాయి.

*2 (a) తూర్పు తీరంలో సమతల ప్రాంతాలు :* ఈ ప్రాంతంలో కృష్ణా, గోదావరి నదులు ప్రవహిస్తూ, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి కృష్ణా గుంటూరు జిల్లాలకుసీటివసతి కలిగిస్తున్నాయి. ఈ ప్రాంతంలోని నేలలు సారవంతంగా వుండి నదీముఖ ప్రాంతాలలో లంకలుగా ఏర్పడ్డాయి. ఈ లంకలలో ఎక్కువగా కొబ్బరి, అరటి తోటలు పెంచబడు తున్నాయి. ఈ లంకల్లో తడిగావుండే పల్లపు ప్రాంతాలలో వరిని మెట్ట ప్రాంతాలలో కూరగాయలు, మిరప, అల్లము మొదలైనపంటలను పండిస్తున్నారు. ఎక్కువగా మామిడి, తియ్యనారింజ పళ్ళనేకాక జామ, సపోటా, పనసపండ్ల వంటి పళ్ళుకూడ ఇక్కడ పండించబడుతున్నాయి. గొట్టపు బావుల ద్వారా నీరు సమృద్ధిగా లభించడంవల్ల కూరగాయలు, అరటి, ఉల్లి పంటలను మన అవసరాలకు సరిపోగా ఎగుమతిగూడ చేసేందుకు వీలుగా ఎక్కువగా పండించుట కవకాశాలు ఏర్పడ్డాయి.

*2. (బి) ఇసుకతీర ప్రాంతాలు :* ఈ ప్రాంతాలు సముద్రతీరం నుండి అయిదు మైళ్ళ వెడల్పున శ్రీకాకుళం, విశాఖపట్టణం, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలలో వున్నాయి ఈ తీరప్రాంతాల్లో సాధారణంగా

జీడిపప్పు తోటలు పెంచబడు తున్నాయి. జీడి పప్పును శుద్ధిచేసి విదేశాలకు ఎగుమతి చేయడానికి వీలుగా పప్పును వేరు చేయడానికి కొన్ని ఫ్యాక్టరీలుకూడా వున్నాయి. జీడిపప్పు తోటలను ఎక్కువజేసి ఎగుమతులను వృద్ధిచేసి విదేశీమారక ద్రవ్యాన్ని ఆర్జించే అవకాశం ఇక్కడ ఎంతైనా వుంది. జీడిపప్పు తోటల పెంపకంతోగూడ, వేసవి నెలలలో కూరగాయలు, పూలు, పప్పుదినుసుకాయలను, ఎక్కువగా రసాయనికపు ఎరువులను ఉపయోగించి పండించవచ్చు. వీటిని విస్తరింప జేయవలసినది ఎక్కువ వుంది. నెల్లూరు జిల్లాలో పులుసు నిమ్మను ఎక్కువగా పండించడానికి అవకాశాలున్నవి.

*3. తెలంగాణా ప్రాంతం* : ఈ ప్రాంతమంతా ఎగుడు దిగుడుగా వుంది, నీటివసతి కల్పించి ఎరువులు వేసినట్లయితే చక్కటి పంటనిచ్చే, చెల్కాభూములుండి పళ్లా చదితర తోటలను పెంచడానికి వీలు కలిగివుంది. అన్నిటికన్నా ముఖ్యమైన అనెబెషాహి రకపు ద్రాక్షను ఈ ప్రాంతంలో లాభదాయకంగా పండించ డానికి వీలవుతుందన్న విషయాన్ని మన రాష్ట్రంలోని ఇతర ప్రాంతాల ప్రజలే గాక యితర రాష్ట్రాలైన పంజాబు, రాజస్థాన్, గుజరాత్, ఢిల్లీ ప్రాంతాలలోని వారుకూడ గ్రహించి ఈ ప్రాంతంలో ఎక్కువగా డబ్బును ఖర్చుపెట్టి ద్రాక్షతోటలను విస్తరింప జేస్తున్నారు. బానిమ్మ, అత్తి, జామపళ్ళను గూడ లాభదాయకంగా పండించవచ్చు. సీతాఫలాలు వాటంతటవే ఏ పోషణలేక ఈ ప్రాంతపు అడవులలో ఎక్కువగా పెరుగుతున్నాయి.

*4. రాయలసీమ ప్రాంతం* : ఈ ప్రాంతం కర్నూలు, కడప, అనంతపురం, చిత్తూరు జిల్లాలు కలిపిగా నుండి రాష్ట్ర విస్తీర్ణంలో నాలుగవ భాగానికెక్కువగా ఆక్రమించుకొన్నది. ఇది పర్వత శ్రేణులతో కూడిన మెట్ట నేలలుగల విశాల పీఠభూమి. ఈ ప్రాంతంలోని సగటు వర్షపాతం 20 నుండి 35 అం॥, అంటే మిగతా ప్రాంతాలకన్న తక్కువే. నదులు, ఉపనదులతో కూడి వున్న దీ ప్రాంతం. ఇక్కడవున్న నేలలు ఎర్ర, నల్ల మిశ్రమ నేలలుగావుంది. పలువిధాలుగా వున్నాయి. తేలిక భూములైన ఎర్రనేలలు పండ్లతోటలకు అనువైనవి. కడపజిల్లా ముఖ్యంగా రాజంపేట, పులివెందుల తాలూకాలు బత్తాయి, చీని, పులుసు నిమ్మ తోటలకు ప్రసిద్ధి చెందాయి. అరటి తోటల పెంపకానికి వాటి ఎగుమతికి గల వసతులను వినియోగించుకొని ఈ ప్రాంతంలోని రైతులు ఈ తోటలను విస్తరింప జేస్తున్నారు. అదేగాక గతమూడు సంవత్సరాలుగా కర్నూలు, చుట్టుపట్ల ప్రాంతం ఆ జిల్లాలోని ద్రోణాచలం, చిత్తూరు జిల్లాలోని మదనపల్లి, కడప చుట్టుపట్ల ప్రాంతాలలోని కొందరు రైతులు ధైర్యంతో అనెబెషాహి ద్రాక్షను పండించడానికి ఉద్యుక్తులవుతున్నారు. వారి ప్రయత్నాలు సఫలమేగాక లాభదాయకంగా కూడ వున్నాయి. దీనినిబట్టి రాయలసీమ ప్రాంతంలో ద్రాక్ష పెంపకాన్ని విస్తరింప జేయడానికి ఎంతైనా అవకాశం వుంది. ఈ ప్రాంతం శ్రేష్ఠమైన మామిడి పండ్లకు ప్రసిద్ధిచెంది, యేటా ఈ పళ్ళు పొరుగు రాష్ట్రాలకు ఎక్కువగా ఎగుమతి చేయబడు తున్నాయి. భూగర్భంలోని నీటిని వినియోగించేందుకు చేసే ప్రయత్నాలతో, నిమ్మజాతి, మామిడి, అరటి, ద్రాక్ష, జామ, సపోటా పండ్ల అభివృద్ధికి ఈ ప్రాంతంలో ఎక్కువ అవకాశంవుంది.

## పండ్లు, కూరగాయల అభివృద్ధి కార్యక్రమం

రాష్ట్రంలోని పరిస్థితి : రాష్ట్రంలోని పండ్లు, కూరగాయలు ఇతర పంటలైన కోకో, తమలపాకు, ఖర్జూర, పుచ్చకాయలు, అభివృద్ధికి గల అపరిమితమైన అవకాశాలను గ్రహించి రాష్ట్ర ప్రభుత్వంవారు వాటి పరిశోధనకు, విస్తరణకు చాలా పథకాలను ప్రణాళికలలో చేర్చారు. తోటల పెంపకానికి వాటిఉత్పత్తి పెంచడానికి పరిశోధనలు రాష్ట్రంలో వివిధ ప్రాంతాలలోని పరిశోధనా స్థానాలలో జరుగుతున్నాయి. వాటివివరాలు ఈ క్రింద * కనబరుచబడినవి.

| *పంటల వివరం | పరిశోధనా స్థానం పేరు, స్థలం |
|---|---|
| 1. విదేశీయ కూరగాయలు, లిచ్చీపండ్లు, కాఫీ, నిమ్మజాతి పండ్లు, అనాస, అరటి మొదలగునవి. | వ్యవసాయపరిశోధనా స్థానం, అనకులోయ, విశాఖపట్టణం జిల్లా |
| 2. నిమ్మజాతిపండ్లు, కోకో, మామిడి, కాఫీ, విదేశీయ కూరగాయలు, యితర రకములైన తోటపంటలు. | ఫల పరిశోధనా స్థానం, కొవ్వూరు, తూర్పు గోదావరి జిల్లా |
| 3. అరటి | అరటిపండ్ల పరిశోధనా స్థానం, కొవ్వూరు, పశ్చిమ గోదావరి జిల్లా |
| 4. జీడిమామిడి | జీడిమామిడి పరిశోధనా స్థానం, బాపట్ల, గుంటూరు జిల్లా |
| 5. మామిడి, నిమ్మజాతిపండ్లు, జామ, సపోట. | ప్రాంతీయ పండ్ల పరిశోధనా స్థానం, అనంత రాజుపేట, కడపజిల్లా |
| 6. పండ్లు, కూరగాయల శిల్ప | ప్రభుత్వ పండ్ల శిల్ప కర్మాగారం, అనంత రాజుపేట, కడప జిల్లా |
| 7. తమలపాకు | తమలపాకు పరిశోధనా స్థానం, కడప |

ఈ చెప్పబడిన ముఖ్య పరిశోధనా స్థానాలే కాక పండ్లు కూరగాయల మొక్కలను సరఫరా చేసే నిమిత్తం అనకాపల్లి, వరంగల్లులో వున్న వ్యవసాయ పరిశోధన స్థానాలలో నారుమళ్ళు నెలకొల్ప బడ్డాయి.

*విస్తరణ* : రాష్ట్రంలోని పండ్లు, జీడి మామిడి తోటలను విస్తరింపచేయడానికి పాత తోటలను పునరుద్ధరించడానికీ విస్తరణ పథకాలు 1958 నుండి 1962 వరకు అమలులో వున్నాయి. ఈ కాలంలో పథకాలక్రింద ఇచ్చిన మొత్తాలు అభివృద్ధి చేయబడిన పంటల వివరాలు† (చూ. పే. 50)

ఈ పై పథకాలు 1963 లో కొన్నికారణాలచేత అమలులో లేవు. కాని మరల 1963 సం. లో అమలులోకొచ్చే అవకాశాలు వున్నాయి. ప్రస్తుత దేశపరిస్థితుల రీత్యా కూరగాయల, ఉత్పత్తిని హైదరాబాదు నగర ప్రాంతాలలో అభివృద్ధిపరచి అవసరాలకు ఆదుకునే నిమిత్తమై 2 పథకాలను రాష్ట్రప్రభుత్వం అమలులోకి తెచ్చింది.



విరగకాచిన మిరపతోట

*(౧) హైదరాబాదు, సికింద్రాబాదు నగరాలలో పెరటి తోటలలోని అభివృద్ధి పథకం* : ఈ పథకం ప్రస్తుత అత్యవసర పరిస్థితులలో నగర వాసులు పెరటి తోటలలోను, ఇంటి ఆవరణలలోను తమ అవసరాలకు సరిపోయే కూరగాయలను పెంచడానికి సహాయం చేయడానికి ఉద్దేశింపబడింది. ఈ పథకం క్రింద 1963-64 లో కనీసం సెంటు విస్తీర్ణత కలిగిన 2,500 క్రొత్త పెరటి తోటలను ఏర్పరచాలని వున్నది. ఈ పథకం క్రింద ప్రతి ఒక సెంటుకు తక్కువ గాకుండా వుండే పెరటి తోటలకు కావలసిన సాంకేతిక సలహాలు, ఒక రూపాయి విలువగల విత్తనాలు, నాలుగు రూపాయల విలువగల రసాయనికపు ఎరువులు (అమ్మోనియం ఫాస్పేటు) మరియు 2 రూపాయల విలువ గలిగిన మందులను పురుగులు, చీడలను అరికట్టడానికి ఇస్తారు. ఈ పథకం ప్రజల ఆకర్షణకు గురై, చాల పెరటి తోటలను నెలకొల్పడము జరుగుతోంది. త్వరలోనే అనుకున్న 2,500 పెరటితోటలు నెలకొల్ప బడతాయి.

(తరువాయి 60 వ పేజీలో)

| * పంటల వివరం | పరిశోధనా స్థానం పేరు, స్థలం |
|---|---|
| 8. కర్బూజ, పుచ్చకాయలు | కర్బూజ, పుచ్చకాయల పరిశోధనా స్థానం, కడప |
| 9. కూరగాయలు (దేశి) వంగ, బెండ, చిక్కుళ్లు, టమాటా, బీర, పొట్ల మొ॥ | కూరగాయల పరిశోధనా స్థానం, కర్నూలు |
| 10. నిమ్మజాతి పండ్లు, మామిడి. | ఆదర్శ పండ్లతోట మరియు నారుమడి, గిద్దలూరు, కర్నూలు జిల్లా |
| 11. కూరగాయలు, (దేశీయ మరియు విదేశీయ) వంగ, బెండ, చిక్కుళ్ళు, పూగోబి, గోబి మొదలయినవి. | కూరగాయల పరిశోధనా స్థానం, రాజేంద్ర నగరం, (హైదరాబాదు) |
| 12. ద్రాక్ష | ద్రాక్ష పరిశోధనా స్థానం, రాజేంద్ర నగరం, హైదరాబాదు |
| 13. మామిడి, సీతాఫలము, రామాఫలము మొదలయిన పండ్లు, కూరగాయలు | పండ్ల పరిశోధనా స్థానం, సంగారెడ్డి, మెదకు జిల్లా |
| 14. మామిడి, నిమ్మజాతిపండ్లు. | ప్రభుత్వ, పండ్ల నర్సరీ, వికారాబాదు, హైదరాబాదు జిల్లా |

నాటిక

# స్వార్థత్యాగులు

ఎల్లోరా



## పాత్రలు

| | | |
|---|---|---|
| రామచంద్రయ్య | : | లక్షాధికారి, పెద్దరైతు |
| సీత | : | రామచంద్రయ్య భార్య |
| ప్రసాదు | : | రామచంద్రయ్య కొడుకు |
| కల్పన | : | ప్రసాదు మరదలు, ప్రియురాలు |
| రాజయ్య | : | పంచాయతీ ప్రెసిడెంటు |
| | | రక్షణకమిటీ మెంబరు |
| వెంకయ్య | : | చిన్నరైతు |

## రంగస్థలం

(తెర)

సీను : అది భూస్వామి రామచంద్రయ్య మేడ. ముందుహాలు-మధ్యలో రౌండుటేబులు, సోఫాలు, పూలకుండు, కుడిప్రక్క మూలగా చిన్న టేబులుమీద రేడియో, ప్రక్కనే ఫోను, ఎడమ ప్రక్కగా మేడమెట్లు, హాలుమధ్యగా కర్టెను.

రామచంద్రయ్య లోపలినుండి భాగవతం తీసుకుని బైటకు వస్తాడు. అదే సమయంలో రేడియో పైనాకు వ్యతిరేకంగా, దేశభక్తి గీతం వినిపిస్తూంటూంది. రేడియో ఆపు చేస్తాడు. అనంతరం కుర్చీలో కూర్చుని చదువుతూంటాడు.

"ధనపతి సఖుడై యుండిన..."

ప్రసాదు ఎన్. సి. సి. దుస్తులలో, లోపల్నుంచి బైటికి వెడుతూంటాడు. బూట్ల చప్పుడు విని రామచంద్రయ్య ప్రసాదుని చూసి, కళ్ళజోడు తీస్తూ—

రామ : ఎక్కడికోయ్? తెల్లవారే సరికి ఆ గంతా, బొంతా తగిలించుకుని బయలు దేరావు.

ప్రసాదు : ట్రయినింగుకు నాన్నా!

రా : వోరేయ్ నిన్ను కాలేజీకి పంపింది చదవడానికా ట్రయినింగులు నేర్వడానికా!

ప్ర : తప్పేముంది.

రా : లేదూ? ఫలానివారబ్బాయి మిలట్రీలో చేరాడంటే.

ప్ర : మీకే గౌరవం.

రా : మిడికేవులేవోయ్— నే చెప్పేది విను— నువ్వీ ట్రయినింగులు నేర్చి ఉద్యోగాలు చేసి మమ్మల్నేం ఉద్ధరించనక్కరలే. ఏదో నాలుగు అక్షరంముక్కలు నేర్చుకోరా అని పంపిస్తే—

ప్ర : ఇప్పుడేం మహాపరాధంచేయలేదు. దీనివల్ల దేశానికీ, నా భవిష్యత్తుకీ, ఎంతో ఉపయోగం వుంది.

రా : ఉంటుంది! ఉంటుంది. ఇవన్నీ నేర్చుకొన్నాక తుపాకీ చేతి కిచ్చి పదవోయ్ మిలటరీ కంటారు.

ప్ర : ఆలాటి అదృష్టం నాకు రావాలికాని...

రా : ఏమిటీ! అది అదృష్ట మటరా? ఎవడో కూడూ, గుడ్డా లేనివాడు చెయ్యవలసిన గుడ్డలూ, చెయ్యవలసిన పనులూ—

నీ కేం వచ్చిందిరా! నా మాట విను. లక్షణంగా రెండు లక్షల ఆస్థి వుంది. కాలుమీదకాలు వేసుకుని అనుభవించకా—

ప్ర : మీకు తెలియదు నాన్నా— ఈనాడు దేశం చాలా ప్రమాదంలో వుంది.

రా : రక్షించడానికి బయల్దేరాడయ్యా వీరుడు.

ప్ర : మీ రేమన్నా అనండి ఈ దేశాన్ని రక్షించుకోవల్సిన బాధ్యత, బరువు మనందరిమీదా వుంది— మీరు ఔనన్నా, కాదన్నా— ప్రతియువకుడూ "ఈ నేషనల్ కేడెట్ కోర్"లో శిక్షణ పొందాలని ప్రభుత్వం రూల్సు పెట్టింది.

రా : పెడతారు— మోసేవాడుంటే బరువేసే దానికేం లోపం. ఎంతైనా వేస్తాడు. వాడి దేం పోయింది.

బ్రిటిష్‌వాడుండగా, ఎన్నడన్నా మనలను సైన్యంలో చేరండనిచెప్పాడూ?

ప్ర : ఎందుకు చెబుతాడు? ఆ రోజులు వేరు. ఈనాడు మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. ఈ దేశాన్ని రక్షించ వలసిన బాధ్యత మనందరిమీదా వుంది. మీ రెన్నయినా చెప్పండి—

రా : ఈ ట్రయినింగు మాననంటావు—

ప్ర : క్షమించండి మీతో వాగ్వివాదం చేసే టయిం నాకు లేదు. వస్తా.

(వెళ్తాడు— రామచంద్రయ్య భార్యసీతమ్మ బైటకు వస్తుంది లోపల్నుంచి)

రా : విన్నావా— వాడిమాటలు విన్నావా! కని పెంచి పెద్దవాడిని చేసి, చదువుకుని మనల నేదో ఉద్ధరిస్తాడనుకుంటే— వాడీ మిలటరీ బట్టలు కట్టుకుని గంపెడు చీకటి నెత్తిన పెట్టుకొని మరీ పోతున్నాడు. పోయి, పోయి ఏనాడో మిలటరీలో చేరిపోతాడు— చస్తే. విన్నా నన్నూ తగలేసేవాళ్ళుకూడా వుండరు. గడ్డితిని సంపాదించిన ఈ ఆస్థిఅంతా, ఎవడో కట్టుకపోతాడు.

సీతమ్మ : ఇంతకూ మీ రనేది ఏమిటి?

రా : ఏమిటా? నీ శ్రార్ధం— నా ప్రారబ్ధం. ఆ చదువులూ ట్రయినింగులూ మాని అబ్బాయిని ఇకనుంచైనా, ఇంటిపట్టున ఉండమని చెప్పు.

సీత : వాడెక్కడకు పోతాడులెండి. మీదంతా చోద్యంకాని.

రా : చోద్యమా — సరే — అనుభవిస్తావే. నా మాట ఇప్పు డెందుకు రుచిస్తుంది — కొత్తగా. పచ్చాడుగా చైనావాడు దేశం మీదకు యుద్ధానికి. తెల్లారిలేస్తే జోరీగల గుంపల్లే కొంప మీద కొచ్చిపడి రక్షణ నిధులివ్వండి, బాండ్లు కొనండి; బంగారం ఇవ్వండి, అంటూ ఒకటేగోల. ఇవ్వి ఎత్తుకు పోతున్నవాళ్లు అబ్బాయిని ఎత్తుక పోరని ఏమిటే నమ్మకం ?

సీత : మీగోల మీది — వాడిపట్టు వాడిది. మువ్వ నా కెందుకు ? మీ అమ్మ గారికు రేడియో పెట్టమంటోంది ?

రా : అంటూండీ ! అనదూ ! మంచంలో పడుకుని ఏమీ తోచకపోతే సరి

సీత : అయ్యో రామ ! రేడియో పెట్టడాని క్కూడా ఇంత రాద్ధాంత మెందుకండీ.

రా : ఓసీ దౌర్భాగ్యురాలా ! ఆ రేడియోలో తెల్లారిలేస్తే యుద్ధ వార్తలే. దడు చే చెవులు పగిలేలాగు.

సీత : అది కాదండీ — ఈ వేళ శనివారం కదూ — వెంకటేశ్వర సుప్రభాతం వింటుందట.

రా : వింటుంది, వింటుంది. వినదు మరి — విని, విని తిరుపతి కొండమీదకే వెళ్తా నంటుంది. వీడు మిలటరీకి పోతా నంటాడు. అసలు ఈ రేడియోని—

సీత: మీరు దానిజోలికి వెళ్లకండి. అది వాడి కొచ్చిన బహుమతి— మీరు కొనిచ్చేది లేక పోగా

రా: పెట్టే దండగలు చాల్లే.

సీత: ఈ రేడియో కొనటం దండగా—ఇంకా నయం మనం బ్రతకడమే దండగన్నారు కాదు — ఆరేడియో వచ్చాకే దేశంలో ఏ మారుమూల ఏం జరుగుతున్నా తెలుస్తోంది —

రా : ఆఁ ! తెలుస్తూనే వుందిగా — మొగు డనే వాడి నుంతగానే, ఆ తాళిబొట్టు కాస్తా, ప్రసాదుగాడి మాటలువిని రక్షణ నిధి కిచ్చొచ్చావుగా !

సీత : ఇస్తే తప్పేమిటండీ ? అక్కడున్న ఆడవాళ్ళంతా చేతిగాజులు, గొలుసులూ, ఒడ్డాణాలు, చంద్రహారల్తోసహా ఇచ్చారు.

రా : నువ్వేం తక్కువ? తిన్నావా. నేను తెలివైన వాడిని కనుక ఆ నగలన్నీ ఇన ప్పెట్టెలో ముందే దాచుకున్నా కాబట్టి సరిపోయింది

సీత : సరేలెండి "నన్నంటకే నా మాలకాకి" అంటూ, దాచుకుంటే మాత్రం పోయే రోజొస్తోంటే, పట్టుకున్నా ఆగుతాయా.

రా : ఏముంది కొంప కాల్చుకుని బొగ్గులు చేసుకునే బాపతు — వెళ్ళు — వెళ్ళు —

(ఆవిడ లోపలికి వెళ్ళిపోతుంది — రక్షణ కమిటీ మెంబరు రాజయ్యవస్తాడు.)

రాజ : ఉన్నావా ? బావా

రా : నేకొస్తాపోతే ఈ భూమీపుత్రా కొంపా గోడూ అమ్మించి రక్షణనిధికి జమకట్టిద్దా మను కుంటున్నావాయేం ? కూర్చో. ఏం తెల్లారేటప్పటికి దిగావేం ?

రాజ : అదే బావా ! చెప్పాగా ఈ గ్రామంలో కూలీనాలీ చేసుకొనేవారు సైతం డబ్బు కూడబెట్టి —

రా : ఇచ్చారు — నువ్వు కూడా ఇవ్వ అంటావు. అంతేగా ?

రాజ : అవును. తప్పదు బావా.

రా : ఎందుకు తప్పదోయ్. భూమిపన్నంటే కట్టా — నీటితీరువా అంటే కట్టా — ఇంటి పన్నంటే కట్టా.

రాజ : కట్టాలి — ఈ దేశం నీది — దీన్ని రక్షించుకోవాల్సిన వాడివి నువ్వు.

రా : ఇదిగోనోయ్ రాజయ్యా నువ్వు లక్ష చెప్పు. నా కొచ్చే ఆదాయం నా ఇంటి ఖర్చులకి చాలడంలేదు. వచ్చే వాళ్ళూ పోయేవాళ్ళూ—

రాజ : ఎవరు వాళ్ళు ?

రా : చెప్పేది వినవోయ్ — పిల్లాడిచదువు, పాలేళ్ళ జీతం, మా అమ్మ మందులు, అబ్బబ్బ ఛస్తున్నానంటే నమ్ము.

రాజ : రెండులక్షల రూపాయల నిలువ వుంచు కునా చావడం !

రా : ఉంటే పారవేసుకోవాలా ఏం ? అదిగో నువ్వు చేస్తున్నావుగా నిరవాకం.

రాజ : ఇదంతా నా కనవసరం బావా — ఈ గ్రామంలో కల్లా పెద్దరైతువి. డబ్బున్న వాడివి నువ్వే. ఆదర్శంగాముందుకొచ్చి రక్షణ నిధికి డబ్బు ఇవ్వకపోతే ఎలా చెప్పు ? కాయకష్టం చేసుకొనే కార్మి కులు, కూలీలు, సమాన్య మైన పేద రైతులూ, ఈ దేశ రక్షణకు నిధులు ఎలా ఇస్తున్నారో తెలుసా !

రా : ఇస్తారయ్యా — వాళ్ళదేం పోయింది— సరే నా కిప్పుడు తీరికలేదుగాని అనకరా మాట్లాడుదాం.

రాజ : అదేమీ కుదరదు బావా ! నే నెందుకు చెబుతున్నానో ఆలోచించుకో — నువ్వు నీ శక్తివంచన లేకుండా. తప్పక నిధికి విరాళ మివ్వాలి. ఈవూరి గౌరవం నిల బెడ్తూ ఈ దేశానికి వచ్చిన ఉపద్రవం అరికట్టడానికి....

రా : ఇన్ని మాట లెందుకు — నావంతుగూడా పది వేసుకో.

రాజ : పదా !

రా : పోనీ ఇంకో రెండు

రాజ : నీ తాహతుకి......

రా : నాకంటె తాహతున్నవాళ్ళుఎంతిచ్చారో చెప్పు ?

రాజ : అదంతా అనవసరం బావా ! నువ్వు యివ్వాల్సిందే !

రా : బలవంతమా ?

రాజ : కాదు — మన బాధ్యత.

రా : దాని కంతేంవుంది ? ఏదో ఇచ్చినంత వరకూ జమకట్టుకో పో — నీకు పుణ్యం వుంటుంది ! నా పెళ్ళినాడు వందరూపాయలు పెట్టి చేయించిన నా భార్యమెడలోని తాళిబొట్టు మొన్న మీటింగులో పుచ్చుకున్నావుగా ?

రాజ : పోనీలే నీ వంతు 500 రూపాయలు ఇవ్వు.

రా : అయిదు...వంద...లే...

రాజ : అంతేగాదు. ఓ. ఇరవై వేలుపెట్టి రక్షణ బాండ్లు కొను.

రా : అ(((...

రాజ : కంగారు పడకు ! చెప్పేది విను. ఈ వూళ్ళో అందరికన్నా నీ ఇంట్లో నే బంగారం ఎక్కువ వుంది.

రా : దానిమీదకూడా పడిందీ నీ కన్ను. నన్ను అడుక్కు తినమంటారా ఏమిట్రా

రాజ : నీ బంగారం ఎక్కడికీ పోదు —నీ డబ్బూ ఎక్కడికీపోదు. నువ్వూ ఎక్కడికీ పోవు — నామాట విని గవర్నమెంటుకు అప్పుగా యివ్వు — హాయిగా వడ్డీ వస్తుంది.

రా : వస్తాయి, వస్తాయి. నెత్తిమీద కు చేతులు - వెళ్ళు — వెళ్ళు.

రాజ : ఇలా యిళ్ళల్లో దానిపెట్టినందు వల్ల ఆసొమ్ముకు భద్రంలేదు బావా — నామాట విను ఏ దొంగలో పడి పట్టుక పోతే ఏం చేస్తావ్.

రా : బావా ! నీకు వెయి దండాలుపెడ్తాను కాని ఇక వెళ్ళు.

రాజ : సరే — సాయంత్రం వస్తా మళ్ళీ.

[లేచి వెడుతూంటాడు - వెంకయ్య ఎదురుగా వస్తాడు]

వెంకయ్య : నమస్కారం రాజయ్యా.

రాజ : ఏం వెంకయ్యా ! ఏం చేశావు — రక్షణనిధి విషయం ?

వెం : ఇంకా ఆలోచించేదేముంది ప్రెసిడెంటు బాబూ, మీరూ చెప్పడం నేను కాదనడమూనా. ఇదిగో చేతిలో పైకం అందక ఆలస్యం అయింది. సాయంత్రం వచ్చి జమకడతాలెండి.

రాజ : సరే.

వెం : ఒకమాట — మావీధిలో ఆడంగులంతా ఏదో కొంత నిధి వసూలు చేశారట. ఒకసారి మీరు వెడితే ఆ డబ్బు అందిస్తామన్నారు —

రాజ : అలాగే యిప్పుడే వెడతాను —

వెం : చూడండి బాబూ — మరచిపోతాను (బొడ్లోంచి నగ బైటికి తీసి) మాకోడలు చచ్చిపోయిం తర్వాత ఈ చంద్రహారం అలాగే ఉండిపోయింది. తూకం వేయించాను. నాలుగువందల గ్రాములు వుంది. దీన్ని మా కోడలుపేర రక్షణనిధికి జమకట్టుకోండి (నగ ఇస్తాడు — ప్రెసిడెంటు తీసుకొని నవ్వుతూ)

రాజ : (రామచంద్రయ్య కేసి చూస్తూ) చూశావా బావా. ఇదీ నిజమైన దేశభక్తి అంటే.

(వెంకయ్యతో) వెంకయ్యా ఆనక నువ్వు ఇంటికి వెడుతూ ఓసారి మా యింటికిరా. రశీదు ఇస్తాను —

వెం : అలాగే. (రాజయ్య వెళ్ళిపోతాడు)

రా : నీ కేమన్నా మతిపోయిందా ? దయ్యం పట్టిందా నాలుగువందల గ్రాముల గొలుసు వాడిచేతిలో పడవేశావే.

వెం : అంతకన్నా మన దేశరక్షణకు ఎక్కువగా ముట్టచెప్పలేకపోయినందుకు చింత పడుతున్నా.

రా : పడండి ! పడండి !! పడితే లేవదీసేవారు లేదు. అయినా వెంకయ్యా—ఒక్కమాట చెబుతా విను. నీ తాహతేమిటి — నువ్వేమిటి ; అదేమన్నా ఆలోచించావా ? పైగా పిల్లలుగల వాడివి.

వెం : నా పిల్లల కేమందీ — పెద్దబ్బాయికి గవర్నమెంటేకదా స్టయిఫెండిచ్చి చదివించి ఉద్యోగం యిచ్చింది. రెండోవాడు ప్రభుత్వం ఖర్చుతోనే ఫ్యాక్టరీపని నేర్చుకొని ఉద్యోగం చేస్తున్నాడు. ఇంక మూడు నాలుగంటారా ప్రభుత్వ ఆదరణతోనే చదువు సాగిస్తున్నారు — ఆ ప్రభుత్వమే లేకపోతే నేను చదువు చెప్పించి నిరవాకం చేసేవాడినా !

రా : సరే ! ఇంతకీ నువ్వు వచ్చిన పని ఏమిటి ?

వెం : ఓ రెండువందలు అవసరముండివచ్చా. అప్పుగా ఇవ్వండి; వాడ్డనుగానే తీర్చుకుంటాను.

రా : తీరుస్తావు, తీర్చవనికాదు. నాదగ్గరేమో డబ్బులేదు. మా ఆవిడ తాలూకు ఏదో కొద్దిగా వుంది. అది ఎక్కడేనా వడ్డీ కిమ్మంటే సరేలేవే అన్నాను —

వెం : దానికేం తప్పకుండా వడ్డీ తీసుకోండి.

రా : ఉండు (లోనికి వెళ్తాడు — ఓ క్షణం తర్వాత తిరిగివస్తాడు — డబ్బిస్తూ) డబ్బుతో అంత అవసరం ఏమొచ్చిందిప్పుడు ?

వెం : చెప్పొద్దూ — నిన్న మీటింగులో ప్రెసిడెంటుగారి కేసిన పూలదండ రెండు వందలకు పాడాను.

రా : ఏమిటీ పూలదండా ! రెండు వందల రూపాయలా ! నీ కేమైనా మతిపోలేదు గదా.

వెం : నిజంగా మతే పోయింది. ఆ చైనా వాడు మన దేశంమీద ఎప్పుడు పడ్డాడో

అప్పుడే పోయింది. వాడ్ని బైటికి గెంటేదాక ఈమతిసరిగాదనుకో. వస్తా. (వెళ్ళబోతూ ఆగి) అడగడం మరచా బాబూ! తమ రెంతిచ్చా రేమిటి రక్షణ నిధికి?

రా : నీ కేదో పనుందన్నావుగా. వెళ్ళి రా తర్వాత మాట్లాడుకుందాం.

వెం : అంటున్నాననికాదు గాని డబ్బుండ గానే సరికాదు. దాన్ని సద్వినియోగం చేసే తెలివికూడా వుండాలి. రేపు ఏ దొంగలో పడి ఉన్నది దోచుకుపోతే ఏం చేస్తావు?

రా : ఆఁ! నాదగ్గరేముంది వెంకయ్యా దోచు కెళ్ళడానికి. నీ పిచ్చిగాని (లోనికివెడతాడు. వెంకయ బైటకి వెడతాడు)

(బైటనుంచి కల్పన – ప్రసాదు నవ్వుకుంటూ వస్తారు)

ప్ర : అయితే నువ్వన్ని ఏర్పాట్లు చేసుకొన్నా వన్నమాట కల్పనా

క : అవును బావా మరినువ్వో ?

ప్ర : అదే ఆలోచిస్తున్నాను. నిజం చెప్పా లంటే ఈ దేశంలో మొగవాళ్ళకంటె ఆడవాళ్ళే దేశరక్షణకు ముందడుగు వేస్తున్నారా అనిపిస్తూంది –

క : అబ్బ ! మునగచెట్టు ఎక్కించకు –

ప్ర : నిజం ! ప్రతిరోజూ మన దేశంలో చైనా దురాక్రమణకు వ్యతిరేకంగా స్త్రీ పురుష విచక్షత లేకుండా ప్రజలిస్తూన్న ధన కనక వస్తువాహనాలనీ, అందరి దండల్నీ చూస్తూంటే నాకు మతి పోతూంది.

క : ఇందులో వింతేముంది బావా ? మనకు స్వరాజ్యం వచ్చాక ప్రభుత్వం తలపెట్టిన ప్రణాళికలు జరుగుతున్న అభివృద్ధి ఇతింతని చెప్పటానికే వీలులేదు.

ప్ర : అవును ! కల్పనా ! ఎన్ని ఫ్యాక్టరీలు, ఎన్ని ప్రాజెక్టులు, ఎన్ని విద్యుత్ కేంద్రాలు, ఎన్ని ఆరోగ్య సంక్షేమ శాఖలు, ఎన్ని విద్యాప్రణాళికలు అబ్బ! దేశం సస్యశ్యామలం కావడానికి ఎన్ని ప్రయత్నాలు చేస్తోంది మన ప్రభుత్వం!

(రామచంద్రయ్య తిరిగివచ్చి వాకిలిలో నిలబడి, సంభాషణ విని వెనకనేవచ్చి)

రా : వోరేయ్ – యవ్వనంలో వున్నారు – ఒక్కచోటే చదువుకున్నారు కొద్ది రోజుల్లో పెళ్ళిచేసుకోబోతున్నారు. ఏవో ప్రేమగాథలు, వలపు కథలూ చెప్పుకోక ఈ దేశం పిచ్చిపట్టిందేంరా మీకు ?

క : అదేమిటి మామయ్యా ? "దేశమును ప్రేమించు మన్నా! మంచి యన్నది పెంచు మన్నా" అన్నది...

రా : (అడ్డువచ్చి) రేపు పుట్టబోయే కొడుకుని పెంచవమ్మా, దేశంలో మంచిని తర్వాత పెంచుదువుగాని –

ప్ర : రా ! కల్పనా ! మనం వెడదాం

రా : తగ్గతాళం కొయ్యమేళం అని సరిపోయారు (ఇద్దరూ నవ్వుకుంటూ లోనికివెళ్ళారు) రాను రాను కాలం ఇట్లా మారిపోయింది.

(భార్య నగలుపెట్టుకొని వస్తుంది. చూసి) ఎక్కడికండోయ్ రాణీగారూ, నగలన్నీ సింగారించుకుని బయల్దేరారు.

సీత : పేరంటానికండీ! ఈ వేళ మన యశోదకూతురు పెద్దమనిషైతే చిమ్మిలి దంచుతున్నారు.

రా : అందుకు ఈ నగల సింగార మంతా ఎందుకో ? సు ప్వేమన్నా పీటల మీద కూర్చోబోతున్నావా ?

సీత : చాల్లెండి. ఇన్నేళ్ళొచినా ఏంటీచతుర్లు.

రా : చతురుకాదే – ఆ నగలు పెట్టుకొని అవతలకు తగులడకు – ఇప్పటికే జనం కళ్ళల్లో నిప్పులు పోసుకుంటున్నారు.

సీత : ఎందుకు ?

రా : ఎందుకో తర్వాత చెబుతాగాని ఆనగలు తీసిలా యివ్వు. బయల్దేరావు – ఒక నవరసు బంగారం కంటె ఎక్కువ వుండకూడదని ప్రభుత్వం రూల్సు పెట్టిందట –

సీత : అంతేకదా

రా : అయితే ఈ నగలుకూడా తీసుకెళ్ళి నిదికిచ్చి వస్తానంటావేమిటీ –

సీత : తప్పేముంది. మనకు కావల్సినంత బంగారం వుంది. పెట్టుకునే వాళ్ళులేరు. ఆఇనప్పెట్టిలోపెట్టి పూజచెయ్యడంతప్ప. కోడలు వుందీ అంటే నగలు పెట్టుకోవా లని ముచ్చటే లేదు దానికి. చెప్పండి ఇవన్నీ ప్రభుత్వానికంటూ అప్పుగా ఇవ్వకూడదా.

రా : గ్రుడ్డొచ్చి పిల్ల నెక్కిరించినట్టు – నీ వెధవ సలహాలు ఎవడూ అడగలేదు కాని ఆ నగలు తీసి ఇలా పారెయ్యి –

సీత : మొండిమెడతో పేరంటానికి వెడితే అందరూ నవ్వుతారండీ.

రా : నవ్వరూ. అణాసంపాదించడం చేతగాని వాళ్ళు. తే తే.

సీత : ఛీ. పాడుపీడ. వీటిని ముచ్చటగా ఎప్పుడు పెట్టుకోనిచ్చారు లెండి. (రోషంతో మెడమీద నగలన్నీ తీసి స్తుంది. వాటిని రామచంద్రయ్య మూట గట్టుకొని లోపలికి వెళ్ళబోతుంటే ప్రసాదు వచ్చి)

ప్ర : నాన్నా! నే నీవేళ బెంగుళూరు వెడు తున్నా గాని, ఓ వందరూపాయలు కావాలి ఇవ్వు.

రా : బెంగుళూరా ? ఎందుకోయ్ ?

సీత : దేనికిరా నాయనా ?

ప్ర : సైన్యంలో చేరడానికమ్మా !

రా : విన్నావా, విన్నావా. నే చెబితె పట్టి దన్నావే.

సీత : అబ్బాయ్—మేమూ పెద్దవాళ్ళం అయి పోయాం — నీ చేతిమీదుగా ఈ రెండు తనువులు వెళ్ళిపోతే మా జన్మ తరించి నట్లే — నిన్ను యుద్ధంలోకి వెళ్ళవద్దని అనను కాని...

రా: వాడితోపాటు నీకూ మతిపోయిందేమిటే నువ్వు లోపలికి పో. నే మాట్లాడుతా,— ఏరా మమ్మల్నొదిలి యుద్ధంలోకి వెడ తావా ?

ప్ర : నెనొక్కడినే కాదునాన్నా. మా N.C.C. కేడెట్సు 400 మంది దాదాపున్నారు — అంతా వెడుతున్నాము —

దేశపు హద్దుల్లోకి పరులొచ్చి ఆక్ర మించేస్తూంటే చూస్తూ ఎలా వూరుకోను నాన్నా—మీ రిద్దరూ నన్ను దీవించండి.

రా : అందుకే ఈ చదువు లొద్దే అనిచెప్పాను. నా మాట విన్నావా.

సీత : వెళ్ళనివ్వండి — ప్రక్క ఇంటిలో దొంగలు పడితే మన కేమని ఊరుకుంటే, మనకూ అదేగతి — ఎంతమంది బిడ్డలు దేశరక్షణకోసం ఆ అగ్ని గోళాలలో ఆహుతి అవుతున్నారో మీకేం తెల్సు. చావనేది ఎక్కడున్నా వస్తుంది. దిక్కు లేని చావుకంటె దేశంకోసం త్యాగం చేసి నా బిడ్డ వీరుడై తిరిగొచ్చినా, వీర స్వర్గం అలంకరించినా నాకు సంతోషమే!

ప్ర : అమ్మా !... (కన్నీరుతో తల్లి పాదాల మీద పడతాడు) నిజంగా నీ కడుపున పుట్టినందుకు నా ఆశలు, ఆశయాలతో పాటు నా జీవితం తరించిందమ్మా

(సోఫామీద రామచంద్రయ్య, రెండు చేతులతో తలపట్టుకుని కూర్చుంటాడు— సీతమ్మ కొడుకుని చేతులతో లేవనెత్తి) 

సీత : అబ్బాయీ ! సర్వదేవతలూ నీ అండ నుంటారు. సంతోషంగా వెళ్ళిరా (దీవించి గబగబా లోనికి వెళ్ళిపోతుంది కన్నీరు వత్తుకుంటూ. ప్రసాదు — తండ్రిదగ్గరకు వచ్చి)

ప్ర : నాన్నా ! నేను యుద్ధంలో చేరడం నీ కిష్టంలేదని నాకు తెల్సు. జీవం లేని డబ్బు కోసం, నిర్జీవంగా ఈ ఇంట్లో బ్రతకమనటం నీ కిష్టం — కాని నా ఊహాలు ఉద్దేశాలు, ఆశలు ఆశయాలు వేరు. నేను సంపాదించుకున్న విద్యలు సార్థకం చేసి, నే నీ పుణ్యదేశంలో పుట్టి నందుకు నా జన్మ సార్థకం అయ్యేలా ప్రవర్తించి ఋణవిముక్తుణ్ణవ్వడం నా కర్తవ్యం — నా మాటకు అడ్డుచెప్పక— నన్ను దీవించు నాన్నా ! (కాళ్ళకి నమస్క రిస్తాడు)

రా : అబ్బాయ్ ! ఇంతవరకూ చెయ్యెత్తి ఎవరినీ దీవించలేదు. ఈ చేత్తో ఏ మంచి పనీ చెయ్యలేదు — ఈ నోటితో ఏ శుభాన్నీ పలకలేదు — నేను పుట్టిన దగ్గరనుంచీ. ఊహ తెలిసినదగ్గర నుంచీ, నా స్వార్థం తప్ప పరమార్థమన్నదే నాకు లేదు —

న్యాయంగానో, అన్యాయంగానో, పిల్లికి బిచ్చం పెట్టకుండా కొంపలు కాలి పోతున్నా, ఊళ్ళు మునిగిపోతున్నా "అయ్యో పాపం !" అన్న జిహ్వ కాదు నాది. ఈ వేళ ఈ బండబారిన గుండెల్లో ఏదో కరుణ ఏదో కాంతి ప్రవేశపెట్టావు. నువ్వే లేక పోయాక — ఈ ఆస్తి, బంగారం, ఈ లక్షలు నా కెందుకురా.

వెళ్ళు ! నాతరం మాసి పోయింది. మీ యువతరం ప్రవేశించింది. మీరు స్వార్థత్యాగులు, దేశభక్తులు.

మీకు తల్లీ తండ్రీ మీది మమకారం కన్నా మాతృదేశంమీద ప్రేమాభి మానాలు ఎక్కువ. ఆస్తులు, అంతస్థుల కన్నా ఆదర్శాలు విలువైనవి. నే నెంత దుఃఖించినా ఎన్ని అడ్డంకులు చెప్పినా నిన్ను మార్చలేను - వెళ్ళిరా - వెళ్ళిరా—

ప్ర : నాన్నా ! నాన్నా ! నిన్ను చాలా నొప్పిం చాను. అపార్థం చేసుకొన్నా. నాన్నా నన్ను క్షమించండి —

రా : ప్రసాద్ ! నేనే క్షమార్హుణ్ని కాదని నాకు తెలుసు. రామచంద్రయ్య మంచిని ప్రేమించనే లేదని అపవాదుంది. కాని, ఈ వేళ రామచంద్రయ్య కుటుంబం దేశా నికి అంకిత మయ్యిందన్న ఖ్యాతి లభించ బోతోంది. సంతోషంగా వెళ్ళిరా !

(ప్రసాదు లోనికి వెళ్తాడు. అదేసమయంలో రాజయ్య వస్తాడు)

రా బావా ! నేనే నీకు కబురు చేదామను కుంటున్నాను — దారితప్పి నువ్వే వచ్చావు.

రాజ : నీ కోసం రాలేదు — మీ అబ్బాయి కోసరం వచ్చాను — మీ అబ్బాయి, కోడలు మిలటరీలోకి వెళ్తున్నారని వీడ్కోలు ఇవ్వటానికి గ్రామం నది ఒడ్డులో ప్రజలంతా చేరారు — వాళ్ళి ద్దర్నీ తీసుకెళ్ళటానికి వచ్చాను —

రా : చాలా సంతోషం — అలాగే. ఉండు, యిప్పుడే వస్తా.

(లోపలికి వెళ్ళి ఓ క్షణం ఆగి తిరిగివచ్చాడు)

అబ్బాయీ, అమ్మాయీ వస్తున్నారు. వారేయ్ రాజయ్యా నేను 50 వేల రూపా యలకు గవర్నమెంటు బాండ్లు కొన దల్చు కొన్నాన్రా.

రాజ : బావా !

రా : ఆశ్చర్య పడకు. నా దగ్గర 200 కవరీల బంగారం ఉంది, ఆ బంగారాన్ని కూడా ప్రభుత్వానికి అప్పగించదలిచాను — ఇంకా నా వల్ల ఏం జరగాలంటావు ?—

రాజ : అసలు మాట్లాడుతున్నది రామ చంద్రయ్యేనా ! నే వింటున్నది రామ చంద్రయ్యమాటలేనా. ఇది కలా ! నిజమా !

రా : నిజంగా కలే ! రామచంద్రయ్య కన్న కలలన్నీ ఈ రూపంగా పరిణమించా యని తెలుసుకో.

రాజ : బావా ! నిన్నర్థం చేసుకో లేక పోయాను. నీ లాగ దేశంలోని భూస్వాములూ, లక్షాధికారులు, ఇలాంటి మహత్తర త్యాగంతో ముందుకు వచ్చిన నాడు మనకు ఆయుధాలకు, ప్రాజెక్టులకు, ప్రణాళికలకు డబ్బుకొరత ఏం వుంటుంది ? దేశరక్షణకమిటీ తరపున నా హృదయపూర్వక అభినందనాలు తెలుపు కుంటున్నాను —

(ఇంతలో కల్పన ప్రసాదు సూటుకేసుతో బయటకు వస్తారు. వెనకే సీతమ్మ కూడా వస్తుంది)

రా : ఏమేవ్—చిన్నీ, లోపలికెళ్ళి నా—పైపంచ, కర్రా పట్టుకురా. అబ్బాయిని సాగనంపి మరీ వస్తాను —

సీత : నిజమేనండి ?

ప్ర : నిజమేనమ్మా ! నాన్న బాగా మారి పోయాడు —

రాజ : మారిపోవడం కాదోయ్ అల్లుడూ, మనందరికంటె గొప్ప దేశభక్తుడయ్యాడు —

(సీతమ్మ లోపలికెళ్ళి పంచ, కర్ర తెచ్చిచ్చింది)

ప్ర : అమ్మా ! వెళ్లొస్తానమ్మా ! మళ్ళీ నిన్నెంతకాలానికి చూస్తానో.

కల్పన : అత్తయ్యా ! వెళ్ళొస్తా.

సీత : శుభంగా వెళ్ళిరండి. విజయం మీదే—విజయం మీదే.

రాజ : ఇక బయల్దేరుదామా !

రా : పదండి !

(అంతా కళ్ళాపి బైటకి వెడుతూంటే సీతమ్మ కన్నీరు తుడుచుకుంటూ నిలబడింది — బైటి నించి జయజయ ధ్వానాలు వినబడ్డాయి — మెల్లగా శ్లోకం వినిపిస్తుంది.

"జననీ జన్మభూమిశ్చ
స్వర్గా దపి గరీయసీ"

(తెర వాలుతుంది)

(ఆలిండియా రేడియో సౌజన్యంతో) ★

(43 వ పేజీ తరువాయి)

(బి) ద్రాక్షపళ్ళ అభివృద్ధి పథకం : మనదేశానికి స్వాతంత్ర్యం రావడముతో ఎక్కువగా ద్రాక్షనాటించే ప్రాంతాలు పాకిస్తాన్‌లో ఉండి పోయాయి. ఆ లోటును మనం పూర్తి చేసుకోవలసి వుంది. భారతీయ వ్యవసాయ పరిశోధనా సంస్థ తరపున 1956 లో హైదరాబాదులో జరిగిన అఖిల భారత ద్రాక్షపండ్ల ప్రదర్శన జరిగినపుడు ముఖ్యంగా హైదరాబాదు చుట్టుపట్ల ద్రాక్షను పెంచడానికి గల అవకాశాలను వినియోగించుకొని ఆంధ్రరాష్ట్రంలోను, దేశమంతటా ద్రాక్ష పెంపకాన్ని అభివృద్ధి పరచడానికి గల అవకాశాలు సూచింపబడ్డాయి. ఇక్కడ ఎక్కువగా పెరిగే ద్రాక్ష "అనెబె షాహి" అంటే "ద్రాక్షరాజు" అన్నది పేరుకు తగ్గట్టే వుంటుంది. పండ్లుగా తినే ప్రపంచంలోని ద్రాక్ష రకాలన్నిటికన్న అనెబెషాహి పండ్లు చాలా పెద్దవి. అంటే షుమారు ఒక పండు అరబొన్సు లేక 1½ తులాలు దాకా బరువుండి ఒక్కొక్క గుత్తి 7 పౌనులదాకా వుంటుంది. ఒక పంట కాలంలో ఇది ఎకరాకు 30,000 పౌనుల పండ్లదాకా దిగుబడిని ఇవ్వగలదు. హైదరాబాదు నగరానికి చుట్టుపట్ల ప్రాంతాలలోని నేలలు శీతోష్ణ పరిస్థితులు ఈ అనెబెషాహి ద్రాక్షను చక్కగా పండించడానికి దోహద మిచ్చాయి. ఈపరిస్థితులు రాష్ట్రంలోని ఇతర ప్రాంతాలలోగూడవుండటంవల్ల దీనిపెంపకం దినదినాభివృద్ధి చెందుతున్నది. దీని నిచ్చట చక్కగా పెంచుటకున్న పరిస్థితులు, రాబడి దూర రాష్ట్రాలైన పంజాబు, రాజస్థాన్, గుజరాత్, ఢిల్లీ ప్రాంతాలలోని ప్రజల ఆకర్షణకు గురైంది. ఆ రాష్ట్రాలనుండి కొందరు వచ్చి పెద్ద పెద్ద తోటలను పెంచడానికి ఉత్సుకులవుతున్నారు. రాష్ట్ర ప్రభుత్వం కూడా చిన్నతరహా ద్రాక్షపెంపకాన్ని హైదరాబాదు, సికింద్రాబాదు నగరాలలో ఇంటి ఆవరణలలో అభివృద్ధిచేసే నిమిత్తమై ఒకపథకాన్ని మంజూరు చేసింది. ఈ పథకం క్రింద ఎవరైతే రెండు తీగలకు తక్కువగాకుండా పదితీగలకుఎక్కువగాకుండ వేసినాగా నెలకొల్పుతారో వారికి మొక్కలు పదిరూపాయల వంతున వుచితంగా ఇస్తారు. అదే గాక కావలసిన మొక్కలను పాతడము, ఎరువులను వేయడము, చీడలను, తెగుళ్ళను అరికట్టడము వాటి విషయమై కావలసిన సాంకేతిక సలహాలు ఇవ్వబడతాయి.

ఈ పై చెప్పబడిన విషయాలనుబట్టి రాష్ట్రంలోని పండ్లు, కూరగాయల అభివృద్ధికి ప్రభుత్వం సర్వవిధాలా ప్రయత్నిస్తున్నదన్న విషయం విదితమవుతున్నది.

| పథకం పేరు | ఋణాలుగా ఇచ్చిన మొత్తం రూ. లలో | పళ్ళపేరు | ఎకరాలు |
|---|---|---|---|
| 1. పండ్ల అభివృద్ధి పథకం | 34,60,164 | నిమ్మజాతి పళ్ళు | 5,649 |
| (ఎ) దీర్ఘకాల ఋణాలు (క్రొత్త తోటలనిమిత్తం) | | మామిడి, సపోటా, జామ | 9,564 |
| (బి) స్వల్పకాల ఋణాలు (పాతతోటలను పునరుద్ధరించుటకు) | 5,47,814 | నిమ్మ జాతిపండ్లు, మామిడి | 12,951 |
| 2. జీడిమామిడి అభివృద్ధి పథకం | 9,84,862 | జీడి మామిడి | 9,848 |

# భూసార పరిరక్షణలో శ్రద్ధాసక్తులు

జి హెచ్ శంకరరెడ్డి

ప్రకృతిసిద్ధమైన సంపత్తిలో భూమి అతి ఆవశ్యకమైనది. ఆహారం, పశుగ్రాసం, ఇంధనసంపద, నారలు మొదలైనవన్నీ భూమినుంచే ఉత్పత్తి అవుతున్నాయి. అందువల్లనే "నాగరికత యొక్క బీజం భూమిలో ఉన్నది'' అన్న నానుడి వచ్చింది. భూమాత చల్లనిచూపు చూస్తేనే యేదేశమైనా పైకి వస్తుంది. భూమాతను నిర్లక్ష్యం చేయడంవల్లనే లోగడ నగరాలు, నాగరికతలు పతనం చెందాయి. భూసార రక్షణ జాతియొక్క విద్యుక్తధర్మం.

భారతీయ ఆర్థికవ్యవస్థ ప్రధానంగా వ్యవసాయంమీదే ఆధారపడి ఉంది. జాతీయ ఆదాయంలో 100 కి 50 వంతులు భూమినుంచే లభిస్తున్నది. జనాభాలో 100 కి 70 మందికి వ్యవసాయమే జీవనాధారం. వ్యవసాయం అభివృద్ధి చెందితేనే పరిశ్రమలు, వ్యాపారం, పెంపొంది దేశానికి ఆర్థికసుస్థిరత చేకూరుతుంది. కాపున భూమి ఉత్పత్తిని పెంపొందించడం అతిముఖ్యం.

పంటల ఉత్పత్తి సన్నగిల్లడానికి ముఖ్య కారణం వానవల్ల భూసారం కొట్టుకుపోవడమే. ధనాన్ని దొంగ దోచుకునే విధంగానే నీటిదొంగ భూసార ధనాన్ని దోచుకుపోతుంది. యుగ యుగాల శీతోష్ణస్థితి పరిణామ ప్రభావంవల్ల యేర్పడిన భూభాగంయొక్క పైపొరను క్షణికకాలంలో నీటిదొంగ హరించుకుపోతుంది. నేలలో యేది సారవంతమో ఆ భాగాన్ని నీటిదొంగ బలవంతంగా తీసుకొనిపోతుంది. తిన్న ఇంటి వాసాలు లెక్కపెట్టినట్లు మొదట్లో భూసారధనాన్ని దోచి తరువాత భూమినే కాజేస్తుంది. ఈ నేలదోపిడికి, నీటిదొంగకు మానవుడు సక్రమమైన వ్యవసాయ పద్ధతులను అవలంబించక పోవటంవల్ల, తోడ్పడుతున్నది. భూమి బాగా [illegible], అదుపు ఆజ్ఞల్లోలేక వేగంగాపడు వర్షం భూమిలో ఇంకుటకు సమయం లేనందువల్ల, ఉధృత వర్షాకాలంలో నేలమీద పైరు లేనందువల్ల, నీటి వేగాన్ని ఆపడానికి పొలాలలో గట్లవలె అడ్డంకులు లేనందువల్ల వర్షాఘాతము నేలను రెచ్చగొట్టి, మట్టిని చెదర్చి, నేల పైపొరను ప్రవాహంలో చేర్చుకొనిపోతుంది. ఈ విషయం స్వచ్ఛమైన వాననీరు బురదగా మారటంవల్ల స్పష్టమవుతున్నది. సారవంతమైన పైపొర కోత పడుతున్నది. పడిన వర్షమంతా ప్రవాహరూపంలో వ్యర్థమవుతున్నది. తొలుత ప్రారంభమైన పైపొరల వినాశం క్రమంగా లోతైన వంకలకు దారితీస్తుంది. ఉపరిభాగాన పొర్లినీరు నేలతోచేరి 'నదీనాంసాగరగతి' అన్నట్లు [illegible] నదీనదాలను చేరి సముద్రగర్భంలో విశ్రాంతి తీసుకుంటుంది.

నేలకోతవల్లా, నీటి వ్యర్థంవల్లా కలుగుతున్న ఈ మహానష్టం జీవిత వివిధాంగములలోని సమస్త మానవకోటికి కూడ సంక్రమించి 'వానోపసన గ్రాసములకు దైన్యములను కలిగిస్తున్నది. వ్యవసాయందృష్ట్యా అతి ప్రధానమైన పైమట్టి, పంటకు పనికివచ్చే ధాతువులు, పొలానికి వేసిన ఎరువులు, కొట్టుకొనిపోవటంవలన భూసారం తగ్గి

నీటివాలుకు అడ్డంగా భూమిని దున్నుతున్న రైతులు.



పోతుంది. చెరువులు, నీటివనరులు, మేట వేసుకొనిపోతున్నాయి. వాటిక్రింద ఆయకట్టు తగ్గుతున్నది. ఆంధ్రప్రదేశ్‌లో చెరువులు మేటవేసుకొనిపోవడంవలన 7 లక్షల ఎకరాల ఆయకట్టు తగ్గినట్లు అంచనా వేయబడింది. నీటి ప్రవాహంచేత నేల కోసుకొనిరావటంవలన నదులమధ్య మేటవేసుకొనిపోయి, లోతుతరిగి, వాటిగతులు తప్పి, వరదలు, ముంపులు అధికమవుతున్నాయి. భూమిలోకి జలం ఇంకిపోనందున బావులలో నీటిమట్టం దిగజారిపోతుంది. దీని పర్యవసానంగా అసలే దిగువస్థాయిలో నున్న ప్రజల జీవన ప్రమాణాలు మరింత దిగజారిపోతున్నాయి.

రక్షణ లేని పంట నేలలో పై 7 అం॥ భూమి 27 సంవత్సరాలలో హరించుకొనిపోవడం జరుగుతుంది. ఈ మట్టిని తయారుచేయడానికి ప్రకృతికి 500 లేక 1000 సం॥ పట్టవచ్చు. నేల-నీటిపొదుపు విషయంలో జరిగిన పరిశోధనల వల్ల, 100 కి 48 భాగాలు పడిన వర్షపునీరు భూమిపై పారిపోతుందనీ, ఆ విధంగా పోయే ప్రతి అంగుళం పొర్లేనీటితో 1½ టన్నుల సారవంతమైన మన్ను పోతుందనీ తెలియవచ్చింది. వర్షాభావంవల్ల రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలలో తరచుగా కరువులు కలుగుతున్నాయి. నీటి వనరులు నిర్మించటానికి సదుపాయాలు లేక అనిశ్చిత వర్షపాతం మీదనే ఆధారపడి వుండవలసివున్నది. ఈ ప్రాంతాలలో సగటున సంవత్సరానికి పడే 22-35 అంగుళాల వర్షపాతంలో పంటమొక్కలకు కావలసిన 3 అం॥ వర్షపునీరు కూడా ప్రవాహరూపమున నష్టమై, పంటలకందకుండాపోవడం వలన కరువులు సంభవిస్తున్నాయి. వర్షరూపంలో నేలపైపడిన ప్రతి నీటిచుక్కను భద్రపరచినపుడే నేలలో తేమ, సారం, హెచ్చైఫలసాయం పెంపొందుతుంది. నీటిని భద్రపరచినప్పుడు నేలమీది పైమట్టికూడా భద్రపరుచబడుతుంది. భూమి పైపొరతనుక క్షీణించిపోతే, ఎన్నిఎరువులు వేసినా, ఎంత మంచిరకం విత్తనాలు ఉపయోగించినా, పంటల రక్షణచర్యలు అనులు జరిపినా, ఏమాత్రం ఉపయోగం ఉండదు. వ్యవసాయోత్పత్తిని పెంపొందించాలంటే భూమిని కాపాడు కోవటం అత్యవసరం.

భూమిని నిర్లక్ష్యం చేయడం, దుర్వినియోగంచేయడం దశాబ్దాలుగా జరుగుతున్నది. ఆంధ్రప్రదేశ్‌లో వర్షాధారంచే సాగుక్రింద వుంటున్న 200.00 లక్షల ఎకరాలలో సుమారు 100.00 లక్షల ఎకరాలను రక్షణచే సముద్ధరించవలసి వుంటుందని అంచనా వేయబడింది. మిగతా 100.00 లక్షల ఎకరాలలో కూడా కొద్దో గొప్పో భూసారరక్షణ పద్ధతులను అవలంబించవలసివుంటుంది.

నీటివడికి ప్రాప్తించిన ఈ నేలకోత రైతుల పాలిటి నెత్తురుకోత. నేలకోతను అరికట్టాలంటే, భూసార ధనాన్ని రక్షించాలంటే, వర్షపునీటిని వ్యర్థం చేయకూడదంటే, పంట రాబడిని హెచ్చించాలంటే వాలున కడ్డంగా దున్నాలి, వాలున కడ్డంగా విత్తాలి, పీలిక సాగు చేయాలి, ఎక్కువ వాలుప్రదేశాలలో బల్లకూర్పుమడులు (Bench Terraces), వర్షాభావంగల ప్రదేశాలలో సమమట్టపుగట్లు (contour Bunds), వర్షపాతం అధికంగా వున్న ప్రదేశాలలో వాలుగట్లు (Graded Bunds) వేయాలి.

వాలున కడ్డంగా దున్నటంవలన మేరలు, చాళ్ళు, వాలున కడ్డంగా నుండి, చాళ్ళలో నీరు పొర్లిపోకుండా నిలుస్తుంది. మేరలు చిన్న ఆనకట్టలుగా పనిచేసి, నీటిని ఆపి, నేలలో ఇంకునట్లు చేస్తుంది. ఈ విధంగా దున్నక నేలవాలుననుసరించి దున్నినట్లయితే మేరలు, చాళ్ళు నేలవాలుననుసరించి వుంటాయి. నేలలో వెంటనే ఇంకలేని వర్షపునీరు ఈ చాళ్ళగుండా పొర్లిపోయి వ్యర్థమవుతుంది. వాలుననుసరించి పొర్లిపోయి కొద్దినీటికి వడిప్రాప్తించి, ఉధృతంగా ప్రవహించి, నీరు నష్టమవటమేకాక, సారవంతమైన మీదినేలకు ప్రత్యక్షంగా హానిచేకూరుతుంది. నీటి వడివలన నేలలో జక్కేరలు పడతాయి.

వాలున కడ్డంగా విత్తుటవలన మొక్కలు నీటిని అడ్డగించి దానివేగాన్ని, కోతవేయు శక్తిని క్షీణింపజేస్తాయి. నీటి వేగం తగ్గటం వలన నీరు నేలలో ఇంకుటకు అవకాశం కలుగుతుంది.

పీలికసాగు (Strip Cropping) అంటే ఒక పొలాన్ని వాలున కడ్డంగా పీలికలుగా భాగించి ఒక పీలికలో నేలను గ్రమ్ము స్వభావంకల సస్యములను (అంటే వేరుశనగ, అలసంద, పెసర మొ॥), దాని క్రింది పీలికలో నేలగ్రమ్మని సస్యములను (అంటే జొన్న, సజ్జ, ప్రత్తి, ఆముదాలు మొ॥ వాటిని) పెంచువిధానం. నేలను గ్రమ్ము స్వభావంకల సస్యములు నీటివేగాన్ని తగ్గించి, మీదిమన్నును వడగట్టినట్లు నిలిపి, శుభ్రమైన నీటిని మెల్లగా పోనిస్తాయి. నీరు చాలాకాలం నేలమీద వుండటంవలన నేలలో ఎక్కువగా ఇంకును. ఈ పద్ధతివలన భిన్నమైన సస్యములను పెంచడమేగాక ఏటేట తప్పనిసరిగా పంటలమార్పిడి చేయవలెను. దీనివలన ధాన్యందిగుబడికూడ హెచ్చుతుంది.

ఎక్కువ ఏటవాలుగా వున్న కొండ ప్రాంత భూములలో పెద్ద ఎత్తున మట్టిత్రవ్వి దిమ్మలుగా చేసి సేద్యం చేయవచ్చు. దీనికి దిమ్మమడులని, లేక బల్లకూర్పుమడులని

(Bench Terraces) పేరు. ఈ మళ్ళు వాన నీటిని ఆపి, నేలను కోసే వేగాన్ని పొందకుండా అరికట్టుతాయి.

నేల సహజమైన వాటానికడ్డంగా గట్లువేయడం వలన అవి నేలపై పడు వర్షపునీరు యధేష్టంగా పొర్లిపోకుండా అడ్డుకొంటాయి. నేలవాలును, వర్షాన్ని, నేల నైజాన్ని లెక్కించి నిర్ణీతస్థలాలలో సమమట్టాలను కలిపివేయబడే గట్లు సమమట్టపు గట్లు (Contour Bunds) నేలపడే వర్షపు నీటి నంతటిని గట్ల మధ్యననే నిలచిపోవునట్లు చేస్తాయి కొంచెం నీరైనా వ్యర్థంకాదు. నేలమీద నిలచిననీరు నేలలో ఇంకి పైరుకు లభ్యమవుతుంది. పొర్లిపోవు నీటికి వడి ప్రాప్తించి భూమిని కోయకమునుపే, నిర్ణీత స్థలాల్లో నున్నగట్లు నీటివేగాన్ని తగ్గిస్తాయి. పైరుకాలంలో ఎక్కువగా నీరునిలిచి పంట పాడవకుండా సమమట్టపుగట్లలో పొరలు కట్టవలెనేక నీటి కాలువలు నిర్మించి నీటిని పంపించి వేయవచ్చు. వర్షాభావంకల ప్రదేశాలలో పడిన వర్షపు ప్రతి నీటిబొట్టును తేనెబొట్టుగా లెక్కపెట్టి పైర్ల అవసరానికి అందగా చేర్చడానికి ఈ సమమట్టపు గట్లు ఎంతో తోడ్పడగలవు.

వర్షపాతం అధికంగావున్న మెట్ట ప్రదేశాలలో వాలుగట్లు (Graded Bunds) వేయాలి. ఇవి వాలునకడ్డంగా వుండటమే కాక, నీరు జారడానికే కొంచెం వాలును ఇమిడ్చి వుండటంవలన, వాలుగట్లు అనబడుతున్నవి. భూమిలో ఇంక లేనటువంటి ఎక్కువ వర్షాన్ని నీటికాలువలగుండా వెలుపలికి పంపించివేయవచ్చు. వాలుగట్లు నీటివేగాన్ని ఆపి, నేలకోత వేయకుండా చేసి పొలాలకు కలుగు తీరనినష్టాన్ని వారిస్తాయి.

లోగడ భారతదేశంలో, భూసార రక్షణకు ఎక్కువ శ్రద్ధ తీసుకోలేదు. భూమి పుష్కలంగా వున్నంతవరకు ఈ సంగతి ఎవరూ పట్టించుకోలేదు. దేశానికి స్వాతంత్ర్యం వచ్చేవరకు భూసార రక్షణకు జాతీయ కార్యక్రమం అంటూ లేనేలేదు.



దున్నేముందు పచ్చి ఎరువును చదునుచేస్తున్న రైతు.

భూసారం తగ్గిపోయి పంటలరాబడి తగ్గుతున్న పరిస్థితిని ప్రణాళికా సంఘం గుర్తించింది. ఆ సంఘం సిఫార్సు పైననే భూసార రక్షణ కార్యక్రమ పథకాలు దేశమంతట నెలకొల్పబడినవి. ఆంధ్రప్రదేశ్‌లో భూసార రక్షణపథకం క్రింద ఇంతవరకు 1½ లక్ష ఎకరాలలో మాత్రం వాలుగట్లు, సమమట్టపు గట్లు వేయబడినవి. తృతీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో మెట్ట ప్రదేశంలో 2 66 లక్షల ఎకరాలలో సమమట్టపు గట్లు, వాలు గట్లను వేయటానికి నిశ్చయించారు. అందుకు 1.74 లక్షల రూపాయలు కేటాయించబడినాయి. వాలుగట్లను రైతులు వేసికొను

(మిగతా 56 వ పేజీలో)

# పొదుపును ప్రోత్సహించే యూనిటు ట్రస్టు

1963 వ సం. వ భారత యూనిటు ట్రస్టు బిల్లును క్రిందటి నెలలో పార్లమెంటు ఆమోదించింది. యూనిటుదార్ల తరఫున సెక్యూరిటీలలో పెట్టుబడి పెట్టే నిమిత్తం ఒక కార్పొరేషన్ను నెలకొల్పేందుకు ఈ బిల్లు వీలు కలిగిస్తున్నది.

గత ఒకటిరెండు దశాబ్దాలలో అమెరికా, ఇంగ్లాండు, కెనడా, ఫ్రాన్సు, జపాను వంటి కొన్ని అభివృద్ధిచెందిన దేశాలలోనూ, లాటిన్ అమెరికా తదితర ప్రాంతాలలోని కొన్ని అభివృద్ధి చెందుతూన్న దేశాలలోనూ పెట్టుబడి కంపెనీలు, ఏజెన్సీలు ముఖ్యంగా యూనిటు ట్రస్టులు బాగా ప్రచారంలోకి వచ్చాయి. అమెరికాలో రెండవ ప్రపంచ యుద్ధం తరువాత గడచినకాలంలో యూనిటు ట్రస్టులు (లేదా స్థానికంగా ఉదహరించ బడుతున్నట్లు మ్యూచువల్ ఫండ్లు) జరిపిన యూనిట్ల వార్షిక అమ్మకంలోనూ, ఈ రూపంలో పొదుపుల సమీకరణద్వారా సమకూర్చబడిన సొమ్ములోనూ గమనార్హమైన పెరుగుదల ఏర్పడింది. 1962 వ సంవత్సరాంతంనాటికి మ్యూచువల్ ఫండ్లకు సంబంధించి సుమారు 60 లక్షల అక్కౌంట్లు వున్నట్లు, 21 బిలియన్ డాలర్లు అంటే సుమారు రూ. 10,000 కోట్ల మేరకు పెట్టుబడులు వున్నట్లూ అంచనా. ఇంగ్లాండులో కూడా ఈ ట్రస్టుల వ్యాపారంలో గత ఐదు సంవత్సరాల కాలంలో చాలా అభివృద్ధి ఏర్పడింది. 1962 వ సంవత్సరం ముగింపు నాటికి మొత్తం సొమ్ము విలువ సుమారు 257 మిలియన్ పౌండ్లు అంటే దాదాపు రూ. 343 కోట్లు వున్నట్లు అంచనా. కొన్ని ఇతర దేశాలలో ముఖ్యంగా లాటిన్ అమెరికా దేశాలలో ఈ సంస్థలు ఇదేవిధంగా శీఘ్రగతిని అభివృద్ధి చెందుతున్నాయి.

ఈ సంస్థలు బాగా ప్రచారంలోకి రావడానికిగల ముఖ్యకారణం ఇవి సమర్థవంతంగా నిర్వహించబడుతూ ప్రజలకు లాభదాయకమైన సెక్యూరిటీలు, వాటాలలో పెట్టుబడి పెట్టడానికి సదుపాయాలు కల్పించడమే. వీటివల్ల సాధారణ వ్యక్తులు సెక్యూరిటీలలో పెట్టుబడి పెట్టే అవకాశం పొందగలుగుతారు. పెట్టుబడుల విషయంలో సామాన్యంగా వుండే సాధకబాధకాలు నివారణోపాయాలను గురించిన పరిజ్ఞానం వారికి వుండ నవసరం లేదు.

పెట్టుబడికంపెనీ లేక ఏజెన్సీకీ యూనిటు ట్రస్టుకూ మధ్య వుండే వ్యత్యాసమేమిటంటే పెట్టుబడి కంపెనీ లేక ఏజెన్సీ సంస్థలు సాధారణంగా చెల్లించబడిన మూలధనం, రిజర్వులు లేక ఋణంగా పొందిన ధనంతో నిర్వహించ బడతాయి. ఇవి తమ ఇష్టానుసారం ఆదాయాన్ని వినియోగిస్తాయి. తమ డివిడెండ్లను పంపిణీ చేస్తాయి. కాగా యూనిటు ట్రస్టులు పెట్టుబడిదార్ల ఏజెంట్లుగా వ్యవహరిస్తాయి. పెట్టుబడులపై లభించే నికర ఆదాయాన్ని మధ్య మధ్య పెట్టుబడిదార్లకు పంపిణీ చేస్తాయి. యూనిటుట్రస్టులు అనేక కారణాలవల్ల పెట్టుబడి కంపెనీలకన్న ఎక్కువగా ప్రజాదరణ పొందాయి.

భారత దేశంలో, పెట్టుబడి కంపెనీల స్థాపనను ప్రోత్సహించడానికి సంబంధించిన అంశం 1931 వ సంవత్సరంలోనే పరిశీలించబడింది. యూనిటుట్రస్టులు అనగా — ఈ నాడు వ్యవహరించబడుతున్నట్లు — మ్యూచువల్ ఫండ్లు అనాడు బాగా ప్రచారంలో లేవు. కేంద్ర బ్యాంకింగ్ విషయాల విచారణ సంఘంవారు తమకు సహాయపడేందుకుగాను డిప్యూటు చేయబడిన విదేశ నిపుణులను సంప్రదించి ఈ అంశాన్ని పరిశీలించారు. సంఘం ముఖ్య నివేదికలో పెట్టుబడి కంపెనీలస్థాపన విషయమై స్పష్టమైన సిఫార్సేదీ చేయబడక పోయినప్పటికీ మైనారిటీ రిపోర్టులో మాత్రం డబ్బు సమకూర్చగల పెట్టుబడిదార్లకూ, ఆ డబ్బును వినియోగించగల వారికీ మధ్యవర్తిగా పెట్టుబడి కంపెనీలు చాలా ఉపయుక్తమైన పాత్ర వహించే స్థితిలోవున్నట్లు పేర్కొనబడింది. మైనారిటీ రిపోర్టులో చేయబడిన సిఫార్సుల ఫలితంగా పెట్టుబడి కంపెనీలకు కొన్ని పరిస్థితులలో, అవి ఇతర కంపెనీల నుండి డివిడెండ్లుగా పొందే ఆదాయంపై సూపర్ టాక్సును మినహాయించడం వంటి పరిమితమైన రాయితీలను మంజూరు చేయడం జరిగింది. 1933 వ సంవత్సరంలో మొదటిసారిగా అప్పుడు అమల్లోవున్న ఆదాయపు పన్నుచట్టం క్రింద ప్రకటనద్వారా మంజూరు చేసిన ఈ రాయితీ ఇంకా కొనసాగుతున్నది. అయితే 1956 వ సంవత్సరపు కంపెనీల చట్ట నిబంధనలననుసరించి పనిచేస్తున్న

పెట్టుబడి కంపెనీలు పొదుపు మొత్తాల సమీకరణలో కానీ, వాటిని దేశప్రయోజనానికై విస్తృతమైన సెక్యూరిటీలకు పెట్టుబడి పెట్టడంలోకానీ ఇంతవరకు చెప్పుకోదగిన కృషి జరపలేక పోయాయి.

ముఖ్యమైన ఈ విధులను చేపట్టేందుకు, అభివృద్ధి చెందిన ఇతర దేశాలలో మాదిరిగా ప్రజలు పెట్టుబడి పెట్టడానికి వీలుగా సులభమైన, అపరిమితమైన సౌకర్యాలు కల్పించగల యూనిటు ట్రస్టును నెలకొల్పడం అవసరం. అమెరికా, ఇంగ్లాండులలో సాధారణంగా వర్తించే చట్టనిబంధనల ననుసరించి పనిచేసే ఫండ్లు, ట్రస్టులు అనేకం వున్నాయి. ఫండ్లు లేక ట్రస్టులతో కూడిన జాతీయ సంస్థల ఆదేశాలు, నియమావళులననుసరించి పనిచేసేవి కూడా వున్నాయి. అమెరికాలోవలె 1940 వ సంవత్సరపు పెట్టుబడి కంపెనీల చట్టం మాదిరిగా గానీ లేక ఇంగ్లాండులోవలె 1958 వ సం॥పు దగాల (పెట్టుబడులు) నిరోధన చట్టం మాదిరిగా గానీ ఒక ప్రత్యేక శాసనాన్ని రూపొందించడం అవసరమా కాదా అనే విషయం ప్రత్యేకంగా పరిశీలించబడింది. మొత్తం మీద చూచినట్లయితే ప్రభుత్వరంగంలో ఒకే ఒక సంస్థను నెలకొల్పడం ఉపయుక్తం కాగలదనిపిస్తుంది.

మన దేశంలో ప్రస్తుత పరిస్థితులలో పరస్పరం పోటీ పడేట్లుగా అనేక యూనిట్ల స్థాపనను ప్రోత్సహించడం అభిలషణీయం కాదు. ఇటువంటి ట్రస్టులు వ్యక్తిగత వర్తక సంస్థలు లేక బృందాలచే స్థాపించబడి వాటి స్వంత పారిశ్రామిక, వ్యాపార సంబంధాలతో నిర్వహించబడినట్లయితే అవి లోగడ స్థాపించబడిన పెట్టుబడి సంస్థలకంటే ఎక్కువ ప్రజాదరణ పొందక పోవచ్చు. ఇటువంటి ట్రస్టుల పెట్టుబడులు పరిస్థితుల కనుగుణ్యంగా ఉపయోగకరం కాకపోవచ్చు. ప్రభుత్వం నుంచి గానీ, రిజర్వుబ్యాంకు నుంచికానీ లేక మరేదైనా పబ్లిక్‌రంగం సంస్థనుంచి కానీ సహాయంపొందే విషయంలో ఎటువంటి ప్రత్యేక నిబంధనలేకుండా ప్రైవేటురంగంలో స్థాపించబడే యూనిటు ట్రస్టులు అద్యతన భావిలో పటిష్ఠమైన సంస్థలుగా రూపొందడం కూడా సందేహాస్పదమే. ఈ పరిస్థితులలో ప్రత్యేక చట్టంక్రింద చట్టబద్ధమైన కార్పొరేషనుగా నూతన సంస్థను స్థాపించడానికి తలపెట్టబడింది.

భారత యూనిటు ట్రస్టుగా వ్యవహరించబడే ఈ నూతన సంస్థకు ప్రారంభంలో రూ. 5 కోట్ల నిధి సమకూర్చబడుతుంది. దీనిలో రూ. 4 కోట్లను రిజర్వుబ్యాంకు, జీవితబీమా కార్పొరేషను, స్టేట్ బ్యాంకు దాని సహాయక సంస్థలు ఇస్తాయి. మిగతా కోటి రూపాయల మొత్తం స్టేట్ బ్యాంకు, దాని సహాయక సంస్థలు కానటువంటి షెడ్యూల్డు బ్యాంకులు, ఇతర ఆర్థిక సంస్థల నిమిత్తం ప్రత్యేకించబడుతుంది. ఒకవేళ ఈ సంస్థలు ట్రస్టుకు ప్రారంభ సంవత్సరాలలో సహాయపడడంలో ఆసక్తి చూపనట్లయితే ఈ విధంగా ప్రత్యేకించబడిన నిధికి రిజర్వుబ్యాంకు డబ్బు చెల్లిస్తుంది. ఈ విధంగా ట్రస్టు, తలపెట్టిన ప్రకారం రూ. 5 కోట్ల పూర్తి మొత్తంతో తన పనిని ప్రారంభించగలుగుతుంది.

ట్రస్టు రూ. 5 కోట్ల ప్రారంభ మొత్తాన్ని పూర్తిగా కానీ లేక అందులో కొంతభాగాన్ని కానీ భవిష్యత్తులో అది ఈ ప్రత్యేక సహాయం అవసరం లేదని భావించినప్పుడు ఎప్పుడైనా యజమానులకు వాపసు చేయవచ్చు.

ట్రస్టు నిర్వహణ బాధ్యతను ట్రస్టీల బోర్డుకు అప్పగించడానికి ఉద్దేశించబడింది. ఈ బోర్డులో సాధారణంగా 9 మంది సభ్యులు వుంటారు. బోర్డు అధ్యక్షుడినీ, నలుగురు సభ్యులను రిజర్వుబ్యాంకు నామినేటుచేస్తుంది. జీవితబీమా కార్పొరేషను, స్టేట్ బ్యాంకు చెరి ఒక సభ్యుని చొప్పున నామినేటు చేస్తాయి. ప్రారంభ నిధికి డబ్బు చెల్లించిన ఇతరులు మిగతా ఇద్దరు ట్రస్టీలను ఎన్నుకుంటారు. అధ్యక్షుడు పార్ట్‌టైమ్ ప్రాతిపదికపై నియమించబడినట్లయితే, రిజర్వుబ్యాంకు ఇతర తొమ్మిది మంది ట్రస్టీలుగాక ఒక ఎగ్జిక్యూటివ్ ట్రస్టీనికూడా నియమిస్తుంది.

దైనందిన వ్యవహారాలలో ట్రస్టుకు చాలా వరకు స్వేచ్ఛవుంటుంది. రిజర్వుబ్యాంకు ఇచ్చే ఆదేశాలకు లోబడి, పెట్టుబడిదార్ల ప్రయోజనాల దృష్ట్యా వారి తరఫున ఇది తన వ్యవహారాలు సాగించవలసి వుంటుంది. ట్రస్టు ప్రాథమికంగా వ్యక్తుల ప్రయోజనార్థమే ఉద్దేశించబడినప్పటికీ ఇది ఫర్ములు, కంపెనీలు ఇంకా ఇతర సంస్థలనుంచి పొదుపు మొత్తాలను ఆకర్షించడంపై ఆంక్షఏమీ వుండదు. యూనిట్ల విలువ రూ. 100/-లకు మించదు కాబట్టీ అంతేగాక ఇవి ఒకే రేటుకు వలసినన్ని లభ్యమవుతాయి కాబట్టీ జీతాలు పొందేవారు లేక తక్కువగా పొదుపుచేయగలిగే వారితోసహా మధ్యతరగతికి చెందిన వ్యక్తులు ట్రస్టు లభింపజేసే సౌకర్యాలను వినియోగించుకొని యూనిట్లను కొనడం ద్వారా సెక్యూరిటీలకు పెట్టుబడి పెట్టే స్థితిలో వుండగలరని ఆశించబడుతున్నది.

ఒక వ్యక్తి ఎన్ని యూనిట్లనైనా కొనుక్కోవచ్చు. దీనిపై ఎటువంటి నిర్బంధం వుండదు. ఈ యూనిట్లను స్వేచ్ఛగా మరొకరికి మార్చవచ్చు. బ్యాంకులవద్ద కుదువ బెట్టి అప్పు తీసుకోవచ్చు. రిటైర్‌మెంటుకు కానీ లేక పునః విక్రయానికికానీ ఈ యూనిట్లను తిరిగి కొనుక్కునేందుకు ట్రస్టు సిద్ధంగా వుంటుంది. ఈ కొనుగోలుధరలు, ట్రస్టుచే మధ్య మధ్య ప్రకటించబడే ట్రస్టు ఆస్తుల విలువపై ఆధారపడి వుంటాయి.

నిర్వహణ ఖర్చులు, అప్పులకు చెల్లించే వడ్డీమొత్తాలు పోను మిగిలిన ట్రస్టు వార్షిక ఆదాయం యూనిటుదార్లకు పంపిణీ చేయబడుతుంది. యూనిట్లపై వచ్చే ఆదాయం నిర్వహణఖర్చులకు సాధ్యమైనంత పరిమితంగా వినియోగించబడుతుంది. ఎట్టి సందర్భంలో కూడా ఈ ఖర్చులు యూనిట్ల ఆదాయంలో 5 శాతానికి మించకుండా పరిమితం చేయబడుతుంది. ఒక వేళ నిర్వహణ ఖర్చులు అధికమైనట్లయితే, మిగతా

మొత్తాన్ని ట్రస్టు ప్రారంభనిధికి పెట్టుబడి పెట్టినవారి ఆదాయంనుంచి భరించడం జరుగుతుంది. ప్రతియేటా అక్కౌంటు, ఆడిటింగు పూర్తయ్యాక యూనిట్ల నికరాదాయం 90 శాతానికి తగ్గకుండా యూనిటుదార్లకు పంపిణీ చేయబడుతుంది కాబట్టి యూనిటు రూపంలో పెట్టుబడిపెట్టిన మొత్తాలపై లభించే ఆదాయం సాధారణ పెట్టుబడిదారుకు సహజంగానే ఆకర్షణీయంగా వుండాలి. కాలక్రమేణా ట్రస్టు వాటాలు, ఇతర సెక్యూరిటీలు విలువదృష్ట్యా పెంపొందుతాయి కాబట్టి యూనిట్లవెలలో యీ అభివృద్ధి ప్రతిఫలిస్తుంది. యూనిటు దార్లకుకూడా ప్రయోజనం చేకూరుతుంది.

పెట్టుబడి కంపెనీలకంటే భిన్నమైనటు వంటి యూనిటు ట్రస్టుల లేక మ్యూచువల్ ఫండ్లు ఇదివరకే పేర్కొన్నట్లు పెట్టుబడి దార్లకు ఏజెంట్లవంటివి. పెట్టుబడిదార్లకు వారి సముపు మొత్తాల వినియోగం లేక పెట్టుబడిలో ఇవి మేనేజిమెంటు ఇంకా కొన్ని ఇతర సదుపాయాలు కల్పిస్తాయి. ఈ కారణం దృష్ట్యానూ, దేశం మొత్తం మీద అనేకమంది పెట్టుబడిదార్లు లేక యూనిటుదార్ల విషయంలో ఆయాస్థలాలలో ఆదాయపు పన్ను నిర్బంధ మినహాయింపుకు అవకాశం కల్పించడానికి అసౌకర్యం వుండే దృష్ట్యానూ 1961 వ సం. పు ఆదాయపు పన్ను చట్టం సాధారణ నిబంధనలను — ట్రస్టుకు వర్తింపజేసే విషయంలో — సవరించడానికి ప్రతిపాదించారు. ఈ పెట్టుబడి దార్లు, యూనిటు దార్లలో చాలామంది చిన్న మొత్తాలను పొదుపు చేసేవారుగా కానీ లేక మొదటిసారిగా అటువంటి మొత్తాలను పెట్టుబడి పెట్టే వారుగా కానీ వుంటారు.

ట్రస్టు ఆదాయాలన్నీ ఆదాయపు పన్ను, సూపర్ టాక్సు, ఇతర ప్రత్యక్ష పన్నుల చెల్లింపునుంచి మినహాయింపబడతాయి. ట్రస్టు, యూనిటుదార్లకు ప్రతియేటా ఇచ్చే ఆదాయాన్ని, ఆదాయపు పన్నును మినహాయించకుండా పంపిణీ చేయగలుగుతుంది. యూనిటుదారు స్వయంగా పొందిన ఆదాయంపై సంవత్సరానికి రూ. 1000 ల పరిమితి వరకు ఆదాయపు పన్ను మినహాయించ బడుతుంది. అయితే సూపర్ టాక్సు మినహాయింపు వుండదు. మధ్య తరగతి, తక్కువ ఆదాయవర్గాలకు చెందిన వ్యక్తుల దృష్ట్యా ఈ రాయితీలు పెట్టుబడుల (ట్రస్టు యూనిట్ల రూపంలో)ను ఆకర్షించగలవని ఆశించ బడుతున్నది.

అనేక దేశాలలో ఇటీవల యూనిటు ట్రస్టులు చాలా ప్రజాదరణ పొందినట్లు ఇది వరకే తెలియజేయడం జరిగింది. ఆర్థిక పరిపుష్టి సాధించ బడుతున్న కాలంలో కానీ, ధరలు పెరుగుతున్న తరుణంలో కానీ యూనిటు ట్రస్టులు పెట్టుబడిదార్లకు సెక్యూరిటీలు లేక పెట్టుబడులపై యాజమాన్యం కలిగి వుండడానికి అవకాశం కలిగిస్తాయి. అంతేగాక వీటిలో ఎట్టి కోతలు కానీ, నష్టాలు కానీ జరుగవు. ఈ సౌకర్యాల కారణంగా ట్రస్టులు యాజమాన్యపు పంపిణీ, పరిశ్రమల [illegible] ముఖ్యపాత్ర వహించ గలుగుతాయి. సక్రమ నిర్వహణ, పర్యవేక్షణ వల్ల భారత యూనిటు ట్రస్టు, ఇతర ప్రాంతాలలోని ట్రస్టులవలెనే, పెట్టుబడి పెట్టే ఆలోచనగల లేక ఆవిధంగా రూపొంద గల వ్యక్తులకు సహాయపడే స్థితిలో వుండాలి. దానితోపాటుగా దేశాభివృద్ధి కృషిలో గమనార్హమైన పాత్ర వహించే విధంగా కూడా యూనిటు ట్రస్టువుండాలి.

---

(53 వ పేజీ తరువాయి)

టకు కావలసిన సాంకేతిక సహాయాన్ని ప్రభుత్వం ఉచితంగా అందజేస్తున్నది. రైతులు తమంతట తామే ఈ వాలుగట్లకు అయ్యే ఖర్చును భరించలేరు కనుక, ప్రభుత్వం వారే వాలుగట్లకయ్యే ఖర్చును తొలుత భరించి, పిమ్మట 15 సంవత్సరాలలో ఆ మొత్తాన్ని రైతులనుండి సులభ కంతులలో వసూలుచేయడానికి వసతి కల్పించింది. భూసార రక్షణ విషయాలను ప్రజలు గుర్తించి హృదయపూర్వకంగా సహకరిస్తేనే ఈ కార్యక్రమం జయప్రదం అవుతుంది.

వాలున కడ్డంగా దున్నటం, వాలున కడ్డంగా సాగుచేయటం, పీలికసాగు, వాలు గట్లు, సమమట్టపు గట్లు, మెట్ట సేద్యానికి మహా యంత్రాలు మట్టిలోని సారాన్ని లాగి వేయకుండా, వాననీరు వ్యర్థంకాకుండా మంచి పంటలను పండించే రహస్యాన్ని విప్పిచెప్పే సేద్యదోహదాలు. ఇవి అవలంబించి సుక్షేత్రాలను నిస్సారక్షేత్రాలు కాకుండా చేసి, అన్నవస్త్రాల అమరికలో స్వయం సమృద్ధి కలిగించాలి. లాలించిన బిడ్డ, పూజించిన దైవం, ప్రేమించిన పడతి అన్నట్లు, పోషించినచేకాని లేకపోతే భూమి బీడుగా మారుతుంది. ప్రకృతివలన కలిగే నేల కోతలు, నీటినష్టం, సహజమేనని మనం వాటిని సహించి నిస్పృహతో ఊరుకొన కూడదు. "ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యానాదీ ఉభావపి" అనే గీతావాక్యం ప్రకారం పురుషుడు, ప్రకృతి ఇద్దరున్నూ పరస్పర క్షేమాలకు అనాదిగా పుట్టివస్తున్నారు. అటువంటి ప్రకృతి మూలస్థానమైన భూమిని పురుషుడు రక్షించుకోవాలి. బాధ్యతాయుతమైన కార్యకలాపానికి నడుముగట్టి బ్రహ్మాండమైన ఉద్యమంతో నేలదోపిడి నరికట్టి దేశ సౌభాగ్యానికి ప్రస్తావించవలసిన సమయం ప్రత్యక్షంగా వంచెమట తాండవిస్తున్నది. ★



ఫ్రాన్సు మాజీ ప్రధాని శ్రీ ఎం మెండెస్ ఫ్రాన్స్ హైద్రాబాదులో 1963 డిశంబరు 2వ తేదీన
పరిపాలనా సిబ్బంది కళాశాలలో ప్రసంగించారు

## రాష్ట్రానికి ప్రముఖుల రాక

సాలార్‌జంగ్ మ్యూజియంలో జోర్డాన్ రాజు హుస్సేన్





శ్రీమతి ఇందిరాగాంధి హైద్రాబాదులో 1963 డిశంబరు 6వ తేదీన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రజారక్షణ సంఘం నాలుగవ సమావేశంలో ప్రసంగించారు



ఉత్తర నైజీరియా ప్రధాని గౌ అల్హాజి సర్ అహ్మదిబెల్లో 1963 డిశంబరు 17వ తేదీన నాగార్జునసాగర్ ప్రాజెక్టును సందర్శించారు



సన్మార్గాన్ననుసరించమని తన కొడుకును బ్రతిమాలుతున్న తల్లి : సమాచార పౌరసంబంధాల శాఖ అధ్వర్యంలో 1963 డిశంబరు 10 తేదీన హైద్రాబాదులో ప్రదర్శించబడిన "అగ్ని పరీక్ష" నాటకంలోని ఒక దృశ్యం.

ఉస్మాన్‌సాగర్‌లో విహారానికిగాను ప్రవేశ పెట్టబడిన రెండు బోట్లలో ఒకదాని దృశ్యం. రాష్ట్ర సమాచార, న్యాయశాఖల మంత్రి 1963 డిశంబరు 9వ తేదీన వీటికి ప్రారంభోత్సవం చేశారు. "తారామతి", "ప్రేమామతి" అనే ఈ బోట్లను సమాచార, పౌరసంబంధాల శాఖ నడుపుతున్నది. ఛార్జి : ఒక వ్యక్తికి తడవకు 50 న. పై. లు.





రాష్ట్ర ఆరోగ్యశాఖా మంత్రి శ్రీ శివరామప్రసాద్ 1963 డిశంబరు మొదటి తేదీన ఆదిలాబాదు జిల్లా నిర్మల్‌లో నేత్రచికిత్సా శిబిరానికి ప్రారంభోత్సవం చేశారు.

ఆంధ్రప్రదేశ్ కార్మిక శాఖా మంత్రి శ్రీ బి. వి. గురుమూర్తి 1963 డిశంబరు 7వ తేదీన "పతాక దినోత్సవ" నిధికి విరాళం ఇస్తున్న దృశ్యం.



# తాటితోపు

నాయని సుబ్బారావు

[ఈ తాటితోపు 'పొదిలె' అను గ్రామమునకు చెందినది. ఆ యూరికి దక్షిణముగా నున్న 'చిన్న చెఱువు' కు, 'ఊరగొండ' కు మధ్య నీ తాటితోపు. ఇటువంటి విశాలమైన తాటితోపులు ఆంధ్రదేశమున లెక్కకు మీరియుండును. ఇది నా 'జన్మభూమి' కావ్యములో నొక ఖండము. ఆ తాటితోపును గురించిన నా చిన్ననాటి స్మృతి.]

సితవాఃపూరము చిన్నచెర్వునకవాచీనాశ ప్రత్యంత ప
ర్వతపాదస్థలిదాక చిక్కదనమొప్పన్ యోజనాయామ వి
స్తృతమై నందనమేమి లెక్క యనురీతన్నిక్కు భూలోకక
ల్పతరూద్యానము తాటితోపొకటి చెల్వారున్ జనప్రార్థ్యమై

ఎవడు నాటువోసె నెవ్వడు నీరోసె
కంపవెలుగుకోటగట్టి యెవడు
పశుగణమ్ము బారి బడకుండ నమ్మహో
తాళవనము నున్నతముగ బెంచె.

ఎవరో హో నిరవద్యసర్గరచనాహేవాక సంవేగ తాం
డవసానందు డనంత తాళపరిషన్మాంగల్య సామ్రాజ్య మి
య్యవనిన్ సర్వజనాంతరంగభరితాహ్లాదమ్ముగా నిల్పె త
చ్ఛివపాదాంచితకింకిణీ సరభస శ్రీనాదముల్ వంద్యముల్.

పొదిలెకొండయొడిని పొదలు ప్రత్యంతాద్రి
యైన యూరగొండ యస్త్రవిద్య
మరగి లక్ష్యభేదనిరతి నెడాపెడ
నాటు నంపగములు తాటిచెట్లు.

అనిలో భీష్మునకంపశయ్యయది యేమాశ్చర్యమా మూరెడె
త్తున నిర్మించుట యర్జునుండని సముత్తుంగ ద్రుమాస్త్రమ్ముల
న్నినుపారంబదివేల భీష్ములకు నేనింజాలునన్లే మహో
ర్జునుడో శిల్పిన యంపశయ్యావలె పేర్చున్ తాటితోపందమై.

మునుపు కవాతుకై పొదిలెభూపుల కాల్బురుకుచ్చుపాగలన్
తొనకక నిల్చువై ఖరులుతోపగ గాలికితూగియాడు శీ
ర్షనిభృతపత్రసంతతులు సంతతనిశ్చల కాండపంక్తు లిం
పొనర నిటారుగా నిలిచియుండు వనమ్మున తాళభూజముల్.

కుదురులు వేరై పెరిగియు
నదిరా యొద్దిక పరస్పరాభిముఖములై
కదిసి శిరమ్ములు మూర్కొను
హృదయసఖులరీతి కొన్ని తృణరాజముల్.

మరికొన్ని యొక్క కుదురున
పెరిగినవయ్యు నెడమొగము పెడమొగముగ వెన్
ఱంగ నలుపబడు కూర్ములు
తరుగగ నెడమైన యన్నదమ్ములమాడ్కిన్.

ఒకజన్మాంతర వాసనాఫలితమేమో యొక్కలోవంగి భూ
మికి చేరంబడిసాగి నిక్కునటపై మిన్నేదియన్నట్లుగా
నొకతాళమ్ము సమస్తజీవపరిణామోద్యోగధీశాలి పూ
ర్ణకృపన్ కామియొకండు మోక్షపథుడై నట్లూర్ధ్వరేతస్కుడై

పుట్టినదాది దేహముల పోషితసుందరతల్వరింప కె
ప్పట్టున నాత్మసత్త్వగుణవర్ధన దివ్యసుఖానుభూతికై
నిట్టనిటారుగా పయికి నిక్కుటయే పనియైన మౌని స
మ్రాట్టులరీతి తాళతరురాజి వింజిలు నవ్వనమ్మునన్.

ఎల్లమహోజసృష్టి నివిగొమిపసందులు తాటిచెట్లు కా
ర్నల్లని గొగ్గిమేనులు కరాళపుకొంగ మెడల్ వికారపున్
చిల్లరచింపిజుట్లని హసింపకు డా బలితంపుబోదె ల
ల్లలనపట్టి ప్రాకు లతికాళికి తెల్లను వానియందముల్.

ఒక భూజాత లతాకుమారి ప్రణయప్రోన్మేషరాగమ్ము ముం
చుకొనన్నాథుని చుట్టిపట్టుకొని లేచున్ శీర్షపర్యంత మా
యక భక్తిప్రసవాభిషేకసులభుండై యేకపత్నీవ్రత
ప్రకటప్రేమరసావతార సుమనోరాముండుగా నాతడున్.

సుందరవల్లిపై ప్రణయశోభి నవాంబుదనీలవర్ణ న
ట్లందము చిందు నీలరుచిరాంగుడొకండు నితాంత కాంతి మ
త్సుందరవల్లరీ ప్రణయశోభిత ముత్తుల కాంకమాలికా
కందళిత ప్రకాండుడయి కాలెడు దక్షిణనాయకప్రథన్.

పొంపారున్నవవల్లరీ ప్రణయినీ సూనాసవాస్వాదికిన్
మంపేదీ తృణరాడ్విభూతికి దిశామాత్రమ్ముగానౌ శిరః
కంపమ్మొక్కటిదక్క సంతత సుధాగంధమ్ము తత్తాలకీ
సంపన్మత్తత నూగిపోవు సమరీసౌందర్యవద్వల్లికల్.

అతులవదాన్యతాగరిమ నద్భుతకీర్తిచరిత్రులన్నవా
రితరుల కేదియో యొకటి యిచ్చిరిగాక సమస్తమిచ్చిరే
వితతవదాన్యతాగుణ పవిత్రచరిత్రుడు తాళరాజ స
త్కృతి యొకరుండె నిల్వునిలు వెల్లనొసంగును
మానవాళికిన్.

తలయిచ్చు నింటికప్పుకు
నిలువంతయునిచ్చు నింటి నిట్రాళ్ళకు మేన్
నలియిచ్చు నింటి  ట్టికి
సిలాజనుల కాతదెంచి యీయనిదేది.

ఉమ్మగొని భూమిసకలమ్ముడికిపోవగ జనమ్ములకు
ప్రాణములు సొమ్మసిలగా గ్రీ
ష్మమ్ము చెలరేగి పవనమ్ముల యుదారచలనమ్ముల
సదాగతితనమ్మడగ శీర్షా
గ్రమ్మున సమీరజనకమ్ములగు కోమలదళమ్ములను వీవనల
ముమ్మరపు సంతా
పమ్ముడుగుడంచు ననిశమ్ముతృణరాజు కరుణమ్ములయ
నెల్లరకు సమ్మతిగనిచ్చున్.

పునుగున్ కస్తురియున్ జవాదియనసేవో తావులేమంత మే
లనురీతిన్ తృణరాజశేఖరవదాన్య శ్రీసమాహార నం
దనరూపమ్ములు పెండ్లపందిళులమీదన్ పచ్చితాటాకు వా
సన లత్యంతము ఘ్రాణతర్పణములై శాసించునాశా
వధుల్.

పొదిలె తాటితోపు పుణ్యమాయని తాలి
బొట్టులన చెవాకుచుట్టలనగ
పొదిలె పుణ్యసతుల ముగ్ధమోహన భూష
ణములు నిత్యమంగళములు పొలుచు.

పొసగనప్పుడు తీసిన పోతుతాటి
కల్లమృతపానమట్లు సుఖమ్ముసేయు
నడరు నిక్కాకచే నొడల్ చెడినవారు
విడువకొకమండలమ్ము సేవించిరేని.

నీరాయన్న మహోత్తమమ్మయిన పానీయమ్మదే దాని కం
పూరంగా పులియంగబెట్టి సపసంధ్యోపాసనానిత్య స
త్కార స్వీకృతిత్రావి కైపుతలకెక్క న్నింద్యవాచాల గ
ర్వారంభమ్ముల మిట్టుమీరగజన మ్మాతప్పు తాళమ్మదా.

ఎనవచ్చుననవచ్చు నునులేతకొబ్బరి
పక్కులోనొగరింత చిక్కకున్న
సరివచ్చుననవచ్చు చెరకులు సెలవుల
కోతలొకరకులు కూడకున్న
ప్రతివచ్చుననవచ్చు పనసమువ్వపుతొనల్
పొట్టలోనొకవిత్తు పుట్టకున్న
తులవచ్చుననవచ్చు తొలికాపు మామిడి
పండ్లు టెంకల పుల్పుపట్టకున్న
తాటితోపిచ్చు నెందును సాటిలేని
బుఱ్ఱగుంజును తేగలు ముంజెలును ఫ
లావలియును కాలముల రసాతితర్ప
ణాప్తికలిగించు పొదిలె జనాళికెపుడు.

కంజముఖత్రిమూర్తులును కాటుకలైన త్రినేత్రముల్ మనః
పంజరబద్ధయోగత దివమ్మున వెల్గు ననంతసత్కృపా
మంజరి లోకమాతవలె మాటికి తాటిమొగాన వ్రేలు తే
ముంజెలతల్లి లోకనులుమూడును శీతలతాప్రసన్నముల్.

కొంజకమందునెండ దొరకోల్తలకున్ పసివాడుమేనులన్
నెంజిలియామనమ్ములను నిండగచల్వల వెల్లిలెల్ల వా
రంజలిపట్టి వేడెదరు హార్దత వేదిగిరమ్మటంచు ను
మ్మంజెల వాయకున్ సెగలముంలపు దయకు
తాటికాయకున్.

తాళతరువు దాతృతాపరమావధి
తనియపండినట్టి తాటిపండు
అమృతరస సమాసమది రసబంధుర
సత్సమాసమట్లు చవులపుట్ట.

పచ్చిపండ్లుతినెడు బలకృష్ణులకు తిని
పించు సుకవి కెంత పెద్ద యెరుక
అగ్నిపక్వమైన యప్పండ్లరుచి సొంత
ముగనెరుంగు నొక్క పొదిలె జనమె.

అననేవద్దల పోతుతాళ్ళ మెడలందలంకించు నాచన్న లెం
దు ననర్థమ్ములటంచు మేకమెడచన్నుల్ వోలె నాగిల్క లే
రెనయున్నిప్పులరవ్వలై పొదిలెలో నేచేట దీపావళీ
జనితోత్సాహులు భీమబాహులు యథేచ్ఛన్ త్రిప్పు
పొట్లమ్ములన్.

అనయము తాటితోపు బహిరాకృతి చీమయుదూరసందు లే
దనుగతి దుష్ప్రవేశనిబిడాకృతి యయ్యును నందుదూరగా
జనములు లేశమాత్రమును జంకరుకొంకరు దానిలోను స
జ్జనహృదయమ్మునట్లు సువిశాలమనోజ్ఞ మహావకాశమై.
స్థపతి విచిత్రకర్మలయి సన్నుతికెక్కిన వేయికాళ్ళ మం
డపములు కర్మసాక్షికిరణమ్ములు పారసివంచు నే మహా
స్థపతియొ కప్పులోన పలుసందులుగా నొకలక్షకాళ్ళ మం
డపమిటు తీర్చిదిద్దెనన నల్వగు తాళవనమ్ము లోపలన్.

(మిగతా 60 వ పేజీలో)

# భారత ప్రగతి

"ఆంధ్రప్రదేశ్"లో ఈ నెలనుంచి ఈ కొత్తశీర్షికను ప్రారంభిస్తున్నామని తెలియ చేయడానికి ఆనందిస్తున్నాం. ఇతర రాష్ట్రాలలోని ముఖ్యమైన అభివృద్ధి కార్యకలాపాలనుగురించిన యదార్థసమాచారాన్ని ఈ శీర్షిక అందిస్తుంది. ఇది మనకూ అన్యరాష్ట్రాలకు మధ్య పరస్పర అవగాహనానికి దోహదం చేయడంలో ఉపయోగపడగలదని ఆశిస్తున్నాము.

## కేరళ

ఈ నవంబరు నెలలో కేరళ రాష్ట్రం కనీసం రెండు సందర్భాలలోనైనా వార్తాపత్రికలలో దేశస్థుల దృష్టిని ఆకర్షించింది.

మధ్యకేరళలోని రూ. 25 కోట్ల-సబరిగిరి ప్రాజెక్టుకు సంబంధించిన సొరంగాల త్రవ్వకంలో ఈ రాష్ట్రం భారతీయ రికార్డును అధిగమించింది - ఇదీ మొదటి సందర్భం. పశ్చిమ కనుమలలో పర్వతాలపైననూ, ఇరుకైన మార్గాలలోనూ అమెరికా సహాయంతో చేపట్టబడిన ఈ జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టు పనులలో కేరళకార్మికులు సొరంగాల త్రవ్వకంలో రికార్డు స్థాపించారు. వారు ఒక నెలకు 714 అడుగుల పొడవున సొరంగం త్రవ్వకం జరిపారు. ప్రస్తుత రికార్డు 675 అడుగులు. దీనిని బొంబాయికి చెందిన నిర్మాణాల ఇంజనీర్ల సంస్థ స్థాపించింది.

ఇక రెండవ సందర్భం ఏమిటంటే - నవంబరు 21 వ తేదీన కేరళ ప్రపంచదృష్టిని ఆకర్షించింది. ఆనాడు తుంబ అనే ప్రదేశం నుంచి భారతదేశపు తొలి ధ్వని రాకెట్ ప్రయోగించబడింది. కేరళ గవర్నరు శ్రీ వి. వి. గిరి అభివర్ణించినట్లు "జాతీయ ప్రాముఖ్యంగల ఈ సంఘటన"తో భారతావని అంతరిక్షయాత్రల క్లబ్బులో చేరినట్లయింది. అణుశక్తి కమిషనుకుచెందిన డాక్టర్ హెచ్. జె. భాభా, 1600 పౌనుల రాకెటును ప్రయోగించడం, "ఎంతో విజయవంతమైన కృషి"అని పేర్కొన్నారు. అద్యతనభావిలో ఇతోధికంగా అంతరిక్ష పరిశోధనలు జరపడానికి ప్రణాళికలు వున్నవి. కేరళరాష్ట్రం దేశంలోని ఇతర ప్రాంతాలతోపాటుగా, తుంబగ్రామం "తూర్పు ప్రాంతపు కేప్ కెనెడీ"గా ఉదహరించబడేరోజుకొరకు నిరీక్షిస్తున్నది.

### భూసంస్కరణలు

మధ్య మధ్య కొన్ని రోజులు మినహా నవంబరు నెల పూర్తిగా కేరళ శాసనసభా సమావేశాలు జరిగాయి. కేరళ భూసంస్కరణల బిల్లు శాసనసభముందుకు రావడం ఈ నెలలో జరిగిన అతిముఖ్యమైన శాసన చర్య. ఈబిల్లు ఆమోదించబడటంతో రాష్ట్ర వ్యవసాయరంగంలో చిరకాలంగా నిరీక్షిస్తున్న సంస్కరణలు ప్రవేశపెట్టినట్లవుతుంది.

### పంచాయతీ ఎన్నికలు

నవంబరు నెలలో కేరళ గ్రామస్థాయి ఎన్నికల కార్యక్రమంలో నిమగ్నమైంది. ఈ నెల 19 వ తేదీన రాష్ట్రంలోని 922 పంచాయతీలకు ఎన్నికలు ప్రారంభమయ్యాయి. డిశంబరు 6 వ తేదీన ఎన్నికలు ముగిశాయి. మొత్తం పంచాయతీ సభ్యుల సంఖ్య 7174. ఓటర్ల సంఖ్య దాదాపు 8 లక్షలు. కొత్తగా ఎన్నికైన పంచాయతీ సంస్థలు బహుశా నూత్న సంవత్సరారంభంనాడు అధికారం స్వీకరిస్తాయి. పత్రికల వార్తలనుబట్టి ఈ ప్రయోగం చాలా ఆదర్శప్రాయమైన విధానంతో నిర్వహించబడినట్లు తెలుస్తున్నది.

'యునిసెఫ్' ఎఫ్. ఏ. ఓ. ల సహాయంతో విస్తృతీకృతపౌష్టికాహార కార్యక్రమాన్ని నిర్ణీత బ్లాకులలో నవంబరు 14 వ తేదీన ప్రారంభించారు. రాష్ట్ర వ్యాప్తంగా బాలల దినోత్సవంతోపాటుగా ఈ కార్యక్రమాన్ని అమలు పరిచారు.

## ఉత్తర ప్రదేశ్

### విద్యుత్కేంద్రం

హర్ద్వాగంజ్ థర్మల్ విద్యుత్కేంద్రం (3 వ దశ) నిర్మాణానికై సాధన సామగ్రి సరఫరా, డిజైనింగ్ విషయాలలో సోవియట్ సంస్థ ఆయిన మెసర్స్ మెషినో ఎక్స్‌పోర్ట్ (మాస్కో). ఉత్తరప్రదేశ్ విద్యుచ్ఛక్తి బోర్డుల మధ్య కుదిరిన

ఒప్పందంపై లక్నోలో సంతకాలు జరిగాయి.

హర్దువాగంజ్ థర్మల్ విద్యుత్కేంద్రం తొలుత 100 మె. వా. ల ఉత్పాదక శక్తిని కలిగి వుంటుంది. ఈ విద్యుత్కేంద్రంలో ఉత్పాదక శక్తిని 800 మె. వా.లకు కూడా పెంపొందించడానికి అవకాశం వుంటుంది. రాష్ట్ర పశ్చిమ భాగంలో పెద్ద థర్మల్ విద్యుత్కేంద్రంగా ఇది రూపొందుతుంది.

### దేహదార్ఢ్య పరీక్షలు

దేహ దార్ఢ్యానికి సంబంధించినపరీక్షలలో పాల్గొనగోరే వారికి సౌకర్యాలు కల్పించే నిమిత్తం ఈ సంవత్సరం రెండువందల జాతీయ పరీక్షా కేంద్రాలను తెరిచారు. ఒక లక్షమందికిపైగా ఈ పరీక్షలకు హాజరయ్యారు. పరీక్షలు నవంబరు 25,26,27 వ తేదీలలో దేశవ్యాప్తంగా జరిగాయి.

### ప్రణాళిక నాల్గవ సంవత్సరానికి రూ. 120 22 కోట్ల కేటాయింపు

మూడవ పంచవర్ష ప్రణాళిక నాల్గవ సంవత్సరానికి రూ. 120.22 కోట్లు కేటాయించడానికి ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వం తలపెట్టింది. వర్తమాన సంవత్సరంలో ఖర్చు చేయదలచిన రూ. 94.34 కోట్ల కంటే ఇది రూ. 25.88 కోట్లు అధికం.

మొత్తం ప్రణాళికకు కేటాయించిన రూ. 502 కోట్లలో ప్రణాళికలోని మొదటి మూడేళ్ళకు ప్రత్యేకించిన రూ. 244.66కోట్లలోనూ మొదటి సంవత్సరం రూ. 70.12 కోట్లు,రెండవసంవత్సరం రూ.79.58కోట్లు, మూడవ సంవత్సరం ఆ మిగిలిన మొత్తాన్ని వెచ్చించాలని ఉద్దేశింపబడినది. 1963–64సం. కాలానికి ఉద్దేశించబడిన ప్రణాళికా కేటాయింపులో వ్యవసాయం, విద్యుచ్ఛక్తి, నీటి పారుదలక్రింద రూ. 43.51 కోట్లు ; సహకారం, సమాజ వికాసంక్రింద రూ. 12.38 కోట్లు ; పరిశ్రమలు, గనుల క్రింద రూ. 4.77 కోట్లు ; రవాణా, వార్తాసౌకర్యాల క్రింద రూ. 6.51 కోట్లు ; సాంఘిక సేవల క్రింద రూ.23.08 కోట్లు:ఇతరఅంశాలక్రింద రూ. 6.24 కోట్లు. ఇవిగాక తూర్పు జిల్లాలలో అభివృద్ధి కార్యక్రమాల క్రింద రూ. 5 కోట్లు ఖర్చుచేయాలని ఉద్దేశింపబడింది.

### బెల్లం రవాణాపై ఆంక్షలు

రాష్ట్రం వెలుపలి ప్రాంతాలకు బెల్లాన్ని దొంగచాటుగా చేరవేయడాన్ని అరికట్టేందుకు ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం భారత రక్షణనిబంధనలలోని 125 వ నిబంధనలో ఉపనిబంధన (2) క్రింద 1963వ సంవత్సరపు బెల్లం (సరిహద్దు దాటించటంపై ఆంక్షలు) ఉత్తరువును ఒక దానిని జారీచేసింది. ఈ ఉత్తరువును వ్యతిరేకించినవారిపై చట్టరీత్యా చర్యతీసుకోవడం జరుగుతుంది. అందుకు సంబంధించిన బెల్లం నిలువను జప్తుచేసే అధికారం ప్రభుత్వానికి వున్నది.

### కిషౌ ఆనకట్టపై ఒప్పందం

ఉత్తర ప్రదేశ్, పంజాబ్, హిమాచల ప్రదేశ్, రాజస్థాన్, ఢిల్లీ ప్రతినిధులు కిషౌ ఆనకట్టకు అయ్యే ఖర్చులు, దానివల్ల సమకూడే లాభాలూ పంచుకునే విషయంపై కొత్తఢిల్లీలో జరిగిన ఒక సమావేశంలో ఏకగ్రీవంగా అంగీకరించారు. ఆనకట్టకు సంబంధించిన పరిశోధనలు త్వరగా పూర్తి కావాలని, సాధ్యమైనంత త్వరలో నిర్మాణ కార్యక్రమం ప్రారంభించబడాలని వారు కోరారు.

### చక్కెర సరఫరా, రవాణా

చక్కెర వినియోగ దారుడు ఒకటికన్న ఎక్కువ గుర్తింపు కార్డులు కలిగిఉండడం, సక్రమంగా చక్కెర పంపిణీ కావడంవ్యవస్థాక, భారత ప్రభుత్వపు రక్షణ నిబంధనలక్రింద చట్ట వ్యతిరేకమైనది.

ఏ వ్యక్తికూడా రాష్ట్రం వెలుపలనుండి "సరిహద్దులోని" ఏ ప్రాంతాలకూ, లేదా "సరిహద్దు ప్రాంతంనుండి" రాష్ట్రం వెలుపలి ప్రదేశాలకు ఒక్కసారిగా 5 కిలో గ్రాములకు మించి చక్కెరను రవాణా చేయడం కూడదని ఉత్తరువును జారీ చేయడంద్వారా దొంగచాటుగా చక్కెర రవాణా కాకుండా అరికట్టే చర్యలు తీసుకోవడం జరిగింది. కేంద్రపాలిత ప్రాంతాలయిన హిమాచల ప్రదేశ్, ఢిల్లీలకూ ; పంజాబ్, రాజస్థాన్, మధ్య ప్రదేశ్, బీహారు రాష్ట్రాలకు ఆనుకుని అయిదుమైళ్ళ వెడల్పున ఉన్న ప్రాంతం "సరిహద్దుప్రాంతం"గా భావించబడుతుంది.

(58 వ పేజీ తరువాయి)

ఆలోనంగల కాలిబాటలవి పాయల్ పాయలై పెక్కు చం
దాలన్ చిక్కులుజీరులై వెలయ పద్మవ్యూహమట్లుండు స
న్నేలన్ శీల నరుల్ చరింతు రటపోనేగాని రాజాల క
య్యోలమ్ముగ్గడవంగ లేనియభిమన్యుల్ గారువారెవ్వరున్.

బొడమీద మోములుకదలాడు నచ్చతె
ల్ళల పూల నెత్తావు లలముతెలివి
బొదపైని విహరించు పులుగుల వింతవిం
తల వన్నెల గరుత్తు లొలయుతెలివి
వచ్చిపోయెడువారి వాలకమ్ములుగను
పొదచాటు కుందేళ్ళ పదనుతెలివి
పొదవిన్నపము తాళమునకువేవినిపింప
పరతెంచు నుడుత మేలరులతెలివి
లోనతెలివెల్ల నిట్లు సంధానమయ్యు
పైకినేమియు తెలియని వానిపగిది
కృతకజడతావగుంఠన ప్రీతుడైన
తాళవనరాజు మౌనముద్రకు జోహారు.

అలబృందావనిలోని తాలవనవిన్యాసమ్ములం దేమి గో
ప్పలువండించిరి రామకృష్ణభగవద్భావాభిరామమ్ముగా
ఖలులౌ గర్దభరూపధేనుకుల డాకల్లేని యీతోపు గో
ప్పలు పండించితినిట్లు సర్వజనతావాల్లభ్య సంభారముల్

# ఆంధ్రదేశంలో పత్రికా రంగం

సి. వి. హెచ్. రావు

వర్తమానకాలంలో దేశంయొక్క స్వరూపం పత్రికలలో ప్రతిబింబిస్తుంది కనుక ఒక దేశం యొక్కగాని, ప్రజల యొక్కగాని రాజకీయ, సాంస్కృతిక స్థాయిలను ఆ దేశంలో వున్న పత్రికలను బట్టి సరిగ్గా ఖరీజు చేయవచ్చు. ప్రజాస్వామ్యప్రభుత్వంలో జాతీయ స్వరూప స్వభావాలు పత్రికలద్వారా ప్రతిబింబించినంతగా మరియే యితర ప్రభుత్వంలోనూ ప్రతిబింబించవు. ఈ దృష్ట్యా రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక రంగాలలో ఆంధ్రప్రజల శీఘ్రపురోభివృద్ధిని వ్యక్తం చేసే ఆంధ్ర పత్రికారంగం చరిత్రను తలంచుకొని ఆంధ్రప్రదేశ్ నిస్సంశయంగా గర్వపడవచ్చు.

గత శతాబ్దం ఎనభయ్యో యేట తొలి రోజులలో హితవాద అనే వారపత్రిక ప్రచురణతో క్రమానుగతంగా ఆంధ్ర దేశంలో తెలుగు పత్రికారంగం ప్రారంభమయిందని అనవచ్చు. కాని మొట్టమొదటి సారిగా తెలుగు అచ్చుతో కూర్చి, అచ్చు యంత్రంమీద అచ్చువేసినపత్రిక వివేకవర్ధని. దీనిని రావుబహద్దూర్ వీరేశలింగం పంతులుగారు 1885 వ సంవత్సరంలో వారి సంపాదకత్వంలో ప్రారంభించారు. రావు బహద్దూర్ ఆంధ్రదేశంలో సంఘ సంస్కరణోద్యమానికి, భాషాసంస్కరణోద్యమానికి మూలపురుష దనే విషయం సర్వులూ ఎరిగినదే. ఆ విధంగానే పత్రికారంగానికి కూడా ఆదిపురుషుడు ఆయనే. అందుచేత వివేకవర్ధని ఆయన ఆశయాలను పరిపోషించి, ప్రచారం చేయడానికి ఎక్కువగా వుపయోగించింది.

ఒకసారి పదిదశాబ్దాల వెనక్కు వెళ్తే, ఆంధ్రదేశంలోని పత్రికారంగంలో రెండు ముఖ్యమైన అభివృద్ధికరమైన మార్పులు మనకు గోచరిస్తాయి. తెలుగు అచ్చు కనిపెట్టడంతో అనేకమైన తెలుగు పత్రికలు తల ఎత్తాయి. సరిగ్గా యిది ఆంధ్రదేశంలో సాహిత్య, సాంస్కృతిక రంగాలలో పునరుజ్జీవనం ప్రారంభమైన రోజులలో సంభవించింది. ఇంతవరకూ అముద్రితాలుగా వుండిపోయిన అనేక సాహిత్య గ్రంథాలను అచ్చులోకి తీసుకురావడానికి యివి వుపకరణాలయ్యాయి. గత శతాబ్దపు చివరి పదేళ్ళు తెలుగు సాహిత్యానికి "స్వర్ణ యుగం" అనవచ్చు. ఈ కాలంలో ఉద్దండులైన పండితులు అనేకులు గ్రంథరచనలను కొనసాగించడమే కాకుండా, యితరుల రచనల యోగ్యతా యోగ్యతల్ని చాలా హుందాగా, చక్కగా (అంతేకాక సుస్పష్టంగా, సరళంగా) విమర్శిస్తుండేవారు. ఈ రకంగా పత్రికలు సంస్కృతీపునరుజ్జీవనానికే కాక ఆ రోజులలో సంఘాన్ని పీడిస్తుండే కట్నాలు, బాల్యవితంతువులను వేరుపరచడం, బాల్యవివాహాలు, అస్పృశ్యత, అర్థంలేని సనాతన ఆచారాలు, చివరకు ఉద్యోగుల లంచగొండితనం మొదలయిన వాటిని తొలగించే ఉద్యమాల్ని పటిష్ఠం చేయడానికి సహాయకారులయ్యాయి. ఇంతేకాక వీటితోపాటు 1886 లో స్థాపించబడిన భారత జాతీయ కాంగ్రెసు నాటిన రాజకీయ ఉద్దేశాలను కూడా పరిపోషించి, ప్రచారం చేశాయి. భారత జాతీయకాంగ్రెస్ ప్రవచించిన జాతీయతాభినివేశంవల్ల తల ఎత్తిన దేశాభిమానమే ఆంధ్రరాష్ట్రోద్యమానికి అంకురార్పణజరగడానికిప్రధానకారణం.

ఆ రోజులలో వచ్చిన పత్రికలన్నీ ఆంధ్ర రాష్ట్రోద్యమాన్ని పరిపోషించడం, స్వభావసిద్ధంగా ఆ ఉద్దేశాలను కలిగివుండడం చేస్తుండేవి. సాంఘిక, సాంస్కృతిక పునరుజ్జీవనం జాతీయ పునరుజ్జీవనానికి మార్గం వేయగా; తెలుగు పత్రికలు, సాంఘిక సాంస్కృతిక పునరుజ్జీవనం జాతీయ పునరుజ్జీవనంతో చేతులూ చేతులూ కల్పుకొని ముందుకు పోవడానికి కారణమయ్యాయి.

ఈ శతాబ్దపు తొలిరోజులలో తమంత తాముగా పత్రికలు స్థాపించికాని, లేదా యితరులు ప్రారంభించిన పత్రికలను తాము ఉపయోగించిగాని తమ రచనలకు ఒక ఉపకరణంగా వినియోగించుకున్నవారిగా చెప్పుకోదగినవారిలో వీరేశలింగం పంతులుగారు కాక చిలకమర్తి లక్ష్మీనరసింహం, ఎ. పి. పార్థసారథి నాయుడు, పి. ఆనందాచార్యులు, కె. ఆర్. వి. కృష్ణారావుగారలను

చేర్చవచ్చు. వీరితో సన్నిహిత సంబంధం వున్న పత్రికలు మనోరమ, ఆంధ్ర ప్రకాశిక, కల్పవల్లి, సరస్వతి.

వీటన్నిటిలోనూ పార్థసారథి నాయుడు సంపాదకత్వాన వెలువడే ఆంధ్ర ప్రకాశిక తెలుగులో రాజకీయ పత్రికా రంగానికి నాంది పలికిందనవచ్చు. తెలుగు పత్రికా రంగంలో ఆనాడు నిలదొక్కుకోగలిగినవి లేకపోయినా సుమారు 25 సంవత్సరాల పాటు సేవచేసే భాగ్యం దీనికి కలిగింది. కొంతకాలంపాటిది దిన పత్రికగా వుండి, ఆ తర్వాత వారపత్రికగా వస్తుండేది. భారత జాతీయతను వ్యాపి చేయడంలో అమోఘమైన కృషి చేసినవాటిలో శశిలేఖ పత్రిక మరొకటి.

గత శతాబ్దం ఆఖరిదశలో, ఒకదానితో ఒకటి సంబంధం కలిగిన మూడు వివిధ ప్రవాహాలు వచ్చి కలిసి ఆంధ్ర దేశంలో తెలుగు పత్రికారంగం బహుధా వ్యాప్తి కావడానికి కారణ మయ్యాయి. అవి సాంఘిక సంస్కరణ, సంఘ దురాచారాలను రూపుమాపడం — సాహిత్య పునర్వ్యవస్థీకరణ, సాహిత్య విమర్శను అభివృద్ధి పరచడం — జాతీయోద్యమం. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కావాలనే ఆందోళన ఆ రోజుల్లో బహుతక్కువే అయినా, జాతీయోద్యమంలో అదికూడా ఒక భాగమే. ఆనాటి పత్రికా సంపాదకులూ, ప్రచురణ కర్తలూ పాత్రికేయులకన్న ఎక్కువగా పండితులు, రాజకీయ వేత్తల కోవలోకి చెందుతారు. వారికి పత్రికా రంగం అంటే వృత్తికాదు. ఒక వ్యాసంగం వంటిది. అచ్చువేసే విధానాలు అంటే యీనాడు మనం చూపించే ప్రాముఖ్యత కన్న వారు చూపించిన ప్రాముఖ్యత వేరు.

రాజకీయ చైతన్యం దేశంలో (ఆంధ్ర దేశంలో కూడా) వ్యాపించడంతో–ముఖ్యంగా ఈ శతాబ్దం తొలి దశాబ్దంలో వందేమాతరం ఉద్యమం ప్రారంభించడంతో ఆంధ్ర దేశంలో పత్రికా రంగానికి మరింత ఎక్కువగా రాజకీయ వాసనలు వ్యాపించాయి. కొత్తశతాబ్దం ఆరంభంతో (1902) మచిలీపట్టణంనుండి 'దేశభక్త' కొండా వెంకటప్పయ్య, దాసు నారాయణరావుల సమిష్టి కృషివల్ల కృష్ణా పత్రిక ప్రారంభించబడింది. 1906లో దీని సంపాదకత్వం ముట్నూరి కృష్ణారావు గారికి సంక్రమించింది. తెలుగులో చక్కటి రచయిత యీయన. సాంఘిక, రాజకీయ సంస్కరణలపై యీయన ఉన్నతభావాలకు; ఆంధ్ర రాజకీయాలపైనా, సంస్కృతిపైనా, యితర ఆశయాలపైనా చేసే శక్తివంతమైన వ్యాఖ్యానాలకు ఆంధ్రదేశమంతా యీయనను అమితంగా గౌరవిస్తుండేది. క. రామకోటీశ్వరరావు, స్వర్గీయ కాటూరి వెంకటేశ్వరరావు గారలు యీ పత్రికలోని యితర సంపాదకులలో ముఖ్యులు. వీరంతా కృష్ణారావుగారు స్థాపించిన ప్రమాణాలను నిలబెట్టినవారే. ఆ తర్వాత శ్రీ ముదిగొండ సుబ్రమణ్యశర్మగారు యీ పత్రికకు అధిపత్యం వహించి, క్రమంగా హైదరాబాదు నుండి ప్రచురిస్తున్నారు నిరాఘాటంగా అరవై యేళ్ళగా ప్రచురింపబడుతున్న ఘనత యీ పత్రికకు వుంది.

సహాయనిరాకరణ, శాసనోల్లంఘన మొదలయిన వాటిని ప్రచారం చేసేందుకై కొన్ని పత్రికలు వెలువడడానికి గాంధీజీ ప్రారంభించిన స్వాతంత్ర్యోద్యమం కారణ మయ్యింది. వీటిలో ముందుగా చెప్ప దగ్గది కాంగ్రెసు. ఇది మొదట్లో మద్దూరి అన్నపూర్ణయ్య సంపాదకత్వంలో సీతానగరం ఆశ్రమంనుండి వెలువడి, ఆ తరువాత రాజమండ్రి నుండి వస్తుండేది. అన్నపూర్ణయ్య అరెస్టు అయినప్పుడు క్రొవ్విడి లింగరాజు దీనికి సంపాదకులుగా వుండేవారు. ఆ తర్వాత కె. రామచంద్రరావుకు సంపాదకత్వం లభించింది. ఈయనతో ఎమ్. శివరామకృష్ణయ్యకు సన్నిహిత సంబంధం వుండేది. స్వరాజ్య సందేశం, శాసనోల్లంఘనం మొదలయిన గాంధీ ప్రవచనాలను వ్యాప్తిచేయడంలోనూ, దేశస్వాతంత్ర్యానికై బాధలను భరిస్తూ త్యాగం చేయడానికని ఆంధ్ర ప్రజలను ప్రోత్సహించి, ఉద్దీపింపజేయడంలోనూ ఎక్కువగా కృషి చేసిన గౌరవం కృష్ణా పత్రిక, కాంగ్రెసులకే దక్కవలసి వుంటుంది. ఈ రంగాలలో కృషి చేసిన యితర పత్రికల కోవలోకి ప్రజామిత్ర, ప్రజాబంధు, ఆనందవాణి, ఆంధ్ర జ్యోతి వస్తాయి. ఇవన్నీ మద్రాసునుండి ప్రచురింపబడుతుండేవి.

కొద్ది కాలంపాటు మాత్రమే దినపత్రికగా ప్రచురింపబడిన ఆంధ్రప్రకాశికను తప్పిస్తే మొట్టమొదటిసారిగా దిన పత్రికగా ప్రచురించబడిన పత్రికగా ఆంధ్ర పత్రికను చెప్పవచ్చు. ఆంధ్రరాష్ట్ర ఉద్యమానికి రెండవ దశగా ప్రోత్సాహాన్నియిచ్చినవారు "దేశోద్ధారక" కాశీనాథుని నాగేశ్వరరావుగారు. వీరు 1908 నుండి ఆంధ్ర పత్రికను వారపత్రికగా బొంబాయి నుండి నడుపుతుండేవారు. ఆపైని మద్రాసుకు దీనిని మార్చి, అదే పేరుతో దిన పత్రికగా ప్రచురిస్తుండేవారు. ఆ దినపత్రిక ఆనాటినుండి నిరాఘాటంగా, ఏమాత్రం ఒడుదుడుకులు లేకుండా అభివృద్ధి చెందుతూ ఆంధ్రరాష్ట్ర ఉద్యమానికై ఎలుగెత్తి చాటుతూ, గాంధీజీ స్వాతంత్ర్యోద్యమాన్ని బలపరుస్తూ ఒక బలీయమైన జాతిఅంగంగా రూపొందుతూవచ్చింది. గత రెండు దశాబ్దాలుగా దీనికి శ్రీ ఎస్. శంభుప్రసాద్ సంపాదకులుగా ఉంటున్నారు.

ఈ శతాబ్దపు ముప్పయ్యో సంవత్సరం తొలి దినాలలో మద్రాసులో ఆంధ్రప్రభ, 1938 లో జనవాణి అనే మరో దినపత్రికా ప్రారంభించడంతో తెలుగులో దినపత్రికలకు సంబంధించిన పత్రికారంగానికి క్రొత్తబలం వచ్చిచేరింది. జనవాణి శ్రీ తాపీ ధర్మారావు సంపాదకత్వంలో మద్రాసునుండి వస్తుండేది. 18 ఏళ్ళపాటు నిలిచివుంది యీ పత్రిక. ఆంధ్ర ప్రభకు తొలి రెండేళ్ళూ న్యాయపతి నారాయణ మూర్తి సంపాదకులుగా వుండేవారు. ఆ తర్వాత 18 ఏళ్ళపాటు శ్రీ నార్ల వెంకటేశ్వర రావుగారి సంపాదకత్వంలో నడిచింది. ఈ సమయంలోనే విశేషంగా ప్రచారాన్నీ, ప్రజాదరణను పొందింది. ప్రస్తుతం యిది విజయవాడనుండి శ్రీ ఎన్. వి. శేషయ్య గారి సంపాదకత్వంలో వస్తున్నది. ఆంధ్ర ప్రదేశ్‌లో అనేక వార్తా సంస్థలలోనూ, దిన వారపత్రికలలోనూ, రాష్ట్రంలోనూ రాష్ట్రం వెలుపలా ప్రభుత్వ ప్రచార సంస్థల్లోనూ ప్రస్తుతం ప్రముఖస్థానాల్లో వున్న అనేక మంది పాత్రికేయులు తమ శిక్షణను ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభలలో పొందినవారే.

1940 లో విజయవాడనుండి జన్మభూమి, ప్రజాశక్తి అనే రెండు తెలుగు దినపత్రికలు ప్రారంభించబడ్డాయి కాని, కొన్ని సంవత్స రాల పాటు వచ్చి ఆగిపోయాయి. యాభయ్యో సంవత్సరపు తొలిరోజుల్లో మద్రాసునుండి ప్రజాపత్రిక, విజయవాణి అనే రెండు తెలుగు దినపత్రికలు వచ్చేవి. ప్రజాపార్టీని పటిష్ఠం చేయడానికని ప్రకాశం పంతులుగారు ప్రజాపత్రికను ప్రారంభించారు. రెండవదానిని రాయలసీమకు చెందిన ఉత్సాహవంతు లొకాయన ప్రారంభించారు. కాని ఈ రెండు పత్రికలూ ఆట్టే కాలంపాటు నిలవలేదు. 1952 నుండి నిరాఘాటంగా విజయవాడనుండి వస్తున్న తెలుగు దిన పత్రిక విశాలాంధ్ర. ఆంధ్రదేశంలో కమ్యూనిస్టు పార్టీవారికి ప్రచారపత్రిక. తెలుగు దినపత్రికా రంగంలో చెప్పవలసిన యితే వలి రెండు దినపత్రికలు ఆంధ్రజ్యోతి, సమాచారం అనేవి. ఆంధ్రజ్యోతి విజయ వాడనుండి నార్ల వెంకటేశ్వరరావు సంపాద కత్వంలో వెలువడుతున్నది. సమాచారం రాజమండ్రినుండి వస్తున్నది. ఇది పూర్తిగా ప్రాంతీయ సమాచారంతో కూడిన పత్రిక.

వివిధ సమయాలలో అక్కడక్కడా పుట్టి నక్షత్రాలవలె క్షణంపాటు మెరిసి మాయమయి పోయిన అనేక దినపత్రికలు కాక వార పత్రికలు అనేకం గతరెండు దశాబ్దాలలోనూ చెప్పుకోదగినంతగా అభి వృద్ధి చెందాయి. ఉదాహరణకు వివిధ జిల్లాల ప్రధాన నగరాలనుండివచ్చి కొంతకాలంపాటు స్థిరంగా వున్న రాజకీయ వారపత్రికలు అనేకం ఉన్నాయి. వీటిలో నెల్లూరునుండి జమీన్‌రైతు, గుంటూరు నుండి గుంటూరుపత్రిక, విజయవాడనుండి ములుకోల, విజయవాణి, వాహిని ; కాకినాడ నుండి ముందడుగు, విశాఖపట్టణనుండి విశాఖపత్రిక, మచిలీపట్టణం నుండి చుక్కాని (పక్షపత్రిక) ముఖ్యమైనవి.

ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభల తాలూకు సచిత్ర వారపత్రికలలో మొదటిది చాలా కాలం క్రిందటే ప్రారంభించబడింది. రెండవది 14 ఏండ్ల క్రితంనుండి వస్తున్నది. ఈ రెండూ సాహిత్య పత్రికలుగానూ, సామాన్య జనులకు పనికివచ్చే పత్రికలుగానూ బహుళ ప్రచారం పొంది ఒక్కొక్క వ్యక్తిత్వాన్ని ఏర్పాటు చేసుకున్నాయి. గత ఆరేళ్ళనుండీ యివి యితర ముఖ్యమైన వ్యాసాలను ప్రచు రించడంతోపాటు అనేకమంది కథానిక రచ యితలను ప్రోత్సహిస్తూ శీఘ్రగతిని అభి వృద్ధి చెందుతున్నాయి. ప్రతియేటా సంవత్స రానికి రెండేసిసార్లు (ఒక్కొక్కప్పుడు తరచుగా) ఏర్పాటు చేస్తున్న కథల పోటీల వల్ల ఆంధ్రకథా రచయితలలోనూ, నవలా రచయితలలోనూ — రచయితలూ, గద యిత్రులు యిరువురిలోనూ — నివురుగప్పిన సాహిత్యజ్వాలల్ని వెలికితీయడానికి అవ కాశం కలుగుతున్నది.

గడచిన రెండు దశాబ్దాలలోనూ తెలుగు పత్రికారంగం బహుధా విస్తరించింది. ప్రత్యేకంగా పిల్లలకు, స్త్రీలకు, సినిమా రంగానికి, సాహిత్య విమర్శ, కళా రంగా లకు సంబంధించిన మాస, పక్ష, వార పత్రి కలు అనేకం వుండేవి ఆ రోజుల్లో, వీటన్నిటితోనూ చందమామ (మాసపత్రిక), యువ (మాసపత్రిక), గృహలక్ష్మి (మాస పత్రిక), ఆంధ్ర మహిళ (మాసపత్రిక), కిన్నెర, సినిమా చెప్పుకోదగ్గపత్రికలు. వీటిలో చివరి రెండూ కొంతకాలంపాటు వచ్చి ఆగి పోయాయి. మాసపత్రికలలో భారతికి ఒక ప్రత్యేక స్థానం వుంది. దీనివ్యవస్థాపకులు, సంపాదకులు శ్రీ కె. నాగేశ్వరరావు పంతులుగారు. ప్రముఖపాత్రికేయుడు, దీని కని బాంధవుడు నాగేశ్వరరావు పంతులు గారు వ్యవస్థాపకులుగా, ఆర్థిక పుష్టితో, భారతి మూడు దశాబ్దాలకుపైగా ప్రసిద్ధ తెలుగు రచయితల, కవుల, విజ్ఞుల (అంతే గాక సాధారణ రచయితల) రచనలను ప్రచురించడంద్వారా తెలుగు సాహిత్యానికి, సంస్కృతికి అశేషమైన సేవ చేసింది, చేస్తున్నది. ఈ శతాబ్దంలో ద్వితీయ దశాబ్దం పూర్తిగాను, తృతీయ దశాబ్దంలో కొంతకాలం వరకూ శారద అనే మాస పత్రిక వుండేది. కొతా శ్రీరామమూర్తిగారు మచిలీపట్నంనుండి దీనిని ప్రచురిస్తుండే వారు. ఈ పత్రికలలో ప్రచురించబడే రచ నలు సాహిత్య పరంగా ఎంతో విలువైనవి.

చక్కటి సాహిత్య విషయిక రచనలు యిందులో వస్తుండేవి. గ్రాంథిక, వ్యవహారిక భాషలపై విరుద్ధాభిప్రాయాలను చర్చించేందుకు రచయితలకు తగినంత అవకాశం యిందులో యివ్వబడుతుండేది.

ఆంధ్రదేశంలో ఆంగ్లభాషలో వెలువడే వార పత్రికలు, దిన పత్రికలు అధిక సంఖ్యలో తరచుగా బాలారిష్టాలకు గురౌతూ వున్నప్పటికీ ఆంగ్ల పత్రికారంగం ఆంధ్ర దేశంలో చిరకాలంగా వుంటూనే వున్నది. రాజమహేంద్రవరంనుండి టంగుటూరి శ్రీరాములు సంపాదకత్వంలో వెలువడిన క్లేరీన్ అనే పత్రిక బహుశా ఆంగ్లభాషలో వెలువడిన మొట్ట మొదటి వారపత్రిక అనవచ్చు. ఆ వర్గంలో డా. భోగరాజు పట్టాభి సీతారామయ్యగారి సంపాదకత్వంలో మచిలీపట్నంనుండి 1921-1931 సం.లో వెలువడిన జన్మభూమిని చెప్పుకోవచ్చు. సహాయనిరాకరణ, శాసనోల్లంఘన, గాంధీజీ నిర్మాణాత్మక కృషికి సంబంధించిన కార్యకలాపాలను బాధ్యతాయుతంగా వివరించడంలోనూ, వ్యాఖ్యానించడంలోనూ యీ పత్రిక యావద్భారతంలోనూ ప్రసిద్ధి కెక్కింది. కాంగ్రెసు చరిత్రకారుడూ, గాంధీజీ సిద్ధాంతాలకు భాష్యకారుడు అయిన డా. పట్టాభి యీ పత్రికను ఒక పదేళ్ళపాటు ఆర్థిక వనరులు లేని ఒడుదుడుకులలో నడిపారు. ఏమయినప్పటికీ ఉన్నంతకాలం యీ పత్రిక, దీని సంపాదకుని తెలివి తేటలకు, బహుముఖ ప్రజ్ఞకు గీటురాయిగా నిలబడింది.

ఇంగ్లీషులో వచ్చిన మరొక పత్రిక స్వతంత్ర. విజ్ఞులు కొనియాడిన పత్రిక యిది. మద్రాసునుండి వస్తుండేది. ఖాసా సుబ్బారావుగారు దీని సంపాదకులు. చక్కటి వీరి సంపాదకీయాలూ, 'సాఖ' అనే కలం పేరుక్రింద వారం వారం వీరు వ్రాసే ప్రత్యేక వ్యాసాలూ యీ పత్రికకు ఎనలేని గౌరవాన్ని చేకూర్చాయి. ఈ పత్రిక తాలూకూ తెలుగు ప్రచురణకూడా ఒకటి అదే పేరుతో వస్తుండేది.

ఇతర యింగ్లీషు పత్రికలలో ప్రత్యేకంగా పేర్కొదగ్గది త్రివేణి. దీనికి శ్రీ కె. రామకోటీశ్వరరావు వ్యవస్థాపకులూ, సంపాదకులూనూ. తొలిరోజుల్లో మాసపత్రికగా వచ్చి ఆ తరువాత ద్వైమాస పత్రికగాను, త్రైమాస పత్రికగాను వచ్చింది. దీనికి శ్రీ రామకోటేశ్వరరావుగారు పేరుగా సంపాదకత్వాన్ని వహిస్తూ వున్నా, లేక వారి మిత్రులు సంపాదకులుగా వుంటూ వుండినా యిందులో శ్రీ కోటేశ్వరరావుగారి అసాధారణ ప్రతిభ వ్యక్తమవుతూనే వుండేది. సాహిత్య, సాంస్కృతిక పునరుజ్జీవనానికి, ఆంధ్రుల అభ్యుదయానికి త్రివేణి చేసిన సేవ అమోఘమైనది. వ్యాసాలను ప్రచురించడంద్వారా, ఇతర భారతీయ భాషలలో వ్రాసిన కథలను యితరసాహిత్య ఖండాలను ప్రచురించడంద్వారా అంతర్ రాష్ట్రీ భావసమైక్యతకు దోహదకారి అయింది. ఈ విధంగా ముప్పయి ఏళ్ళకు పైగా త్రివేణి చేసిన సేవకు దీనిని ఆంధ్ర ప్రజలు కృతజ్ఞతతో చిరకాలం జ్ఞాపకం పెట్టుకోవలసిన అవసరం ఎంతయినావుంది.

1920 లో గాంధీజీ ప్రారంభించిన స్వాతంత్ర్యోద్యమం తెలుగు పత్రికా రంగాన్ని ఒక్కసారిగా హిమగిరౌన్నత్యానికి తీసుకుపోవడమే కాదు, ఆంధ్రుల ప్రోత్సాహంతో, ఆంధ్రుల పెట్టుబడితో మొట్ట మొదట ఇంగ్లీషు దినపత్రిక — స్వరాజ్య — ప్రారంభంకావడానికి (1922 లో) కూడా కారణ మయింది. 'ఆంధ్ర కేసరి' టంగుటూరి ప్రకాశంపంతులుగారి ముఖ్య సంపాదకత్వంలో స్వరాజ్య ఆశయాలను, దేశ స్వాతంత్ర్య భావాలను ప్రచారం చేయడంలో ఈ పత్రిక అద్వితీయమైన పాత్ర వహించింది. ఈనాడు దక్షిణ భారతదేశంలోనూ, దేశంలోని యితర ప్రాంతాలలోనూ ఆంగ్ల పత్రికారంగంలో ముఖ్యమైన సంపాదకత్వపు స్థానాల్లో భాసిస్తున్న అనేకమంది పాత్రికేయులు ఎప్పుడో ఒకప్పుడు స్వరాజ్యతో సన్నిహిత సబంధం కలిగి వున్న వారనేది జగమెరిగిన సత్యమే.

1948 లో ఇండియన్ రిపబ్లిక్ అనే మరొక ఇంగ్లీషు దినపత్రికను కూడా ప్రారంభించడానికి ఆంధ్రుల ప్రోత్సాహమూ, పెట్టుబడే కారణమయ్యాయి. డా॥ పట్టాభి సీతారామయ్య ఛైర్మనుగా, ఈ వ్యాసకర్త సంపాదకుడిగా డైరెక్టర్ల బోర్డు అద్వర్యంలో ఉన్నతాశయాలతో యీ పత్రిక ప్రారంభించబడింది. ఇండియన్ రిపబ్లిక్ ఆంధ్రజాతికి చక్కటి ఒక ప్రచారసాధనం. ముఖ్యంగా ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం గురించి యిది చేసిన కృషి జ్ఞాపకం పెట్టుకోదగ్గది. రెండున్నర సంవత్సరాల అనంతరం యీ పత్రిక మరొకరి యాజమాన్యంలోకి వెళ్ళిపోయింది. ఆ తర్వాత మరో రెండేళ్ళపాటు ఏదో ఒక విధంగా యీడుకొచ్చి, చివరకు 1953 లో అంతరించి పోయింది. ఈ పత్రికను మూసి వేయడంతో ఆంధ్రుల పెట్టుబడికూడా అఖరయిపోయి, వారి ఉత్సాహం మరో కొత్త ఇంగ్లీషు దినపత్రికా రంగంవైపు తరలించబడి వుండవచ్చు. ఏమయినప్పటికీ యీ ఊహ అవాస్తవం కాదని ఆశిస్తున్నాను.

ఈ వ్యాసంలో నేను 1953 సం॥ లో ఆంధ్రరాష్ట్రం విడదీయబడిన నాటివరకూ — అంటే ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో — ఆంధ్ర ప్రాంతంలోనూ, రాజకీయంగా పాత్రికేయపరంగా రాజధాని అయిన మద్రాసు లోనూ మాత్రమే జరిగిన పత్రికారంగం

పృష్టికను అభివృద్ధిని వివరించాను. ఈసమీక్ష స్వాతంత్ర్యం సిద్ధించడానికిముందు ఆరేడు దశాబ్దాలకు మాత్రమే పరిమితమై వుంది. స్వాతంత్ర్యానంతరం — ముఖ్యంగా 1956 లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన అనంతరం యీ రంగలో తెలంగాణాలో జరిగిన అభివృద్ధి కూడా రాష్ట్రంలోని పత్రికారంగం ప్రగతిలో అంతర్భాగమే.

ఈ నా సమీక్ష ఆంధ్రప్రాంతంలోని పత్రికారంగాన్ని కూడా పూర్తిగా వివరించ లేదు. దశాబ్దాలనుండి తెలుగు పత్రికలు — వార పత్రికలు, పక్ష పత్రికలు యింకా యితర పత్రికలు — అనేకం ఆంధ్రదేశం మాగాణిలో తల ఎత్తాయి. అశేషమైన సాహిత్యపంట ఆంధ్రదేశంలో వున్నప్పటికీ చాలా పత్రికలు పూర్తిగా పరిపక్వంచెంది ఫలసాయాన్ని అందించే స్థితిలో లేవు. వీటిలో చాలా వరకు ఏమాత్రం పెరుగుదల లేకుండా గిడసబారిపోయిన పత్రికలే. లేదా సరిపోయినంతగా ఈ సాహిత్య క్షేత్రాలకు ఆర్థిక వసరులు అనే నీటిపారుదల సౌకర్యాలు లేకపోవడంవల్లా, పత్రికలను నిలబెట్టే ప్రకటనలు, ప్రచారం లేకపోవడం వల్లా యీ మొక్కలు దారిపక్కన దిక్కులేనివాటిలా పడిపోవడం జరుగుతున్నది. ఈ పత్రికల పేర్లు తెలియచేయడం కూడా సాధ్యంకాని విషయమే.

తెలంగాణాకు సంబంధించినంత వరకూ, పైనచెప్పిన కాలాన్ని సమీక్షించడానికి అనేక కారణాలవల్ల నేను ధైర్యం చేయలేక పోతున్నాను. కాని ఓసారి గతంలోనుండి గబగబా నడిచివస్తున్నప్పుడు గోలకొండ పత్రికను చెప్పకుండా వుండలేను. ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడటానికి చాలా ముందునుండే శ్రీ ఎస్. సర్వోత్తమరెడ్డి యాజమాన్యంలో, సంపాదకీయంలో వస్తున్న గోలకొండ పత్రిక తెలంగాణా వెలుపలకూడా ఎంతో ప్రసిద్ధికెక్కింది. గత ఆరేళ్ళనుండి తెలంగాణా పత్రికారంగం పరిధులలో నుండి నాలుగు తెలుగు దినపత్రికలు వచ్చాయి. వీటిలో ఒకటి ఆంధ్రభూమి, రెండవది ఆంధ్రజనత. ఆంధ్రభూమి మొదట్లో శ్రీ పండితారాధ్యుల నాగేశ్వరరావు గారి సంపాదకత్వంలో వచ్చిఆతర్వాత శ్రీ గోరా శాస్త్రి సంపాదకత్వంలో వస్తున్నది. ఆంధ్ర జనత శ్రీ కె. ఎస్. సుబ్రహ్మణ్యం సంపాదకత్వంలో దినదిన ప్రవర్ధమానమవుతున్నది. ఇంక మిగిలిన రెండు పత్రికలూ — ఒకటి ప్రజాప్రభ మరొకటి ఆంధ్రరత్న — కొంతకాలం మాత్రమే నిలబడగలిగాయి.

గత దశాబ్దంలోఆంధ్ర, తెలంగాణా రెండు ప్రాంతాలలోనూ — విజయవాడనుండిజాగృతి, రాజమండ్రి నుండి ప్రేమజ్యోతి, వరంగల్లు నుండి జనధర్మ, ధర్మభూమివంటి పత్రికలు బహుకొద్దివచ్చాయి. ఆంగ్లపత్రికారంగంలో చెప్పుకోవాలంటే హైదరాబాదు బులెటెన్‌ను చెప్పవచ్చు. హైదరాబాదు నుండి వస్తుందేది యిది. గత కొద్ది సంవత్సరాల క్రితం వరకూ యీ పత్రిక ఎక్కువ ప్రచారమూ, సమర్థనీయమైన సంపాదకత్వమూ గల పత్రికగా ప్రసిద్ధి కెక్కింది. కాని ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడటానికి ముందే యీ పత్రిక మూతబడి పోయింది. అయితే దీని ప్రభావంగానే దక్కన్ క్రానికల్, డెయిలీ న్యూస్ అనే రెండు ఇంగ్లీషు దినపత్రికలు యీ రంగంలో కొత్తగా తలఎత్తాయి. దక్కన్ క్రానికల్ గతకొద్ది సంవత్సరాలుగా తెలంగాణా ప్రాంతాన్ని దాటుకుని ఇతరచోట్ల కూడా అధిక ప్రచారాన్ని ఆదరణను పొందుతున్నది. రాష్ట్రంలోని ప్రాంతీయ భాషల్లో ద్వితీయస్థానం ఆక్రమించే ఉర్దూ పత్రికలలో, వాటికివున్న ప్రచారం దృష్ట్యా, రెండింటిని చెప్పక తప్పదు. ఒకటి డెయిలీ సియాసత్, రెండవది డెయిలీ మిలాప్. డెయిలీ మిలాప్‌కు హిందీ ప్రచురణకూడా వుంది. ఇంకా తెలంగాణా తెలుగు, ఇంగ్లీషు (కొంత వరకూ ఉర్దూ) పత్రికా రంగానికి అంతగా అనువైన స్థలంకాదు. కొంత ధైర్యంతో కూడిన సరిపోయినంత పెట్టుబడీ, పత్రికా రంగంలో తగినంత యాజమాన్యం వుంటే హైదరాబాదు పత్రికా రంగానికి కేంద్రం కాగలదు. ప్రజలకు పత్రికల అవసరాలను తీర్చేందుకు చక్కటి బాధ్యతా యుతమైన సంపాదకత్వంలో కొన్ని పత్రికలను తీసుకురాదగ్గ కేంద్రం హైదరాబాదు.

ఆంధ్ర ప్రదేశ్ మాస పత్రికంను నాలుగు భాషల్లో ప్రచురించడంద్వారా యీ రంగంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తన వయిపు నుండి కూడా గణనీయమైన సాహసాన్ని చేస్తున్నది. కొన్ని సంవత్సరాల క్రిందట కేవలం అధికార గజెట్టుగా వుండి, అధికార కార్యకలాపాలను వివరించేదిగా మాత్రమే వున్న యిది ఈ నాడు పాఠకుడి వివిధ అభిరుచులకు వీలుగా అనేక విషయాలతో ఒక సంపూర్ణ పత్రికగా వెలువడుతున్నది.

ఒక దేశం యొక్కగాని లేదా ఆదేశం లోని ప్రజలయొక్కగాని రాజకీయ, సాంఘిక ప్రగతిని భేరీజు వేయడానికి ఎప్పుడయినా ఆదేశంలో గల పత్రికలే సరియైన కొలతబద్దలు అనే ప్రవచనంతో యీ వ్యాసం ప్రారంభించాను నేను పైనచేసిన సమీక్షలో మీరు దర్శించినట్టు ఆంధ్ర దేశంలో పత్రికా రంగం ప్రగతిని చిత్రించడంద్వారా ఆ ప్రవచనను విస్తృతీకరించడం జరిగింది. ఒక దేశంలోగానీ లేదా ఒక ప్రాంతంలో గాని వున్న పత్రికలు ఆ దేశంలోని, లేదా ఆ ప్రాంతంలోని రాజకీయ, ఆర్థిక, సాంఘిక రంగాలలోని అభివృద్ధికన్న విరుద్ధంగా వుండవు అనే వాక్యంతో నేను ముగిస్తాను.

ఆంధ్రప్రదేశ్ ప్రజలు రాజకీయ, సాంఘిక రంగాలలో మరింత ఎక్కువగా చైతన్యవంతులై శీఘ్రతరంగా యింకా ముందుకు చొచ్చుకు పోవలసిన అవసరం ఎంతయినా వుంది. దీనిని సాధించాలంటే, తగినంత పెట్టుబడి, సమర్థనీయమైన ప్రచురణ, యితర సౌకర్యాలు, పారిశ్రామిక వర్తక రంగాలనుండి ప్రకటనల రూపంలో సహాయం — ఇవన్నీ సమృద్ధిగా వుండి; మన రాజ్యాంగంలో పొందుపరచబడిన ప్రజా క్షేమం, సాంఘికాభివృద్ధి అనే లక్ష్య ద్వయాలను వెలికితీసే పత్రికలు కావాలి. ★

# చిరుధాన్యాలు

చిరు ధాన్యాలనగా చిన్నగింజ గలిగిన తృణ ధాన్యాలు. వరి, గోధుమ ఇందులో చేరవు. ఇందులో జొన్న, సజ్జ, రాగి, కొఱ్ఱ ముఖ్యమైనవి. వరిగ, సామలు, ఆరిక, ఊదలు అంత ప్రాముఖ్యమైనవి కావు. మన రాష్ట్రంలో మొత్తం చిరు ధాన్యాలక్రింద షుమారు 1.2 కోట్ల ఎకరములు సాగులోవుండి 26 లక్షల టన్నుల గింజలు దిగుబడి అవుతున్నవి. మొత్తం రాష్ట్రంలో సాగులోనున్న విస్తీర్ణంలో చిరు ధాన్యాలక్రింద 41 శాతం విస్తీర్ణం కలదు.

ఆంధ్ర రాష్ట్రంలో చిరుధాన్యాల విస్తీర్ణం, దిగుబడి మొత్తం భారత దేశంలో వాటి శాతం *డిగువ ఇవ్వబడినవి :-

జొన్న :

జొన్నలు ముఖ్యంగా కర్నూలు, మహబూబునగర్, నల్గొండ, ఆదిలాబాదు, గుంటూరు, నెల్లూరు జిల్లాలలో సాగులో నున్నవి. జొన్నలు పునాస (జూన్—సెప్టెంబరు) పైరు (అక్టోబరు — ఫిబ్రవరి) లలో కూడ పండించబడుతున్నవి. మొత్తం విస్తీర్ణంలో పునాసపంట 61 శాతం ఉంటుంది. పునాసలో పండించబడే రకాలు తేలికవై సుమారుమూడునెలలలోఫలిస్తాయి. పైరురకాలు సుమారు నాలుగు మాసాలలో ఫలిస్తాయి. కర్నూలు జిల్లాలో ముంగారి పచ్చ జొన్న అనేరకం-110 రోజుల కాలపరిమితి కలిగినది — పునాసలో వేయబడుతున్నది. ఆదిలాబాదు జిల్లాలో పునాసలో (ఖరీఫ్) వేయబడే "సోన"; "వరది"; "తూప" అనే రకాలు $4\frac{1}{2}$ మాసాలనుండి $5\frac{1}{2}$ మాసాల కాలపరిమితికలిగి వున్నాయి. ఖమ్మం, వరంగల్, నల్గొండ జిల్లాలలో "మాఘీ జోవార్" అనే రకాలన్నీ పునాసపైర్లకు మధ్యస్తంగా (Late Kharif) సెప్టెంబరులో వేస్తారు. ఇది $4\frac{1}{2}$ మాసాల పంట. ఆంధ్ర దేశంలో పండించబడే జొన్నలలో ముఖ్యమైనవి పచ్చజొన్నలు, ఎఱ్ఱజొన్నలు, (Sorghum durra) తెల్ల జొన్నలు (Sorghum Cernuum) కొండ జొన్నలు (Sorghum Roxburghii) తెలంగాణా ప్రాంతంలో సాగయ్యే జొన్న రకాలు మల్దండి, పర్భని, (Sorghum Subglabrescens). చిత్తూరు జిల్లాలో పశుగ్రాసానికి ప్రత్యేకంగా "కాకిమారి జొన్న" అనే రకం (Sorghum Dochna) సాగులో వున్నది. తెలంగాణాలో ఇంపి జోవార్ అనే రకం పశుగ్రాసమునకై పెంచబడుతున్నది.

సజ్జ :

సజ్జ ప్రధానంగా పండించబడే జిల్లాలు నల్గొండ, అనంతపురం, గుంటూరు, విశాఖపట్నం, చిత్తూరు, కడప, నెల్లూరు. సజ్జను సాధారణంగా పునాస పంటగనే (జూన్ — సెప్టెంబరు) వేస్తారు. ఇది సుమారు 3 నెలల పంట. సజ్జలో కూడ వివిధ ప్రాంతాలలో, వివిధ పేర్లతో పెరగు రకాలుగలవు.

( 1959—60 వ సంవత్సరంలో )

| చిరుధాన్యం పేరు | విస్తీర్ణం లక్షల ఎకరాలలో | దిగుబడి లక్షల టన్నులలో | ఎకరా దిగుబడి పౌన్లలో | భారతదేశ విస్తీర్ణంలో శాతం |
|---|---|---|---|---|
| జొన్న | 64.4 | 14.53 | 506 | 15.2 |
| సజ్జ | 15.6 | 3.11 | 446 | 5.2 |
| రాగులు | 8.28 | 3.32 | 898 | 14.0 |
| ఇతర చిరుధాన్యాలు | 27.6 | 4.13 | 335 | 22.2 |
| మొత్తం చిరుధాన్యాలు | 120.49 | 26.09 | — | 12.3 |

చిన్నచిన్న సూదికఱ్ఱలతో కన్నాలుచేసి వరుసగా మొక్క-జొన్న విత్తనాలను నాటుతున్న స్త్రీలు.



పెద్దసజ్జ కండెసజ్జ ఎచ్చిక సజ్జ ఎమాళపు సజ్జ, పూనాగంటి, పెద్దగంటి మొదలగు పేర్లతో సాగవుతున్నది.

రాగి :

రాగి ముఖ్యంగా చిత్తూరు, శ్రీకాకుళం, మహబూబ్ నగర్, అనంతపురం, విశాఖ పట్టణం జిల్లాలలో సాగవుతున్నది. విశాఖ, శ్రీకాకుళం జిల్లాలలో దీనిని "చోడి" అనీ, నెల్లూరు జిల్లాలో "తమిద" అని వ్యవహరిస్తారు. విశాఖ, శ్రీకాకుళం జిల్లాలలో వరి పైరుకు ముందుగా తేలికరకం పునాసలో పండిస్తారు. ఇది 85 రోజులలో కోతకు వస్తుంది. దీనిని పునాసచోడి లేక బురద చోడి అంటారు. మెట్టభూములలోను, తోట పైరుగాను, వివిధ ప్రాంతాల కనువైన రకాలు సాగులో నున్నాయి. వీటి కాల పరిమితి $3\frac{1}{2}$ నుండి 4 నెలలుంటుంది.

కొఱ్ఱ :

కొఱ్ఱ కర్నూలు, అనంతపురంజిల్లాలలో విస్తారంగా సాగులోవున్నది. బొచ్చుకొఱ్ఱ, జడకొఱ్ఱ, సేనకొఱ్ఱ మొదలైన రకాలు వివిధ ప్రాంతీయ నామములతో సాగవుతున్నవి. ఇది పునాసలో (జూన్ – సెప్టెంబరు) వేయు 85–90 రోజులలో పండు – పంట మిగతా చిరు ధాన్యాలలో "వరిగ" గుంటూరు, మహబూబ్‌నగర్ జిల్లాలలోను, మిగతా ధాన్యాలు రాష్ట్రమంతట కొద్ది విస్తీర్ణంలోను సాగవుతున్నవి.

## జరుగుతున్న కృషి - సాధించిన ఫలితాలు

చిరుధాన్యాలు ప్రాంతీయత గలిగి ఒక ప్రాంతంలో బాగా పండు రకాలు; మరో ప్రాంతంలో సరిగా పండుట లేదు. అందుచేత వివిధ ప్రాంతాలకు అనువైన వంగడములు తయారు చేయడానికి ముఖ్యమైన ప్రాంతాలలో ప్రాంతీయ చిరుధాన్య పరిశోధన కేంద్రాలు నెలకొల్పబడుతున్నవి. విశాఖ, శ్రీకాకుళం జిల్లాలకు విజయగరంలోను; ఉభయ గోదావరి జిల్లాలకు పెద్దాపురంలోను; గుంటూరు, కృష్ణా, నెల్లూరు జిల్లాలకు లాం, వంగోలులలోను; రాయలసీమకు ద్రోణాచలం, ధర్మవరం, నంధ్యాలలలోను; తెలంగాణా జిల్లాలకు మధిర, ఆదిలాబాదు, రాజేంద్ర నగర్‌లోను ఆయా ప్రాంతాలలో మంచి రాలికనిచ్చే వంగడములు తయారు చేయడానికి కృషి జరుగుతున్నది ప్రత్యేకంగా నీరు కట్టి సాగుచేసే చిరు ధాన్యాలపై పరిశోధనకు చంద్రగిరిలో ఒక కేంద్రం స్థాపించబడినది. ఎంచిన వంగడములు తయారు చేయడానికి జరిగిన కృషి ఫలితంగా రైతులకందీయబడిన మేలుజాతి రకాలు పట్టికలో వివరింపబడినవి.

పట్టికలో చూపబడినవి కాక ఇతర రాష్టాలనుండి, విదేశాలనుండి అనేకరకాలు తెప్పించబడి వివిధ కేంద్రాలలో పరీక్షించబడుతున్నవి. ఆఫ్రికానుండి వచ్చిన "ఘనాబజ్రా" అను సజ్జరకం లావు కంకి కలిగి పెద్దగింజ కలిగి రాష్ట్రమంతటా మంచి ఫలితాల నిస్తున్నవి. దీని గింజలు చాలా పుష్టికరమైనవని పరీక్షల వలన తేలింది. వీనిలో 14 శాతం మాంస కృత్తులు కలవు. దేశవాళీ రకాలలో 11 శాతం మాత్రముంటాయి. మైసూరు రాష్ట్రంనుండి తేబడిన HK 282 అనే కొఱ్ఱరకం గుంటూరు పరిసరప్రాంతాలలో మంచి ఫలితాలనిస్తున్నది. ప్రస్తుతం వాడుకలోవున్న G-1 కంటె ఇది 15 శాతం అధిక రాలికనిచ్చింది. ఇది జడ కొఱ్ఱ రకం.

పుష్పాది రాలిపోకుండా రక్షణకై కాగితపు సంచులు తొడిగిన దృశ్యం.



పరిశోధన జరిపి యికదా దిగుబడిని అధికం చేయవలసిన ఆవశ్యకత ఎంతేని కలదు. ప్రస్తుతం నడుపబడుతున్న ప్రాంతీయ చిరుధాన్య కేంద్రాలలో కృషి ఇనుమడింపబడినది. విజయనగరం, పెద్దాపురం, చంద్రగిరి క్షేత్రాలలో ఎంచిన రాగి వంగడములు తయారు చేయడానికి కృషి జరుగుతున్నది. లాం, నంద్యాల, ద్రోణాచలం, ఆదిలాబాదు క్షేత్రాలలో మేలుజాతి జొన్న రకాలు తయారు చేయడానికి కృషి జరుగుతున్నది, సంకర జాతుల నుత్పత్తిజేసి అధిక రాలిక నిచ్చే జొన్న రకాలను తయారు చేయడానికి లాం, ధోన్ క్షేత్రాలలో కృషి జరుగుతున్నది. మన రాష్ట్రంలో రెండవ ముఖ్య చిరుధాన్యమైన సజ్జలో సంకర జాతుల ఉత్పత్తికి ప్రత్యేకంగా అనంతపురం జిల్లా ధర్మవరంలో చిరుధాన్య పరిశోధన కేంద్రం నెలకొల్పబడింది. మన రాష్ట్రంలో ముఖ్యంగా చిరుధాన్యాలు పండించబడే మహబూబ్‌నగర్, నల్గొండ నెల్లూరుజిల్లాలలో వీటి అభివృద్ధి! కృషి జరగలేదు. అందుచేత నాలుగవ పంచవర్ష ప్రణాళికలో యీ జిల్లలలో ప్రత్యేకంగా చిరుధాన్య పరిశోధన కేంద్రాలను స్థాపించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

ఏపుగా పెరిగిన "దక్కన్ హైబ్రిడ్ మక్కా" మొక్కజొన్న పైరు, అంబరుపేట. హైదరాబాద్.

## జరుగ వలసిన కృషి

నాలుగవ పంచవర్ష ప్రణాళికలో వ్యవసాయోత్పత్తిని అధికం చేయవలసిన అవసరం ఎంతైనా గలదు. ప్రణాళికల కృషి ఫలవంతమవడానికి వ్యవసాయరంగంలో విజయం ఆవశ్యకమని యెల్లరు గుర్తించారు. చిరుధాన్యాలు కష్టించి పనిచేసేవారి ముఖ్యాహారమవడం వలన వీటిమీద



# మానవసంస్కృతికే మూలకందమైన ప్రత్తి పంట

కె. సత్యనారాయణ మూర్తి

మానవుని నిత్య జీవితావసరాలల్లో ఆహారం, బట్ట ముఖ్యమయినవి. మన రాష్ట్రం ఆహార వుత్పత్తిలో స్వయం పోషకత్వాన్ని సంపాదించుకోవడమే గాకుండా ఇతర రాష్ట్రాలకు ఆహార ధాన్యాలను అందించ గల్గిన స్థితిలో వుంది. కాని ప్రత్తిపంట వుత్పత్తిలో స్వయం సమృద్ధి పొందడానికి మనరాష్ట్రం ముందంజ వేయవలసివుంది.

మన దేశంలో ప్రత్తి పండించే ముఖ్యమైన రాష్ట్రాలలో మన రాష్ట్ర మొకటి. మన దేశంలోని ప్రత్తిపంట విస్తీర్ణంలో సుమారు నాలుగు శాతం విస్తీర్ణం మన రాష్ట్రంలోనే వుంది. దేశంలోని ప్రత్తి వుత్పత్తిలో సుమారు రెండు శాతం మన రాష్ట్రంలో అవుతున్నది. ఇతర రాష్ట్రాలతో పోల్చిన వివరాలు 1వ నెం. కల పట్టికలో ఈయబడ్డాయి.

మన రాష్ట్రంలో 1962-63 సంవత్సరాంతానికి పంటవిస్తీర్ణం 9.15 లక్షల ఎకరాలని, పంట వుత్పత్తి 1.43 లక్షల బేళ్ళు అని అంచనా వేయబడింది. మనరాష్ట్రంలో నూటికి 98 వంతులు పంట వర్షాధారంక్రింద సాగవుతున్నది. ఇతర రాష్ట్రాలతో పోల్చి చూస్తే నీటివనరుల క్రింద సాగవుతున్న పంట చాల తక్కువ. ఇందువల్ల రాష్ట్రంలోని పంట వుత్పత్తి తక్కువగా వున్నది. అయితే నాగార్జున ప్రాజెక్టు, పోచంపాడు ప్రాజెక్టుల వలన రాష్ట్రంలో నీటివనరుల క్రింద పంటసాగు వృద్ధికావడానికి చాలా అవకాశాలున్నాయి. దీనితోపాటు ప్రత్తి పంట విస్తీర్ణం, వుత్పత్తి అధికం చేయడానికి ప్రణాళికలు యోచనలో వున్నాయి.

తృతీయ పంచవర్ష ప్రణాళిక అంతమయ్యేనాటికి అనగా 1965-66 సంవత్సరాంతానికి పంటవుత్పత్తి 2.0 లక్షల బేళ్ళు వుండాలని ప్లానింగ్ శాఖ, రాష్ట్రప్రభుత్వం నిర్ణయించాయి. అనగా తృతీయ పంచవర్ష ప్రణాళికలో 77 వేల బేళ్ళప్రత్తిని అదనంగాపండించవలసి వుంది. నాలుగవ, ఐదవ ప్రణాళికలు అంతమయ్యేనాటికి రాష్ట్రవుత్పత్తి 2.75 లక్షలు, 3.52 లక్షలు వుండేటట్లు ప్రణాళికలు సిద్ధపరచబడుతున్నాయి. (చూ. నెం. 2-పట్టిక)

ప్రణాళికలు అమలు జరపడంలో లక్ష్యసిద్ధికై తగు చర్యలు తీసుకొనడం అవసరం. ఈ లక్ష్యాన్ని సాధించిననాడు మనరాష్ట్రంలో వుత్పత్తిని ఇతోధికంచేయడమే కాక

| (1) రాష్ట్రం | పంటవిస్తీర్ణం (లక్షల ఎకరాలలో) | శాతం | పంట ఉత్పత్తి లక్షలబేళ్ళు | శాతం |
|---|---|---|---|---|
| 1. మహారాష్ట్రం | 62.88 | 33 | 16.11 | 30 |
| 2. గుజరాతు | 42.45 | 22 | 14.01 | 26 |
| 3. మైసూరు | 25.87 | 14 | 4.10 | 7 |
| 4. మధ్యప్రదేశ్ | 18.75 | 10 | 4.54 | 9 |
| 5. పంజాబ్ | 13.37 | 7 | 8.02 | 15 |
| 6. మద్రాస్ | 9.90 | 5 | 3.75 | 7 |
| 7. ఆంధ్రప్రదేశ్ | 7.72 | 4 | 1.23 | 2 |
| 8. ఇతర రాష్ట్రాలు | 7.77 | 5 | 2.14 | 4 |
| మొత్తం | 188.71 | 100 | 53.90 | 100 |

(1960-61 సంవత్సరపు అంకెలు తీసుకొనబడినవి)

| (2) వివరాలు | ప్రత్తిపంట విస్తీర్ణం (లక్షల ఎకరాలు) | ప్రత్తివుత్పత్తి (లక్షలబేళ్ళు) |
|---|---|---|
| 1. ద్వితీయ ప్రణాళిక అంతమయిన సంవత్సరానికి (1960-61) | 7.72 | 1.23 |
| 2. తృతీయ ప్రణాళిక లక్ష్యం | 8.81 | 2.00 |
| 3. నాలుగవ ప్రణాళిక లక్ష్యం | 9.69 | 2 75 |
| 4. ఐదవ ప్రణాళిక లక్ష్యం | 10.64 | 3.52 |

దేశాభ్యుదయానికి తోడ్పడిన వారమౌతాము ఉత్పత్తి పెంచబడిననాడు రాష్ట్రంలో పరిశ్రమలు అభివృద్ధిచెంది జీవనప్రమాణాలు పెరుగుటకు చాలా అవకాశాలు వుంటాయి. అప్పుడే. దారంతీసే మిల్లులను క్రొత్తగా పెట్టడానికి అనుమతులు లభిస్తున్నాయి.

మన రాష్ట్రంలో ఎకరానికి సరాసరి పంట దిగుబడి ప్రస్తుతం 62 పౌనులు (దూది). దేశంయొక్క సరాసరి దిగుబడి 112 పౌనులు. ఐదవ ప్రణాళిక అంతమయ్యే నాటికి రాష్ట్రివుత్పత్తి ఎకరానికి 120 పౌనులు సాధించేందుకు కృషి జరుగవలసి వున్నది. అందుకు ప్రణాళికలు రూపొందించబడుతున్నాయి. అధికోత్పత్తి ముఖ్యంగా నీటి ఆధారంతో ప్రత్తిని ఎక్కువగా వేయుట వలన సాధించవలసివున్నది. నాగార్జున సాగర్‌వంటి ప్రాజెక్టులు ప్రత్తిని ఎక్కువగా పండించడానికి తోడ్పడతాయి.

## ఆంధ్రప్రదేశ్‌లో ప్రత్తిసాగు వివరాలు

మన రాష్ట్రంలో ప్రత్తిపంటకు రాయలసీమ జిల్లాలు కీలకప్రాంతాలు. రాష్ట్రంలో నూటికి సరాసరి 70 వంతుల వుత్పత్తి ఈ జిల్లాలలో జరుగుతున్నది. రాష్ట్రంలో ముఖ్యమైన ప్రత్తి పండించే జిల్లాలు, పంట విస్తీర్ణం వుత్పత్తి 3వ నెం. కల పట్టికలో ఇవ్వబడ్డాయి.

మన రాష్ట్రంలో ప్రత్తి సాగుచేసే జిల్లాలు వ్యాపారరీత్యా ఐదు ప్రాంతాలుగా విభజించబడ్డాయి. ఈ ప్రాంతాల వివరాలు యిక్కడసాగుఅయ్యేఅభివృద్ధికరమైన వంగడాలు 4వ నెం.కల కట్టికలో యివ్వబడ్డాయి.

## ప్రత్తి పరిశోధనాంశాలు

ప్రత్తిని పండిచే ప్రాంతాలు, వర్షపాతం తక్కువ అయిన ప్రదేశాలు, అభివృద్ధికరమైన వంగడాలు కనుగొనడమే పరిశోధనల ముఖ్యమైన వుద్దేశ్యం. ప్రత్తిపంటలో ఎకరానికి పంట దిగుబడియేగాక, పోచ పొడవు దూది దిగుబడి దూదినాణ్యత మొదలయిన ఉన్నత గుణాలుకూడ గర్లేట్టు చేయాలి. ప్రత్తి లేక దూదియొక్క విలువ

| (3) జిల్లాపేరు | విస్తీర్ణం (ఎకరాలు) | శాతం | ఉత్పత్తి బేళ్ళు | శాతం |
|---|---|---|---|---|
| 1. కర్నూలు | 4,52,000 | 49 | 67,900 | 47 |
| 2. ఆదిలాబాద్ | 1,86,000 | 20 | 28,900 | 20 |
| 3. అనంతపురం | 1,46,000 | 16 | 25,400 | 17 |
| 4. కడప | 42,000 | 5 | 7,200 | 5 |
| 5. గుంటూరు | 25,000 | 3 | 5,200 | 4 |
| 6. మహబూబ్‌నగరు | 21,000 | 2 | 2,500 | 2 |
| 7. నెల్లూరు | 14,000 | 2 | 2,700 | 2 |
| 8. నిజామాబాద్ | 13,000 | 1 | 1,600 | 1 |
| 9. ఇతర జిల్లాలు | 16,000 | 2 | 2,100 | 2 |
| మొత్తం. | 9,15,000 | 100 | 1,43,400 | 100 |

| (4) ప్రాంతం పేరు | జిల్లాలు | అభివృద్ధి కరమైన వంగడాలు | విత్తనాలు వేయు కాలం |
|---|---|---|---|
| 1. వెస్టరన్స్ | అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలో కొన్ని ప్రాంతాలు | వెస్టరన్స్–1 లక్ష్మి అదోనికమ్ హెచ్ 420, ముంగారి | ఆగస్టు, సెప్టెంబరు జూన్, జులై |
| 2. నార్తరన్స | కర్నూలు జిల్లాలోని కోవెలకుంట్ల, బనగానిపల్లె, నంద్యాల, ఆళ్లగడ్డ, ఆత్మకూరు, మహబూబ్ నగరు జిల్లాలోని అలంపురము, గద్వాల తాలూకాలు | నార్తరన్స 14 నందికమ్ | ఆగస్టు |
| 3. కాకినాడ | గుంటూరు, నెల్లూరు, కృష్ణ, ఉభయగోదావరి జిల్లాలు విశాఖపట్నం కర్నూలుజిల్లాలో కొన్ని ప్రాంతాలు | కాకినాడ-2 | జులై నుంచి సెప్టెంబరు వరకు. |
| 4. గౌరాని పర్భాని అమెరికన్ ప్రత్తి ప్రాంతాలు | ఆదిలాబాద్, నిజామాబాదు, మెదక్ | గౌరాని-6 పర్భాని అమెరికన్ 1 | జూన్, జులై |
| 5. ఉమ్రాస్ | వరంగల్, కరీంనగర్ | క్రొత్తరకం యివ్వవలెను | జూన్, జులై |

ఈ గుణాలనిబట్టి ఉంటుంది. కనుక సాధ్యమైనంత వరకు ఈ గుణా లన్నీ ఒకే రకంలో వుండేటట్లు చేయడమే ప్రత్తి పరిశోధనలలోని లక్ష్యం. ఇంతకు ముందే పేర్కొనబడినట్లు ప్రత్తి పంట నూటికి 98 వంతులు వర్షాధారం క్రింద సాగు అవుతున్నది. ముఖ్యమైన రాయలసీమ జిల్లాలో వర్షపాతం తక్కువ. 20 అంగుళాల నుండి 30 అంగుళాల వరకు వర్షం వస్తూ వుంటుంది. కొన్ని సంవత్సరాలలో వర్షం సరిగా రాని కారణాలవల్ల పూర్తిగా పంట చెడిపోవడంకూడ జరుగుతూ వుంటుంది. వర్షం తక్కువ అవడంవల్ల కృత్రిమ ఎరువులు వేసి, పంట వుత్పత్తి అధికంచేసే అవకాశాలు తక్కువ. కాబట్టి పరిశోధనల ద్వారా కనిపెట్టబడిన నూతన అభివృద్ధి కరమైన వంగడాల ద్వారా పంటను అధికం చేయడం ఒక్కటే ముఖ్యమైన మార్గం.

ఈ ప్రధానోద్దేశంతోనే రాష్ట్రంలో ప్రత్తిపరిశోధన చేయబడుతున్నది. ప్రత్తి పరిశోధనశాఖ చేస్తున్న ముఖ్యకృషి యీ క్రింద వివరించబడింది.

*1. వెస్టరన్స్ ప్రాంతం :* రాష్ట్రంలోని పంట విస్తీర్ణంలో నూటికి 60 వంతులు ఈ ప్రాంతంలో వున్నాయి. అనంతపూరు, కడప, కర్నూలు జిల్లాలలో కొన్ని తాలూకాలలో ప్రత్తిసాగు అయ్యే ప్రాంతమంతా వ్యాపారరీత్యా "వెస్టరన్స్" ప్రాంతమని పిలువబడుతున్నది. ఇక్కడ ప్రత్తి ముంగారి పంటగాను (జూన్–జులై) హింగారి పంటగాను (ఆగస్టు–సెప్టెంబరు) వేయుదురు. ఈ పంటల అభివృద్ధికై ఆదోని ప్రత్తి పరిశోధన కేంద్రంలో పరిశోధనలు జరుగుతున్నాయి. పరిశోధనల ఫలితాలు యీ క్రింద ఈయబడ్డాయి.

*ముంగారి ప్రత్తి :* రాయలసీమ జిల్లాలలో ముంగారి ప్రత్తి సుమారు ఒక లక్ష ఎకరాలలో సాగు అవుతున్నది. ఈ ప్రత్తి పోచపొడవు దూదినాణ్యత తక్కువ. ఈ రకాన్ని సాగుచేయడంవలన రైతుకు ధర తక్కువ వస్తుంది. ఆదోని ఫారంలో పరిశోధనల వలన 'ఆదోనికమ్' అనే నూతన వంగడం కనిపెట్టబడింది. ఈ నూతన రకం రైతులు పండిస్తున్న ముంగారి ప్రత్తి కంటె పంట దిగుబడి, పోచపొడవు దూది దిగుబడి, నాణ్యతలలో అభివృద్ధి కలిగి వున్నది. 1961 వ సంవత్సరంలో కేంద్ర ప్రత్తి సంఘంవారు ఈ నూతన రకాన్ని రైతులకు ఇవ్వడానికి అంగీకరించారు. ఈ ఆదోనికమ్ ప్రత్తియొక్క ఆధిక్యతను 5 వ నెం. కల పట్టిక తెలియజేస్తుంది.

ముంగారి ప్రత్తి బదులు నూతన రకం 'ఆదోనికమ్' పండించడం వలన ప్రత్తి ఉత్పత్తి అధికం చేయడమే కాక రైతులకు ఎకరానికి రూ. 72 అధికలాభం వస్తుందని అంచనా వేయబడింది. ఆదోనికమ్ వేరు శనగ, కొర్ర పంటలలో మిశ్రమ పంటగా వేయడానికికూడా అనువైనదని పరిశోధనల వలన కనుగొనబడింది. దీనివలనకూడా ప్రత్తి వుత్పత్తిని ఇతోధికం చేయడానికి చాల అవకాశాలు వున్నాయి.

*హింగారిపంట :* అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలలో నల్లరేవడి భూములలో హింగారి పంటగా వేస్తారు. వెస్టరన్స్–1 అనే వ్యవసాయ శాఖచే ఇవ్వబడినరకాన్ని రైతులు వేస్తున్నారు. ఈ రకం సుమారు రెండు లక్షల ఎకరాలలో సాగవు తున్నది. అయితే ఈ రకంలో దూది దిగుబడి, శాతం తక్కువ. 28 పాళ్ళు మాత్రమేవుంది. ఈ రకంకన్న మేలైన రకాన్ని కనుగొన డానికి ఆదోనిఫారంలో పరిశోధనలు కొనసాగుతున్నాయి. మూడు మేలైన రకాలు కనుగొనబడ్డాయి. ప్రస్తుతం ఈ రకాలను రైతుల భూములలో వేసి పరీక్షిస్తున్నారు. ఈ రకాలలో వెస్టరన్స్–1 కంటె దూది దిగుబడి, శాతం హెచ్చు. వీటిలో మేలు రకం ఎంచి నూతన వంగడంగా ఇవ్వ డానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి.

'లక్ష్మి' అనే అమెరికను జాతి ప్రత్తి రకం ఈ జిల్లాలలో సుమారు ఒకటిన్నర లక్షల ఎకరాలలో సాగవుతున్నది. ఈ రకంలో పంట రాలుబడి ఎక్కువ. దేశవాళీ ప్రత్తి రకాలకన్న వున్నతమైన గుణాలుండుటవల్ల. ఈ రకాన్ని పండించడంవలన రైతులకు ఎక్కువ రాబడి వస్తున్నది. కాని ఈ రకం ప్రత్తిలో చీడపురుగులు, జబ్బులు ఎక్కువ. అందువల్ల కొన్ని సంవత్సరాలలో పంట రాలుబడి తక్కువగా వుండవచ్చు. లేదా నాణ్యత చెడిపోవచ్చు. ఈ ప్రత్తిలోగల లోపాలను సవరించి మేలైన అమెరికను జాతి ప్రత్తిరకాన్ని కనుగొనే పరిశోధనలు సాగుతున్నాయి.

| (5) వివరాలు | ఆదోనికమ్ | రైతులువేయు ముంగారిప్రత్తి |
|---|---|---|
| 1. పంటదిగుబడి ఎకరానికి పౌనులు | 440 | 360 |
| 2. దూది దిగుబడి .. .. | 150 | 114 |
| 3. దూది దిగుబడి శాతం | 34 | 31 |
| 4. పోచ పొడవు (అంగుళాలలో) | 0.92″ | 0.82″ |
| 5. దూది నాణ్యత (కౌంట్లు) | 30′ | 16′ |
| 6 నికరాదాయము ఎకరానికి రూ. | 72/– | — |



విచ్చిన ప్రత్తికాయలు

*2. నార్తరన్స్ ప్రాంతం :* కర్నూలు జిల్లాలో నంద్యాల, బనగానిపల్లె, కోవెలకుంట్ల, ఆళ్లగడ్డ, నందికొట్కూరు తాలూకాలలో ప్రత్తి పండించే ప్రాంతం నార్తరన్స్ ప్రాంతంగా వ్యాపారరీత్యా పిలువబడుతున్నది. ఇక్కడ సుమారు ఒకలక్ష ఎకరాలలో ప్రత్తి సాగవుతున్నది. ప్రత్తి పరిశోధనస్థానము నంద్యాలలోని పరిశోధనల ద్వారా 1920 వ సంవత్సరంలో కనిపెట్టబడిన "నార్తరన్స్ 14" అనే ప్రత్తి రకాన్ని రైతులు వేస్తున్నారు. దేశవాళీ ప్రత్తి రకాలలో మేలైన ప్రత్తిరకంగా దీనికి మంచి ప్రాముఖ్యత వుంది. దీనిలో దూదినాణ్యత 40 కౌంట్లు. కాని ఈ రకంలో దూది దిగుబడి శాతం తక్కువ. (నూటికి 25 మాత్రమే) అందువలన ఈ రకం బాగా విస్తరించలేదు. నార్తరన్స్ గుణగణాలు పోకుండా దూది దిగుబడి శాతం హెచ్చుగా వుండేటట్లుచేసి, ఒక అభివృద్ధికరమైన నూతన వంగడాన్ని కనుగొనడానికి నార్తరన్స్ ప్రత్తి అభివృద్ధి ప్రణాళిక ఒకటి నంద్యాల ప్రత్తి పరిశోధన స్థానంలో 1949 నుండి అమలు జరుపబడుతున్నది. ఈ ప్రణాళికకు ఆర్థిక సహాయం కేంద్ర ప్రత్తి సంఘమువారు, మన రాష్ట్రప్రభుత్వంవారు చేస్తున్నారు.

పరిశోధన కృషివలన 1962 వ సంవత్సరంలో "నందికమ్" అనే ఒక క్రొత్తరకం కనిపెట్టబడింది. ఈ రకం నార్తరన్స్-14 కన్న దూది దిగుబడిలో, దూది దిగుబడి శాతంలోను, పోచపొడవులోను, దూది నాణ్యతలోను అభివృద్ధి గావించబడింది. కేంద్ర ప్రత్తి సంఘంవారు 1962 వ సంవత్సరంలో ఈ నూతన ప్రత్తిరకాన్ని అంటే 'నందికమ్'ను రైతుల కివ్వడానికి ఆమోదించారు. నందికమ్ గుణగణాలు 6 వ నెం. పట్టికలో ఈయబడినవి.

రైతులు 'నందికమ్'ను పండించుట ద్వారా ఎకరానికి పదకొండు రూపాయలు అధికలాభాన్ని పొందుతారని అంచనా వేయబడింది. ఈ నూతన రకం నార్తరన్స్ ప్రాంతములో పూర్తిగా విస్తరించినప్పుడు సంవత్సరానికి మూడు వేల బేళ్లు దూది అదనంగా పండించవచ్చును. అంటే మన దేశంలోని దూదికొరతను కొంతవరకు తొలగించడానికి యిది తోడ్పడుతున్నది.

*కాకినాడ ప్రాంతం :* గుంటూరు, నెల్లూరు, కృష్ణా, గోదావరి, విశాఖపట్నం, శ్రీకాకుళం, కర్నూలు జిల్లాల్లోని మార్కాపురం, కంభం తాలూకాలలో ప్రత్తి వేయబడే ప్రాంతాన్ని 'కాకినాడ' ప్రత్తి ప్రాంతమని పిలుస్తున్నారు. ఇక్కడ కొంచెం ఎరుపురంగుగల ప్రత్తి పండుతుంది. సుమారు 80 వేలఎకరాలలో ప్రత్తి సాగవుతున్నది. ప్రపంచంలో ఇంత విస్తీర్ణంలో రంగుజాతి ప్రత్తి పండించే ప్రాంతం ఇది ఒక్కటే. కాకినాడ రేవునుంచి ఈరకంప్రత్తి విదేశాలకు ఎగుమతి అవ్వటంవల్ల ఈ ప్రాంతంలో పండే ప్రత్తి 'కాకినాడ' ప్రత్తి అని పిలువబడుతున్నది. కాకినాడ-2 అనే రంగు ప్రత్తి రకాన్ని ప్రస్తుతం రైతులు వేస్తున్నారు. కాని ప్రస్తుతం విదేశాలలో ఈ రకం ప్రత్తికి గిరాకీ లేకపోవడం వల్ల రైతులకు ధర గిట్టుబాటుగా ఉండడం లేదు. అందువల్ల తెల్లని ప్రత్తి రకాన్ని కనుగొనడానికి నరసరావుపేటలో పరిశోధనలు సాగుతున్నాయి. 741 అనే తెల్లని ప్రత్తిరకం ఒకటి కొత్తది పరిశోధనలద్వారా కనిపెట్టబడింది. ఈ రకాన్ని ప్రభుత్వఫారమ్ లోను, రైతుల భూములలోను వేసి పరీక్షించారు. ఈ రకం ప్రత్తి కాకినాడ-2 రకం కంటె పంట దిగుబడి ఎక్కువ; దూది దిగుబడి శాతం, దూది నాణ్యతలు కూడ ఎక్కువ. ఈ రకం ప్రత్తిని నూతన వంగ

| (6) వివరాలు | నందికమ్ | నార్తరన్స్ 14 |
|---|---|---|
| 1. దూది దిగుబడి ఎకరానికి పౌనులు | 103 | 89 |
| 2. దూది దిగుబడి శాతం | 32 | 25 |
| 3. పోచపొడవు (అంగుళాలలో) | 0.94" | 0.88" |
| 4. దూది నాణ్యత (కౌంట్లు) | 36′ | 33′ |
| 5. ఎకరానికి నికరాదాయం | రూ. 11/- | — |

ఉంగా యివ్వడానికి ఏర్పాట్లు జరుగు తున్నాయి. ఈ రకం తాలూకు వివరాలు 7వ నెం. పట్టికలో ఈయబడ్డాయి.

741 అను యీ రకం జూన్, జులై, ఆగస్టు నెలలలో వేరుశనగ, కొర్ర, సజ్జ మొదలయిన పంటలతో మిశ్రమ పంటగా వేయడానికి చాల అనువైనదని పరిశోధనల ద్వారా కనిపెట్టబడింది. విశాఖపట్నం, శ్రీకాకుళాలలో వేయబడే చిన్న ప్రత్తి కన్న ఈ రకం మేలురకం. అక్కడ కూడా యీ ప్రత్తిని పండించేందుకు వీలున్నది.

*4. గౌరాని ప్రాంతం :* ఆదిలాబాద్, నిజామాబాద్, మెదక్ జిల్లాల్లో ప్రత్తి పండే ప్రాంతం 'గౌరాని' ప్రాంతమని పిలువబడుతున్నది. గౌరాని ప్రత్తినుంచివచ్చే నూలు సిల్కువలె సున్నితంగా ఉంటుంది. గట్టి దారం వస్తుంది. మన దేశంలో ఈ ప్రత్తికి మంచిపేరు వుంది. గౌరాని-6 అను మేలు రకం ప్రత్తిని సుమారు ఒక లక్ష ఎకరాలలో రైతులు వేస్తున్నారు. ఈ రకంకన్న మేలైనరకం కనుగొనడానికి ముథోల్ (ఆదిలాబాదు జిల్లా) ఫారంలో పరిశోధనలు సాగుతున్నాయి. పోచపొడవు, అంగుళం కన్న ఎక్కువగావుండి గట్టిదారాన్ని యిచ్చే మేలైనరకాలు రైతులకు యివ్వడానికి అవకాశాలు కనబడుతున్నాయి. ఆదిలాబాద్ జిల్లాలో ఎగువప్రాంతంలో కొండలుగల తాలూకాలలో పర్భాని అమెరికను-1 అనే అమెరికను జాతి ప్రత్తిరకం సుమారు ఒక లక్ష ఎకరాలలో సాగులోవుంది. ప్రస్తుతం L-147 అనే ఒకరకం రైతులకు యివ్వడానికి ఏర్పాటు చేయబడింది. మేలైన రకాలను కనుగొనడానికి ప్రణాళికలు యోచనలో వున్నాయి.

*5. వుమ్రాస్ :* వరంగల్, కరీంనగరు, మెదకు జిల్లాలలో ప్రత్తిపండే ప్రాంతం 'వుమ్రాస్' అని పిలువబడుతున్నది. ఈ రకంలో పోచపొడవు తక్కువ, పంట రాలుబడి ఎక్కువగల్గి, పోచపొడవు మొదలయిన వున్నత గుణాలుగల మేలైన రకాన్ని కనుగొనడానికి ప్రణాళికలు సిద్ధపరుచబడుతున్నాయి. ఇందులో పరిశోధనలు యింకా ప్రారంభించవలసి వుంది.

## నీటి వనరుల క్రింద ప్రత్తిసాగు

మన రాష్ట్రంలో తుంగభద్ర ప్రాజెక్టులో కొద్దివేల ఎకరాలలో మినహా తక్కిన ప్రత్తిపంట అంతా వర్షాధారం క్రింద సాగవుతున్నది. ఇంతకుపూర్వ చెప్పినట్టు నూటికి 98 పాళ్ల ప్రత్తి పండించే భూములు వర్షపాతంమీద ఆధారపడి వున్నాయి. ఇతర రాష్ట్రాలతో పోల్చిచూస్తే నీటి వనరుల క్రింద సాగవుతున్న పంట చాల తక్కువ. ఇందువల్ల రాష్ట్రంలో వుత్పత్తి తక్కువగా వుంది. నాగార్జునసాగర్ ప్రాజెక్టు, పోచంపాడు ప్రాజెక్టులవల్ల రాష్ట్రంలో నీటివనరుల క్రింద పంట సాగు వృద్ధి అవడానికి అవకాశాలు హెచ్చుగావున్నాయి. దీనితోపాటు ప్రాజెక్టు భూములలో ప్రత్తి పంట సాగు అధికంచేయడానికి ప్రణాళికలు సిద్ధపరచబడుతున్నాయి. ఇందువల్ల రాష్ట్రంలో ప్రత్తిపంట వుత్పత్తి ఇతోధికంగా వుంటుంది. ఇక్కడ $1\frac{1}{16}$ అంగుళాలు పోచపొడవుగల క్రొత్తరకాలు తయారుచే పండించడానికి ఏర్పాట్లు చేయబడ్డాయి.

యిట్టి పోచపొడవు గల దూదిని మన యితరదేశాలనుండి తెప్పించుకొంటున్నాం దానికి ఎంతో ఖర్చు అవుతున్నది. క్రొ రకాన్ని పండించడంవలన విదేశీ మార ద్రవ్యం బయటికి పోకుండా వుండుటేకా ప్రజల ఆదాయంకూడా పెరుగుతుంది.

*నాగార్జున సాగర్ ప్రాజెక్టు :* ఈ ప్రాజె క్రింద సుమారు మూడున్నర లక్షల ఎ రాలలో ప్రత్తిపంట సాగుచేయవచ్చ అంచనా వేయబడింది. పల్నాడు, సత్తె పల్లి, నరసరావుపేట, వినుకొండ, వంగోలు దర్శి తాలూకాలలో ప్రత్తిసాగు చేయవచ్చు అప్పుడే ఈ ప్రాంతానికి అనుగుణమైన మేలైన అమెరికను జాతి ప్రత్తి రకాన్ని కనుగొనడానికి పరిశోధనలు ప్రారంభిం బడ్డాయి. ప్రాజెక్టుక్రింద అంచనా వేయబడి మూడున్నర లక్షల ఎకరాలు సాగులో తెచ్చినప్పుడు రాష్ట్రంలో ప్రత్తి ఉత్పత్తి రెండున్నర లక్షల బేళ్ళు అధిక మవ తుంది. మనరాష్ట్రంలో ప్రత్తి వుత్పత్తి యొక్క భవిష్యత్తు నాగార్జునసాగర్ ప్రాజెక్టు మీద ఎక్కువగా ఆధారపడి వున్నది. ఈ ప్రాజెక్టులో నీటిపారుదల క్రింద ప్రత్తి త్వరితంగా సాగులోకి తేవడానికి ప్రణాళికలు గూడా యోచనలో వున్నాయి. ఇంతవరకు

| (7) వివరాలు | 741 రకం (తెల్లని ప్రత్తి) | కాకినాడ 2 రకం కొంచె ఎరుపురంగుగల ప్రత్తి |
|---|---|---|
| 1. పంట దిగుబడి ఎకరానికి పౌనులు | 688 | 598 |
| 2. దూది దిగుబడి ,, ,, | 240 | 179 |
| 3. దూది దిగుబడి శాతం | 38 | 30 |
| 4. పోచపొడవు (అంగుళాలు) | 0.91" | 0.90" |
| 5. దూది నాణ్యత (కౌంట్లు) | 30' | 25' |

జరిగిన పరిశోధనలు చాల ఆశాజనకంగా వున్నాయి. ఎకరానికి కనీసం 1000 పౌనుల ప్రత్తి పండించ వచ్చునని పరిశోధన ఫలితాలు తెలియ జేస్తున్నాయి.

*మాగాణిలో ప్రత్తిపంట*: ఒకే ఒక వరి పెద్ద పంట తీసుకొనే(ఏక్ ఫసలీ) భూములలో ప్రత్తి పండించడానికి చాలా అవకాశాలు వున్నాయి. వరిచేనుకోసిన తర్వాత మరల వరి పూడ్పులుపెట్టే మధ్యకాలంలో అనగా సుమారు నవంబరు, డిశంబరు నెలల నుండి మే, జూన్ వరకు ఈ ప్రత్తిని పండించ వచ్చు. నెల్లూరు జిల్లాలో పరికోతలు జనవరిలో జరుగుతాయి కనుక ఈ ప్రత్తిని జనవరి, ఫిబ్రవరి నెలల్లో నాటవచ్చు. పి 216 యఫ్ అనే మేలైన అమెరికన్ జాతిప్రత్తిని పండించ వచ్చు. దీనిపంట ఐదు లేక ఐదున్నర నెలలలో పూర్తి అయిపోతుంది. కనుక ఈ ప్రత్తిని పండించడానికి అనుకూలమైనది చవిటి నేలలు తప్ప వరిపండే భూములన్నిటిలోను ఈ ప్రత్తిని పండించవచ్చును. కృష్ణా, గుంటూరు, నెల్లూరు, ఉభయ గోదావరి జిల్లాలలోను ఈ ప్రత్తిని వేస్తున్నారు. ఈ ప్రత్తి పంటను ఇతోధికంగా అభివృద్ధి చేయడానికి ప్రభుత్వంవారు కృష్ణా,గుంటూరు జిల్లాలలో 'ప్యాకేజి ప్రోగ్రామ్' (సాంద్ర వ్యవసాయ పథకం)అమలు జరుపుతున్నారు. సర్కారు జిల్లాలలో కనీసం ఒక లక్ష ఎకరాలలో ఈ ప్రత్తిని పండించ వచ్చునని అంచనా వేయబడింది. అందువలన 50 వేల బేళ్ళ ప్రత్తి అధికంగా వుత్పత్తి చేయవచ్చు.

మాగాణి భూములకు అనువైనట్టి తక్కువపంట పరిమితిగల మేలైన అమెరికను జాతి ప్రత్తివంగడాలు కనుగొనడానికి పరిశోధనలు జరుపబడుతున్నవి. నెల్లూరు ప్రధాన కేంద్రంగా, గుడివాడ, రామచంద్రపురం ఉపకేంద్రాలుగా పరిశోధనలు సాగుతున్నాయి. ఎకరానికి 800-1000 పౌనుల ప్రత్తిని పండివవచ్చును.

(సీ–అయిలెండు ఆంధ్రూస్)

నాణ్యమైన వస్త్రాలు తయారు చేయడానికి శ్రేష్ఠమైన ప్రత్తి అవసరం. మన దేశంలో ఈ రకం ప్రత్తి వుత్పత్తి తక్కువ అవడంవల్ల విదేశాలనుండి సుమారు ముప్పయికోట్ల రూపాయలు వెచ్చించి ఈ రకం ప్రత్తిని ఏటేటా దిగుమతి చేసుకొంటున్నాం. దీనివల్ల ఎంతో విదేశీమారకద్రవ్యం ఖర్చవుతున్నది. దేశంలో నాణ్యమైన ప్రత్తి వుత్పత్తి హెచ్చించి స్వయంపోషకాన్ని సాధించడానికి అనేక ప్రణాళికలు ఆలోచనలో వున్నాయి. సీ–అయిలెండు అనే ప్రత్తి రకం మన దేశంలో హెచ్చుగా పండించడానికి అవకాశాలు వున్నాయి అని కనుగొనబడింది. ఈ రకం ప్రత్తి పోచపొడవు 1¼'' నుండి 1⅜'' ఉండటమేకాకుండా దీని నుండి 70 కౌంట్లు నూలు తీయవచ్చును. కేరళ, మైసూరు రాష్ట్రాలలో ఈ రకం ప్రత్తిని విరివిగా పండించడానికి ప్రయత్నాలు చేస్తున్నారు.

మన రాష్ట్రంలో కూడ ఈ రకం ప్రత్తిని పండించే అవకాశాలు కనుగొనడానికి మూడు సంవత్సరాల నుండి పరిశోధనలు సాగుతున్నాయి. ఈ ప్రత్తిపంట చాలా సున్నితమైన పంట; చాల శ్రద్ధతో పంట సాగుచేయవలసి వున్నది. ఈ పంటపై చీడపురుగులు, రోగాలు అధికం కావున శ్రద్ధగా క్రిమి సంహారక మందులు చల్లుట, సక్రమమైన ఎరువులు వేయుట, పొలంలో మురికినీరు నిలువలేకుండా చేయుట, అంతరకృషి చేయుట మొదలయిన పంట విధానాలు జాగ్రత్తతో చేయవలసి వున్నది. దానివల్ల వచ్చే లాభంకూడా హెచ్చుగా వుంటుంది. ఎకరానికి సుమారు 1000 పౌనుల ప్రత్తిని పండించవచ్చు. దీనివల్ల రైతుకు ఖర్చులు పోను ఎకరానికి సుమారు 500 రూపాయలు నికరాదాయం వచ్చే అవకాశం వుంది. కొన్నిచోట్ల ఎకరానికి 2500 పౌనుల ప్రత్తికూడా పండించబడింది. ఈ సంవత్సరం తుంగభద్ర ప్రాజెక్టు క్రింద 70 ఎకరాలలో ఈ ప్రత్తిని పండిస్తున్నారు. రాష్ట్రంలో ఈ రకం ప్రత్తిని ఇతోధికంగా పండించే అవకాశాలు వున్నాయి. దీనివల్ల రైతుకు హెచ్చులాభం రావటమేకాక దేశంలో ఈ నాణ్యమైన ప్రత్తి పంట వుత్పత్తి అధికం చేయవచ్చు. ఇందువల్ల దేశంలో ఇట్టి మేలైనరకాల దూది కొఱత తీరడమేగాక దేశసంపద కూడా వృద్ధిఅయి, ప్రజల ఉన్నతజీవన ప్రమాణానికి తోడ్పడుతుంది.

## కమ్యూనిటీ రేడియో సెట్లు

1963 అక్టోబరు నెలలో యీ క్రింది గ్రామాలలో, సంస్థలలో కమ్యూనిటీరేడియోసెట్లు నెలకొల్పడం జరిగింది.

నల్గొండ జిల్లా: పెట్టిమర్తి, గోనబోయిన పల్లి, బృందావన పురం.

హైదరాబాదు జిల్లా: పెదమంగలారం, చెంగోలి.

మెదక్ జిల్లా: లచ్చాపుట్ చేనేత సహకార సంఘం, ఇంకోడి పంచాయతీ.

నిజామాబాద్ జిల్లా: నిజామాబాదు జిల్లా సమాచార కేంద్రం.

కరీంనగర్ జిల్లా: ములకనూరు, చింతకుంట.

వరంగల్లు జిల్లా: బొల్లికుంట.

శ్రీకాకుళం జిల్లా: సొంతబొమ్మాళి.

విశాఖ జిల్లా: వేపాలం, జూతాడ, కొమరవోలు.

కృష్ణా జిల్లా: విజయవాడలో జిల్లా సమాచార కేంద్రం.

గుంటూరు జిల్లా: తారావాడి, తిమ్మయ్య పాలెం.

# తెనాలి రామలింగ, రామకృష్ణులు; ఒక్కరు కారు : ఇద్దరు

దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డి

లోగడ పాండురంగమాహాత్మ్య కావ్య పీఠికలో క్రింది జిజ్ఞాస ప్రకటింపబడినది.

'ఇన్ని సరిపడియున్నను నుద్భట చరిత్రమున రామలింగయ యని గ్రంథకర్త పేరును, పాలగుమ్మి యేలేశ్వరుఁ డని గురువు పేరును; పాండురంగ మాహాత్మ్యమున రామకృష్ణుఁ డని గ్రంథకర్త పేరును, చిక్కాచార్యులని గురుని పేరును గానవచ్చుటయు, గద్యరీతులు భిన్నములుగా నుండుటయు – రెండును నొక్కని పేళ్ళే యను సిద్ధాంతమునకుఁ గొంత బాధకములుగాఁ గానవచ్చును' అని;

క్రీ.శే. శ్రీ వేటూరు ప్రభాకరశాస్త్రిగారు మొదట జిజ్ఞాస కలిగించియు, వెంటనే 'మతము మారుట' కారణముగా చూపి 'రామలింగఁడే రామకృష్ణుఁడు' అని సిద్ధాంతము చేయుటయు, పలువు రంగీకరించుటయు జరిగినది.

అయినను, కాలభేదమునుబట్టి చూచినచో వీరి సిద్ధాంతము సంశయాత్మకమన వీలున్నది.

'రామలింగని తల్లిదండ్రులవలే నితని (రామకృష్ణుని) తల్లిదండ్రులును లక్ష్మమ రామయ నామధారులే. కావున రామలింగఁడే రామకృష్ణుఁ డనుట సంగతమగును.' అని అనుటకంటే వీ రిరువురు ఏకోదరు లనుట మేలుకద :

రామయ
–లక్ష్మమ

| రామయ– రామలింగ కవి | రామయ– రామకృష్ణ కవి |
|---|---|

ఇట్టి భిన్నవ్యక్తిత్వమును రూపుమాపుట మతభేషజము. శైవ–వైష్ణవ కావ్య గద్యరీతులకు భిన్నము.

అంతేకాదు. కాలక్రమాను గుణముగ చూచినను లింగ – కృష్ణుల నిజనామములు మారనక్కర లేదు.

| కృష్ణదేవ రాయలు | సమకాలము | రామలింగ కవి |
|---|---|---|
| 1509–30 | .. | 1515–30 |
| * | * | * |
| సదాశివదేవ రాయలు | సమకాలము | రామకృష్ణ కవి |
| 1542–74 | .. | 1546–74 |

క్రీ. శ. 1530–42 మధ్య కాలములో అచ్యుతదేవరాయల కాలములో రామకృష్ణ కవి విద్యార్థి దశను గుర్తింప వీలున్నది. కావున, మత వాదులు సిద్ధాంతీకరించినట్లు శ్రీకృష్ణదేవరాయల సభలో ప్రౌఢకవి రామలింగనికి ప్రవేశమున్నను, బాలకవి రామకృష్ణునికి ప్రవేశము లేదనుట కాలక్రమము.

ఏకోదరులగు రామలింగ–రామకృష్ణుల జనన కాలముల మధ్య వ్యవధి 10–12 సంవత్సరములు కలవనుట కాక్షేపము లేదు. కొన్ని వంశములలో అన్నకు – తమ్మునికి మధ్య 20 సంవత్సరముల పుట్టుక వ్యవధి కనబడుచున్నది. అందుచేత సోదరు లిద్దరు ఏకోదరు లనుట భిన్నవ్యక్తిత్వ లక్షణము.

కృష్ణదేవరాయలు క్రీ. శ. 1515 లో కొండవీటిని జయించిన పిమ్మట దుర్గాధిపతిగా నాదేండ్ల గోపమంత్రి నియుక్తుడయ్యెను. గోపన్న కార్యకర్త దేశమంత్రికి క్రీ. శ. 1520 ప్రాంతములో ఉద్భటారాధ్య చరిత్ర రచించి, అంకితమిచ్చి నందున రామయ రామలింగ కవి క్రీ. శ. 16 శతాబ్ది ప్రథమ పాదమునాటి కావ్యకర్త యగును.

ఇక రామకృష్ణ కవి కావ్యరచన యెప్పటిదో తెలిసికోవలసియున్నది. అందుకు క్రింది గ్రంథాంతరంగిక కావ్య ప్రశంస ప్రధాన సాధనమగుచున్నది.

గిరికాను షక్త బుద్ధిను
పరిచరునింబోలే.
..................
గురు భీతమతికి నాముక్త
మాల్యదకు నేన యగుచున్.

— (పాండు. 4–242,243)

వసుచరిత్ర కథపేరును, ఆముక్తమాల్యద కథ పేరును శబ్దశక్తి ధ్వనిగా పాండురంగ

కథలో రామకృష్ణకవి వ్యంజకము చేయుట క్రీ. శ. 16 శతాబ్ది సమకాల చరిత్ర.

సుప్రసిద్ధ చారిత్రకు లీ పద్యరచనా కాలము నిట్లు తీర్మానించిరి.

'ఇందువల్ల రామరాజ భూషణుని (అతి శబ్దశ్లేష వాగాడంబర) కవిత్వముపై రామ కృష్ణునకుఁ గల యభిమానము తెలియుట యట్లుండ, వసుచరిత్ర పాండురంగ మాహాత్మ్యమునకుఁ బూర్వము రచియింపఁ బడెనని విశదమగుచున్నది.

* * *

'వసుచరిత్ర పీఠికయందు కర్ణాట రాజ్య పునరుద్ధరణమును, దిరుమలరాజ పట్టాభి షేకమును వర్ణింపఁబడి యుండుటచేతను, మఱియు నతఁడు రాజ్యపాలన ౧౧ మాసములే చేయుటచేతను, క్రీ. శ. ౧౫౭౦ వ సంవత్సరముననే వసుచరిత్ర రచియింపఁబడె నని తలంచి (ఇదివరలో) యట్లు వ్రాసితిని. కాని క్రీ. శ. ౧౫౭౦ వ సంవత్సరము వసుచరిత్ర రచనాకాలమనుట కంటే తత్కృతి సమర్పణ కాలమని చెప్పుటయే యుచితముగఁ దోచుచున్నది. అట్టి నవరసభాసురం బగు శ్లేషకావ్యమును అల్పకాలమున రచించుటకు సాధ్యము కాదు. అను;

— (భారతి, 18/3-1941)

డాక్టర్ శ్రీ నేలటూరి వేంకటరమణయ్యా గారి కాలనిర్ణయమే అన్నిటికి సరిపడు సిద్ధాంత మన వీలున్నది. దీనిని వెనుకకు మార్చకూడదు.

'శాలివాహన శవరుషంబులు ౧౪౬౫ అగు నేటి శోభకృతునామ సంవత్సర భాద్రపద శుద్ధ ౨ సోమవారము నాడు కాశ్యప గోత్రం — గురవయదేవ చోడ మహారాజులుం గారు తుంగభద్రా తీరమందు విరూపాక్ష దేవుని సన్నిధిని శ్రీరంగరాజు రామరాజు మూలాన శ్రీ సదాశివరాయలచేత రెండు తామ్రశాసనాలు పుచ్చుకొని—అనిమెల సంగమేశ్వర దేవునికి — అనే దేవు ళ్ళు యిద్దరున్ను పెద సంగరాజు పింన సంగరాజు —అనే తొమ్మంద్రు కుమారులు సమీపస్తు లయి వుండగాను — శివరాత్రి పుణ్యకాల మందు — యిచ్చిన గ్రామాలు ' అని.

— (భారతి, 18/2-1941)

ఇందలి గురవరాజు పెద్ద కుమారుడు పెదసంగరాజువద్ద విరూరి వేదాద్రి వ్రాయసకాడై యుండగా తెనాలి రామకృష్ణ కవి పాండురంగ మాహాత్మ్యము రచించి, ఆ మంత్రి కంకిత మిచ్చినట్లు కావ్యావతారిక చెప్పుచున్నది. కాబట్టి, క్రీ. శ. 1542-74 మధ్య కాలములో; సదాశివరాయల కాలాన పెద సంగరాజు – మంత్రి విరూరి వేదాద్రి— కావ్యకర్త రామకృష్ణకవియూ సమ కాలికులై, పాకనాటి నివాసులై సారస్వత సేవ చేసినట్లు లోకల్ రికార్డు చిత్తుశాసనములు దృఢపరచుచున్నవి.

అన్న పెదసంగరాజు దానశాసనములు చిక్కకపోయినను, తమ్ముడు పిన్న సంగరాజు క్రీ. శ. 1546-79 మధ్య కాలములో కడప – పాకనాటిని పరిపాలించి నట్లు పొత్తపి శాసనమును, బుక్కాయపల్లె శాసనమును చెప్పుచున్నవి. కావున, అన్న దమ్ములు పెద సంగరాజు—పిన్న సంగరాజు క్రీ. శ. 16 శతాబ్ది మూడవ పాదమున సమ కాలికు లనుట నిర్వివాదము. కడప పాకనాటి చోడ రాజవంశ పట్టిక క్రింద చూపబడినది.*

క్రీ. శ. 1544 నాటి తిరుపతి శాసనములో 'కందాడై అప్పయ్యంగారు' ప్రసాద గ్రహీతలం దొక్కరుగా పేర్కొనియుండుట చేత, ఆ కందాళ అప్పలాచార్యులే పాండురంగ కృతిపతి విరూరి వేదాద్రి మంత్రికి గురువని చారిత్రకులు గుర్తించుట జరిగినది.

కృతిపతి గురువునకు సమకాలికు డగు భట్టరు చిక్కాచార్యులు కృతికర్తకు గురు వగుటచేత క్రీ. శ. 1544 ప్రాంతమున కలడనుట సమకాలికచరిత్ర. శాసనాధారము చిక్కలేదు. చిక్కకపోయినను, క్రీ. శ. 1546-79 మధ్యకాలమందలి పిన్న సంగరాజు శాసనకాలముతో అన్న పెదసంగరాజు సమకాలమును, అన్న - మంత్రి: విరూరి వేదాద్రి సమకాలమును, మంత్రి – కవి; తెనాలి రామకృష్ణుని సమ కాలమును, వైష్ణవ గురువుల సమకాల



మును గుర్తించి నిర్ణయించుటలో చారిత్రక కాలదోషము లేదనిపించుచున్నది.

వెనుక వివరించినట్లు పాండురంగ మాహాత్మ్య కథలో పోలికగా గిరికానుషక్త బుద్ధిని, ఆముక్తమాల్యదామతిని పేర్కొనుట చేత క్రీ. శ. 1570–71 మధ్య కాలమందలి వసుచరిత్ర – అంకితము తరువాతనే రామకృష్ణకవి పాండురంగ మాహాత్మ్యము రచించి, విరూరి వేదాద్రి మంత్రి కంకిత మిచ్చినట్లు స్పష్ట మగుచున్నది.

కాగా, 'రామకృష్ణుఁ డప్పటికి ప్రఖ్యాత కవియై తన పాండురంగ మాహాత్మ్యమును క్రీ. శ. 1543 వ సం, ప్రాంతమున నుండిన మంగయ గురవరాజు తొమ్మండుగురు పుత్రులలో జేష్ఠుఁడగు పెదసంగ భూపాలుని వ్రాయసకాఁడైన విరూరి వేదాద్రి కంకిత మొసఁగె ననుట యసంగతము గాఁజాలదు' (కాని)

* * *

తత్కారణముననే క్రీ. శ. 1535–40 సం. ల ప్రాంతమున రచించిన పాండురంగ మాహాత్మ్యమున 'గిరికా ఉపరిచర వసువుల (వసుచరిత్ర) వృత్తాంతమును రామకృష్ణుఁడు ప్రస్తావించగల్గెను'

— (భారతి, 18/3–1941)

అని, డాక్టరు శ్రీ నేలటూరు వేంకటరమణయ్య గారు తీర్మానించుట – ఒక్క తరము కూడ దీయుటకేమో తెలియదు.

తెనాలి రామలింగకవి క్రీ. శ. 1516 నుండి 1574 వరకు రామకృష్ణుడై దీర్ఘకాలము ప్రౌఢకవి జీవితము గడపె ననుట కంటే క్రీ. శ. 1520 నుండి 1540 వరకు కావ్య రచన కావించె ననుట శ్రేష్ఠ మని రచనా కాలము వెనుకకు నెట్టినట్లున్నది అన్న దమ్ముల కాలము అన్నకే సర్దవలసి వచ్చుట చేత ఒక్కతరము కాలదోష మేర్పడినది.

రామలింగ కవి– 1515–30

రామకృష్ణ కవి– 1546–74

ఇట్లు సోదర కవులు నిజనామధారులై శైవ–వైష్ణవ (పురాణ) కావ్య రచనలు కావించిరనుట తెనాలివంశ కాలక్రమము, మధ్యకాలము 16 యేండ్లు రామకృష్ణుని విద్యాభ్యాస వ్యవధి క్రింద లెక్కింప వీలున్నది. అచ్యుతదేవరాయల కాలము 12 యేండ్లు అన్నదమ్ముల మధ్యకాలమనిపించు చున్నది.

తెనాలి సోదరకవుల వ్యక్తిత్వము రూపుమాపిన భట్టుసోదరకవుల వ్యక్తిత్వముకూడ రూపుమాపబడినది.

కవివంశ సంబంధము స్పష్టముగా కావ్యములలో చెప్పకపోవుటచేతనే అనేక వాదోపవాదములు పెరిగినవి.*

ఆంధ్రప్రభ (1963) దీపావళి ప్రత్యేక సంచికలో శ్రీ మాదిరాజు కుమార స్వామి గారు శ్రీ కాళహస్తి శైవక్షేత్ర మందున్న తెనాలి రామకృష్ణుని మంటపం – ఫోటో ప్రకటించుటచేత ఆతడు శైవమతమును విడనాడి వైష్ణవ నామధారి యయ్యె ననుట కాధారము లేదు. శైవక్షేత్రమండపముపై రామకృష్ణుని పేరు చెక్కబడి యున్నదో, లేక – వాడుకనుబట్టి మండపమున కా పేరు కలిగినదో తిరుపతి ఫొటోగ్రాఫర్‌గారు స్పష్టముగా చెప్పలేదు. చారిత్రకులా మండప నిర్మాణ చరిత్రను పరిశోధించి ప్రకటించు టావశ్యకము.

ఎట్లయినను, 'ఇన్ని సరిపడియున్నను– గద్యరీతులు భిన్నములుగా నుండుటయు – రెండును నొక్కని పేళ్ళే యను సిద్ధాంత మునకుఁ 'గొంత' బాధకముగాఁ గాన వచ్చును' అను;

క్రీ. శే. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి జిజ్ఞాస ప్రశంసాపాత్ర మైనది.

భట్టుమూర్తి – రామరాజభూషణులు (జ్ఞాతి) సోదరులైనట్లే : రామలింగ–రామకృష్ణులు ఏకోదర సోదరు లనుట కవివంశ సమకాల సాదృశ్య చరిత్ర.

*తెనాలి కవివంశము




ప్రబంధాంక కవివంశము



# పారిశ్రామిక విశేషాలు

## కేంద్రరంగం

భారీవిద్యుత్పరికరాలు సింథటిక్ డ్రగ్స్ ప్రాజెక్టుల ఫ్యాక్టరీ భవనాలు, ఇండ్ల నిర్మాణాలు శీఘ్రగతిని సాగుతున్నవి.

హిందుస్తాన్ యంత్రపరికరాల సంస్థ వారు సనత్‌నగర్‌లో తమ అయిదవ యూనిటును నెలకొల్పుతున్నారు. ఫ్యాక్టరీకి అవసరమైన స్థలాన్ని సేకరించడం జరుగుతున్నది. ప్రారంభపనులను కంపెనీ బహుశా ఈ సంవత్సరంలోనే చేపట్టుతుంది. భారత ప్రభుత్వం హైద్రాబాదులో నెలకొల్పే ఎలక్ట్రానిక్స్ ఫ్యాక్టరీ ప్రారంభ ఏర్పాట్లు కూడా జరుగుతున్నాయి.

## ప్రైవేటు రంగం

మాంగనీస్ మెటల్ మాంగనీస్ డయాక్సైడ్ల ఉత్పత్తి కొరకు విశాఖపట్నం జిల్లాలో రెండు యంత్రాగారాలను నెలకొల్పేందుకు భారత ప్రభుత్వం మెసర్స్ ఫెరాయ్ అల్లాయ్ కార్పొరేషన్ (లిమిటెడ్), మెసర్స్ ఏ. వి. స్వామి అండ్ కంపెనీలకు లైసెన్సులు ఇచ్చింది.

ఎగుమతుల అభివృద్ధి కార్యక్రమం క్రింద 500 ఆటోమేటిక్ మగ్గాలను నెలకొల్పుకోవడానికి భారత ప్రభుత్వం మెసర్స్ సర్వారాయ టెక్స్‌టైల్స్ (కాకినాడ)కు అనుమతి ఇచ్చింది. ఈ కార్యక్రమాన్ననుసరించి అయిదు సంవత్సరాలవరకు 75 శాతం ఉత్పత్తి ఎగుమతి నిమిత్తం ప్రత్యేకించబడుతుంది.

మెసర్స్ ఆంధ్ర ఫౌండ్రీ, మెషిన్ కంపెనీ (లిమిటెడ్)కి ఏటా రూ. 12 లక్షలు విలువచేసే రబ్బరు సంబంధమైన సాధన సామగ్రిని సికింద్రాబాదులోని ఈ కంపెనీ శాలూకు ప్రస్తుత సంస్థలో ఉత్పత్తి చేసేందుకు లైసెన్సు మంజూరైంది.

లైసెన్సు ఇచ్చినదానికంటే 7½ శాతం మేరకు కదుళ్ళ సంఖ్యను పెచ్చించుకోడానికి అనుమతి ఇవ్వబడుతుందని భారత ప్రభుత్వ టెక్స్‌టైల్ కమీషనరు నూలుమిల్లులన్నింటికీ తెలియజేశారు.

## సింగరేణి కాలరీస్

బెల్లంపల్లి కాలరీస్ డిప్యూటీ జనరల్ మేనేజరు. 1963 సెప్టెంబరు 20 వ తేదీన బెల్లంపల్లి రైలుస్టేషను సమీపంలోని సోమగూడెంలోనూ, ఆదిలాబాదుజిల్లా రామకృష్ణాపురం డివిజనులలోనూ సోమగూడెం నెం. 3 గనినీ. రవీంద్రగని (నెం. 4)నీ ప్రారంభించారు.

1965-66 వ సంవత్సరాంతానికి సాధించదలచిన 6.1 మిలియన్ టన్నుల బొగ్గు ఉత్పత్తి లక్ష్యాన్ని చేరుకోవడంలో ఈ కొత్తగనులు తోడ్పడతాయని డిప్యూటీ జనరల్ మేనేజరు అన్నారు.

కొత్తగూడెం కాలరీస్ రుద్రంపూర్ డివిజనులో వెంకటేశ గని (నెం. 7) వద్ద త్రవ్వకం పనులకు మద్రాసు గవర్నరు శ్రీ విష్ణురామ్‌మేధి 1963 అక్టోబరు 28 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు. తృతీయ ప్రణాళికా లక్ష్యాలను సాధించేందుకై బొగ్గు ఉత్పత్తిని పెంపొందించడానికి సింగరేణి కాలరీస్ మేనేజిమెంటు వెంకటేశ గని (నెం. 7) వద్ద, 6 వ నెంబరు గనివద్ద లోతున త్రవ్వకాలు చేపట్టింది. ఈ రెండింటికి రూ. 30 లక్షలు ఖర్చవుతుందని అంచనా. గని సొరంగం, ఉపరితలం నుంచి 850 అడుగుల లోతువుండి లోపల 20 అడుగుల వ్యాసం కలిగివుంటుంది. 16 నెలలలో వీటి పనులు పూర్తవుతాయి. ఈ త్రవ్వకాలు జరపడానికి, హంగరీకి చెందిన మెసర్స్ నికెక్స్ ట్రేడింగ్ కంపెనీ (బుడాపెస్ట్ వారు) మెసర్స్ ఖేమ్‌చంద్ రాజ్‌కుమార్ అనే సంస్థతో కలిసి సింగరేణి కాలరీస్‌లో ఒప్పందం కుదుర్చుకున్నారు. త్రవ్వకాలు, యంత్రాల స్థాపన పనులలో 20 మంది హంగరీ నిపుణులు నిమగ్నమై వున్నారు. చాలా లోతున గనులు త్రవ్వకం సాగించడంలో ఈ సొరంగాలు తోడ్పడతాయి.

శ్రీ విష్ణురామ్ మేధికి తొలుత సింగరేణి కాలరీస్ మేనేజింగ్ డైరెక్టరు, ఆదనపు జనరల్ మేనేజరు, డిప్యూటీ జనరల్ మేనేజరు, హంగరీ బృందం నాయకుడు శ్రీకొవక్స్, మెసర్స్ ఖేమ్‌చంద్ రాజ్‌కుమార్ సంస్థ ప్రతినిధి శ్రీ మిత్తల్ స్వాగతం చెప్పారు. అయిదవ నెంబరు గనిలో గవర్నరు త్రవ్వకపు పనులను చూశారు. బొగ్గుస్క్రీనింగ్‌యంత్రాన్ని, కార్మికుల కాలనీని కూడా ఆయన సందర్శించారు.

సింగరేణి కాలరీస్ గనులలో 1963 సెప్టెంబరులో 290,097.9 టన్నుల బొగ్గును త్రవ్వితీశారు. గత సంవత్సరం ఇదే కాలంలో 278,806.1 టన్నుల బొగ్గును తీయడం జరిగింది.

1963 సెప్టెంబరు నెలాఖరు నాటికి 2,419,494.3 టన్నుల బొగ్గు వీటిలో లభించింది. కాగా గత సంవత్సరం ఇదే కాలంలో 2,250,153.9 టన్నుల బొగ్గు లభించింది. (తరువాయి 82 వ పేజీలో)

# 'రణభేరి'

విఖ్యాతాంధ్రకవులు

జాతీయైక్యత, రక్షణోద్యమ సందేశాలతో రచించిన ఉత్తేజకరమైన

గేయముల రెండవ సంపుటి:

**వెల 00-25 న. పై.**

ఇతర ప్రచురణలు :

| | | |
|---|---|---|
| శంఖారావం : (గేయాలు) | 0-25 | న. పై. |
| కనువిప్పు : (బుర్రకథ) | 0-25 | ,, |
| చైనా ద్రోహం : వీరభారత్ (బుర్రకథలు) | 0-25 | ,, |
| పాంచజన్యం : (బుర్రకథ) | 0-25 | ,, |
| అల్లూరి సీతారామరాజు చరిత్ర | రూ. 2-75 | ,, |
| వందేమాతరం : ( నాటిక ) | రూ. 1-00 | |
| అగ్గిగుండెలు - మరి రెండు నాటికలు | రూ. 1-00 | |


ప్రచురణకర్తలు :

సమాచార ప్రజాసంబంధాలశాఖ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

హైదరాబాద్




జగ్గూను చూచి ఆగిపోయాను

మాట్లాడించాలని అనుకుంటూ వుండగానే అతడే అడిగాడు "ఏమండీ బాబుగారూ! బావున్నారా" అని

"బాగానే వున్నాను" అని అన్నాను తలూపుతూ

'ఇవ్వాళ బడికి వెళ్ళలేదా?" బీడీ వెలిగించుకుంటూ అడిగాడు జగ్గూ।

"నిన్నంతా ఆటల్లో వుండిపోయాను హోంవర్కు అలాగే వుండిపోయింది అందుకని "

నామాట పూర్తికాకమునుపే అందుకొని—

"అయితే మాస్టారంటే మీ క్కూడ భయమే నన్నమాట –" అని అన్నాడు

"భయ మేమరి।"

జగ్గూ మరొక బీడీ వెలిగించి రెండు

సింధీ కథ

మూలం

లాల్ పుష్ప

అనువాదం

చెరుకుమల్లి వెంకటనర్సయ్యా

దమ్ములు లాగి — 'ఈ కాలం మాష్టర్లు మా కాలం మాష్టర్లకంటే మెరుగే" అనిఅన్నాడు

"కావచ్చు."

"మా రోజుల్లో గంటలకొలది ఎండలో నిలబెట్టేవారు గోడకుర్చీ వేయించేవారు ఇక వీపుమీద నిత్యం బెత్తం నాట్యం చేస్తూం

అనువాదభారతి

డేది దానితో నాకుమాష్టర్లన్నా,పుస్తకాలన్నా ఎక్కడ లేని కంటగింపు కలిగింది మాష్టారంటే నాకు చెప్పనలవిగాని భయం వేసి — నేనేంచేసేవాడనో మీకు తెలుసా।"

"చెప్పు, ఏం చేసేవాడవో "

"నవలరాయ్‌గారి తులసిగాడు లేడూ, వాడితో పారిపోయి, దొంగతనంగా, జ్ఞానచందుగారి తోటలో దూరేవాణ్ణి అక్కడ చెట్టెక్కి మామిడికాయలు కోసుకొనితింటూ కాలక్షేపం చేసేవాళ్ళం ఆ రోజులేవేరు। అవి తిరిగి రమ్మంటేమాత్రం ఇప్పుడొస్తాయా?''

ఆ మాటలకు నేను నవ్వాను

''మా రోజుల్లో ఇంతటి దయార్ద్రహృదయంగల మాష్టర్లుండేవారు కాదు నిజం చెబుతున్నాను — అప్పుడే గనుక ఇటువంటి మాష్టర్లుంటే నాకు ఈ రోజు టీ అమ్ముకునేస్థితి పట్టేదే కాదు పెద్దడాక్టరునయ్యే వాణ్ణేమో।"

నాకు నవ్వుఆగిందికాదు గట్టిగానవ్వాను.

నాతో జగ్గూకూడా నవ్వాడు మరుక్షణం అతని మొహంమీద విషాదం వ్యాపించిపోయింది ఇంతక్రితం అతని మొహంమీద కనిపించిన నవ్వు ఆతనిది కాదేమో ననిపించింది నాకు।

కొంచెంసేపు జగ్గూ మాట్లాడలేదు

మరొక బీడీ వెలిగించి దమ్ము లాగుతున్నాడు

జగ్గూ బీడీ త్రాగుతాడని నాకిదివరకే తెలుసు, కాని ఇంత ఎక్కువగా త్రాగుతాడని తెలియదు నేను ఉండబట్టలేక పోయాను

"ఏమయ్యా! నువ్వు బీడీలు ఆదేపనిగా త్రాగుతున్నావేమిటి?"

''ఏదోమరి మనసులోని బాధను మరచిపోవడానికి ఏదో ఒకటి చేయాలిగా" అని అన్నాడు జగ్గూ బాధగా।

"ఏం జరిగింది జగ్గూ ?" అని ఆతురతగా అడగకుండా ఉండలేక పోయాను తిరిగి.

"ఇవ్వాళ నా ఆడదాన్ని చావుదెబ్బలు కొట్టాను బాబూ."

"ఎందుకు."

"తలంతా దిమ్ముగా, నొప్పిగా వుంది. కాస్త తలపట్టవే" అని మర్యాదగా అడిగాను బాబూ ! "ఇంట్లో బండెడు చాకిరీచేసి అలసి పోయాను. విశ్రాంతి తీసికోవాలి నేను" అంటూ కసిరింది ఒక్కసారి. నాకు మహా కోపం వచ్చేసింది. రోజంతా రెక్కలు విరుచుకునే నేను, దానితో తల పట్టించుకొనే పాటి అధికారం లేదా ?'' అన్నాడు ఆవేశంగా.

నేనేమీ మాట్లాడలేదు. జగ్గూ నా దగ్గర ప్రతి విషయం దాచకుండా చెప్పేస్తాడు నిష్కపటంగా. మా ఇద్దరి మధ్య ఇంతలో ఈ ఆప్యాయత, సామీప్యత ఎలా వచ్చిందో తెలియదు.

"బాబుగారూ ! దాన్ని నేను ఎంతగానో ప్రేమిస్తున్నాను. అదంటే పడి చస్తాను. కాని నేను దాని తియ్యని మాటలు వింటానికి ఒక్క సారయినా నోచుకోలేదు ఇంత వరకు. మీరు చూస్తూనే వున్నారు. నేను బనియను తప్ప మరొకటి వేసుకోను. దానికి మాత్రం రంగు రంగుల చీరలు, రవికలూ తెస్తూనే వున్నాను. నాకు మట్టుకు నేను ఒక్క రోజయినా వంటికి సబ్బు పెట్టుకొని స్నానం చేసిన పాపాన పోలేదు. కాని దానికి మాత్రం సబ్బులు తెస్తూనే వుంటాను. అయినా నన్ను అది ప్రేమగా చూడనే చూడదు. కారణం ఏమిటో నాకు తెలియటం లేదు." అని అన్నాడు బాధగా.

నాకు ఏం సమాధానం చెప్పాలో తోచింది కాదు. జగ్గూ కంఠం గద్గదమైంది. మళ్ళీ చెప్పుకోసాగాడు తన బాధనంతా. "ఈ ఊరు విడిచి దూరంగా ఎక్కడికైనా వెళ్ళి పోదామనిపిస్తుంది నా మనసుకి అప్పుడప్పుడు. జీవితం మీద వున్న ఆశ చావనీయడంలేదు. మీరే చెప్పండి బాబూ ! మానవుడు కష్టాలను ఎదుర్కొంటూ కూడా, జీవితంమీది ఆశ అతన్ని ఎందుకు విడిచి పెట్టదు ? ఇలాఎందుకుజరుగుతుందిబాబూ?"

నేనేమీ జవాబు చెప్పలేకపోయాను. తరువాత జగ్గూ తన దారిన తాను వెళ్ళి పోయాడు విచారంగా.

జగ్గూ నాతో నేగాక అందరితోనూ అలాగే ప్రేమగా వుంటాడు. అతడు కవి కాదు, కథారచయిత అంతకంటే కాదు. అయినా అతడు ఎదుటివారి బాధలు అర్థం చేసుకొని వాటితో పాలు పంచుకోవటానికి ప్రయత్నిస్తాడు. అప్పుడప్పుడు నేను అతన్ని గురించి తీవ్రంగా ఆలోచిస్తాను. అతడొక సత్తెకాలపు సత్తెయ్యలాంటి అమాయకుడు. అతని నోటివెంట పచ్చిబూతులు రావడం కూడా కద్దు. అతని ముఖమెంత మసిలా వుంటుందో, మనసంత స్వచ్ఛంగా వుంటుంది. మసాలాకిళ్ళీ తినటం, పుగాకు నమలటం, బీడీకట్టలు తగలెయ్యటం అతనికున్న పాడుఅలవాట్లు. ఘాటైన భంగు, తేనీరంటే చెవి కోసుకుంటాడు. సారాయి అలవాటయితే లేదు కాని, పండుగదినాల్లో దాన్ని కూడా విడిచిపెట్టేవాడు కాదు. ఏది ఎలాగున్నా అతడు మట్టిలోనుంచయినా మాణిక్యాలు సంపాదించే నేర్పరి. అతడెప్పుడు ఇతరుల జోలికి పోవటం చూడలేదు. టీ అమ్మేవాడు. "ఐస్‌క్రీమ్" అమ్మేవాడు, అరటిపళ్ళు అమ్ముతాడు. ఒక వృత్తి కాదు రకరకాల వృత్తులు అతడు అవలంబిస్తాడు.

"టీ" కెటిల్‌తీసుకొని "హవాయిజహాజ్" హోటల్ ముందర తిష్ఠ వేస్తాడు. అతను అమ్మే "టీ" — కప్పు ఖరీదు రెండుపైసలు మాత్రమే ! సాధారణంగా హోటళ్ళలో మనం త్రాగే "టీ" కి ఏ మాత్రం తీసిపోదు అతని టీ ! "హవాయిజహాజ్" హోటల్ దివాలాతీసే పరిస్థితికి వచ్చింది. హోటల్ యజమానికి జగ్గూ అంటే ఎక్కడలేని మంట. ఒకసారి జగ్గూను అతను "మా హోటల్‌కు ఎదురుగా ఎందుకు కూర్చున్నావ" వని అన్నాడట ! "ఇది సర్కారు వారి స్థలం, నీదేమీ కాదు" అని అన్నాడట ! దానితో హోటల్ యజమాని దిగివచ్చి — జగ్గూ చేతిలో రూపాయి పెట్టాడు. ఆ రూపాయి తీసుకొనికూడా జగ్గూ అలాగే ఆ హోటల్ ముందు కూర్చొనేవాడు.

జగ్గూ రోజుకు నాలుగుగంటలు పనిచేసేవాడు. తక్కిన సమయమంతా అతగాడి మిత్రుడు "రూమన్" గదిలో గడిపేవాడు. అక్కడ అతను ఏవో గాలిమేడలు కట్టుకుంటూ కూర్చునేవాడట !

నేను కన్పిస్తేచాలు "ఏముందీబాబుగారూ ! బాగున్నారా !'' అని ఎంతో ఆప్యాయంగా పలకరించేవాడు !

"బాబుగారూ ! నాకు మంచి అలవాట్లు లేకపోవచ్చు. అంతమాత్రానికే నా భార్య నన్ను ఈసడించుకుంటే ఎలాగండీ ? మగవాడన్నతరువాత ఏవో దురలవాట్లు వుంటాయి. ఆడది చెప్పి ఒక మార్గానికి తీసుకరావాలిగాని ఆలా చీదరించుకుంటే ఎలాగండీ ?'' అని అన్నాడు.

ఈ విషయాల్లో నా కట్టే అనుభవం లేక పోవటం వల్ల విని ఊరుకున్నాను. ఏమీ మాట్లాడలేదు.

* * *

మరొకరోజు కన్పించాడు. మనిషి చాలా విచారంగా ఉన్నాడు.

"ఏం బాగున్నావా ?" అన్నాను నేను.

"ఏదో వున్నాలెండి" అని అంటూ "ఇప్పుడు నా మకాం రూమన్‌గాడి గదిలోనే" అని అన్నాడు.

"ఏం ? ఎందుకని ?"

"అంతే ! చేసుకున్న ఆడది ప్రేమించక పోతే ఏం చేయమంటారు ?"

"ఓర్పు వహించాలి జగ్గూ" అన్నాను, ఏదో అనుభవజ్ఞుడిలాగా !

"నాకు జీవితం మీద విరక్తి పుట్టింది బాబూ !"

"పెళ్ళాన్ని ఒంటరిగా వదలి నువ్వు వేరే వుండటం ఏంబాగుంది చెప్పు ?"

"అది పుట్టింటికి వెళ్ళిపోయిందండిబాబు గారూ !"

ఇక నే నేమీ మాట్లాడ లేదు.

ఆ తరువాత చాలా రోజులవరకు మరల జగ్గూ కనిపించలేదు. ఈ లోపల నేను రక రకాల కష్టాలకు లోనయ్యాను. మా నాన్న చనిపోయారు. కుటుంబ పోషణ భారం నామీదే పడింది. ఎలాగో మెట్రిక్ ప్యాసై నాను. ఉద్యోగం కోసం ఎంతో ప్రయత్నించాను. కాని ఎక్కడా దొరకలేదు. చివరకు ఎవరో కన్పించి ఢిల్లీలో ఓ ప్రైవేటు కంపెనీలో ఉద్యోగం వున్నది, యిప్పిస్తామన్నారు. వారంరోజుల్లో వచ్చి చేరమన్నారు. కాని ఢిల్లీ వెళ్ళటానికి నా దగ్గర డబ్బు లేకపోయింది.

చాలామందిని అడిగాను. ఎవ్వరూ ఇవ్వ లేదు. బంధువు లనుకున్న వాళ్ళూ–నా పరిస్థితిని బాగా ఎరిగినవాళ్ళు కూడా కష్టదశలో నన్ను ఆదుకోలేదు. ఏమీ తోచక బజార్లు పట్టుకొని తిరిగాను, ఎవరైనా కనిపిస్తారేమో నని. జగ్గూ కనిపించాడు. చూచి నవ్వాడు. నేను నవ్వలేకపోయాను. నా బాధని గమనించి నట్టున్నాడు.

"ఏమండీ బాబుగారూ ! ఏమిటి అలా వున్నారు ?" అని అడిగాడు ఆదుర్దాగా !

నేను అతనివైపు పరీక్షగా చూశాను. మనిషి బాగా చిక్కి శల్యమై, ఎముకల గూడులా కనిపించాడు. కళ్ళు బాగా లోనికి పీక్కుపోయాయి. అతని పైన నాకు జాలి వేసింది. కాని నా సంగతి చెప్పక తప్ప లేదు. ఎందుకో ఒక్కసారి నవ్వాడు.

"ఇక్కడే నిల్చోండి బాబూ ! ఇప్పుడే వస్తా !" అని పరుగెత్తుకుంటూ అతని స్నేహితుడి గదికి వెళ్ళాడు. పది హేను నిమిషాలలో ఐదు పదిరూపాయల నోట్లు నా చేతికందిస్తూ "తీసుకోండి బాబూ, ఈ డబ్బు ! ఢిల్లీ వెళ్ళి లక్షణంగా ఉద్యోగం చేసుకోండి" అని గోముగా అన్నాడు. నా సంతోషానికి మేర లేకపోయింది. ఒక మామూలు మానవుడి అంతర్యంలో దాగి వున్న అద్భుతమైన ఉదాత్తభావానికి చకితుడ నయ్యాను.

ఏదో బెట్టుకు "ఎందుకులే" అన్నాను. అందుకు జగ్గూ "నా మనసును మీరు కష్ట పెట్టకండి. జీవితంలో "నా" అనుకునే అధికారం సంపాదించుకో నివ్వండి...... డబ్బు దేముంది బాబూ ! ఇవ్వాళ వస్తది. రేపు పోతది. మిగిలి వుండేది మంచితనం ఒక్కటే!" అని అన్నాడు.

నేను కాదనలేక పోయాను. అతని మనసులోని ఆవేదన నాకు అర్థమైంది. జీవితంలో ఏ వ్యక్తీ ఒంటరిగా తనకు తానుగా జీవించ లేడని, మరో వ్యక్తితో తాదాత్మ్యతను ఏర్పఱచుకోవటానికి, సాన్నిహిత్యాన్ని పొందటానికి, శతవిధాలా ప్రయత్నిస్తాడని అనుకున్నాను.

నాకు ఢిల్లీలో దొరికిన ఉద్యోగం మంచిది కావడం వలన – అక్కడే ఆగిపోయాను. ఆరుమాసాల తరువాత శలవు తీసుకొని బొంబాయి వచ్చాను, అందర్నీ ఒకసారి చూసి వెడదామని. వచ్చీ రావడం తోనే జగ్గూను కలుసుకొని సమయానికి ఆదుకొన్నందుకుగాను, కృతజ్ఞత తెలుపుకొని ఆ డబ్బు తిరిగి ఇచ్చివేద్దామని, అతని మంచి చెడ్డలు తెలుసుకుందామని – అనుకున్నాను.

జగ్గూ స్నేహితుడి గదికి వెళ్ళాను. జగ్గూ కనిపించలేదు. అతని స్నేహితుణ్ణి "జగ్గూ ఎక్కడికి కెళ్లాడు ?" అని ప్రశ్నించాను.

నా ప్రశ్నకు అతడు వెంటనే సమాధానం చెప్పలేదు. నా కెందుకో అనుమానం వేసింది.

"జగ్గూ ఎక్కడికి కెళ్ళాడు ?" అని మరల ప్రశ్నించాను.

తల పైకెత్తి ఆకాశంవైపు చూపించాడు.

నా కళ్ళవెంట బొటబొట కన్నీళ్ళు కారాయి. మేఘాలు సూర్యుణ్ణి అడ్డుకోలేక పోయినాయి. వాటి దారిన అవి వెళ్ళిపోయినాయి.



(78 వ పేజీ తరువాయి)

## నిజాం చక్కెర ఫ్యాక్టరీ

1963–64 చెరకు ఆటకాలన్ని ఫ్యాక్టరీ మొదటి యంత్రాగారంలో ప్రణాళికా, పంచాయతీ రాజ్ శాఖామంత్రి డాక్టర్ ఎం. చెన్నారెడ్డి 1963 అక్టోబరు 4 వ తేదీన ప్రారంభించారు. రెండవ యంత్రాగారంలో దీనికి పరిశ్రమల శాఖామంత్రి డాక్టరు ఎం. ఎన్. లక్ష్మీనరసయ్య 1963 అక్టోబరు 9 వ తేదీన ప్రారంభోత్సవం జరిపారు.

చెరకు :

ఫ్యాక్టరీ క్షేత్రాలనుంచి, రైతులనుంచి ఈ నెలలో ఫ్యాక్టరీకి అందిన చెరకుగడ వివరాలు దిగువ పేర్కొనబడినవి :–

| | ఫ్యాక్టరీ క్షేత్రాలు | రైతులు | మొత్తం మె. ట. |
|---|---|---|---|
| 1. కేంద్రరైల్వే ... | | 15997 | 15997 |
| 2. ఎన్. రైల్వే | 23060 | 8153 | 31213 |
| 3. రోడ్డు | 7566 | 19812 | 27378 |
| | 30626 | 43962 | 74588 |

మె. ట.

ఈ నెలలో మొదటి ఫ్యాక్టరీలో 34253 మె. ట. గడను, రెండవ ఫ్యాక్టరీలో 39748 మె. ట. ల గడను ఆడించారు.

చక్కెర ఉత్పత్తి :

ఈ నెలలో మొదటి ఫ్యాక్టరీలో 28,508 (క్వి) సంచులు, రెండవ ఫ్యాక్టరీలో 31,640 (క్వి) సంచుల చక్కెర ఉత్పత్తి జరిగింది.

## 1962-63 బోనసు అడ్వాన్సు

నెలకు రూ. 500/–ల వరకు జీతం పొందే ఉద్యోగులకు ఈ క్యాలండర్ సంవత్సరంలో ఇదివరకే చెల్లించిన పండుగ అడ్వాన్సు కాక అదనంగా "దసరా" పండుగకు ప్రత్యేక అడ్వాన్సును మేనేజిమెంటు చెల్లించింది. ఈ ప్రత్యేక పండుగ అడ్వాన్సు పూర్తిగా 1962-63 వ సంవత్సరానికి వారికి చెల్లించబడే బోనసులో సర్దుబాటు చేయబడుతుంది.





## అనంతపురం జిల్లా

**మేలుజాతి విత్తనాల పంపకం:**

నూటముప్పయి మణుగుల మేలుజాతి విత్తనాలనూ, 449 మణుగుల రసాయనిక ఎరువులనూ ముదిగుబ్బ పంచాయతీ సమితిలో నవంబరు నెలలో పంపిణీచేయడం జరిగింది.

**బాల గ్రంథాలయాలు:**

గోరంట్ల పంచాయతీ సమితిలో గ్రంథాలయాలకు పుస్తకాలు సగం విరాళాల రూపంలో యిచ్చే పద్ధతిలో అందజేయబడుతున్నాయి. నాలుగు బాలల గ్రంథాలయాలు స్థాపింపబడ్డాయి.

**మధ్యాహ్న భోజన కేంద్రాలు:**

గోరంట్ల పంచాయతీ సమితిలో కేర్ సంస్థ సహాయంతో 24 మధ్యాహ్న భోజన కేంద్రాలు ప్రారంభించ బడ్డాయి.

## చిత్తూరు జిల్లా

**గ్రామలక్ష్మి శిక్షణ శిబిరం:**

మదనపల్లిలో 1963 అక్టోబరు 31వ తేదీ నుండి నవంబరు 13వ తేదీ వరకూ గ్రామలక్ష్మి శిక్షణ శిబిరం నిర్వహించ బడింది.

**యువక మండలులు:**

నగరి పంచాయతీ సమితిలో 39 మంది సభ్యులతో రెండు యువక మండలులు స్వయం సహాయక కార్యక్రమాల క్రింద ప్రారంభించబడ్డాయి.

**మధ్యాహ్న భోజన పథకాలు:**

నగరి పంచాయతీ సమితిలో కేర్ సంస్థ ఆధ్వర్యంలో 14 పంచాయతీ సమితి పాఠశాలల్లోనూ, మదనపల్లి పంచాయతీసమితిలోని 25 ఎలిమెంటరీ పాఠశాలల్లోనూ మధ్యాహ్న భోజన పథకాలు ప్రారంభించడం జరిగింది.

## తూర్పు గోదావరి

**ఎరువుల పంపకం:**

పెద్దాపురం పంచాయతీ సమితిలో నవంబరు నెలలో 120 టన్నుల రసాయనిక ఎరువులు, 14 ఆధునిక వ్యవసాయ పరికరాలు పంపిణీ చేయబడ్డాయి. నవంబరులో 305 పశువులకు విత్తులు కొట్టడం జరిగింది. 1,216 పశువులకు చికిత్స చేయబడింది. 545 పశువులకు టీకాలు వేయడం జరిగింది. నాలుగు చిన్న చిన్న కర్రవంతెనలు నిర్మించబడ్డాయి.

**శ్రమదానం:**

భీమవరపుకోట గ్రామంలోని రక్షణ శ్రామికబ్యాంకు సభ్యులు శ్రమదాన కార్యక్రమంలో పాల్గొని హరిజనవాడనుండి మంచినీటి బావివరకూ 160 గజాల మట్టి రోడ్డునూ, కాలువలతో 150 గజాల వీధి రోడ్డునూ నిర్మించుకున్నారు. వీరి శ్రమదానం విలువ సుమారు రూ. 450లు వరకూ వుంటుంది.

## గుంటూరు జిల్లా

**పంచాయతీ భవన ప్రారంభోత్సవం:**

పొందూరు గ్రామంలో రూ. 12,000ల ఖర్చుతో కొత్తగా నిర్మించిన పంచాయతీ భవనానికి గుంటూరు జిల్లా కలెక్టరు ప్రారంభోత్సవం చేశారు.

**ఎరువుల పంపిణీ:**

ఇప్పూరు పంచాయతీ సమితిలో నవంబరు నెలలో 227 మణుగుల రసాయనిక ఎరువులూ, 32 ఆధునిక వ్యవసాయ పరికరాలు పంపిణీ చేయబడ్డాయి. 7 మంచినీటి బావులను బాగుచేయడం జరిగింది.

## కరీంనగర్ జిల్లా

**పశు ప్రదర్శన:**

గోసంవర్ధన వారోత్సవాలను పురస్కరించుకొని కొత్తపల్లి గ్రామంలో నవంబరు 23, 24 తేదీలలో జిల్లా స్థాయిలో ఒక పశు ప్రదర్శన ఏర్పాటు చేయబడింది. ఇందులో 570 పశువులను, యితర జంతువులను ప్రదర్శించారు.

**హోంగార్డుల శిక్షణ శిబిరం:**

కరీంనగర్‌లో నవంబరు 27వ తేదీన 112 మంది సభ్యులతో మూడు రోజులపాటు జరిగే హోంగార్డుల శిక్షణ శిబిరానికి కలెక్టరు ప్రారంభోత్సవం చేశారు.

## ఖమ్మం జిల్లా

**గ్రామ లక్ష్మి శిక్షణ శిబిరం:**

మధిరలో పంచాయతీ సమితి నవంబరు 16 నుండి ఒక గ్రామలక్ష్మి శిక్షణ శిబిరాన్ని నిర్వహించింది.

## కర్నూలు జిల్లా

**కమ్యూనిటీ హాలు:**

పన్యం పంచాయతీ సమితికి చెందిన

# ప్రగతి పథంలో

చిందుకూరు యువకమండలి సభ్యులు రూ. 1,200/– ల ఖర్చుతో కమ్యూనిటీ హాలుకొరకు ఒక భవనాన్ని నిర్మించారు.

### మహబూబునగర్ జిల్లా

*పొగలేని పొయ్యిలు :*

ధన్వాడ పంచాయతీ సమితికి చెందిన కొసనపల్లి గ్రామంలో స్త్రీల స్వచ్ఛంద సేవా దళం సభ్యులు పొగలేని పొయ్యిలను నిర్మించారు. గ్రామీణ స్వచ్ఛంద సేవాదళ సభ్యుల సహాయంతోనూ, రక్షణ శ్రామిక బ్యాంకుల సహాయంతోనూ గ్రామంలోని రోడ్లన్నీ బాగుచేశారు.

### మెదక్ జిల్లా

*గ్రామసభ :*

సిర్పుర గ్రామంలో నవంబరు 30 వ తేదీన ఒక గ్రామసభ నిర్వహించబడింది.

*మధ్యాహ్న భోజన కార్యక్రమాలు :*

నవంబరు 21 వ తేదీన కొర్పల్ల గ్రామంలోనూ, డిశంబరు 5 వ తేదీన వడ్డేపల్లి గ్రామంలోనూ మధ్యాహ్న భోజన కార్యక్రమాలు ప్రారంభించబడ్డాయి.

*రక్షణ శ్రామిక బ్యాంకులు :*

వడ్డేపల్లి గ్రామానికి చెందిన రక్షణ శ్రామిక బ్యాంకు సభ్యులూ, హాతనూరబ్లాకు తాలూకు విస్తరణ సిబ్బందీ డిశంబరు 5 వ తేదీన శ్రమదాన ఉద్యమాన్ని నడిపి 100 అడుగుల పొడవు మురికినీటి కాలువల్ని త్రవ్వారు.

### నల్గొండ జిల్లా

*బ్లాకు సమాచార కేంద్రం :*

ఆత్మకూరులో జిల్లా కలెక్టరు ఒక బ్లాకు సమాచార కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు.

*పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం :*

ఆత్మకూరు పంచాయతీ సమితికి చెందిన తుమ్మలపెన్‌పహాడ్‌లో ప్రజల విరాళాలతో నిర్మించిన పాఠశాల భవనానికి జిల్లాపరిషత్తు ఛైర్మను ప్రారంభోత్సవం చేశారు.

*గ్రామీణ రోడ్ల నిర్మాణం :*

చౌటుప్పల్ పంచాయతీ సమితిలోని రక్షణశ్రామిక బ్యాంకుల సభ్యులు శ్రమదానంతో మూడు గ్రామీణ రోడ్లను నిర్మించారు. ఈ శ్రమదానం రూ. 1,190 ల విలువ వుంటుంది.

*ఉత్తమ మహిళా మండలి :*

1963–62 సం॥ లో నక్రేకల్ సమితిలో కెల్ల కొర్లపహాడ్ మహిళామండలి ఉత్తమమైనదని నిర్ణయించబడినది.

*గ్రామసహాయకుల శిక్షణ శిబిరం :*

నక్రేకల్ పంచాయతీ సమితికి చెందిన మద్రూరు గ్రామంలో నవంబరు 27 వ తేదీ నుండి మూడు రోజులపాటు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం నిర్వహించబడింది.

*శ్రమదానంతో రోడ్డు :*

కోదాడుపంచాయతీసమితిలోని కూచిపూడి గ్రామంలోగల రక్షణశ్రామిక బ్యాంక్ సభ్యులు, గ్రామీణ స్వచ్ఛంద సేవాదళ సభ్యులు రూ. 5‌00 లు విలువచేసే శ్రమదానాన్ని యిచ్చి రోడ్డును నిర్మించుకున్నారు.

*ఉత్పత్తి ఋణాలు :*

అధికాహారోత్పత్తికి ముంగోడు పంచాయతీ సమితి ఉత్పత్తి ఋణంక్రింద రూ. 15,000 లను పంపిణీ చేసింది.

### నెల్లూరు జిల్లా

*స్వయం సహాయక కార్యక్రమం :*

స్వయంసహాయకకార్యక్రమంక్రింద చినక్రాక పంచాయతీ సమితికి చెందిన కృష్ణారెడ్డి పాలెంలోనూ, చంద్రారెడ్డి పాలెంలోనూ రెండు పాఠశాలల భవనాలు రూ. 1,500/– ల ఖర్చుతో నిర్మించబడ్డాయి. ఐతంపాడు, అన్నపరం, మారెళ్ళపాడు, అయ్యపరెడ్డి పాలెం గ్రామాలలో నాలుగు పాఠశాలలు కూడా మరమ్మత్తు చేయబడ్డాయి.

*చెరువు మరమ్మతు :*

కొండపి పంచాయతీ సమితి తాలూకు ధర్మవరంలో గ్రామీణ స్వచ్ఛంద సేవాదళ సభ్యులు, రక్షణ శ్రామిక బ్యాంక్ సభ్యులు రూ. 600 ల ఖర్చుతో ఒక చెరువును మరమ్మతు చేశారు.

### నిజామాబాదు జిల్లా

*వసతిగృహానికి ప్రారంభోత్సవం :*

బాన్స్‌వాడలో డిశంబరు 1 వ తేదీన షెడ్యూలు కులాలు, యితర వెనుకబడిన తరగతులవారికొరకై వసతిగృహం ఒకటి ప్రారంభించబడింది.

### విశాఖపట్టణం జిల్లా

*గిరిజనులునిర్మించిన పాఠశాల :*

గంపరై పంచాయతీ సమితికి చెందిన గిరిజనులు రూ. 1,000/– లు విలువచేసే శ్రమదానంతో పాడబయలు, బంగారుమెట్ట గ్రామాలలో రెండు పాఠశాలల్ని నిర్మించారు.

### వరంగల్లు జిల్లా

*సస్య రక్షణ చర్యలు :*

ఏడుపందల పది ఎకరాలలోని వరి పంటను చీడపురుగులనుండి రక్షించడానికై బి. హెచ్. సి. 10 శాతం మందును చల్లడం జరిగింది. ఈ విధంగా మొత్తం 18 టన్నుల ధాన్యాన్ని చీడపురుగుల బారినుండి రక్షించడం జరిగింది.

*మిశ్రమజాతి మొక్కజొన్న విత్తనాల పంపకం :*

346 మణుగుల మిశ్రమజాతి మొక్కజొన్న విత్తనాలను, 1534 పౌనుల రసాయనిక క్రిమిసంహారక ఔషధాలను, 2060 మణుగుల యితర రసాయనిక ఎరువులను పరకాల పంచాయతీ సమితిలో నవంబరు నెలలో రైతులకు పంపిణీ చేయడం జరిగింది.

*మంచినీటి బావి :*

కొడంగల్ సమితికి చెందిన భక్తిముల్ల పంచాయతీ తాలూకు బలభద్రాయిపల్లి గ్రామంలో గ్రామీణ స్వచ్ఛంద సేవాదళ సభ్యులు, రక్షణశ్రామిక బ్యాంక్ సభ్యులు కలిసి గ్రామంలో మంచినీటి బావిని త్రవ్వారు. ఈ పని రూ 1500/–ల విలువ గలదిగా అంచనా వేయబడింది. ★

# రసాయనిక ఎరువులు

డాక్టర్ టి. వెంకట రమణారెడ్డి

## రసాయనిక ఎరువులు

దినదినాభివృద్ధి చెందుతున్న ప్రజానీకం అవసరాలకు సరిపడే మేరకు అధిక వ్యవసాయోత్పత్తిని సాధించడమే ప్రతిదేశాన్నీ ప్రస్తుతం ఎదుర్కొంటున్న ముఖ్య సమస్య. క్రమంగా అమలు జరుపబడుతున్న పంచవర్ష ప్రణాళికలు ఈ విషయానికే ప్రాధాన్యతనిస్తున్నాయి. అధికోత్పత్తి సాధనకు ముఖ్య మార్గాలు రెండు. మొదటిది ఎక్కువ భూమిని సాగులోకి తేవడం. రెండవది ప్రస్తుతం సాగులో నున్న భూమిలో పంటను హెచ్చుచేయడం. సాగుకు లాయకైన భూమంతా ఇదివరకే సాగులోకి తేబడిన కారణంగా మొదటిమార్గంవల్ల అంతగా ప్రయోజనం వుండదు. ప్రస్తుతం సాగుబడిలోనున్న భూమినుంచి ఉత్పత్తిని అధికం చేయడం అనివార్యమేకాక, తప్పించుకోనలవికాని మహత్తరమైన బాధ్యతకూడా. ఈ బాధ్యత గురుతరమైనప్పటికీ దుస్సాధ్యం మాత్రంగాదు. ఇందుకుగల బ్రహ్మాండమైన అవకాశాలను వినియోగించుకొని, పోషక పదార్థాలను భూమికి చేర్చుటద్వారా ఇది సులభసాధ్యం.

అన్ని జీవరాసులవలెనే మొక్కలకు కూడ మనుగడకు పోషక పదార్థాలు అవసరం. 15 రకాల పోషకపదార్థాలు అవసరమైనప్పటికీ ప్రాణవాయువు, ఉదజని, నత్రజని, బొగ్గు, భాస్వరం, పొటాసియం, సున్నం, మాంగనీసియం, గంధకం ముఖ్యావసరాలు. ఇనుము, మాంగనీసు, బొరన్, రాగి, జింకుల అవసరం స్వల్పం. పై పోషకపదార్థాలలో నత్రజని, భాస్వరం తప్ప మిగతావన్నీ అదృష్టవశాత్తు గాలినుండో, లేక భూమినుండో సమకూరుతున్నవి. మన రాష్ట్రంలోని భూములకు నత్రజని, భాస్వరములు చేర్చిన చాలు. బంగాళాదుంప, మిరప, పుగాకు మొదలైన పొటాషు నుపయోగించు పైర్లకు పొటాషు ఎరువులనుకూడ వేయాలి.

ఏటేటా పంటలు పండించడంవల్లనూ, నీటిలో కరిగి కొట్టుకొని పోవడంవల్లనూ, నీటి ప్రవాహానికి భూమి కోసుకొని పోవడంవల్లనూ భూమిలో పోషక పదార్థాలు నష్టమవుతున్నవి. భూసారం క్షీణించకుండా వుండటానికీ, అధికోత్పత్తి జరగడానికీ పోషకపదార్థాలను భూమికి చేర్చాలి.

### పోషకపదార్థాలు - వాటి విధులు

*నత్రజని :—*

1. మొక్కలు ఏపుగా పెరుగుటకుపకరించును.
2. శ్రేష్ఠములయిన ఆకుకూరలనుపెంచును.
3. ఆకులకు ముదురు ఆకుపచ్చ రంగునిచ్చును.
4. ఎక్కువ వేసిన యెడల మొక్కలు ఎదిగి పడిపోవుటయేగాక క్రిమి కీటకాదులకు గురియగును. పైరు తయారగుట ఆలస్యమగును.

*భాస్వరం :—*

1. మొక్కలు త్వరలో వ్రేళ్ళు వేయుటకుపకరించును.
2. మొక్కలు బాగా పిలకలు వేయును.
3. పైరు త్వరలో ఫలించును.
4. తప్పతాలు లేక గట్టిపంట పండును.

*పొటాషు :—*

1. వెలుతురు నుపయోగించుకుని మొక్కలు ఆహార పదార్థాన్ని తయారు చేసికొనుటకుపకరించును.
2. క్రిమికీటకాల బారినుండి తట్టుకొను శక్తి మొక్కలకు ప్రసాదించును.
3. మొక్కల కాడలు, గడ్డి, గట్టిగా దృఢంగా వుండునట్లు చేయును.
4. పండిన ధాన్యపుగింజలు నిండుగాను పుష్టిగలవిగాను ఉండునట్లు చేయును.

*సున్నం :—*

1. వ్రేళ్ళు త్వరలో వేయుటకుపయోగించును.
2. మొక్కలు శక్తివంతంగాను, దృఢంగాను ఉండునట్లు చేయును.
3. మొక్కలు ఇతర పోషక పదార్థాలు తగు పాళ్ళలో తీసుకుని, ఉపయోగించుటకుపయోగపడును.
4. మొక్కలలో తయారగు విషపదార్థాలను హరించును.

*మెగ్నీషియం :—*

1. ఆకులలోని "క్లోరోఫిల్" అను పచ్చని పదార్థం తయారగుటకిది ముఖ్యావసరం.
2. భాస్వరాన్ని మొక్కలోని వివిధ భాగాలకు చేర్చును.
3. మొక్కలోని నూనె పదార్థాలు, క్రొవ్వు పదార్థాలు తయారవటంలో ఉపయోగపడును.

*గంధకం :—*

1. చిక్కుడుజాతి మొక్కల (legumes) వ్రేళ్ళయందుండే కాయలను వృద్ధిచేయుట కుపయోగించును.
2. గింజ రాలుబడిని హెచ్చుచేయును.

పైన వివరింపబడిన పోషక పదార్థాలను భూమికి ఎరువులద్వారా చేర్చవచ్చును. ఇవి రసాయనిక ఎరువులలో హెచ్చుగానుండి,

మొక్కలకు సులువుగా అందుబాటుకు వచ్చు రూపంలో వుండటంచేతనే రసాయనిక ఎరువులకు ఇంత ప్రాముఖ్యత. రసాయనిక ఎరువులు అనుకూలమైనప్పటికీ, అజాగ్రత్తగా ఉపయోగించిన పక్షంలో అపకారం కూడా కలుగవచ్చు. మన దేశ మంతటిలో రసాయనిక ఎరువుల వాడకంలో ముందంజ ఆంధ్ర రైతుదే. అనుకూల వాతావరణ పరిస్థితులు, పుష్కలమైన నీటి వసరులు వుండటంవల్ల రసాయనిక ఎరువులు విరివిగా వాడి అధికోత్పత్తిని సాధించే అవకాశాలు మనరాష్ట్రానికే హెచ్చుగా వున్నవి. నత్రజని ఎరువుల వాడకం 1956-57 లో 92,806 టన్నులనుండి 1962-63 లో 2,87,029 టన్నులవరకు (అమ్మోనియం సల్ఫేటు రూపములో) అంటే మూడురెట్లుకు పైగా పెరిగింది.

స్థూలంగా రసాయనిక ఎరువులను నత్రజని ఎరువులు, భాస్వరపు ఎరువులు, పొటాషు ఎరువు లని మూడు తరగతులుగ విభజించవచ్చును.

*నత్రజని ఎరువులు :—*

ఆంధ్రరాష్ట్రానికి సరఫరా అవుతున్న నత్రజని ఎరువులు ముఖ్యమైనవి : 1. అమ్మోనియం సల్ఫేటు. 2. యూరియా. 3. అమ్మోనియం సల్ఫేటు నైట్రేటు. 4. కాల్సియం అమ్మోనియం నైట్రేటు. వీటి నుపయోగించడానికి వాటి ప్రత్యేక లక్షణాలను గురించి తెలుసుకోవడం అవసరం.

*అమ్మోనియం సల్ఫేటు :—*

రాష్ట్రంలో మొట్టమొదట వాడుకలోకి వచ్చిన రసాయనిక ఎరువు. అనాదినుండి రైతులు దీనికి అలవాటు పడివున్నారు. ప్రత్యేకంగా గాని, మిశ్రమ ఎరువుల ద్వారా గాని భూమికి చేర్చవచ్చును. సామాన్యంగా తెల్లగా వుండును. కాని ఒక్కొక్కప్పుడు పసుపు పచ్చగాను, కొంచెం బూడిదవర్ణంగాను కూడ వుండును. నూటికి 20 మొదలు 21 పాళ్ళవరకు నత్రజని వుండును. తేమకు చెమ్మగిల్లదు. నిలువచేయడానికి అనువైనది. ఇందులోని నత్రజని, మొక్కలకు వెంటనే అనుభవానికి వచ్చును. నీటిలో కరుగుతుంది. కాని భూమినుండి కొట్టుకొని పోదు. నత్రజనిని అమ్మోనియా రూపంలో ఉపయోగించు వరిజాతి పైరులకు మిక్కిలి అనుకూలమైనది. తగినంత సున్నం ఉన్న భూములలో హెచ్చు ఫలితాలనిచ్చును. లేనిపక్షంలో భూమిలోని ఇనుము, మాంగనీసు, అల్యూమినియం సంబంధమైన పదార్థాలు నీటిలో కరుగు స్థితికి తేబడి భూమినుండి కొట్టుకొని పోవును. పైరు నాటడానికి ముందుగానీ, నాటిన పిమ్మటకానీ చల్లవచ్చును. కాని మొక్క బ్రతికిన తర్వాత వేయడం మంచిది.

*యూరియా :—*

ఇటీవల ఎరువుగా విరివిగా వాడబడుతున్నది. ఇందులో నూటికి 46 వంతులు నత్రజని వుండును. ఇందులోని నత్రజని, సేంద్రియరూపంలో, నీటిలో కరుగు స్వభావాన్ని గలిగి వుండును. చల్లుట కనుకూలముగ సన్నని గుళ్ళరూపంలో తయారవుతున్నది. తేమకు చెమ్మగిల్లి గడ్డకట్టు స్వభావం కలదు. ఆ విధంగా గడ్డకట్టకుండ వుండటానికి అల్కాథిన్ పొరగల సంచులలో సప్లై చేయబడుతున్నది. హెచ్చు శాతం నత్రజని కల్గివుండటంవలన సరియైన మోతాదులో అమ్మోనియం సల్ఫేటు బదులు వాడవచ్చును. మొలకెత్తుతున్న మొక్కల చేరువలో, లేత మొక్కల వ్రేళ్ళ సమీపంలో, లేత మొక్కల చిగుళ్ళపయిన పడకుండునట్లు చల్లవలెను. అన్నిరకాల పైర్లకు, భూములకు, వాతావరణ పరిస్థితులలోనూ వాడవచ్చును. పూలమొక్కలకు, ఫలవృక్షాలకు, తగు మోతాదులో నీటిలో కలిపి మొక్కలపై చల్లవచ్చును.

*అమ్మోనియం సల్ఫేటు నైట్రేటు :—*

దీనిలో నూటికి 26 వంతులు నత్రజని కలదు. 19.5 వంతులు నత్రజని అమ్మోనియా రూపంలోను, 6.5 వంతులు నైట్రేటు రూపంలోను వుండును. నైట్రేటురూపంలో వున్న నత్రజని మొక్కలకు చల్లిన వెంటనే అందుబాటగును. మొక్కలు నాటుటకు పూర్వంగాని, నాటిన తరువాతగాని వేయవచ్చును. చల్లే టప్పుడు విత్తనాలతో కలపరాదు. వర్షాధారంతో పండేపైర్లకు, స్వల్ప నీటి ఆధారంతో పెంచబడుపైర్లకు, గొర్రుతో భూమిలో రెండు మూడంగుళాల లోతున వేసినట్లయితే మంచిఫలితం ఇస్తుంది. చల్లిన వెంటనే ఎక్కువనీరు పెట్టరాదు. అమ్మోనియం సల్ఫేటుతోను, సూపరు ఫాస్ఫేటుతోను కలిపి చల్లవచ్చు. తేమకు చెమ్మగిల్లి గడ్డకట్టు స్వభావం కలుగుటచేత, అల్కాథినె పొరగల సంచులలో నింపి సప్లయి చేయబడుతున్నది. తేమతగలని చోట్ల పొడినేలపై కానీ, కొయ్యబల్లలపై కానీ నిలువ చేయవలెను.

*కాల్షియం అమ్మోనియం నైట్రేటు :—*

నూటికి 20.5 వంతుల నత్రజనికలదు. సగం అమ్మోనియా రూపంలోను, సగం నైట్రేటు రూపంలోను ఉండును. ప్రత్యేకంగా చల్లవచ్చును. మిశ్రమ ఎరువుగా వాడుటకు అంతగా అనుకూలమైనది కాదు. అమ్మోనియం సల్ఫేటు, నైట్రేటులతో కలిపి చల్లవచ్చు. కాని Basic glag తోను సూపరు ఫాస్ఫేటుతోను కలపరాదు. ఇటీవల ఎరువుగా విరివిగా వాడబడు తున్నది. కోస్తాజిల్లాలలోను, నిజామాబాదు జిల్లాలోను విరివిగా వాడబడుతున్నది.

భాస్వరపు ఎరువులు :—

భాస్వరపు ఎరువులలో ముఖ్యమైంది సూపరుఫాస్ఫేటు. ఇందులో నూటికి 16 వంతులు భాస్వరం కలదు. లక్షటన్నులకు పైగా రాష్ట్రంలోనే తయారవుతున్నది. దీని సరఫరా ప్రయివేటు సంస్థలద్వారా జరుగుతున్నది. దీని వాడకంకూడాక్రమంగా అధికమవుతున్నది. 1956—57 సం॥ లో 26,673 టన్నులనుండి 1962—63 సం॥ లో 12,4,456 టన్నుల వరకు (నాల్గురెట్లకు పైగా) పెరిగింది. రాష్ట్రంలోనే ఎక్కువ భాగం తయారవటంచేతను, ఇతర రాష్ట్రాల లోని ఉత్పత్తిదార్లుకూడ ఆంధ్రరాష్ట్రంలోని వారికి సరుకు సరఫరా చేయటానికి ఆసక్తి చూపుతున్నందునను, యీ ఎరువు కొరత లేక పుష్కలంగా సరఫరా అవుతున్నది.

పొటాషు ఎరువులు :—

పొటాషు ఎరువుల ఆవశ్యకత రాష్ట్రం లోని భూములకంతగా ఇదివరకు కనిపించక పోయినప్పటికీ ఇటీవలి ప్రయోజనాలవల్ల పంట అభివృద్ధికి పొటాషుకూడ దోహద మిస్తుందనీ, పంట నాణ్యతనుకూడ హెచ్చి స్తుందనీ తేలినది. అందుచేత నత్రజని, భాస్వరపు ఎరువులతో బాటు పొటాషు ఎరు వులుకూడ వేయవలసిన అవసరం ఏర్ప డింది. అందుచేత యీ ఎరువుల వాడకం కూడ ఇటీవల పెరుగుతున్నది. ఈ ఎరువు లలో ముఖ్యమైనవి పొటాషియం క్లోరైడు, పొటాసియం సల్ఫేటు.

పొటాషియం క్లోరైడు :—

దీనిలో 100 కి 60 వంతులు పొటాష్ ఉంది. ఇందులోని క్లోరైడు బంగాళా దుంప లోని పిండి పదార్థాన్ని పొగాకులోని ఆకు నాణ్యతను, చెఱకులోని రసం నాణ్యతను తగ్గించేస్తుంది. కాబట్టి దీనిని యీ పైర్లకు వాడరాదు.

పొటాసియం సల్ఫేటు :—

దీనిలో 100 కి 48 వంతులు పొటాషు ఉంటుంది. సరుకునాణ్యం ప్రధానంగా గల బంగాళదుంప, చెఱకు, పొగాకు, పండ్లు, కూరగాయల పైర్లకు వాడవలెను.

## ఆంధ్ర ప్రదేశ్‌లో ఎరువుల సరఫరా విధానం

నత్రజని ఎరువులు :

రాష్ట్రంలో నత్రజని ఎరువుల సరఫరా సహకార సంస్థలకు అప్పగించబడింది. రాష్ట్రావసరాల కవసరమైన నత్రజని ఎరువు లను కేంద్ర ప్రభుత్వం వద్దనుండి రాష్ట్ర వ్యవసాయాధికారి తెప్పిస్తారు. అవిధంగా తెప్పించిన సరుకును, జిల్లా సహకార సంస్థలు, రైతులకు, నిర్ణీతపద్ధతి ననుసరించి సరఫరాచేస్తాయి. రాష్ట్రంలో ఆంధ్ర ప్రాంతంలోని 11 జిల్లాలలోనూ జిల్లా సహకార సంస్థలు ఎరువులు సరఫరా చేస్తున్నాయి. తెలంగాణా ప్రాంతంలో 4 జిల్లాలలో (హైదరాబాద్, మహబూబ్ నగర్, కరీంనగర్, నిజామాబాద్) మాత్రం జిల్లా సహకార సంస్థలు ఎరువులు సరఫరా చేస్తున్నాయి. మిగతా జిల్లాలలో తాలూకా సహకార సంఘాలే ఆయా ప్రాంతాలలో యీ పనిని నెరవేరుస్తున్నాయి. సహకార సంస్థలు ఎరువులు సరఫరా చేయడానికి ముందుకు రాని ప్రాంతాలలోనూ, సంఘాలు సక్రమంగా పనిచేయని ప్రాంతాలలోనూ, వ్యవసాయ శాఖాధికార్లే తమ డిపోలద్వారా ఎరువులను సరఫరా చేస్తున్నారు. ఎరువులు సహకార సంస్థలకు రైలుస్టేషనుల వద్దకుచేర్చి కేంద్ర ప్రభుత్వం, నిర్ణయించిన రేట్లకు సప్లయి చేయబడతాయి. రైలుస్టేషనువద్ద డెలివరీ తీసుకొన్నది మొదలు, రైతులకు సరఫరా చేసేపర్యంతం జవాబుదారి సహకార సంస్థలదే. ఈ సరఫరాకు సంబధించిన ఖర్చు లకుగాను టన్నుకు కొంత మొత్తం చొప్పున కేంద్ర ప్రభుత్వం మంజూరు చేసింది. ఆ మొత్తాన్ని సప్లయిరేటుకు కలుపుకొని కేంద్ర ప్రభుత్వం నిర్ణయించిన విడుదల రేట్లకు మించకుండా రైతులకు ఎరువులను అమ్మాలి.

నత్రజని ఎరువులకు కేంద్ర ప్రభుత్వం నిర్ణయించిన సప్లయిరేట్లు ఖర్చులకుగాను కేటాయించిన మార్జిను, రైతులకు అమ్మే విడుదల రేట్లు *యీక్రింద పేర్కొనబడినవి:—

1961—62వ సంవత్సరంనుండి రాష్ట్రానికి నత్రజని ఎరువుల సప్లయి తృప్తికరంగా వున్న కారణంగా రైతులకు ఇబ్బంది లేకుండ వారి కవసరమైనంత ఎరువును కొని, ఉపయోగించి అధికోత్పత్తిని సాధించేందుకై పంపిణీ విధానంలోని నిబంధన లన్నింటినీ సడలించి జిల్లా పరి షత్తులు, పంచాయతీ సమితులు నిమిత్తం

| *ఎరువుల పేర్లు | సప్లయి రేటు (టన్నుకు) | మార్జిను (టన్నుకు) | విడుదల రేటు (టన్నుకు) |
|---|---|---|---|
| | రూ. | రూ. | రూ. |
| అమ్మోనియం సల్ఫేటు | 330 | 30 | 360 |
| యూరియా | 670 | 45 | 715 |
| అమ్మోనియం సల్ఫేట్ నైట్రేట్ | 400 | 35 | 435 |
| కాల్సియం అమ్మోనియం నైట్రేట్ | 278 | 32 | 310 |

షరా :— పై రేట్లపైన అమ్మకంపన్ను అదనంగా వసూలు చేయబడుతుంది.

లేకుండ పంపిణీవిధానం సవరించబడిన. ప్రస్తుత విధానాన్ననుసరించి యే రైతైనా ఎట్టి అభ్యంతరం లేకుండా తన కవసరమైన నత్రజని ఎరువులను సహకార సంఘాల డిపోలలోనుంచి గానీ వ్యవసాయశాఖ డిపోలనుంచి గానీ కొనుక్కోవచ్చు. నిబంధనలను సడలించిన పిమ్మట అమలోనున్న ప్రస్తుత విధానంలోని ఏర్పాట్లీ క్రింద ఉదహరింప బడినవి :—

1. రాష్ట్రావసరాల కవసరమైన ఎరువులను కేంద్ర ప్రభుత్వం వద్దనుండి రాష్ట్ర వ్యవసాయాధికారి తెప్పిస్తారు.
2. మిశ్రమ ఎరువులను తయారుచేసే ఎరువుల సంస్థలకు ప్రభుత్వం నిర్ణయించిన మేరకు నత్రజని ఎరువులు రాష్ట్రవ్యవసాయాధికారి కేటాయిస్తారు.
3. జిల్లాలకు ఎరువుల సరఫరాకు రాష్ట్ర వ్యవసాయాధికారి నిర్ణయించిన లక్ష్యాలను ఆయా జిల్లా కలెక్టర్లు జిల్లా వ్యవసాయాధికారి సలహాపై సాగువిస్తీర్ణం, పైర్లు, రైతుల అవసరాలను గమనించి జిల్లాలోని వివిధ ప్రాంతాలకు లక్ష్యాలను విభజిస్తారు.
4. జిల్లా కలెక్టరు, జిల్లా వ్యవసాయాధికారిని, ప్రాంతీయ సహకార సంఘాల డిప్యూటీ రిజిష్ట్రారును, జిల్లా సహకార సంఘం అధ్యక్షుని, జిల్లా పరిషత్తు అధ్యక్షుని సంప్రదించి జిల్లాలో ఎరువుల అమ్మకానికి కేంద్రాలను నిర్ణయిస్తారు.
5. జిల్లాకువచ్చిన సరుకును వెంటనే ఆయా ప్రాంతాల లక్ష్యాలను బట్టి జిల్లా కలెక్టరు జిల్లా వ్యవసాయాధికారితో సంప్రదించి వివిధ ప్రాంతాలకు పంపిణీ చేస్తారు.
6. సరుకును నిర్ణీత కేంద్రాలకు చేర్చి విక్రయ శాలలను ఏర్పరచి రిటైల్ సొసైటీలద్వారా గాని, లేక తమ సొంత డిపోలద్వారా గాని రైతులకు ఎరువులు సరఫరాచేసే బాధ్యత జిల్లా సహకార సంఘానిదే.
7. రిటైలు సొసైటీలను, సహకార సంఘాల డిప్యూటీ రిజిష్ట్రార్లు జిల్లా సహకార సంస్థల అధ్యక్షులతో సంప్రదించి యేర్పరుస్తారు.

రైతుకెట్టి ఇబ్బందిలేక తమకు కావలసినంత ఎరువులను కొని అధికోత్పత్తి సాధనకు తోడ్పడవచ్చు.

## ఎరువుల వాడకాన్ని అభివృద్ధి చేయడానికి కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు కలుగచేసిన ఇతర సదుపాయాలు

*రాష్ట్ర ప్రభుత్వం :*

1. పుష్కలంగా సప్లయి అవుతున్న ఎరువులను ఖరీదు చేయడానికి తగినంత ధనం లేని జిల్లా సహకార సంఘాలకు ఎరువులను అమ్మిన తరువాత డబ్బు చెల్లించే పద్ధతిపై (consignment cum-credit system) సప్లయిచేసేవసతికల్పించింది.
2. సహకార చెక్కెరమిల్లులు, వారికి చెఱకు సప్లయి చేయడానికి అంగీకరించిన రైతులకు ఎరువులు సప్లయి చేసేవసతి కల్పించింది. మిల్లు యజమానులు ప్రభుత్వం వద్దనుండి ఎరువులు అప్పుగా తీసుకుని, చెఱకు రైతులకు అప్పుగా ఇచ్చి ఖరీదును మిల్లుకు సప్లయిచేసిన చెఱకు ధరనుండి మినహాయించుకుంటారు.

*కేంద్ర ప్రభుత్వం :*

1. పైరులకు ఎరువులు వేయని కాలంలో సప్లయి చేసిన ఎరువులను నిల్వచేసిన సంస్థలకు సప్లయిరేట్లలో ఈ దిగువ † చూపిన రేట్ల ప్రకారం ముదరా ఇస్తారు. ఇట్టి ముదరాలు ఏప్రిలు మొదలు జూన్ వరకూ తిరిగి అక్టోబరు మొదలు డిశంబరు నెలవరకూ సప్లయి చేయబడిన సరకుపై మాత్రం ఈ దిగువ విధంగా యిస్తారు.

   ఈ సదుపాయం ఎరువులు పంపిణీచేసే సహకారసంఘాలకు చాలా అనుకూలమైనది.
2. రేవులలోవున్న ఎరువులను రోడ్డు రవాణాద్వారా ఆయాప్రదేశాలకు చేర్చుకునే యెడల అటిరవాణా ఖర్చులు రేవు నద్దనుండి 500 కి. మీ. వరకు కేంద్ర ప్రభుత్వమే భరిస్తుంది. ఈ సదుపాయం వినియోగించుకొని సహకార సంఘాలు సకాలంలో రైతులకు ఎరువులు అందజేయవచ్చు.
3. పర్వతప్రాంతాలు, ఏజెన్సీప్రాంతాలు, ఎరువులు సులువుగా తీసికొని పోవుటకు వీలుగాని ఇతరప్రాంతాలలోను ఎరువుల వాడకాన్ని అభివృద్ధి చేసే నిమిత్తం ఆయాప్రాంతాలకుతీసికొనిపోబడే ఎరువులకయ్యే అదనపు ఖర్చులలో మూడువంతులను కేంద్రప్రభుత్వంభరిస్తుంది. మిగతా ఒక వంతును రాష్ట్రప్రభుత్వం భరించవలసి వుంటుంది ఈ సదుపాయాన్ని

| † ఎరువు పేరు | మూడు నెలలకు ముదరా | రెండు నెలల ముదరా | ఒక నెలకు ముదరా |
|---|---|---|---|
| | రూ. న.పై. | రూ. న.పై | రూ. న.పై. |
| అమ్మోనియం సల్ఫేటు | 7—50 | 5—00 | 2—50 |
| యూరియా | 15—00 | 10—00 | 5—00 |
| కాల్సియం అమ్మోనియం నైట్రేట్ | 7—50 | | 2—50 |

వినియోగించుకుని అటువంటి ప్రాంతాలలోకూడ ఎరువులు విరివిగా వాడి అధికోత్పత్తి సాధించవచ్చును.

*పంచవర్ష ప్రణాళికలు - రసాయనిక ఎరువులు :-*

పంచవర్ష ప్రణాళికలు వ్యవసాయోత్పత్తికి ముఖ్యసాధనం. మూడవ ప్రణాళికా కాలంలో సాధించదలచిన 27.9 లక్షల టన్నుల వ్యవసాయాధికోత్పత్తిలో 6.5 లక్షలు అనగా సుమారు నాల్గవ వంతును రసాయనిక ఎరువులద్వారా సాధించ వలసివుంది. దీనినిబట్టి అధికోత్పత్తి కార్యక్రమంలో రసాయనిక ఎరువుల ప్రాధాన్యత విశదమవుతున్నది.

రసాయనిక ఎరువుల సందర్భంలో పంచవర్ష ప్రణాళికల లక్ష్యాలు సాధించిన ఫలితాలు యీ ప్రక్క పట్టికలలో పొందుపరచబడినవి:

*ఎరువుల ఫ్యాక్టరీలు :-*

రసానిక ఎరువుల వాడకంలో ఆంధ్ర రాష్ట్రంయొక్క ఆధిక్యతవలనను, ఎరువుల ఉపయోగానికి అనువయిన వాతావరణ పరిస్థితులు, నీటి వనరులు, రసాయనిక ఎరువులు సమృద్ధిగా వాడగల అవకాశాలు వుండటం వలనను ఈ రాష్ట్రంలో రెండు ఎరువుల ఫ్యాక్టరీలు నిర్మించడానికి నిర్ణయించబడింది. అందులో విశాఖపట్టణం వద్ద స్థాపించబడనున్న ఫ్యాక్టరీ 80,000 టన్నుల నత్రజని, అమ్మోనియంఫాస్ఫేటు (20 N : 20 P), యూరియా రూపములో తయారు చేస్తుంది. కొత్తగూడెంవద్ద నెలకొల్పబడనున్న ఫ్యాక్టరీ 80,000 టన్నుల నత్రజనిని యూరియారూపంలో తయారు చేస్తుంది. ఇవి పూర్తయేసరికి ఆంధ్ర రాష్ట్రం, రసాయనిక ఎరువుల విషయంలో స్వయం సమృద్ధమై అధికోత్పత్తిని సాధించ గల దనడంలో సందేహంలేదు.

*నత్రజని ఎరువులు :-*

రెండవ ప్రణాళిక

(అమ్మోనియం సల్ఫేట్ రూపంలో) (టన్నులలో)

| సంవత్సరం | సాధించదలచినలక్ష్యం | సప్లయికాబడిన ఎరువులు మొత్తం | సరఫరాఫలితం |
|---|---|---|---|
| 1956–57 మొదలు 1960–61 వరకు | 9,96,655 | 5,47,575 | 5,66,504 |

మూడవ ప్రణాళిక

| | | | |
|---|---|---|---|
| 1961–62 | 3,23,500 | 2,34,440 | 1,83,940 |
| 1962–63 | 4,00,000 | 3,67,346 | 2,87,079 |
| 1963–64 | 4,75,000 | * 2,76,695 | * 1,94,692 * 30–9–63 వరకు |
| 1964–65 | 5,50,500 | — | — |
| 1965–66 | 6,00,000 | — | — |

*ఫాస్ఫరపు ఎరువులు :-*

రెండవ ప్రణాళిక

| | | | |
|---|---|---|---|
| 1956–57 మొదలు 1960–61 వరకు | 2,70,000 | 2,42,813 | 2,42,843 |

మూడవ ప్రణాళిక

| | | | |
|---|---|---|---|
| 1961–62 | 1,00,000 | 95,277 | 95,277 |
| 1962–63 | 1,50,000 | 1,24,456 | 1,24,456 |
| 1963–64 | 2,00,000 | — | — |
| 1964–65 | 2,50,000 | — | — |
| 1965–66 | 3,50,000 | — | — |

నాల్గవ ప్రణాళిక లక్ష్యాలు

| సంవత్సరం | నత్రజనిఎరువులు (టన్నులు) | ఫాస్ఫరపుఎరువులు (టన్నులు) |
|---|---|---|
| 1966–67 | 6,50,000 | 4,00,000 |
| 1967–68 | 7,00,000 | 4,25,000 |
| 1968–69 | 7,50,000 | 4,50,000 |
| 1969–70 | 8,00,000 | 4,75,000 |
| 1970–71 | 8,50,000 | 5,00,000 |
| మొత్తం | 37,50,000 | 22,50,000 |

# సంగ్రహప్రకటనలు

## స్వర్ణకారుల పునరావాసం

"ఆంధ్రప్రదేశ్ స్వర్ణకారుల పునరావాస సంఘం'' వారు కార్మిక, రవాణాశాఖల మంత్రి అధ్యక్షతన సమావేశమై తీసుకున్న నిర్ణయాల ఫలితంగా ప్రభుత్వం నిరుద్యోగులైన స్వర్ణకారుల పునరావాసానికై దిగువ పేర్కొన్న చర్యలు గైకొన్నది :—

ఉద్యోగసాధక కేంద్రాలద్వారా ప్రభుత్వ, ప్రైవేటు రంగాలలో ఉద్యోగాలు లభింపజేయడంలో నిరుద్యోగులైన స్వర్ణకారులకు ప్రాధాన్యత ఇచ్చారు.

భారత ప్రభుత్వం చెల్లించిన మొత్తంలో నుంచి రూ. 10 లక్షలను, ఉపాధికోల్పోయిన స్వర్ణకారులు ఏదైనా కొద్దిపాటి వ్యాపారం చేసుకోగలగడానికి వీలుగా వారికి వ్యక్తిగతంగా రూ. 500/- ల మేరకు ఋణాలు మంజూరు చేసేందుకూ రూ. 4. లక్షలను స్వర్ణకారుల కుటుంబాలకు (ఒక్కొక్క జిల్లాలో 60; హైద్రాబాదు, సికింద్రాబాదు జంట నగరాలలో 500 ల చొప్పున) కుట్టు మిషన్లను సరఫరా చేసేందుకూ ఖర్చుచేయడానికి నిశ్చయించారు.

స్వర్ణకారుల పునరావాసం నిమిత్తం జంట నగరాలలో దిగువ పేర్కొన్న పరిశ్రమలను ప్రారంభించేనిమిత్తం పరిశ్రమలశాఖ రూ. 2.5 లక్షలు కేటాయించింది :— చేతి కాగితం పరిశ్రమ; కుటీర పరిశ్రమల కేంద్రంలో ఒక చేతిపనుల విభాగం, గాజు పరిశ్రమ, చిన్నతరహా అల్యూమినియం పరిశ్రమ.

మధ్యరకం పరిశ్రమను నెలకొల్పడానికి ఖాదీ గ్రామీణ పరిశ్రమల మండలి రూ. 70,000 లు మంజూరు చేసింది. ఉపాధికోల్పోయిన స్వర్ణకారులతో కూడిన సహకార సంఘం ద్వారా ఈ పథకం అమలుపరచబడుతుంది. రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో వడ్రంగం, కమ్మరిపని కేంద్రాలను నెలకొల్పడానికి కూడా మండలి నిశ్చయించింది. ఇందునిమిత్తం ప్రారంభంలో 25 మంది స్వర్ణకారులకు శిక్షణ గరపడానికి ప్రతిపాదించారు.

అన్ని విద్యాసంస్థలలోనూ 12 వ తరగతి వరకూ స్వర్ణకారుల పిల్లలకు ఫీజు చెల్లింపులను మినహాయించారు. పరిశ్రమలకు ప్రభుత్వ సహాయక కార్యక్రమం క్రింద పరిశ్రమలశాఖ ఒక్కొక్క జిల్లాకు రూ. 10,000 ల చొప్పున కేటాయించింది. స్వర్ణకారుల పునరావాసం నిమిత్తం ఈ మొత్తాలను కొన్ని జిల్లాలలో వినియోగించడం కూడా జరిగింది.

## గొట్టపు బావులు

గొట్టపు బావుల నిర్వహణకు, పనులకు సంబంధించిన పథకాన్ని 1963—64 వ సంవత్సరంలో కూడా కొనసాగించడానికి ప్రభుత్వం మంజూరుచేసింది. ఇందుకుగాను రూ. 2,81,729 ల వ్యయాన్నికూడా ప్రభుత్వం ఆమోదించింది.

## పిచ్చికుక్క కరచినవారికి చికిత్స

వైద్యశాఖ డైరెక్టరు సూచనను పురస్కరించుకొని ప్రభుత్వం అన్ని ఆసుపత్రులలోనూ వాక్సిన్‌ను ఉచితంగా సరఫరా చేయాలని ఆదేశించింది. ప్రాణరక్షణకు ఉపయోగించే మందులన్నింటినీ ఆసుపత్రులలో ఉచితంగా సరఫరా చేయడానికి ఉద్దేశించడం జరిగింది. పిచ్చికుక్క కరచిన వారికి ఉపయోగించే వాక్సిన్ కూడ ప్రాణరక్షణకు వినియోగించే మందు కావడంవల్ల దానిని కూడా ఆసుపత్రులలో ఉచితంగా సరఫరా చేస్తారు.

## హోంగార్డు శిక్షితులు

హోంగార్డులుగా నమోదయి, ఏదైనా ప్రత్యేక ప్రదేశంలో శిక్షణ పొందుతున్న ప్రభుత్వోద్యోగులు వారు ఉద్యోగంచేసే ఆయా ప్రదేశాలనుంచి శిక్షణజరిగే ఆరు నెలల కాలంలో సాధారణంగా బదిలీ చేయబడకుండా చూడాలని ప్రభుత్వం వివిధ శాఖాధిపతులను ఆదేశించింది.

## సినిమా ఆపరేటర్ల పరీక్షకుల బోర్డు

ప్రభుత్వం సినిమా ఆపరేటర్ల పరీక్షకుల బోర్డును దిగువ సభ్యులతో—1963 డిశంబరు 11 తేదీనుంచి—పునర్నిర్మించింది.

శ్రీ బి. ఎన్. రెడ్డి, మద్రాసు; శ్రీ టి. ఆదినారాయణ, ఆంధ్రప్రదేశ్ ఫిలింఎగ్జిబిటర్ల సంఘం ప్రతినిధి, విజయవాడ; శ్రీ కె. పి. ప్రసాద్, విజయవాడ; శ్రీ రమేష్ చంద్ర లాహోటీ, ఫిలిం ఎగ్జిబిటర్ల సంఘం ప్రతినిధి, హైద్రాబాదు; ప్రభుత్వ చీఫ్ ఎలక్ట్రికల్ ఇన్‌స్పెక్టరు ఈ బోర్డు ఎక్స్ అఫీషియో అధ్యక్షుడుగా వ్యవహరిస్తారు.

## ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి కార్పొరేషన్

ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి కార్పొరేషను డైరెక్టర్లుగా ఈ క్రింద పేర్కొన్నవారిని మరో సంవత్సరం వరకు ప్రభుత్వం తిరిగి నియమించింది :—

అధికార్లు

శ్రీ వి కె రావు ఐ ఎ యస్ ప్రభుత్వ ప్రత్యేక కార్యదర్శి, పరిశ్రమల శాఖ (ఉపాధ్యక్షుడు); శ్రీ ఎం. ఏ. అబ్బాసీ. ఐ. ఏ. ఎస్. ఆర్థిక శాఖ కార్యదర్శి (డైరెక్టరు), శ్రీ బి.ఎల్. ఓట్స్. ఐ.ఏ.ఎస్. పరిశ్రమలు, వాణిజ్య శాఖ కార్యదర్శి (డైరెక్టరు).

అనధికార్లు :

శ్రీ వి. రామకృష్ణ, ఐ. సి. ఎస్. (రిటైర్డ్), మద్రాసు; శ్రీ మద్దిసుదర్శనం. గుంటూరు; శ్రీ రాజారామదేవరావు, బేగంపేట; శ్రీ జైచంద్ డి. లోహడె, హైద్రాబాదు (డైరెక్టర్లు).

## అవినీతినేరాల పరిశీలన

ముఖ్యమైన అవినీతి నేరాలను కనుగొనడానికి ఉపకరించే సమాచారాన్ని తెలియజేసే ప్రభుత్వోద్యోగులకు ప్రాధాన్యతలేక ప్రమోషను ఇవ్వాలని భారత ప్రభుత్వం నియమించిన అవినీతి నిర్మూలన విషయాల ఉపసంఘం సిఫార్సు చేసింది. రాష్ట్ర ప్రభుత్వం ఈ సిఫార్సును ఆమోదించి ఇటువంటి ప్రభుత్వోద్యోగులకు రొక్కం బహుమతులు ఇవ్వాలనీ అర్హమైన సందర్భాలలో ప్రమోషనుకు ప్రాధాన్యత ఇవ్వాలనీ, యోగ్యతను బట్టి తరువాతి స్థానంలోకి ప్రమోటు కూడా చేయాలని ఆదేశించింది.

## రసాయనిక ఎరువుల పంపిణీ

రాష్ట్రంలో రసాయనిక ఎరువులపంపిణీ విధానాన్ని ప్రభుత్వం సవరించింది. నత్రజని ఎరువులన్నింటి (అమోనియం సల్ఫేటుతోసహా)నీ ఎటువంటి నిర్బంధాలు లేకుండా విక్రయిస్తారు. దిగువ పేర్కొన్న సవరించిన విధానం అవలంబించబడుతుంది.

వ్యవసాయ శాఖ డైరెక్టరు, ఇంతవరకు ఆచరణలో వున్నట్లుగానే రాష్ట్రానికి కేటాయించిన నత్రజని ఎరువుల కోటాలను తెప్పించుకోవడానికి ఇండెట్లు పంపుతారు ఎరువుల ఫర్ములు, ఇతర భారీ వినియోగదార్లకు ఎరువులు కేటాయిస్తారు. అంచలవారీ కార్యక్రమం ప్రకారం ఇండెంటు చేయవలసిన పరిమాణం విషయంలో తుదినిర్ణయం వ్యవసాయశాఖ డైరెక్టరుదే అయినప్పటికీ సాధ్యమైతే ఆయన ప్రతిసంవత్సరం ఇండెంటును స్థిరీకరించడానికి పూర్వం సహకార సంఘాల రిజిస్ట్రారు, జిల్లా సహకార మార్కెటింగ్ సంఘాల ప్రతినిధులను–గత సంవత్సరంలో ఎరువుల వినియోగం, ఎరువుల అవసరాలకు సంబంధించిన ఇతర అంశాల విషయంలో – సంప్రదిస్తారు. ఎరువుల ఫర్ములకు, భారీ వినియోగదార్లకు రాష్ట్రానికి కేటాయించిన కోటాలో 15 శాతం ఎరువులను సరఫరా చేస్తారు. అయితే అమోనియం సల్ఫేటును మాత్రం రాష్ట్రం కోటాలోనుంచి 10 శాతంవరకు మాత్రమే ప్రత్యేకిస్తారు. మిగతా 5 శాతం మేరకు ఇతర నత్రజని ఎరువులను సరఫరా చేస్తారు.

అంచలవారీ కార్యక్రమం వివరాలు అందినవెంటనేజిల్లాకలెక్టరు జిల్లావ్యవసాయ శాఖాధికారిని సంప్రదించి మొత్తం విస్తీర్ణం, పంటలు, రైతుల అవసరాల ప్రాతిపదికపై జిల్లాలోని వివిధ ప్రాంతాలకు కేటాయింపులు చేస్తారు. జిల్లాలో ఎరువుల పంపిణీ కేంద్రాలను జిల్లాకలెక్టరు, జిల్లా వ్యవసాయ శాఖాధికారి, సహకార సంఘాల డిప్యూటీ రిజిస్ట్రారు, జిల్లా సహకార మార్కెటింగ్ సంఘాల అధ్యక్షుడు జిల్లా పరిషత్ అధ్యక్షులతో సంప్రదించి నిర్ణయిస్తారు. ఎరువుల కోటాలు చేరినవెంటనే జిల్లా సహకార మార్కెటింగ్ సంఘం వాటిని పైనపేర్కొన్న విధంగా నిశ్చయించబడే పంపిణీ కేంద్రాలకు రవాణాచేస్తుంది.

ఎరువుల చిల్లర పంపిణీ జిల్లా సహకార మార్కెటింగ్ సంఘం అధ్యక్షునితో సంప్రదించి సహకార సంఘాల డిప్యూటీ రిజిష్ట్రారు ఎన్నికచేసే చిల్లర పంపిణీసంఘాల ద్వారా జరుగుతుంది. చిల్లరపంపిణీసంఘాలు లేకపోయినా లేదా ప్రస్తుతం పనిచేస్తున్న సంఘాలు పనిచేయలేకపోయినా ఈ పంపిణీ కార్యక్రమం జిల్లా సహకార మార్కెటింగ్ సంఘాల స్వంత విక్రయశాలలద్వారా జరుగుతుంది.

## వినియోగదార్ల సహకార విక్రయశాలలు

తూర్పుగోదావరి జిల్లా రాజమండ్రిలో 15 శాఖలతోనూ, కృష్ణా జిల్లా మచిలీపట్నం, విశాఖపట్నం జిల్లా విజయనగరం, కర్నూలు జిల్లా ఆదోనిలలో పదేసి శాఖలతోనూ నాలుగు వినియోగదార్ల సహకార విక్రయశాలలను ప్రారంభించేందుకై సహకార సంఘాల రిజిష్ట్రారుకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అనుమతి ఇచ్చింది. ఈ ప్రతిపాదనను భారత ప్రభుత్వం ఆమోదించిన దృష్ట్యా ప్రభుత్వం తూర్పుగోదావరి, కృష్ణా, విశాఖపట్టణం, కర్నూలు జిల్లాలలోని వినియోగదార్ల సహకార విక్రయశాలలకు ఒక్కొక్కదానికి సమాన ప్రాతిపదికపై వాటాధనం క్రింద రూ. 1 లక్షను, నిర్వహణ ధనం క్రింద రూ. 2 లక్షలను మంజూరు చేసింది. దీనిని పూర్తిగా భారత ప్రభుత్వం భరిస్తుంది, నలుగురు డిప్యూటి రిజిష్ట్రార్లు, తొమ్మిది మంది సహకారశాఖ సీనియర్ ఇన్‌స్పెక్టర్లను నియమించడానికీ ఒక్కొక్క విక్రయశాలకు ఒకటి చొప్పున నాలుగు ట్రక్కులను కొనుగోలు చేయడానికి కూడా ప్రభుత్వం మంజూరీ ఇచ్చింది.

## విద్యా రాయితీలు

రాజకీయబాధితుల పిల్లలకు, మనుమలకు విద్యా రాయతీలను మంజూరుచేసే పథకానికి సంబంధించిన నియమావళిలోని 5 వ

(మిగతా 95 వ పేజీలో)

# మణిముత్యాలు

## ధారా గృహం

తలకి గనుగన
కన్నీరు ధార లొలుక,
మేన బేర్పిందు లురులంగ
మెలత వాలిచె,
నీలు ప్రిదిలిన జలధార
లోలి గలయ గ్రమ్మి, చెదరెడు
ధారాగృహమ్మువోలె.

—నన్నెచోడుడు.

## వేటలో పంది పరాక్రమము

ఎగుచు కూతలు
మొల్లె యెత్తి బిట్టాలించి
గమికి గన్నాకయి
గాలి యలము;
వడిగుక్క లంటంగ వచ్చిన,
మెడ ద్రిప్పి ఘుర్ఘురించుచు
బయల్ కొమ్ము జిమ్ము;
తారసించిన చోట
దారున జోరబారి,
యొకటి రెంటని
దొబ్బలురుల నడుచు;
జాలచేరులు వట్టి తూలింప,
బలిమి నీడ్చుకొని
డొంకల దూరి చుట్టబెట్టు;
ఈకెుపోటుల బడి
ప్రేవు లీదులాడ
బోయి, పోలేక దగ దొట్టి
పొదలు పొచ్చి,
బెండు వడియును
జోరనీదు పీట వెట్టి;
చూపులనె యేర్చు బ్రజ
నొక్క సూకరంబు.

—పెద్దన.

## వేట కుక్కల విక్రమం

ఇవి కంఠపాశంబు
వింత డుస్సిన,
మీదబడి దిశాకరినైన
గెడపజాలు;
ఇవి, మింట బరచు
పక్షీంద్రు జూపిన,
నీడబడి వాలునందాక
జరపజాలు;
ఇవి, గాలికనిన,
మూక వరాహ దనుజేంద్రునైన
జుట్టింటిలో నాగజాలు;
ఇవికాటు కొల్పిన,
వృద్ధకూర్మము వీపు చిప్పైన
నెరచిక్కె చింప జాలు; నవగ,
ఘుర్ఘుర గళగర్తజనిత
భూరి భూభృదురుబిల భరిత
భా భా భయంకర రార్భటీ
దీర్ణ దిగ్భిత్తు లగుచు జెలగె,
సరిపెనణల బట్టి తెచ్చిన
జాగిలములు.

—పెద్దన.

## సూర్యోదయం

ప్రాచీన శైలాగ్రభాగస్థమగు
నశోకంబున చిగురుజొంపం బనంగ,
వర్షాధిపతి యని వాసవు గొలువ
జేరిన యింద్రగోపక శ్రేణి యనగ;
ఉరుతర పూర్వభూధరము నెత్తంబున
బొలుచు గైరిక గండశిల యనంగ;
కాశ్మీర పటమున గావించి సురపతి
విడిచియాడెడు తూల [illegible]డగ యనగ;
అరుణ కిరణుండు దోతెంచె,
నంబుజాత నర్మ సచివ
స్మితాపాదనంబునందు
జతురుడై, యుష్ణకరముల
జక్రవాక తాప ముడుపుట
నాశ్చర్యధాముడగుచు.

—కేతన.

## శైలేంద్ర తనయ....

హారసిల మణులకు
నాయువు వచ్చె నా
గమనీయమగు
తను కాంతు లెసగ,
మెరుగు దీగెలు
గండుమీలపై
నెలసె నా
దృగ్భాసురద్యుతుల్
తేజరిల్ల,
చమర సుకేశ
పాశముల
దుమ్మెద పిండు
దగిలెనా గుటిల
కుంతలము లమర

కాంచన కుంభముల్
కరికుంభ కర్కశ
మెనసెనా బాలిండ్లు
వొసరి తనర
బాపవశమున
శాపంబు వడి,
విహీన జనుల
సంగతి కర్హమై
పొనర గన్న
యమర సతులొకో యన
దర్శ నార్హలైన
యెరుకు లేమలగాంచె
శైలేంద్ర తనయ
—నన్నెచోడుడు.

## గడన

గడన గల
మగని జూచిన
అడుగడుగున
మడుగు లిడుదు
రతివలు, దమలో,
గడనుడుగు
మగని జూచిన,
నడిపీనుగ
వచ్చెనంచు
నగుదురు సుమతీ.
—బద్దెన.

## శివభక్తులు

అంత్యజుఁ డంత్యజుఁ -
డనుచుఁ గుయ్యిడెద,
రంత్యజునకుఁ జోర -
నది యెట్లు వచ్చు
నరు దగు మీఁదుట్టి -
యగ్రజన్ములకు,
హరభక్తు లిండులు -
చొరఁగరా దనగఁ
గన్నులు గానరు -
గా కింటి లోన,
నెన్నంగఁ గుహీను -
లిట్లున్న వారె ?
రుద్రభక్తుల యిండ్ల -
రూఢిఁ బ్రత్యక్ష,
రుద్రులు గా కేమి -
క్షుద్రు లున్నారె ?
మహేశ్వరుల నిజ
మందిరంబులను,
మహేశ్వరులె కాక -
మనుజు లున్నారె ?
—పాల్కురికి సోమన.

## ఉత్సవం

కనకంపు గ్రోవులు
గొని మంచి కాశ్మీర
జలము లొండురులపై
జల్లు వారు
కర యంత్ర మాది గాగల
జల యంత్రాలి
నోలి నొండురులపై నొత్తువారు,
మెలుపారు తలిరుల
గలకంపు బువ్వుల
వలగొని యొండొరు వైచువారు,
కర్పూర చందన
కస్తూరి మృగవంక
ములుగొని యొండొరు
బూయువారు,
పట్టి పెనగవారు,
పట్టీక రయమున బారువారు,
నెగచి పట్టువారు -
ప్రణయ భావ మెసగ
బారు లుత్సవమున
గూడి నీరుపోత లాడిరొప్ప.
—నన్నెచోడుడు.

## దానశీలత

కారేరాజులు
రాజ్యముల్ గలుగవే
గర్వోన్నతిం బొందిరే
వా రేరీ ?
సిరి మూటకట్టుకొని
పోవన్ జాలిరే !
యుర్విపై బేరైనం
గలదే ?
శిబిప్రముఖులున్
బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు ?
వారినిన్ మరచిరే
యిక్కాలమున్ భార్గవా !
—పోతన

## నీతులు

చెల్లియుండియు
సైరణ సేయు నతడు;
పేద వడియును
నర్థికి బ్రియముతోడ
దనకు గల భంగి
నిచ్చు నతండుఁ ——
బుణ్యపురుషు లని
చెప్పి రార్యులు
బుధవరేణ్యా,

* * *

కడు నమ్మ
యనికియునుఁ
నమ్మమియును సుశీల !
కుశలత కాదు ;
ఎయ్యెడనైనను
బుద్దిసొనిపి
తడవి
కనుగొనంగవలయు
దగవు ధర్మమున్
—తిక్కన

# పంటల ఉత్పత్తి ఉద్యమాలు

యమ్ కె ఆదేని

ప్రత్యేక పరిస్థితులు ఏర్పడినపుడు వాటి నధిగమించడానికి ప్రత్యేకంగా కృషి చేయడం సహజం. ఆహారోత్పత్తిని ఎక్కువ చేయవలసిన పరిస్థితి మన దేశంలోరాగా, కేంద్ర ప్రభుత్వపు ఆదేశం మేరకు ఆంధ్ర ప్రదేశ్‌లోకూడ 1958 సం॥ లో "రాబీ" పంటకాల నుండి అధికాహారోత్పత్తికై ప్రత్యేకఉద్యమాలు ప్రారంభమై, ఇంతవరకూ నడుస్తూ ఉన్నవి. రైతుల సహకారంతో సాధ్యమైనంత ఎక్కువగా ఆహారోత్పత్తిని సాధించడమే వీటి ఉద్దేశం. ఈ ఉద్యమాల్లో కొన్ని ముఖ్య ఆహారసస్యాలనూ, కొన్ని గ్రామాలనూ ఎంచుకొని వాటిలో ఎక్కువ ఫలసాయం పొందడానికి ప్రయత్నం జరుగుతుంది. సంవత్సరంలోని రెండు పంట కాలాలల్లోకూడ వీటిని అమలుపరుస్తున్నారు.

ఈ ఉద్యమాలు ఆహార పంటలైన వరి, జొన్న, రాగి, మొక్కజొన్నలకు వర్తింపచేయబడినవి. అయితే జిల్లా వ్యవసాయాధికార్లకు ఆయాజిల్లాలనుబట్టి ఏయే పంటలను ఈ ఉద్యమములో చేర్చాలో నిర్ణయించే అధికారం ఇవ్వబడింది.

## ఉద్యమాల విస్తీర్ణం, ఫలితాలు

ఈ ఆహారోత్పత్తి ఉద్యమాలు ప్రారంభించినప్పుడు సుమారు 15,000 గ్రామాలకు వర్తింపజేయ బడినవి. జరిగిన ఉద్యమాలలో పొందిన అనుభవాన్ని పురస్కరించుకొని వీటిలో 1960-61 లో కొన్ని మార్పులు చేయబడినవి. 1960 సం॥ లో ఒక్కొక్క జిల్లాలో ఒక్కొక్క గ్రామాన్ని ఎంచుకొని ఆ గ్రామంలో సాంద్ర వ్యవసాయ పథకాన్ని ప్రవేశ పెట్టారు. ఇది ఆహారోత్పత్తి ఉద్యమాలలో అంతర్భాగమే. ఇవి రైతులలో ఉత్సాహాన్ని కలిగించాయి. దానితో ఫలితాలు కూడ ప్రోత్సాహకరంగా ఉన్నాయి. ప్యాకేజి పథకంవల్ల చాలా గ్రామాల్లో ఎకరాకు 2-3 బస్తాలు ఎక్కువగా పండించగలిగారు. ఈ విషయంలో శ్రీకాకుళం జిల్లా నందిగాం గ్రామంలో సాధించిన ఫలితం పేర్కొనదగింది. ఆ గ్రామంలో యీ పథకం ప్రారంభించకముందు ఎకరాకు 15 బస్తాలు వరి ధాన్యం దిగుబడి వస్తూవుండేది. కాని, ఈ కార్యక్రమంజరిగిన తరువాత ఆ గ్రామంలోని 521 ఎకరాల వరిపంటలోనూ ఎకరాకు 28 బస్తాలు దిగుబడి వచ్చింది. ఇందువల్ల ఎకరాకు 288 రూపాయలు అదనంగా ఆదాయం వచ్చింది. ఇది చిన్నవిషయం కాదు. 1961-62 సం॥ ఖరీఫ్, రాబీపంటల ఉద్యమాల కాలంలో ప్యాకేజి పథకాన్ని విస్తరించారు. ఈ కార్యక్రమంలో ఇదివరకు ఒక జిల్లాకు ఒక గ్రామం ఉండే యిప్పుడు ఒక బ్లాకుకు ఒక గ్రామాన్ని ఎన్నికచేశారు. తర్వాత 1962-63 సం॥ లో ఖరీఫ్, రాబీ ఉద్యమాలన్నీ ప్యాకేజి పథకం స్థాయిలో ఒక గ్రామసేవకుని ఆజమాయిషీలో ఒక గ్రామం లేక ఒక బ్లాకులో 10 గ్రామాలు తీసుకొనిరాబడ్డాయి. ఈ పథకాలు జయప్రదం అయిన ప్రాంతంలో ఎకరాకు 2-5 బస్తాల ధాన్యం అధికంగా పండింది. 1963-64 సం॥ లో పశ్చిమ గోదావరిజిల్లా సాంద్ర వ్యవసాయ పథకంతోపాటు క్రొత్త ప్యాకేజి పథకాన్ని 10 జిల్లాలలో ప్రవేశపెట్టబడింది. నీటి పారుదలలో సాగయేపంటలు యిందులో చేర్చబడ్డాయి. ఈ పథకంలో చేరని శ్రీకాకుళం, విశాఖపట్టణం, అనంతపురం, కడప, ఖమ్మం, నల్లగొండ, హైదరాబాదు, మెదక్, ఆదిలాబాద్ జిల్లాలలో 1963-64 సం॥ లో సాధారణ "ఖరీఫ్, రాబీ" ఆహారోత్పత్తి ఉద్యమాలు అమల్లోవున్నాయి.

ఆయా పంటకాలల్లో నడిపే ఉద్యమాలు ఇపుడు సాంద్ర వ్యవసాయ పద్ధతిలో ఉన్నవి. ఈ పద్ధతితో గ్రామ కమతాలకు ఒక నిర్దిష్టమైన సేద్య ప్రణాళిక తయారు చేయబడుతుంది. అందులో మేలైనపంట సాగు వివరాలు అన్నీ ఉంటవి. వాటి నాధారంగా ప్రతి కమతానికి ఏయే వస్తువులు ఎంతెంత ఎప్పుడు అవసరమో గుర్తించబడి ఉంటుంది. వాటిని బట్టి వస్తువుల సరఫరాతో సాంకేతిక సహాయంకూడా అందజేయబడుతుంది. వీటితో బాటు సస్యరక్షణకు మందులు సగంధరకు అందజేయబడుతున్నాయి. తక్కావీ ఋణాలూ, ప్రత్యేక ఋణాలూకూడ రైతులకు మంజూరు చేయబడుతున్నాయి.

ఆహారోత్పత్తి యితోధికం చేయడలచే కార్యక్రమాలన్నీ జయప్రదం కావాలంటే

సమృద్ధిగా రసాయన ఎరువుల సరఫరా ఏర్పాట్లు ఉండాలి. అవసరమైతే జిల్లా పరిషత్తు ద్వారా అదనంగా ఎరువులను సరఫరా చేయడానికి వ్యవసాయ శాఖ రైతులకు తోడ్పడుతుంది. గ్రామాల్లో వున్న వ్యవసాయసిబ్బంది భూమి తీరునుబట్టి సేద్య ప్రణాళికలు తయారుచేశారు. వాటినిబట్టే కావలసిన ఎరువుల పంపకం జరుగుతుంది.

ఈ ప్రత్యేక ఆహారోద్యమాలలో పచ్చి ఆకు ఎరువులు వ్యాప్తికూడా ముఖ్యం. పచ్చి ఎరువు విత్తనాలు సకాలంలోకూడ కొందరికి దొరకవు. కనుక 100 గ్రాముల విత్తన ముందే పొట్లాలు తక్కువ ధరలకు రైతులకు ఇప్పించి వరిపొలాలగట్లపై విత్తన ములకై వేయిస్తున్నారు. ప్యాకేజి పథకం వున్న గ్రామాలలో ఒక్కొక్క బ్లాకులో 500 విత్తనాల పొట్లాలు రైతులకు అంద చేస్తున్నారు. బంజరు భూములలోనూ, పోరంబోకు స్థలాల్లోనూ చెట్లునాటే కార్యక్రమం ఉధృతం చేయబడింది. వీటివలన చిట్టడవులు దరిదాపులలో కానిపల్లెలకు పచ్చియాకు ఎరువుల సదుపాయం కలుగుతుందన్నమాట.

మంచి వ్యవసాయపు పనిముట్లు కూడ రైతులకు అందజేయబడుతున్నాయి. రోటరీ పుష్‌హోలు యితర పనిముట్లు నాల్గవ వంతు తక్కువ ధరకు అమ్మబడుతున్నాయి.

వసతులున్న రైతులందరికీ ఆయిల్ ఇంజన్లు, ఎలక్ట్రిక్ మోటార్లు, నీరుతోడు యితర యంత్రాలు అద్దె కొనుగోలు పద్ధతి లోనూ తక్కువ ఋణాలద్వారానూ సులభంగా కొనుటకు ఏర్పాట్లు చేయబడినాయి.

ప్రత్యేక వ్యవసాయోత్పత్తి ఉద్యమాలలో ఖరీఫ్, రాబీ పంటకాలాలలో సంవత్సరానికి 30 లక్షల రూపాయల మేరకు ఋణాలు రైతులకు యివ్వబడుతున్నాయి.

ఈ ఉద్యమాల్లో ఎక్కువగా పండించిన గ్రామానికి భారత ప్రభుత్వం సాముదాయక బహుమతులు ఏర్పాటుచేసి ప్రోత్సాహపరుస్తున్నది. ప్రత్యేకంగా పంట కోతలుచేసి, జిల్లాలోని పంటను అంచనా వేస్తున్నారు. గత మూడుసంవత్సరాల సరాసరి దిగుబడితో ఇప్పటి దిగుబడులు పోల్చగా యే జిల్లాలో 15 శాతం కంటే అధికంగా వస్తుందో, ఆ జిల్లాకు10,000రూపాయలు సాముదాయక బహుమతి ఇస్తారు. 1958-59 సం॥ లో విశాఖపట్టణం, కృష్ణా, హైదరాబాదు, నిజామాబాదు, కరీంనగర్ జిల్లాలకు యీ బహుమతులు వచ్చాయి. ఈ జిల్లాల అన్నింటికంటే అత్యధికంగా పంట దిగుబడి సంపాదించిన కృష్ణా జిల్లాకు "రాజ్యకలశ" బహుమతి యివ్వబడింది. 1959-60 సంవత్సరపుఖరీఫ్,రాబీ ఉద్యమాలలో విశాపట్నం కర్నూలు, హైదరాబాదు, నిజామబాదు, మహబూబ్‌నగర్, నల్లగొండ, వరంగల్లు, చిత్తూరు మెదక్‌జిల్లాలు సాముదాయక బహుమతులందుకొన్నాయి. ఇందులో హైదరాబాదు, విశాఖపట్టణం, నిజామాబాదు జిల్లాలు ఖరీఫ్, రాబీ రెండు ఉద్యమాలలోనూ బహుమతులు పొందినవి. అయితే హైదరాబాదు జిల్లా "రాజ్యకలశ" బహుమతి పొంద కలిగింది.

1961-62సంవత్సరపు ఖరీఫ్‌ఉద్యమాల్లో రాష్ట్రంలో 8 జిల్లాలకూ. 1960-61 సం॥ రాబీ ఉద్యమంలో 7 జిల్లాలకూ యీ సాముదాయకబహుమతులు అందజేయబడినాయి, 1961-62 సం॥ లో ఖరీఫ్, రాబీ ఉద్యమాల రెంటిలోనూ ఆదిలాబాద్ జిల్లాకు "రాజ్యకలశ'' బహుమతి ఇవ్వబడింది. రాష్ట్ర స్థాయిలోనూ, కేంద్రస్థాయిలోనూ ఇటువంటి ప్రోత్సాహం వుండటంవల్ల ఈ ఉద్యమాలు రైతుల సహకారంతో జయప్రదమవుతున్నాయి.



---

(01 వ పేజీ తరువాయి)

నిబంధనను ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం యీ క్రింది విధంగా సవరించింది.

6 వ నిబంధనలో మొదటి వాక్యంచివర 'ప్రతియేటా' 'ఆగస్టు 31' అనే మాటల మధ్య 'మరియు డిశంబరు 31' అనే మాటను చేర్చి, యీ మొదటివాక్యం అనంతరం యీ దిగువనున్న దానిని కలిపి చదువుకోవాలి.

"ఆయేడు ఆగస్టు 31 వ తేదీ వరకూ వచ్చిన దరఖాస్తులు (కొత్తవి, రెన్యూవలువి) మొదటి జట్టుగా పరిగణింపబడి, వీటికి ఆగస్టు 31 వ తేదీ అనంతరం సాధ్యమైనంత త్వరలో అనుమతి ఉత్తరువులు యివ్వబడతాయి. ఆ యేడు డిశంబరు 31 వ తేదీ వరకూ వచ్చిన దరఖాస్తులు రెండవ జట్టుగా పరిగణింపబడి, డిశంబరు 31 తరువాత సాధ్యమైనంత త్వరలో అనుమతి ఉత్తరువులు ఇవ్వబడతాయి. ఆయేడు డిశంబరు 31 వ తేదీ తరువాత వచ్చే దరఖాస్తులు ఎట్టిపరిస్థితులలోనూ పరిశీలింపబడవు.

## సెకండరీ విద్య

అల్పసంఖ్యాక భాషావర్గాలవారు దరఖాస్తులను ముందుగానే రిజష్టరు చేసే పద్ధతిని ప్రవేశ పెట్టడానికి సంబంధించిన ఉత్తర్వులను రాష్ట్రంలోని సెకండరీ పాఠశాలలన్నింటికీ వర్తింపజేయడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆదేశించింది. ★

# ప్రశ్నోత్తరావళి

శ్రీ బి. జనార్ధన్, హయాత్ నగర్, తూర్పు హైద్రాబాదు.

ప్రశ్న: హైద్రాబాదుజిల్లాలోవిమానం ద్వారా ఎరువులను ఎప్పుడు చల్లుతారు?

సమాధానం: హైద్రాబాదు జిల్లాలో విమానం ద్వారా ఎరువులను చల్లించే కార్యక్రమ మేదీ ప్రస్తుతానికి లేదు.

శ్రీ వై. తిరువెంగళయ్య, నరుకూరు, నెల్లూరు జిల్లా.

ప్ర: ప్రయాణీకుల సౌకర్యార్థం, రైల్వేలలో మాదిరిగా పెద్ద బస్సు స్టాండ్లలో ప్రభుత్వం మరుగు దొడ్లను ఏర్పాటు చేస్తుందా?

సమా: ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రోడ్డు రవాణా కార్పొరేషను హైద్రాబాదు-విజయవాడలలోని బస్టాండ్లలో ప్రయాణీకుల సౌకర్యార్థం మరుగుదొడ్లను ఇది వరకే నెలకొల్పింది.

శ్రీ ఆర్. వి. ఎస్. సుబ్రహ్మణ్యం గుప్త, కురిచేడు.

ప్ర: గుండ్లకమ్మకు అడ్డంగా కురిచేడు-వినుకొండ రోడ్డుపై కాజ్వే నిర్మాణం పూర్తయిందా?

సమా: గుంటూరు — వినుకొండ — కురిచేడు రోడ్డుపై 59/3-4 వ మైలువద్ద గుండ్లకమ్మ నదికి అడ్డంగా కాజ్వే నిర్మాణం రెండునెలల క్రితమే ముగిసింది. ఈ కాజ్వేపై రాకపోకలుకూడా జరుగుతున్నాయి.

శ్రీ ఎం. పోతారెడ్డి, కూచనపల్లి.

ప్ర: విజయవాడవద్దగల పటమటలోని వయోజన ఉపాధ్యాయ శిక్షణా పాఠశాలలో ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయులు చేరవచ్చా? శిక్షణ ఎంతకాలం జరుగుతుంది? శిక్షణాకాలంలో ఉపాధ్యాయులకు జీతం ఇస్తారా?

సమా: పటమటలోని వయోజన ఉపాధ్యాయ శిక్షణాపాఠశాలలో ప్రవేశం పొందడానికి ఉపాధ్యాయులు అర్హులే. వయోజన పాఠశాలల్లో పనిచేస్తున్న ఉపాధ్యాయులకు ప్రాధాన్యత ఇవ్వబడుతుంది.

శిక్షణ 45 రోజులు లేదా ఆరువారాల పాటు జరుగుతుంది. శిక్షణాకాలంలో అభ్యర్థులకు నెలకు రు. 22.50 న.పై. ల చొప్పున స్టైపండు చెల్లించబడుతుంది.

శ్రీ తుత్తగుంట రామారావు, వడిసలూరు, తూర్పు గోదావరి జిల్లా.

ప్ర: గోదావరికి అడ్డంగా నిర్మించదలిచిన పోలవరం బ్యారేజ్, ఇప్పూరు ఆనకట్ట, ఇంచంపల్లి ఆనకట్టలకు సంబంధించిన పూర్తివివరాలను తెలపండి. వీటిని నిర్మించాక రామపాదసాగర్ ప్రాజెక్టు నిర్మాణానికి అవకాశం వుందా?

సమా: 1. ఇంచంపల్లి ప్రాజెక్టు ఇది బహుళార్థసాధక ప్రాజెక్టు. దీని క్రింద సీలంపల్లి గ్రామసమీపంలో గోదావరికడ్డంగా ఆనకట్ట నిర్మించబడుతుంది. 600 మెగావాట్లవరకు విద్యుదుత్పత్తి జరుగుతుంది. 172 మైళ్ళు, 112 మైళ్ళ పొడవునవుండే రెండు కాలువలు వరంగల్, ఖమ్మం జిల్లాలలో 3 లక్షల ఎకరాలకు నీటిపారుదల చేస్తాయి.

ఈ ప్రాజెక్టు ముఖ్యాంశాలు

రిజర్వాయరు:

1. లైవ్ స్టోరేజి ... 390 శ.కో. ఘ. అ.
2. ఆరగాణి ... 100,300 చ. మైళ్లు.
3. నీటిలో మునిగిపోయే విస్తీర్ణం 355,200 ఎకరాలు
4. పూర్తి రిజర్వాయరు మట్టం + 390
5. జలాశయం కనీసమట్టం + 353

హెడ్ వర్క్స్

(అ) ఆనకట్ట: మాసన్రీ: పొడవు 6,180 అడుగులు; ఎత్తు 175 అడుగులు.

(ఆ) స్పిల్ వే: కేంద్రం: ఒక్కొక్కటి 58 అ. × 40 అ. ల చొప్పున 56 గేట్లు. పరిమాణం: 2,500,000 క్యూసెక్కులు.

(ఇ) నీటి విసర్జన: నదీతూములు ఒక్కొక్కటి అ. 12 × 8 అ. ల చొప్పున 14. కుడివైపు పెద్ద తూము: ఒక్కొక్కటి అ 6 × 10 అ. ల చొప్పున 7 గవాక్షాలు. ఎడమవైపు పెద్ద తూము: ఒక్కొక్కటి అ. 6 × 10 అ. ల చొప్పున 5 గవాక్షాలు.

కాలువలు 1 కుడి కాలువ: పొడవు, 172 మైళ్ళు. పరిమాణం 4,078 క్యూసెక్కులు.

2. ఎడమకాలువ: పొడవు 12 మైళ్ళు. 2,952 క్యూసెక్కులు.

ఆయకట్టు:

| జిల్లా | కుడికాలువ క్రింద | ఎడమకాలువ క్రింద |
|---|---|---|
| 1. వరంగల్ | 64,000 ఎ. | ... |
| 2. ఖమ్మం | 112,000 ఎ. | 124,000 ఎ. |

ఈ పథకం సమగ్ర పరిశీలన జరుగుతున్నది.

సమా : 2. ఇప్పూరు ఆనకట్ట, పోలవరం బ్యారేజ్ : ఇది ఒక సమీకృత పథకం. దీనిమేరకు ఇప్పూరు వద్ద గోదావరికి అడ్డంగా ఆనకట్ట, ఇప్పూరు ఆనకట్ట స్థలానికి దిగువన 36 మైళ్ళ దూరంలో పోలవరం వద్ద పిక్ బ్యారేజి, 124 మైళ్ళ, 134 మైళ్ళ పొడవుగల రెండు కాలువలు నిర్మించబడతాయి. ఇవి 766,000 ఎకరాలకు నీటిపారుదల చేయ గలుగుతాయి. 420 మెగావాట్ల విద్యుదుత్పత్తి జరుగుతుంది.

ఈ పథకం ముఖ్యాంశాలు దిగువ పొందు పరచబడినవి :

రిజర్వాయరు

(అ) 1. లైవ్‌స్టోరేజి 205 శ.కో.ఘ.అ. + 335 శ.కో.ఘ.అ. వరదస్టోరేజి.

2. అరగాణి : 116,584 చ. మైళ్ళు.

3. పూర్తి జలాశయం మట్టం + 191

4. ఎం. డబ్ల్యు. ఎల్. + 208

(ఆ) ఆనకట్ట: కొంతభాగం మాసన్రీ, కొంత భాగం కాంక్రీట్, స్పిల్ వేభాగం–2,700 అడుగుల పొడవు. నాన్ స్పిల్ వేసెక్షన్ ప్రతివైపున 400 అడుగులు. ఎత్తు 180 అడుగులు.

హెడ్‌వర్క్స్: 1. బ్యారేజి: 7,780 అడుగుల పొడవు; స్పిల్ వేభాగం: 5368 అడుగుల పొడవు.

కాలువలు: 1. కుడికాలువ: పొడవు 124 మైళ్ళు. పరిమాణం 6,000 క్యూసెక్కులు.

2. ఎడమకాలువ : పొడవు 130 మైళ్ళు. పరిమాణం 9,139 క్యూసెక్కులు.

ఆయకట్టు:

| జిల్లా | ఎడమ కాలువ క్రింద | కుడి కాలువ క్రింద |
|---|---|---|
| విశాఖపట్నం | 3,27,000 ఎ. | ... |
| పశ్చిమ గోదావరి | ... | 2,49,000 ఎ. |
| తూర్పు గోదావరి | 1,39,000 ఎ. | ... |
| కృష్ణా | | 51,000 ఎ. |

3. సమగ్ర పరిశీలనలు ముగిశాయి. పూర్తి వివరాలతో ప్రాజెక్టు నివేదికను సిద్ధం చేయవలసివుంది. ఇప్పూరు ఆనకట్ట, పోలవరం బ్యారేజ్‌పథకం రామపాద సాగర్ ప్రాజెక్టుకు ప్రత్యామ్నాయమైన ప్రతిపాదన. తొలుత నిర్ణయించుకున్న రామపాదసాగర్ ప్రాజెక్టుస్థలం విషయంలో ఇబ్బందులు కలుగడంవల్ల దానికి స్వస్తిచెప్పి ప్రత్యామ్నాయంగా ఇప్పూరు ఆనకట్ట, పోలవరం బ్యారేజ్ పథకం ప్రతిపాదించబడింది.

*శ్రీ రుచంకి వెంకటరావు, తుని.*

ప్ర: విశాఖపట్నం జిల్లా సర్పీపట్నం తాలూకాలో తాండవ రిజర్వాయరు పథకం పనులను ఎందుచేత నిలిపివేశారు. ఇది ఎప్పుడు పూర్తవుతుంది ?

సమా : కేంద్రజలవిద్యుచ్ఛక్తి సంఘం నుంచి సాంకేతిక మంజూరీ లభించక పోవడంవల్ల తాండవ రిజర్వాయరు పనులను నిలిపివేశారు. ఈ కమిషను నుంచి సాంకేతిక మంజూరీ లభించిన వెంటనే పనులను తిరిగి ప్రారంభిస్తారు.

*శ్రీ కె. వి. నారాయణ, మెంటపూడి.*

ప్ర: పశువ్యాధులకు ఆయుర్వేద ఔషధాలను అమ్మే ఫార్మసీని రిజిస్టరు చేయించడానికి ఎవరికి వ్రాయవలసి వుంటుంది ?

సమా : పశువ్యాధులకు ఆయుర్వేద మందులను అమ్మే ఫార్మసీలను నమోదుచేసే పద్ధతి ప్రస్తుతం ఆచరణలోలేదు. మీకు ఇంకాఏమైనా వివరాలు కావలిస్తే డ్రగ్ కంట్రోలర్‌కు, హైదరాబాదులోని వైద్య శాఖ డైరెక్టరు కార్యాలయం చిరునామాకు – వ్రాయండి.

*శ్రీ బి. వి. నరసింహారావు, దోమకొండ, కామారెడ్డి తాలూకా, నిజామాబాదుజిల్లా.*

ప్ర: మా గ్రామానికి 1962 నవంబరు 26వ తేదీన విద్యుచ్ఛక్తి సరఫరాను ప్రారంభించారు. సుమారు 500 ఇండ్లలో ఎలక్ట్రిక్ వైరు ఫిట్టింగులు జరిగాయి. కాని ప్రభుత్వం వాటికి ఇంతవరకూ విద్యుచ్ఛక్తిని సరఫరా చేయలేదు. త్వరలో సరఫరా చేస్తారా ?

సమా : దోమకొండ గ్రామానికి విద్యుచ్ఛక్తి సరఫరా చేయడం జరిగింది. ఈ పథకం మేరకు దిగువవిధంగా విద్యుచ్ఛక్తిసరఫరాకు మంజూరీ లభించింది.

| | | | |
|---|---|---|---|
| పరిశ్రమలు.... | 3 | 75 | అ. శ. |
| వ్యవసాయం... | 80 | 400 | ,, |
| ఇండ్లు... | 200 | | |

పై ప్రశ్ననుబట్టి అన్ని ఇండ్లకూ ఇంకా విద్యుచ్ఛక్తి సరఫరా జరగనట్లు విదితమవుతున్నది. ఇంకా విద్యుచ్ఛక్తి పొందని కొందరు వినియోగదార్లకు విద్యుచ్ఛక్తి సరఫరా జరగడంలో వ్యవహార సంబంధంగా ఆలశ్యం జరిగి వుండవచ్చు. విద్యుచ్ఛక్తి సరఫరా మంజూరు చేయబడిన వారికెవ్వరకీ ఆ సరఫరా నిరాకరించబడలేదు. తమ ఇండ్లకు వైర్లబిగింపులను పూర్తిచేసుకున్న వినియోగదార్లందరికీ విద్యుచ్ఛక్తి లభింపజేయబడుతుంది. ఇదివరకే విద్యుచ్ఛక్తి సరఫరా మంజూరు చేయబడిన వినియోగదార్లు విద్యుచ్ఛక్తి పొందడంపై ఎట్టి నిర్బంధాలు లేవు.



# లలనావనం



## ✽ "బంగారమే శృంగారమా?" ✽

— టి. రత్నమాల

అనాదినుండీ భారతావని రత్నగర్భ అనీ, బంగారు గనులకునిధి అనీ, పేరెన్నికగన్నది. నవరత్నఖని భారతావని. అందుకనే నాటోలు మన భారతీయులు అలంకరణకు నవరత్నాలూ, సువర్ణంతోసహా వివిధ రకముల భూషణాలు తయారుచేయించి పురాణ యుగంనుండీ స్త్రీ పురుషులు ధరించేవారు.

కొందరు మహారాణులు ఏడువారాల సొమ్ములు ధరించేవారట. అనగా ఒకనాడు వజ్రాలతో తయారుకాబడినవీ, మరోనాడు కెంపులూ, పచ్చలూ, నీలాలూ, ముత్యాలూ, వైఢూర్యాలూ ఈ విధంగా ఒకొక్కనాడు ఒక రకమైన ఆభరణాలు అలంకరించుకునే వారట.

ఇన్ని విధాలుగా వారలంకరించుకునే వారంటే భారతదేశపు భాగ్యమే కారణం. మన భూమిలో, సముద్రంలో, గనులలో, లభ్యమవుతున్న యీ సంపదను వారు కేవలం వినోదార్థం, విలాసంగా ఉపయోగించుకునే వారనుకోవాలి.

పురాణ యుగంలో శ్రీరామచంద్రుడూ, తమ్ములూకూడా చేతికి కంకణాలూ, దండ కడియాలూ మెడలో హారాలతో విరాజిల్లుతున్నట్లు మన చిత్రకారులు చిత్రించారు. ఆ నగలవలననే వారంత సౌందర్యరాసులుగా మనకు కనుపించారనుకుంటే అది కల్ల. సీతాకళ్యాణమునకు ఆ సీతమ్మతల్లిని నఖ, శిఖ పర్యంతం వజ్రాలంకృతగా అలంకరించారట. వివాహతంతు ముగిసిన పిదప వధూవరులు పెద్దలందరికీ నమస్కరించడం జరిగింది.

ఆ తరువాత వశిష్ఠమహర్షి జానకీదేవి నుద్దేశించి 'తల్లీ రామచంద్రుని పాదములకు నమస్కరించు' అని ఆదేశించారట. జానకి కిమ్మనకుండా గమ్మున నిల్చున్నదట. మరల నొకమారు మహర్షి హెచ్చరించారు. ఊహూ, సీత కదలలేదు, మెదలలేదు. అంత మహర్షి కించిత్ కోపగించారు. ఏమి టీపిల్ల మొండితనం, అనుకొని అంతలోనే కోపం తమసొత్తుకాదని తెలుసుకుని సీతకు దగ్గరగా వచ్చి 'అమ్మా! పతికి పతియే గతి అన్న నానుడి నీకు తెలియనిదా? అందునూ నీ పతి సర్వలోకాధిపతికదా! రాక్షసులను దునుమాడి రాతిని నాతిగజేసిన రామచంద్రుని పాదములంటి మ్రొక్కుటకు వెనుకంజ వేయుటకు కారణమేమమ్మా!' యని బుజ్జగింపుగా అడిగినారట.

అప్పుడు మైథిలి ఒక్కమారులిక్కిపడి నట్లయి 'స్వామీ మీకు తెలియనిదేమున్నది? రాతిని "రమణి"గా మార్చిన వారి పాద కమలములను ఆపాదమస్తకము రాళ్ళతో అలంకరింపబడిన నే నంటినచో యీ రాళ్ళన్నియూ "రమణు"లుగా తయారయిన పక్షంలో నే నేమి చేయగలను?' అంటూ తన సంశయాన్ని వెలిబుచ్చిందట. ఆ మైథిలి పల్కులువిని వశిష్ఠమహర్షి హర్షం వెలిబుచ్చగా, ఆమె వివేచనాశక్తికి అందరాశ్చర్యపడగా శ్రీరామచంద్రు డుప్పొంగిపోయినారట. ఇది పిట్టకథ కావచ్చును. కానీ ఆ విధంగా అలంకారశోభితులుగా చిత్రించిన చిత్రపటాలుచూచిన ఆ నేత్రాలతోనే మనం మరొక చిత్రాల వంకకు మన దృష్టి మరల్చుదాము.

అది కైకేయి కోరికపై సీతారామలక్ష్మణులు వనవాసమునకు బయలుదేరిన చిత్రం. ఇందు వారందరునూ తమ సర్వాభరణములనూ దీసివైచి కేవలం నారచీరెలు ధరించినారు. ఇప్పుడు కూడ వారి సౌందర్యమున కేలోపమునూ రాలేదు. సరికదా? ఆ సిగజుట్టులూ, మోకాలిపైకి కట్టిన ఆ నారపంచెలూ, ధనుర్బాణాలూ వారికి మరింత శోభ నిచ్చాయి. నిరాడంబరముగా నారచీరెతో పతివెంట నడచిన ఆ లోకైకమాత

సీతనుగాంచిన ఆమె సహజసౌందర్యము ద్విగుణీకృతంగా మనకు కన్పట్టును

ఆ సౌందర్యాన్ని కాంచియేకదా శూర్పణఖ రామ లక్ష్మణులను వాంఛించినదీ; సీతను రావణుడు ఎత్తుకొనిపోయినదీ; దీనిని బట్టి మనము బాగా ఆలోచించి తరచి చూచినచో యీ బంగారమే మనకు శృంగారాన్నిచ్చుచున్నదను మాట ఒట్టి బూటకమనుకోవాలి. శకుంతల కణ్వాశ్రమములో పెరిగినది. ఆమెకు నగలూ, నాణెములూ లేవు. కేవలమామె పుష్పాలతోనే అలంకరించుకునేది. అట్టి ఆ నిరాడంబర కన్యను దుష్యంతుడు గాంధర్వ వివాహ మాడినాడంటే ఆమె సహజసౌందర్యాని కది గీటురాయి.

నేటి మన స్త్రీలు బంగారానికెక్కువ ప్రాముఖ్యతనిచ్చి దానివలన తమ సౌందర్యం ఎక్కువ కాగలదను కొనడం ఇప్పటి విషమ పరిస్థితులలో చాలా తెలివి తక్కువనే చెప్పాలి. పాశ్చాత్య దేశాలవారు ఏ అలంకారాలూ లేకుండా తమ దుస్తులతోనే తళతళ లాడుతారు.

భారతస్త్రీ వారివలెనే బోసిగా వుండుట కంగీకరించదు. ఇందుకు మన ప్రాచీనుల వద్దనుండి అనుశ్రుతంగా వచ్చుచున్న అలంకారాల అనుభవం కావచ్చు. ఇప్పుడు మనం ఒక్క బంగారాన్ని మాత్రం దేశం కోసం సమర్పించినా వివిధ రకాలగాజులూ, పూసల హారాలూ, ప్లాస్టిక్‌తో తయారైన గాజులూ, మొదలైనవి విరివిగా మనం వాడుకోవచ్చును కదా ? దొంగల భయాన్ని పారద్రోలి, దేశ సౌభాగ్యాన్ని నిలబెట్టగలిగే యీ బంగారాన్ని మనం ప్రభుత్వానికి అందజేసి అందుకు ప్రతిఫలంగా "గోల్డుబాండ్స్" తీసుకోవచ్చును.

ఎక్కువ భాగ్యవంతులు తమకున్నంతలో దేశరక్షణకే బంగారాన్ని దానంచేసి, సామాన్యులాబంగారాన్ని ప్రభుత్వ పరం చేసి దాని విలువకు తగిన బాండ్సు తీసుకొనడం ఎంతైనా సమంజసం. పూర్వం మన స్త్రీలకు చదువనూ, వ్రాయనూ తెలియదు. ఆస్తిలో వాటావుండేదికాదు. అందువల్ల పుట్టింటివారూ, అత్తింటివారూ పెట్టిన ఆభరణాలే అండగావుండేవి. అప్పట్లో వారికి బ్యాంకులో డబ్బు దాచుకొనుటగానీ, సేవింగ్ సర్టిఫికేట్సు కొనుక్కొనుటగానీ, బహుమతి బాండ్లుగానీ ఏమీ తెలియవు. పైగా తండ్రి ఆస్థిలో హక్కువుండేదికాదు ఇప్పుడో మన స్త్రీలు అన్నిటిలో పురుషునితో సమానహక్కులు కలిగివున్నారు. కనుక మనకీరోజుల్లో బంగారంపై మోజంతగా పనికిరాదు. మన దేశాన్ని చైనావాళ్ళనుండి రక్షించుకునేందుకు మన బంగారాన్ని విరివిగా ప్రభుత్వానికందించి ఆయుధసామాగ్రి ఎక్కువగా తెప్పించి మన శత్రువును పారద్రోలటానికి మనం పాటుబడాలి. ఈ దృక్పథంతో చూస్తే బంగారమే శృంగారమని అనుకొనము



# నవగీతి

— ఎ. యస్. ప్రకాశ్ బాబు

ఎవడమ్మా ఈ నాటికి
తెగువతోడ మనతోటను
తనదటంచు తనయులతో
తగవులాడ నెంచువాడు ?

సొబగులతో సొంపారెడు
సుందర నందన వనమిది
శాంతి జ్యోతి కాంతులందు
రూపొందిన జాతినీది.

సుంతయైన చింతలేక
కలకలనవ్వెడు పాపలు;
నిరాగసులు దయామయులు
చరియించెడు భూమినీది.

బ్రతుకులందు వెతల బరువు
దించివేయ నెంచి సమత
ప్రేమమతతో సాగిపోవు
సుమతులుండు జగతినీది.

దురాశయనెడు కసవుమేసి
మదియించిన మృగమువైరి;
సుజనతయెడ దోసగుచేయ
సమకట్టిన ఈ సుపరుడు.

మంచియనెడు కుసుమంబును
త్రుంచ నెంచు ఖలులకు నీ
జనతలోని వున్నతినిక
తగినరీతి చూపగలము.

అంతులేని సంపదలతో
ఇంపౌనరెడు పూదోటను
హరియించగ వచ్చేనీచుల
పీచమడచి పంపగలము.

గతమె 'వర్తమానము' నకు
దారిచూపు కరదీపిక
ఊహలోని భావికికను
రూపమొసగి మనగలము.

మాకు అనుసరితమమ్మా
గతమందలి మనశూగత
దీక్షైనది నాటిచరిత
ఈ యువతకు మేటిబాట.

నీదు సిరుల సారము దిని
వికసించిన తరముమాది
నీ సేవకు తనువులైన
నగవుచు పీడెదమమ్మా.

మాకెన్నో శుభము లొసగి
అనురాగపు పెన్నిధిగా
బ్రోచిన తల్లీ నీ వ్యథ
విదితము మా కెల్లరకును.

నీయనుంగు తనయులుగా
నీ దీవెన వెలుగులోన
ఈ 'వని'లో శాంతినింప
కదలెద మీ క్షణమందే.

# గర్భిణీ స్త్రీలు - వారు తీసుకోవలసిన జాగ్రత్తలు

డాక్టర్ కె. వసుంధర

గర్భిణీ స్త్రీ తీసుకోవలసిన జాగ్రత్తలు అనగానే, మూడువంతులు తొలిచూలు గర్భిణీకి వర్తిస్తుంది. ఎందువల్లనంటే పిల్లల తల్లులు, ఈ జాగ్రత్తలు, నియమాలు అనుభవపూర్వకంగా కొద్దో గొప్పో తెలుసుకుంటారు కాబట్టి. పండంటి పదిహేనుల పాపను, ఏ కష్టంలేకుండా సునాయాసంగా ప్రసవించాలని కాబోయే యే తల్లికి వుండదు? ప్రసవమనేది చాలా శ్రమ, ఓర్పు, ఓపికతో కూడుకొన్నపని. అందుకు తగ్గ ఓపిక, స్థోమతు తెచ్చుకోవాలంటే, కొన్నిజాగ్రత్తలను, నియమాలను గర్భిణీ స్త్రీ బిడ్డ కడుపులోపడ్డదగ్గరనుండీ, ప్రసవించేవరకూ, పాటించాలి.

గర్భిణీ స్త్రీ తాను ప్రసవించేకాలం ఉజ్జాయింపుగా తెలుసుకోవడం ఎంతో అవసరం. ఏవేవో గుణించుకొని, సరిగ్గా లెక్కతెలియనందువల్ల తనకు ఆ సమయంలో సహాయం చేయడానికని వచ్చిన దగ్గరబంధువులు నెలల కొద్దీ వుండిపోవడం, లేక వాళ్ళు రాకముందే ఆ కాస్త పుణ్యకాలం జరిగిపోయి, సమయానికి ఎవరూలేక యిరుగుపొరుగులపై ఆధారపడడంలాటివితరచూ జరుగుతూవుంటాయి. అదీకాకుండా ఫలానా వారం, ఫలానా నెల అని తెలిస్తే, అందుకు కావలసినసరంజామా, ఇంట్లోకి కావలసిన అవసర పరికరాలు ముందు ఒకనెలనుండి, తరువాత రెండు నెలలవరకూ సరిపోయేట్లు జాగ్రత్త పెట్టుకోవచ్చు. ఇవన్నీ కాకుండా అసలయిన కారణం యింకొకటి వుంది. గర్భిణీ స్త్రీ తాను యీ చెప్పబోయే పద్ధతిప్రకారం ప్రసవకాలాన్ని నిర్ణయించుకొని, ఆ నిర్ణయకాలానికి ప్రసవం జరగనట్లయితే, (లేక 4 వారాలు గడచిపోయినా) తనకు స్వాభావికంగా ప్రసవం జరిగే పద్ధతికి ఏదో ఆటంకం కలిగిందన్నమాట. అప్పుడు త్వరపడి డాక్టర్‌దగ్గరకి వెళ్ళితే పిల్లకీ, తల్లికీ కూడా ప్రమాదాలు తప్పవచ్చు.

ప్రసవకాలం ఎలా నిర్ణయించుకోవాలో చెబుతాను. ఇది చాలా సులభం. గర్భిణీ స్త్రీ తాను ఆఖరిసారిగా వెలుపలవున్న మొదటి రోజును జ్ఞాపకం పెట్టుకోవాలి. ఆరోజుకి 7 రోజులు కలిపి 9 నెలలు ముందుకుగాని, 3 నెలలు వెనక్కిగాని లెక్కపెట్టాలి. ఉదా : చివరిసారి వెలుపలవున్న మొదటి రోజు అక్టోబరు 20వ తేదీ అయినట్లయితే దానికి 7 రోజులు కలిపినపక్షంలో అక్టోబరు 27వ తేదీ అవుతుంది. ముందుకి 9 నెలలు గానీ, వెనక్కి 3 నెలలుగానీ లెక్కపెట్టేట్లయితే అప్పుడు ప్రసవం జరిగే రోజు ఉజ్జాయింపుగా జూలై 27వ తేదీ అవుతుంది. సాధారణంగా ఈ రోజుకి పదిరోజులు ముందుగానో తరువాతనో ప్రసవం జరగవచ్చు. పిల్లతల్లుల విషయంలో, ఒకవేళ వారు మళ్ళీ వెలుపల వుండకుండానే గర్భందాల్చిన యెడల, కడుపులోని పిండం కదలిక మొదలయిన రోజునుండి లెక్కపెట్టుకోవాలి. ఈ కదలిక నాలుగవమాసం సగాన పడ్డ తరువాత జరుగుతుంది. పిండం పూర్తి స్వరూపందాల్చిన దగ్గరనుండీ ప్రసవించే కాలం 280 రోజులు. దీనిని బట్టి తను ప్రసవించేకాలం నిర్ణయించుకోవచ్చు. అయితే ఇది పైన ఉదహరించినంత సరయిన లెక్కకాదు.

స్త్రీ తాను గర్భం దాల్చినట్లు తోచిన వెంటనే డాక్టర్‌ని సంప్రదించాలి. తాను మొదటిసారిగా ఏ డాక్టర్‌నయితే సంప్రదిస్తుందో, ప్రసవించేవరకూ, ప్రసవించడానికి కూడా అదే డాక్టర్‌ని సంప్రదించాలి. గర్భందాల్చిన మొదటి 30 వారాలు నాలుగు వారాలకి ఒకసారి, 30 నుండి 36 వారాల వరకు ప్రతి 15 రోజులకు ఒకసారి, ఆ తరువాతప్రతివారం డాక్టర్‌ని సంప్రదిస్తూ వుండాలి. ఇలా డాక్టర్ దగ్గరకు వెళ్ళినప్పుడల్లా, రక్తపోటు, మూత్రం, రక్తం బరువూ, పిండం పెరుగుదలను, పరీక్ష చేయించుకోవాలి. దానిమీదట, తనకు ప్రసవం మామూలుగా జరుగుతుందో, లేక హాస్పిటల్‌లో చేరాలో డాక్టర్ నిర్ణయిస్తారు. సామాన్యంగా మొదటికాన్పు హాస్పిటల్‌లో జరగడమే మంచిది.

పైనచెప్పిన ప్రకారం డాక్టర్‌ని సంప్రదిస్తూ, ఆ మధ్యకాలంలో ఎప్పుడయినా బట్ట కనిపించడంగాని, తరచూ వాంతులు కలగడంగాని జరిగినా, మూత్రం బిగబట్టినా, వళ్లు వాపు చూపినా, విడవకుండా తలనొప్పి కలిగినా, కడుపులోపసిబిడ్డ కదిలికలు ఆగినట్లు

తోచినా, కడుపు బిగబట్టినా, వెంటనే డాక్టర్ దగ్గరకు వెళ్లాలి.

*ఇక గర్భిణీ స్త్రీ తీసుకోవలసిన జాగ్రత్తలు :* ఇందులో డాక్టర్ ప్రమేయం ఏమాత్రం లేదు. మొదటిది వ్యాయామము: ప్రసవించడమనేది చాలాబలం, శక్తితో కూడినపని. వ్యాయామంవల్ల దానికి తగ్గ బలాన్ని శక్తినీ పుంజుకుంటారు. చాలా మంది, ఇంట్లో తలమునక్కపని వుండగా, వేరే వ్యాయామం ఎందుకూ అంటుంటారు. కాని రోజూ సాయంకాలం కొద్దిదూరం వరకు, ప్రశాంతమయిన గాలిలో, నిర్మల వాతావరణంలో నడిచినట్లయితే ఆ వ్యాయామానికి ఏదీసాటిరాదు. అదృష్టంకొద్ది ఏదైనా కాలువగానీ, ఏరుగానీ లేక చిన్నవాగయినా కానీ దగ్గర్లో వుండటం సంభవిస్తే అక్కడికి నడిచివెళ్ళి సాయంసమయంలో 15 నిముషాలపాటు గడిపితే ఆ ప్రశాంత వాతావరణంలో మనస్సుకి, వంటికి, పుట్టబోయే బిడ్డకుకూడా ఎంతో మంచిది. మన పెద్ద వాళ్ళు గర్భిణీ స్త్రీలను కూర్చున్నచోటు నుండి కదలనివ్వరు. కాని అది వాళ్ళకు ఎంతహాని చేస్తుందో వారికి తెలియదు. ఇలా శ్రమకు అలవాటు పడకపోవడం మూలాన చాలా కష్టపుకాన్పులు జరగడం పరిపాటి. కాని పెద్దబరువులు మోయడం. ఎత్తడం, దూకడం ముఖ్యంగా 6 నెలలు దాటిన తరువాత పరిగెత్తడం, ఈదడం, డాన్సులు చేయడంవంటివి మంచివికావు. దూరభారపు ప్రయాణాలు ముఖ్యంగా రైలు ప్రయాణాలను సాధ్యమయినంతవరకు తగ్గించుకోవడం మంచిది. విమాన ప్రయాణాలు హానిచేయవంటారు, దానికున్న ప్రమాదాలు తప్పిస్తే. 6 నెలలు దాటినతరువాత ఎత్తుమడిమల జోళ్ళని వదిలేసి అకుచెప్పులు వేసుకోవడం మంచిది.

*విశ్రాంతి :* 6 నెలలవరకూ, ప్రత్యేకంగా విశ్రాంతి తీసుకోవలసిన అవసరంవుండదు. కాని 6 నెలలు దాటిన తరువాత, ప్రతిరోజూ భోజనానంతరం మధ్యాహ్నం, కాస్త విశ్రాంతితీసుకోవడంఅవసరం. మధ్యాహ్నం వేళ మంచంమీద నడుంవాల్చి అన్నీమరచి పోయి కాసేపు కళ్ళు మూసుకోవాలి. ఆసమయంలో,కొంచెం బట్టలను వదులుచేసుకొని, కాళ్ళు కొంచెం ఎత్తులోపెట్టి పండుకోవాలి. ప్రతిరాత్రీ కనీసం 8 గంటలయినా నిద్రపోవాలి. నిద్రపోయే గది కిటికీలన్నీ తెరచి వుంచడం మరచిపోకూడదు. ఆఫీసులలోగాని, ఫ్యాక్టరీలలోగాని పనిచేసేవాళ్ళు ప్రసవించే కాలానికి కనీసం 6 వారాలుముందే పనిలోనుండి విరమించుకోవాలి.

*ఆహారము :* ఆరోగ్యంగావున్న గర్భిణీ స్త్రీకి ఏ ప్రత్యేక ఆహారమూ అక్కర్లేదు. సులభంగా అరగగలిగేట్టు తేలికయిన ఆహారం తీసుకోవాలి. మితిమీరి ఎప్పుడూ భోంచేయరాదు. ఉప్పు వాడకాన్ని తగ్గించుకోవాలి. ముఖ్యంగా 6 నెలలు దాటిన తరువాత నీరు ఎక్కువగా త్రాగడం మంచిది. ఆహారంలో విటమిన్లు, మాంసకృత్తులు, ఖనిజ లవణాలు ఆయాపాళ్ళలో వుండేట్టు చూచుకోవాలి. విటమిన్లు ఎక్కువగా వుండేపదార్థాలు పాలు, గ్రుడ్లు. ఆకుకూరలు, పండ్లు ఆహారంలో సగభాగం మాంసకృత్తులు ఆక్రమించుకోవాలి. అవి ఎక్కువగావుండే పదార్థాలు పాలు, గ్రుడ్లు, మాంసం, తాజాపండ్లు, ఆకుకూరలు. విటమిన్లు దేహానికి వ్యాధులను ప్రతిఘటించే శక్తినిచ్చి, కడుపులోనిపిండం పెరుగుదలకు తోడ్పడతాయి. "డి" విటమిను రిక్కెట్స్ (Rikets) అనే జబ్బురాకుండా బిడ్డను కాపాడుతుంది. "ఇ" విటమిను గర్భకోశంమీద పనిచేసే హార్మోనులు తయారయేందుకు తోడ్పడుతుందంటారు. 'కె' విటమిను "ప్రొత్రోంబిన్" అనే పదార్థాన్ని తయారు చేస్తుంది. అది తల్లికి ప్రసవించిన తరువాత ఎంతో అవసరం. రక్తస్రావం ఎక్కువగా జరుగకుండా ఏ. బి. సి. విటమిన్లు శరీరానికి అన్నివిధాలా అవసరం. ఇవన్నీ చిక్కటిపాలు, మాంసం ముఖ్యంగా పండ్లు, ఆకుకూరలలో వుంటాయి.

పోతే బిడ్డ ఎముకల పెరుగుదలకు ఖనిజ లవణాలు ఎంతో అవసరం. ఆహారంలో వాటిపాలు తక్కువయినట్లయితే గర్భంలోని పిండం పెరుగుదలకు ఆటంకం కలిగి, రిక్కెట్స్ (Rickets) అనే వ్యాధి వస్తుంది. దీనిని బిడ్డ పుట్టిన తరువాత నయం చేయడం చాలా కష్టం. ఈ ఖనిజ లవణాలను, కాల్షియమ్, ఫోస్పరస్, అయిరన్, అయిడిన్ అంటారు. ఇవి ఎక్కువగా వెన్న. జున్ను. పండ్లు. కూరగాయలలో వుంటాయి. అయిరన్ అనే ఖనిజలవణం, పిండం రక్తనిర్మాణానికి, వృద్ధికి తోడ్పడుతుంది. అది ఎక్కువగా వున్నపదార్థములు "మాంసం" (లివర్, మూత్రపిండాలు) గ్రుడ్లు, పండ్లు, ఆకుకూరలు. మనం నిత్యం తీసుకునే ఆహారంలో అయిరన్ పాలు గర్భిణీ స్త్రీకి సరిపోయే అంతగా వుండదు. అందువలన ఆహారంతోపాటు అయిరన్ టానిక్‌లు తీసుకోవడం మంచిది.

గర్భిణీ స్త్రీలకు మలబద్ధకమనేది తరచుగా కలుగుతూ వుంటుంది. అదిరాకుండా చూచుకోవాలి. అలాగని ఘాటయినమందులు విరోచనానికి వాడరాదు. ఆముదంలాటివి అసలే వాడరాదు, అలా వాడినట్లయితే గర్భస్రావం జరిగే ప్రమాదమున్నది. చాలవరకు మన ఆహారం మార్పుచేసి ఎక్కువగా నీరు త్రాగినట్లయితే సర్దుకుపోతుంది. ఆహారంలో మార్పు అంటే, ఎక్కువ ఆకుకూరలు, రసంలాటివి తీసుకొని, పచ్చళ్ళ

తగ్గించివేయాలి, పండ్లని బాగా తినాలి. అప్పటికీ సర్దుకోని పక్షంలో, సున్నితమయినమందులు, "లిక్విడ్‌పారఫిన్'' (Liquid Paraffin) లాంటివి వాడాలి.

గర్భిణీస్త్రీ స్నానం విషయంలో కూడా జాగ్రత్త తీసుకోవాలి. మరీ వేడినీటితోగాని, మరీచన్నీటితోగాని స్నానం చేయరాదు. గోరువెచ్చని నీటితో చేస్తేమంచిది.

సాధ్యమయినంతవరకు వదులు దుస్తులనే వాడాలి. ప్రత్యేకంగా నడుందగ్గర శ్రద్ధ తీసుకోవాలి, నడుందగ్గర బిట్టబిగ్రుగా వుండి.''వెరికోస్ వెయిన్స్'' (Varicosity of Veins) అనే జబ్బును ప్రోత్సహించి (అంటే కాళ్ళమీది చెడురక్త నాళాలు ఉబ్బడం) బిడ్డనంచి పెరుగుదలకు కూడా ఆటంకం కలిగిస్తుంది.

ఇకపోతే కొంతమంది గర్భిణీస్త్రీలు రెండవనెలనుండీ 4 వ నెలవరకూ వాంతి చేసుకోవడం మొదలుపెడతారు. ప్రక్కమీద నుండి లేచిన వెంటనే గానీ లేక మొహం కడుక్కునేటప్పుడుగానీ ఈ విధంగా వాంతులు జరిగిన తరువాత మామూలుగానే తిరుగుతారు. అలాంటప్పుడు ప్రక్కమీద నుండి లేవకముందే ఒక కప్పు తేలికయిన టీ గానీ, లేక ఏదైనా పండు, బిస్కట్టును గానీ తిని ఒక అర్ధగంట పండుకుంటేచాలు, తరువాత యథాప్రకారం లేచి తిరుగవచ్చు. అప్పటికీ విడవక రోజంతా తిన్నది తిన్నట్లు వాంతిచేసుకోవడం లాంటిది జరిగితే, రోజుకు రెండుసార్లు భోజనంచేసే బదులు కొద్దికొద్దిగా నాలుగుసార్లు భోజనంచేయాలి. భోజనానంతరం రెండు నిమ్మకాయలు రసం తీసి త్రాగితేసరి. ఈ సమయంలో నీరెంత ఎక్కువగాత్రాగితే అంతమంచిది. ఆహారంలో మాంసం, వెన్న, నెయ్యి, చేపలులాంటివి చేరనీయరాదు. వాంతులు కట్టుకున్న తరువాత రెండుమూడు రోజులలో మళ్ళీ మామూలు ఆహారం తీసుకోవచ్చు. అప్పటికీ తగ్గకపోతే డాక్టర్‌ని సంప్రదించడం మంచిది.

గర్భిణీస్త్రీలు కడుపులో మంట అనడం తరచుగా వింటుంటాం. సాధారణంగా యీ బాధ చివరినెలలో కలుగుతుంది. చాలవరకు రాత్రులలో వచ్చి నిద్ర భంగం చేస్తుంది. అలాంటప్పుడు పండుకోబోయేముందు ఒక గ్లాసు నీళ్ళలో ఒక్కగరిట బెకింగ్‌సోడా కలిపి త్రాగితే, ఆ మంటరాదు. బజారులో అమ్మేసోడా త్రాగినా సరే. ఇంకా తగ్గకపోతే, భోజనంచేసిన తరువాత రెండు నిమ్మకాయలు రసంతీసి త్రాగితే బాధ నివారణ కావచ్చు. అప్పటికీ గుణం చూపించకపోతే అది "హయాటస్ హెర్నియా" (Hiatus Hernia) అనే జబ్బువల్ల కలుగుతున్నదన్నమాట. ఇది ప్రసవించిన తరువాత దానంతటదే తగ్గిపోతుంది చాలావరకు.

నెలలు నిండిన రోజులలో తొలిచూరు గర్భిణీస్త్రీలు ప్రసవాన్నిగురించి రాసిన పుస్తకాలు చదివి, అందులోని వివిధదశలు తెలుసుకొంటే మొదటిసారి అదేమిటోననే తత్తరపాటుపోయి బిడ్డకీ తనకీ ప్రమాదంతెచ్చుకొనే ముప్పు తప్పిపోతుంది. ఈ కాలంలోనే చిన్నచొక్కాలు కుట్టుకోవటం గాని, చిన్న చిన్న మేజోడు, స్వెట్టర్లు తన పుట్టబోయే బిడ్డకు తయారు చేసుకోవడం కాని చేస్తూ ఆ పాపనుగురించి తియ్యని కలలు కంటూ సంతోషంతో ప్రశాంతమయిన మనస్సుతో ఆ సమయంకోసం ఎదురుచూస్తే, ప్రసవం తేలికగా జరిగిపోతుంది.

ఇక ఇరుగు పొరుగువారి విధి : మనలో కొంతమంది పరామర్శించడానికని యివ్వాళో, రేపో ప్రసవించబోయే గర్భవతి ముందుకువెళ్ళి పరధ్యానంగానో, తెలిసీ, తెలియకో మొదలెడతారు బాతాఖానీ. ఏమని ? "ఫలానా సీత గర్భంపోయింది;" "ఫలాని రంగమ్మగారి జానకి ప్రసవించలేక మూడు రోజులు నానాయాతన పడి, నాలుగో రోజున చచ్చిన బిడ్డని కన్నది" అని. ఇలాంటి మాటలు పొరబాటునయినా గర్భిణీస్త్రీముందు ముఖ్యంగా తొలిచూలాలుముందు అనరాదు. ప్రతి తొలిచూలాలు ప్రసవించడమంటే అదోలాంటి భయం పెట్టుకుంటుంది. భయంతోటి ఎదురుచూస్తుంది. అలాంటప్పుడు యిలాంటి కబుర్లు చెవునపడితే, ఒక విధమైన ఆందోళన, భయం ఆమెలో జనిస్తుంది. అది సులభ ప్రసవానికి ఆటంకం కలిగించి, బిడ్డనంచి ప్రకోచ, సంకోచాలకి అడ్డు తగులుతుంది. ఇలాంటి కష్టపు కాన్పు ఆమెలో ఒక విధమైన విసుగు, జుగుప్స కలిగించి మనస్సుపై దెబ్బతీస్తుంది. అప్పుడు బిడ్డఅంటే ఒక విధమైన జుగుప్స కలిగి లాలనగా, ప్రేమతో దగ్గరకు తీయలేక పోతుంది. ఇది ముందు ముందు బిడ్డకు సరిపోయినన్ని పాలు యివ్వలేక పోతుంది. అలా కాకుండా తొలిచూలాలు, సంతోషంగా తన మొదటికాన్పును గురించి, పుట్టబోయే బిడ్డనుగురించి తియ్యటి కలలు కంటూ, తను విన్న మంచి మంచి విషయాలను, చూచిన చక్కటి పాపలను గుర్తుకు తెచ్చుకుంటూ, చుట్టాలు, స్నేహితులు యిచ్చిన ప్రోత్సాహంతో, తన తొలికాన్పుకి ఎదురుచూచినట్లయితే, తేలికగా కాన్పు జరిగిపోయి ఆరోగ్యమయిన పండంటి పాపను కంటుంది. అలాంటప్పుడు గర్వంతో పుట్టిన బిడ్డను, ఆప్యాయత ప్రేమను చిందిస్తూ, ప్రశాంతమయిన మనస్సుతో బిడ్డను దగ్గరకు తీసుకుంటుంది. ముందు ముందు బిడ్డ ఆరోగ్యానికి, తల్లి ఆరోగ్యానికి యిది ఎంతో శుభసూచకము,

గర్భిణీస్త్రీలు ఈ జాగ్రత్తలన్నీ తు. చ. తప్పకుండా పాటిస్తే, దృఢంగానూ, ఆరోగ్యంగానూ, వుండే బిడ్డలు పుడతారనడంలో సందేహంలేదు. నేటి పాపలే రేపటి పౌరులు, రాబోయే తరాలవారు ఎంత ఆరోగ్యవంతంగా వుంటే, దేశానికి అంత మేలు చేకూరుతుంది.

# వి ద్యా స హా యం

వెనుకబడిన తరగతులు ముఖ్యంగా నిమ్న జాతులు, నిమ్నతెగల వారిలో విద్యాభివృద్ధినీ వారి ఆర్థిక ప్రయోజనాలనూ సాధించడానికీ, సాంఘిక దురన్యాయం, ఇతర దోపిడీ విధానాలనుంచి వారికి రక్షణ చేకూర్చడానికీ రాష్ట్ర ప్రభుత్వాలు తగు అవకాశాలు కల్పించడాన్ని భారత రాజ్యాంగం నిర్దేశిస్తున్నది.

సాంఘిక పరిణామంపై విద్యా ప్రభావాన్ని గూర్చి ప్రత్యేకంగా నొక్కి చెప్పనవసరం లేదు. విద్యా సముపార్జనకై హరిజన పిల్లలకు సహాయం చేయడమే సమాజంలోని ఈ మందభాగ్యులకు ప్రభుత్వం చేసే గొప్ప సేవ. బోర్డింగ్ సౌకర్యాలు, ఉపకారవేతనాలు, పుస్తకాలు మొదలైన వాటికొరకు ధనసహాయంవంటి సదుపాయాలను రాష్ట్ర సాంఘిక సంక్షేమశాఖ కల్పిస్తున్నది.

## ప్రభుత్వ హాస్టళ్ళు

నిమ్నజాతులు, ఇతర వెనుకబడిన తరగతుల వారిపరిస్థితులను చక్కబరచడానికి సాంఘిక సంక్షేమశాఖ గైకొన్న ముఖ్యచర్య, ఈ తరగతుల పిల్లలకు విద్యాభ్యాసం నిమిత్తం హాస్టలు సౌకర్యాలు కలుగజేయడం. ఈ హాస్టళ్ళు ప్రభుత్వంచే నెలకొల్పబడ్డాయి. ప్రభుత్వ నిధులనుంచే వీటి ఖర్చులను భరిస్తారు. ఈ హాస్టళ్ళలో పాఠశాలలు, కళాశాలలలో చదివే నిమ్న జాతుల పిల్లలకు, కొందరు వెనుకబడిన తరగతులపిల్లలకుకూడా భోజన,వసతిసౌకర్యాలు కలుగజేస్తారు. 1963-64 వ సంవత్సరంలో వివిధజిల్లాలలో నెలకొల్పబడుతున్న 19 హాస్టళ్లతోసహా రాష్ట్రంలో 122 హాస్టళ్ళున్నాయి. వీటి నిర్వహణకు గత సంవత్సరం రూ. 14,19,442 లు ఖర్చయినవి. ఈ ఏడాది రూ. 17,30,500 లు కేటాయించారు. వీటివల్ల 6,951 మంది బోర్డర్లకు ప్రయోజనం చేకూరుతున్నది.

## సహాయక హాస్టళ్ళు

ప్రభుత్వం పూర్తిగా స్వంత నిధులనుంచి హాస్టళ్ళను నిర్వహించడంతో పాటుగా ప్రైవేటు ఆధ్వర్యంలో నిర్వహించబడే బోర్డింగ్ గృహాలకుకూడా గ్రాంట్లు ఇస్తుంది. ఈ హాస్టళ్ళలో వుండే అర్హులైన బోర్డర్లకు ఒక్కొక్కరికి ఒక సంవత్సరంలో 10 నెలలకు రూ. 150/-ల చొప్పున బోర్డింగ్ గ్రాంట్లు మంజూరు చేస్తారు. బోర్డింగ్ గ్రాంటుకు అర్హతపొందడానికి విద్యార్థి, హాస్టలువున్న స్థలంనుంచి మూడు మైళ్ళకంటే ఎక్కువ దూరంలోనున్న ప్రాంతం వాస్తవ్యుడై వుండాలి. అయితే విద్యార్థినుల విషయంలో ఇటువంటి నిబంధనలేదు. నిర్ణీతవయః పరిమితిలోవుండి మూడవ తరగతి లేక అంతకు పైతరగతిలో చదివే విద్యార్థులంతా గ్రాంటుకు అర్హులే. నిమ్నతెగలు, విముక్త జాతులకు చెందిన విద్యార్థులు కూడా తరగతి, నివాస స్థలం దూరం, వయః నిబంధనల నుంచి మినహాయించబడతారు. రాష్ట్రంలో సహాయంపొందే హాస్టళ్ళు 878 వున్నాయి. 1962-63 వ సంవత్సరంలో ఈ హాస్టళ్ళకు రూ. 43,84,600 ల మేరకు 29,230 బోర్డింగ్ గ్రాంట్లు మంజూరు చేశారు. వర్తమాన సంవత్సరంలో రూ. 31,36,000 లు కేటాయించారు.

ప్రభుత్వ హాస్టళ్ళు, సహాయకహాస్టళ్లు కూడా ప్రస్తుతం జిల్లా పరిషత్తులు, పంచాయతీ సమితుల పర్యవేక్షణక్రింద వున్నాయి.

## పాఠశాలలు

ఆంధ్రప్రాంతలో 540 సాంఘికసంక్షేమ పాఠశాలలు, తెలంగాణా ప్రాంతంలో 245 నిమ్నతెగల పాఠశాలలు వున్నాయి. వీటిలో 3 ఉన్నత పాఠశాలలు మిగిలినవి ఎలిమెంటరీ పాఠశాలలు. ఉన్నత పాఠశాలలు మచిలీపట్నం, దోకిపర్రు, కొరిమెర్లలలో పనిచేస్తున్నాయి. ఈ పాఠశాలల నిర్వహణకు సాంఘిక సంక్షేమ శాఖ ఏటా సుమారు రూ. 21,74,600 లు ఖర్చు చేస్తున్నది.

## మధ్యాహ్న భోజనం

ఎలిమెంటరీ పాఠశాలలలో చదువుతున్న నిమ్నజాతుల విద్యార్థులకు మధ్యాహ్న భోజనం సరఫరాచేస్తున్నారు. ఇందుకు ఏటా రూ. 7,49,400/- లు ఖర్చవుతున్నది.

## స్టేట్ స్కాలర్‌షిప్పులు

ఉన్నతపాఠశాలలు, కళాశాలలలోనూ, వృత్తి, సాంకేతికవిద్యా



కోర్సులలోనూ చదివే ఈ కులాల విద్యార్థులకు — అర్హులైన వారికి — వారు తమ విద్యా ఖర్చులను భరించడానికి వీలుగా సాంఘిక సంక్షేమశాఖ రెసిడెన్షియల్, నాన్ రెసిడెన్షియల్ స్కాలర్‌షిప్పులను మంజూరు చేస్తున్నది.

### నాన్ రెసిడెన్షియల్ స్కాలర్‌షిప్పులు

వీటిని విద్యార్థులు చెల్లించే ఫీజు, నోటు బుక్కులు మొదలైన వాటి ఖర్చులను భరించ గలగడానికి వీలుగా మంజూరు చేస్తారు. నిమ్న తెగల విద్యార్థులు మినహా అర్హులైన ఇతర విద్యార్థులందరికీ జిల్లా పరిషత్తులు ప్రీ మెట్రిక్ నాన్ రెసిడెన్షియల్ స్కాలర్ షిప్పులను మంజూరు చేస్తున్నాయి. నిమ్న తెగల విద్యార్థులకు వీటిని కలెక్టర్లు మంజూరు చేస్తారు. జంటనగరాలలో తప్ప జిల్లాలలో పోస్ట్ మెట్రిక్ నాన్ రెసిడెన్షియల్ స్కాలర్ షిప్పులను అర్హులైన విద్యార్థులందరికీ కలెక్టర్లు మంజూరు చేస్తారు. జంట నగరాలలో వీటిని సాంఘిక సంక్షేమ శాఖ డైరెక్టరు మంజూరు చేస్తారు. నాన్ రెసిడెన్షియల్ స్కాలర్ షిప్పులక్రింద ఏ రేటులో మొత్తాలు మంజూరు చేయబడేదీ *దిగువ పేర్కొనబడింది:

### రెసిడెన్షియల్ స్కాలర్‌షిప్పులు

వీటిని జిల్లా కలెక్టర్లు, జిల్లా పరిషత్తు III (బి) స్థాయీ సంఘం సూచనల ననుసరించి మంజూరు చేస్తారు. అయితే జంట నగరాలలో వీటిని సాంఘిక సంక్షేమ శాఖ డైరెక్టరు మంజూరు చేస్తారు. 5 మైళ్ళ దూరంలోని పాఠశాల లేక కళాశాల హాస్టలులో గానీ పరిగణించబడిన ప్రైవేటు హాస్టలులోగానీ నివసించే విద్యార్థులకు వీటిని మంజూరుచేస్తారు. దూరానికి సంబంధించిన నిబంధన హాస్టళ్ళలో వుండే విద్యార్థులకు వర్తించదు. తెలంగాణా ప్రాంతంలో హరిజనులుగా మారినవారు మాత్రమే రెసిడెన్షియల్ స్కాలర్ షిప్పులకు అర్హులు. ఈ స్కాలర్ షిప్పుల మేరకు పైన పేర్కొన్న నాన్ రెసిడెన్షియల్ స్కాలర్ షిప్పు రేటుతోపాటుగా భోజన, వసతి ఖర్చులను కూడా దిగువ రేట్లలో ఇస్తారు:—

(1) సహాయక హాస్టళ్ళలో నివసించే ఉన్నత పాఠశాల విద్యార్థులకు 10 నెలల వరకు నెలకు రూ. 15/— ల చొప్పున మంజూరు చేస్తారు.

(2) పాఠశాల హాస్టళ్ళలోవుండే ఉన్నత తరగతుల విద్యార్థులు, సహాయక హాస్టళ్ళలో నివసించే కళాశాల విద్యార్థులకు ఆయా పాఠశాల హాస్టళ్ళ వార్డెన్లు కోరిన విధంగా నెలకు రూ. 20/— లు లేక అంతకు తక్కువ మొత్తాన్ని మంజూరు చేస్తారు.

(3) హైదరాబాదు, విశాఖపట్నం, కర్నూలు, గుంటూరులలోని కళాశాల హాస్టళ్ళలో నివసించే కళాశాల విద్యార్థులకు 9 నెలల వరకు నెలకు రూ. 50/— ల చొప్పున మంజూరు చేస్తారు.

(4) ఇతర ప్రదేశాలలో కళాశాల హాస్టళ్ళలో నివసించే విదార్థులకు 9 నెలల పాటు నెలకు రూ. 40/— ల చొప్పున మంజూరు చేస్తారు.

### ప్రత్యేక నాన్ రెసిడెన్షియల్ స్కాలర్ షిప్పులు

ఏ హాస్టలులో కూడా ప్రవేశం పొందలేని విద్యార్థులకు సాంఘిక సంక్షేమ శాఖ డైరెక్టరు వీటిని మంజూరు చేస్తారు. వీటి మేరకు నెలకు రూ. 14/— లు మొదలు రూ. 25/— ల వరకు మంజూరు చేస్తారు. నిబంధనావళి ముఖ్యాంశాలు దిగువ పేర్కొనబడినవి:—

(1) రెసిడెన్షియల్, నాన్ రెసిడెన్షియల్ స్కాలర్ షిప్పులన్నికూడా విద్యార్థి ప్రవేశం పొందిన నెలారంభం నుండి మొదలవుతాయి. ఒకవేళ విద్యార్థి మధ్యలో చదువు మానివేసినట్లయితే అప్పటివరకే ఇది వర్తింపులో వుంటుంది. గైర్‌హాజర్ కాలానికి దామాషా మినహాయింపులు చేయబడతాయి.

(2) పూర్తి కోర్సు కాలం (మొదటి ఫారంనుంచి 3వ ఫారం, 4వ ఫారం నుంచి 6వ ఫారం వరకు ఒక్కొక్క పర్యాయం చొప్పున) రెండు పర్యాయాలు మాత్రమే పరీక్ష తప్పటం జరిగినట్లయితే స్కాలర్ షిప్పులను రెండవసారి మంజూరు చేస్తారు.

(3) సాంఘిక సంక్షేమ శాఖ మంజూరు చేసే స్కాలర్ షిప్పు పొందినవారు ఒక్క మెరిట్ స్కాలర్‌షిప్పు మినహా మరే

| *కోర్సులు | నిమ్న జాతులు, నిమ్న తెగలు | ఇతర వెనుకబడిన తరగతులు |
|---|---|---|
| ప్రీ మెట్రిక్ | రూ. 4/— లు మొదలు రూ. 200/— ల వరకు | రూ. 6/— లు మొదలు రూ. 70/— ల వరకు |
| పోస్టు మెట్రిక్, వృత్తి విద్యా కోర్సులు, ఇతర కోర్సులు | రూ. 14/— లు మొదలు రూ. 314/— ల వరకు | రూ. 54/— లు మొదలు రూ. 434/— ల వరకు |
| పోస్టు గ్రాడ్యుయేటు కోర్సులు | రూ. 23/— లు మొదలు రూ. 223/— ల వరకు | రూ. 23/— లు మొదలు రూ. 283/— ల వరకు |

(మిగతా 105వ పేజీలో)

ఇతర స్కాలర్‌షిప్పులను కూడా పొందడానికి అనుమతించ బడరు.

(4) అభ్యర్థి తలితండ్రులు లేక సంరక్షకుల వార్షికాదాయం రూ. 3,600/_ ల పరిమితికి లోబడి స్కాలర్ షిప్పులు మంజూరు చేయబడతాయి. 1959_60 వ సంవత్సరానికి పూర్వం పాఠశాలలలోనున్న తెలంగాణా విద్యార్థులకు ఈ పరిమితి వర్తించదు.

(5) ప్రభుత్వ పరీక్షలు, విశ్వ విద్యాలయ పరీక్షల ఫీజులను, అర్హమైన కులాల విద్యార్థులనుంచి దరఖాస్తులు వచ్చిన పిమ్మట మంజూరు చేస్తారు.

1962_63 వ సంవత్సరంలో రెసిడెన్షియల్, నాన్ రెసిడెన్షియల్ స్కాలర్ షిప్పులపై రూ. 58,98,800 లు వెచ్చించడం జరిగింది. కాగా ఈ సంవత్సరం కేటాయింపు రూ. 62,11,300.

## భారత ప్రభుత్వ స్కాలర్ షిప్పులు

రాష్ట్ర స్కాలర్ షిప్పులే కాక, షెడ్యూలు కులాలవారికి, షెడ్యూలు తరగతుల వారికి, యితర వెనుకబడిన తరగతుల వారికి భారతప్రభుత్వం యిచ్చే పోస్టు మెట్రిక్ స్కాలర్ షిప్పులకు సంబంధించిన పథకం వికేంద్రీకరించబడి, రాష్ట్ర ప్రభుత్వానికి ఆ బాధ్యతలు అప్పగించబడ్డాయి. భారత ప్రభుత్వం ఎప్పటికప్పుడు విడుదల చేసే ఉత్తరువులు, సూచనలు మేరకు ఆచరించేటట్లుగా ఈ స్కాలర్ షిప్పుల పంపిణీ బాధ్యతలను రాష్ట్ర ప్రభుత్వం సాంఘిక సంక్షేమ శాఖ డైరెక్టరుకు అప్పగించింది. ఆఖరి సాంవత్సరికపు పరీక్ష ప్యాసుఅయిన యోగ్యతలుగల షెడ్యూలు కులాల విద్యార్థులందరికీ నిర్ణీత మీన్స్‌టెస్టు ప్రాతిపదికగా యీ భారత ప్రభుత్వ స్కాలర్ షిప్పులు యివ్వబడతాయి. వైద్య, ఇంజనీరింగు కోర్సులలో చదివే షెడ్యూలు కులాల, షెడ్యూలు తరగతుల విద్యార్థులు ఒకసారి పరీక్ష తప్పినా స్కాలర్ షిప్పులు యివ్వడానికి అర్హులుగానే ఎంచబడతారు. షెడ్యూలు తరగతుల వారికి ఏ విధమయిన యోగ్యత పరీక్షగాని వుండదు. ఇంతవరకూ ఇతర వెనుకబడిన కులాలవారికి యిచ్చే భారత ప్రభుత్వ స్కాలర్ షిప్పులు కులాల ప్రాతిపదికమీద ఆధారపడి వుండేవి. కాని 1963_64 నుండి యీ పద్ధతిని భారత ప్రభుత్వం మార్చివేసి, విద్యార్థి ఆర్థిక పరిస్థితుల మీద ఆధారపడి భారత ప్రభుత్వం స్కాలర్ షిప్పులను మంజూరు చేయ వలసిందని ఉత్తరువులు జారీ చేసింది. తల్లిదండ్రుల సాంవత్సరిక ఆదాయం రూ. 1500/_ లకు మించని విద్యార్థులకు యీ స్కాలర్ షిప్పులు మంజూరు చేయబడతాయి. వైద్య, సాంకేతిక విద్యార్థుల విషయంలోనయితే వారి తల్లిదండ్రుల సాంవత్సరిక ఆదాయం రూ 2400/_ లకు మించి వుండకూడదు.

వివిధ కోర్సుల విద్యార్థులకు యిచ్చే నెలసరి నిర్వహణ ఖర్చులు యీ విధంగా వుంటాయి. వసతిగృహంలో వున్న వారికి —రూ 40 నుండి రూ 75 వరకు మారుతుంది. డే స్కాలర్లకు—రూ 27 నుంచి రూ 60 వరకూ మారుతుంది.

ఈ స్కాలర్ షిప్పులు గుర్తింపబడిన సంస్థలలో వున్న వారికి మాత్రమే యివ్వబడతాయి.

వృత్తి విద్యలను అభ్యసిస్తున్న స్కాలర్లకు తమ కోర్సులను పూర్తి చేయడానికి పరిశీలనాపర్యటన చాలా అవసరమని ఆ విద్యార్థి చదువుతున్న సంస్థలూకు అధిపతి ధృవపరుస్తే, అట్టి వానికి రైలు, బస్సు మొదలయిన వాటిమీద అయిన అసలు ఖర్చు నిర్ణయించబడిన గరిష్ఠ మొత్తం మేరకు సంవత్సరానికి పరిశీలనాపర్యటన ఖర్చుక్రింద రూ 100/_ లను యివ్వడం జరుగుతుంది.

సంస్థ అధిపతి సిఫారసుచేస్తే రీసర్చి స్కాలర్లకు యీ పథకం క్రింద థీసిస్ టైపు చేయడానికని, అచ్చు చేయడానికని రూ 100/_ వరకూ యివ్వడంజరుగుతుంది.

1962_63 సం॥ కాలంలో 3,474 మంది షెడ్యూలు కులాల వారికి, 185 మంది షెడ్యూలు జాతుల వారికి, 1,732 యితర వెనుకబడిన తరగతుల వారికి మొత్తం వరుసగా రూ 17,10,913; రూ 1,09,826; రూ 13,78,931 మేరకు భారత ప్రభుత్వ స్కాలర్‌షిప్పులు యివ్వబడ్డాయి. 1963_64 సం. కాలానికి ఉద్దేశించిన మొత్తం యీ విధంగా వుంటుంది :

షెడ్యూలు కులాలవారికి... రూ 7,14,700
షెడ్యూలు తరగతుల వారికి ... రూ 49,200
ఇతర వెనుకబడిన తరగతుల వారికి ...రూ 13,29,800

# పండుగ పలుకు

"తంగిరాల

బాల బాలికలార
పరుగు పరుగున రండి !
పసిడి పిచ్చుకలార
ఎగిరెగిరి రండి !
చలిగాలి హెచ్చింది !
సంక్రాంతి వచ్చింది !
ఆటలే ఆడాలి,
పాటలే పాడాలి !
గొబ్బిళ్ళు పెట్టాలి
గోవింద కొట్టాలి !
బాల బాలికలార
పరుగు పరుగున రండి !
పెద్ద పండుగ వచ్చె
ముద్దు లెన్నో తెచ్చె !!

చెల్లాయి గొబ్బిళ్ళు
చూడరా తమ్ముడూ !
గిరగిరా తిరుగుతూ
ఆడరా తమ్ముడూ !
బుజ్జాయి గుండుపై
భోగిప ళ్ళవిగోను !
చూడవే చెల్లెలా !
పాడవే కోయిలా !!

అన్నయ్య తెచ్చాడు
ఆ దుంగ ఈ దుంగ !
అల్లరి కిష్టయ్య
తలుపులే తెచ్చాడు !
ఆకాశ మంటాయి
ఆ భోగి మంటలు !

చెల్లెళ్ళు అక్కలూ
చప్పు చప్పున రండి !
తమ్ముళ్ళు, అన్నలూ
దబ్బు దబ్బున రండి !
చలికాగి మీరంత
చప్పట్లు కొట్టండి !!

డూ డూ బసవన్న
దణ్ణాలు పెడతాడు....
వెండి కొమ్ములు ఊపి
విద్దెలే చేస్తాడు....!!
"హరహరా ! హరహరా !
మహాదేవ ! మహాదేవ !"
జంగాల లింగయ్య
చరచరా వచ్చాడు !
గణగణా గణగణా
గంట కొడుతున్నాడు !
'భూం భూం - భూం భూం'
చెవులు గింగురు మనగ
శంఖంబు పూరించు !
బాల బాలికలార
పరుగు పరుగున రండి !

"అంబ పలుకు జగదంబా పలుకు"
కంచిలోని కామాక్షీపలుకూ!!"
డబుడక్క ! డబుడక్క !
బుడబుక్క ! డమరుక్క !!
పాతచొక్కాలకే
పరమ జోస్యం చెప్పు !!
నామాలుదిద్దుకొని

హరినామ స్మరణతో
కాళ్ళ గజ్జెలు అన్ని
ఘల్లు ఘల్లున మ్రోయ,
చెకచెకా చెకచెకా
చేతి తాళం ఆడ,
బంతిపువ్వుల దండ
బొజ్జపై వ్రేలాడ,
తంబురా మీటుతూ
సాతాని వచ్చాడు !
జేజేలు కొట్టుతూ
జియ్యరూ వచ్చాడు !!
బాల బాలికలార
పరుగు పరుగున రండి !!

గున్నమామిడి తోట
కదనరంగం కాగ -
కత్తులతో చీరంగ
నెత్తురులు పారంగ -
పౌరుషం అగ్నివలె
భగ భగా మండంగ -
పలనాటి వీరులై
బొబ్బిలీ శూరులై
ఒడలు తెలియక పోరు
కోడి పుంజుల జూడ
బాల బాలికలార
పరుగు పరుగున రండి !
పసిడి పిచ్చుకలార
ఎగిరెగిరి రండి !
పెద్దపండుగ వచ్చె
ముద్దు లెన్నో తెచ్చె !! ★

---

(22 వ పేజీ తరువాయి)

...ట్టూ తిరుగుతూ, చప్పట్లు చరుస్తూ గొబ్బి పాటలు పాడుతుంటారు.

సంక్రాంతి ఆబాల వృద్ధులకూ పండుగ. అందరూ అంతకు ముందురోజు (భోగి) తెల్లవారగానే నలుగుపెట్టుకొని అభ్యంగన స్నానం చేస్తారు. కొత్తబట్టలు ధరిస్తారు. పిండి వంటలు చేసుకుని భుజిస్తారు. ఇదే తెలుగు వాళ్ళకు పెద్దపండుగ.

సంక్రాంతి మర్నాడు కనుము. గ్రామస్థులకు—ముఖ్యంగా వ్యవసాయదారులకు సంబంధించిన పండుగ యిది. పశువుల కొట్టంలో పొంగలి వండి, దాన్ని పొలాల్లో చల్లుతుంటారు. దీనినే పొలిచల్లడం అంటారు. చాలాచోట్ల పశువులను బలిచ్చి, ఆరక్తంతో పొలివండి, పొలాల్లో చల్లడం అలవాటుగా వుంది. ఈ రోజున వ్యవసాయదారుడు తన కృషి ఫలించడంలో బాసటగా నిలిచిన పశువులను పూజిస్తాడు. రకరకాలుగా అలంకరిస్తాడు. పూలదండలను మెడల్లోవేసి, గంటల పట్టెడలు కట్టి, మువ్వల గజ్జెలు తగిలించి అలంకరిస్తాడు. ఆసాయంకాలం కోడి పందాలు, గొర్రెపొట్టేళ్ళ పందాలు, ఎడ్ల పోటీలు, పశువుల ఊరేగింపులు గ్రామస్థులు ఏర్పాటు చేసి పశువులపై తమ గౌరవ ప్రపత్తులను ప్రదర్శించుకుంటారు. ★

"ట్రాన్సిస్టర్ ఔట్ పుట్"ను ఉపయోగించి





మీ రేడియో బ్యాటరీ దీర్ఘకాలం పని చేసేట్లు
చేసుకోండి : డబ్బు మిగుల్చుకోండి !!

ఎట్టి డ్రై బ్యాటరీ రేడియోకైనా
దీనిని నాలుగు గంటలు
వ్యవధిలో అమర్చగలము.
ఖర్చు రూ. 45/– మాత్రమే





రేడియోలనే
ఎన్నుకోండి

ఒక సంవత్సరం గ్యారంటీతో విక్రయించబడును.
ధరలు : రూ. 125/– ల (జనత : 3 బ్యాండ్లు)
మొదలు రూ. 350/– ల (ఏ. సి.. ట్రాన్సిస్టర్
కంబైన్డ్) వరకు. అమ్మకం పన్ను అదనం.

మాడల్: టి. 63 టేబిల్ ట్రాన్సిస్టర్ రూ. 270/-

ఫోను : **42868**

ఆంధ్ర డిస్ట్రిబ్యూటర్లు : కె. వరదరాజ్,
**5-1-742**, బ్యాంకు వీధి, కోఠి, హైదరాబాద్ - ఆం.ప్ర.



తాజ్ పబ్లికో, హైదరాబాదు - 1 ఫోను : **45543**

---

Phone No. 44407

## కలర్ ప్రింటింగ్‌కు

రఫీక్ మెషిన్ ప్రెస్

మా ప్రత్యేకత :

బీడీ లేబిల్స్, సోప్ రాపర్లు, పోస్టర్లు, హాండ్ బిల్లులు,
పుస్తకాలను అందంగా ముద్రించి ఇస్తాము.

**RAFIQ MACHINE PRESS, MACHLI KAMAN**
**HYDERABAD - (2) A. P.**

---

గుర్తుంచుకోండి : ఫోను నెం. **45543**

## జె. ఆర్ట్సు పెయింటింగ్ హౌస్

జాంబాగ్ రోడ్డు, హైదరాబాదు, ఆం. ప్ర.
డిజైనులు, సైనుబోర్డులు, సినిమా స్లైడ్లు,
ఇంకా అన్ని విధములైన పెయింటింగ్ పనులు
చేయబడును.

తాజ్ పబ్లికో, హైదరాబాదు - 1

---

శీతాకాలం,
వేసంకాలం,
వర్షాకాలాలకు
అనువైన దుస్తులు
స్వెట్టర్లు, బనియన్లు, మేజోళ్లు, చేతిరుమాళ్లు
ఇంకా ఇతర రెడీమేడ్ వస్త్రాలు సరసమైన ధరలకు లభిస్తాయి.

## పి. పెంటయ్య, హోల్‌సేల్ హైజరీ మర్చంట్

ఫోను : **44954**

75 _ మదీనా బజారు, హైదరాబాదు - (2)

తాజ్ పబ్లికో, హైదరాబాదు _ ఫోను : **45543**





PHONE 44954
**P. PENTIAH**
**WHOLESALE HOSIERY MERCHANT**
**75 MADINA BAZAR HYD A P**

# ముఖ్యవార్తలు

## రాష్ట్రంలో

నవంబరు 28 : రాష్ట్రంలో సైన్సువిజ్ఞానాన్ని వ్యాప్తిచేయడానికి, సైన్సు అభివృద్ధికి రాష్ట్ర ప్రభుత్వం 'ఆంధ్ర ప్రదేశ్ సైన్సు అకాడమీ' ఒకదానిని ఏర్పాటు చేసింది.

నాగార్జున సాగర్ ఆనకట్ట డైవర్షన్ - కమ్ - ఇరిగేషన్ కాలువకు సంబంధించిన పనికి రాష్ట్ర నీటిపారుదల మంత్రి ప్రారంభోత్సవంచేశారు.

నవంబరు 29: ముఖ్యమైన పాల్ప్రాజెక్టు ప్రాంతాలను సందర్శించడానికని పదకొండుమంది సభ్యులుగల ఒక ఇంగ్లాండు పాత్రికేయబృందం ఒకరోజు పర్యటనకై హైదరాబాదు విచ్చేసింది.

డిశంబరు 1 :- ఆఫ్రికా దేశాలు - ఇథోపియా, టాంగనికా, నైజీరియా, ఉగండా, యు. ఎ. ఆర్, సొమాలియా, సుడాన్ - లకు సంబంధించిన ఏడుగురు సీనియరు అధికార ప్రతినిధులు మూడు రోజులపాటు పర్యటించి ఆంధ్రప్రదేశ్‌లో పంచాయతీరాజ్ విధానాన్ని పరిశీలించడానికై హైదరాబాదుకు చేరుకున్నారు.

డిశంబరు 2: లోగడ ఫ్రాన్సు ప్రధాన మంత్రిగా వుండిన మి॥ మెండెస్-ఫ్రాన్సు రెండురోజుల పర్యటనకై హైదరాబాదు విచ్చేశారు.

డిశంబరు 4 : ఆంధ్రప్రదేశ్ సహకార సంఘాల బిల్లును అసెంబ్లీ ఆమోదించింది.

డిశంబరు 7 : వాల్తేరు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో శ్రీమతి ఇందిరాగాంధీ పట్టప్రదానోత్సవ సభను ఉద్దేశిస్తూ ప్రసంగించారు.

డిశంబరు 8 : ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ మార్కెటు కమిటీ అధ్యక్షుల మండలికి ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

డిశంబరు 9 : వర్తమాన సంవత్సరంలో ఖర్చులకొరకై రూ. 8.5 కోట్ల మేరకు సప్లిమెంటరీ గ్రాంటులను ఆంధ్ర ప్రదేశ్ విధానసభ ఆమోదించింది.

డిశంబరు 10 : వ్యవసాయ విశ్వవిద్యాలయ బిల్లును అసెంబ్లీ ప్రవేశపెట్టింది.

డిశంబరు 12 : జోర్డానులోని హాషిమైటి వంశపురాజు హుస్సేన్ మూడు రోజులపాటు పర్యటనకై హైదరాబాదు విచ్చేశారు.

డిశంబరు 13 : ఆంధ్ర ప్రదేశ్‌లోని ఇంజనీరింగు, పాలిటెక్నిక్కు కళాశాలల ప్రిన్సిపాలుల సమావేశానికి రాష్ట్ర విద్యామంత్రి ప్రారంభోత్సవంచేశారు. రాష్ట్ర విధానసభ కాలనిర్ణయం లేకుండా వాయిదాపడింది.

డిశంబరు 14 : ఉస్మానియా విశ్వవిద్యాలయం హైదరాబాదులో ప్రభుత్వయాజమాన్యంపై ఏర్పాటు చేసిన సెమినారుకు కేంద్ర ఉక్కు, గనులు, భారీ ఇంజనీరింగు పరిశ్రమలశాఖా మంత్రి ప్రారంభోత్సవం చేశారు.

డిశంబరు 17 : ఉత్తర నైజీరియా ప్రధాని అల్హాజీ అహమద్ బెల్లో నాగార్జున సాగర్‌ను సందర్శించారు.

డిశంబరు 19 : ఆంధ్రప్రదేశ్ మంత్రిమండలిలో పదవుల మార్పిడి ప్రకటించబడింది.

## భారత దేశంలో

నవంబరు 21 : తిరువేంద్రం నుండి పదిహేను మైళ్ళదూరంలోగల తుంబ రాకెట్టుస్టేషనునుండి మొట్టమొదటి రాకెట్టు వొదలబడింది.

నవంబరు 22 : జమ్మూ, కాశ్మీర్ రాష్ట్రంలో పూంచ్‌కుదగ్గర్లో గుల్‌పూర్ వద్ద ఐ. ఎ. ఎఫ్‌కు చెందిన ఒక హెలీకాప్టర్ కూలిపోయిన కారణంగా అందులోని భారత రక్షణ సర్వీసు సీనియరు ఉద్యోగులు అయిదుగురు మరణించారు.

ఒక దీర్ఘకాల వర్తక ఒప్పందానికి భారతదేశం, హంగేరి క్రొత్తఢిల్లీలో సంతకాలు చేశాయి.

నవంబరు 24 : మహారాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ ఎమ్. ఎస్. కన్నంవార్ బొంబాయిలో స్వర్గస్థులయ్యారు.

నవంబరు 29 : క్రొత్తఢిల్లీలో నాల్గవ భారత సహకార కాంగ్రెసుకు ప్రధానమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

జాతీయ పాఠ్యపుస్తకాల ప్రచురణకని స్వీడనుయిచ్చే 8,000టన్నుల కాగితం బహుమతి కిన్యూవలుకు సంబంధించిన ఒప్పందంపై భారతదేశం, స్వీడను సంతకాలు చేశాయి.

డిశంబరు 1 : రాష్ట్రపతి నాగాలాండును, భారతదేశంలోని 16వ రాష్ట్రంగా ప్రారంభోత్సవం చేశారు.

డిశంబరు 2 : సిక్కిం మహారాజు తాషి నంగ్యాల్ కలకత్తాలో స్వర్గస్థులయ్యారు.

ప్లానింగు కమీషను డిప్యూటీ చైర్మనుగా శ్రీ అశోక మెహతా పదవి నధిష్టించారు.

డిశంబరు 3 : భారతదేశంలో 13 రోజులపాటు పర్యటించడానికని జోర్డాను రాజు హుస్సేన్ ఐబాన్ తలాల్ క్రొత్తఢిల్లీకి చేరుకున్నారు.

డిశంబరు 5 : మహారాష్ట్ర ముఖ్య

మంత్రిగా బొంబాయిలో శ్రీ వసంత రావు పి. నాయక్ పదవీ ప్రమాణం చేశారు.

డిశంబరు 6 : నైజీరియా ప్రజాస్వామ్య రిపబ్లికు ఉత్తరప్రాంతపు ప్రధాని హాజ్జీ సర్ అహమదు బెల్లో భారత దేశంలో 14 రోజులపాటు పర్యటించేందుకై క్రొత్తఢిల్లీ చేరుకున్నారు.

డిశంబరు 7 : తారాపూరులోని భారత దేశపు మొట్టమొదట అణుశక్తి ప్లాంటుకు 80 మిలియను డాలర్ల (రూ. 38.10 కోట్లు) మేరకు అమెరికా యిచ్చే విదేశమారక ఋణానికి సంబంధించిన ఒప్పందానికి ఢిల్లీలో సంతకాలుచేయడం జరిగింది.

డిశంబరు 8 : మెడికల్ సైన్సుకు సంబంధించిన ఇండియన్ అకాడమీ మొట్టమొదటి పట్టప్రధానోత్సవంలో రాష్ట్రపతి ప్రసంగించారు.

డిశంబరు 10 : మైసూర్‌లో సర్దార్ కె. ఎమ్. పణిక్కర్ పరమపదించారు.

డిశంబరు 13 : 1964 జనవరి 1 నుండి అమలులోకివచ్చే కేంద్రప్రభుత్వోద్యోగులకు సంబంధించిన ఒక సాంఘిక భద్రతా పథకాన్ని కేంద్ర ఆర్థిక మంత్రి ప్రకటించారు.

డిశంబరు 16 : భారతదేశపు రక్షణావసరాలపై చర్చించడానికి మూడురోజుల పర్యటనగా అమెరికా సంయుక్త సైన్యాధిపతుల అధ్యక్షుడు జెనరల్ మాక్సువెల్ డి. టేలర్ క్రొత్తఢిల్లీ చేరుకున్నారు.

డిశంబరు 20 : కేంద్రపాలిత ప్రాంతాలయిన గోవా, డయ్యూ, డామన్ లలో మొట్టమొదటి ప్రజాప్రభుత్వ మంత్రిమండలికి శ్రీ దయానంద బి. బండోడ్కర్ నాయకుడుగా పదవీ స్వీకారంచేశారు.

## విదేశాలలో

నవంబరు 20 : మిత్రరాజ్యసమితి సాధారణసభ 1965 సంవత్సరాన్ని ప్రపంచ సహకార సంవత్సరంగా నిర్ణయించింది.

నవంబరు 22 : టెక్సాస్‌లో అధ్యక్షుడు జాన్ ఎఫ్. కెన్నెడీ హత్య చేయబడ్డాడు.

అమెరికా కొత్త అధ్యక్షుడుగా ఉపాధ్యక్షుడు లిండన్ జాన్సన్ పదవీ స్వీకారం చేశారు.

ప్రముఖ ఇంగ్లీషు రచయిత, పండితుడు ఆల్డస్ హక్స్‌లే హాలీవుడ్‌లో మరణించారు.

నవంబరు 28 : మిత్రరాజ్య సమితి ఆహార వ్యవసాయసంస్థ డైరెక్టర్ జనరల్‌గా భారత దేశానికి చెందిన శ్రీ బి. ఆర్. సేన్ తిరిగి ఎన్నికయ్యారు.

నవంబరు 29 : ట్రాన్స్ కెనడా జెట్ విమానం క్యుబెక్ వద్ద కూలిపోయిన కారణంగా 118 మంది మరణించారు.

డిశంబరు 6 : అమెరికాలో అత్యంత గౌరవ ప్రదమైన స్వేచ్ఛ మెడలును స్వర్గీయ జాన్. ఎఫ్. కెన్నెడీ, స్వర్గీయ పోపు జాన్ XXIII లగార్లకు మరణానంతరం ఇచ్చినట్టు అమెరికా అధ్యక్షుడు ప్రకటించారు.

డిశంబరు 8 : బేంకాక్‌లో థాయిలాండ్ ప్రధాని మార్షల్ సరిత్ టానరాట్ మరణించారు.

డిశంబరు 9 : అమెరికాలో మేరిలేడ్ దగ్గర్లో పేన్ అమెరికా బోయింగ్ జట్ విమానం కూలిపోయిన కారణంగా 82 మంది మరణించారు.

డిశంబరు 10 : జాంజిబారు స్వతంత్ర రాష్ట్రమయింది.

డిశంబరు 12 : కెన్యా స్వాతంత్ర్యాన్ని పొందింది.

డిశంబరు 17 : భద్రతాసంఘం, ఆర్థిక సాంఘిక సంఘంల సభ్యత్వాల్ని పెంచాలనీ మిత్రరాజ్య సమితి సాధారణ సభ సిఫారసు చేసింది. ★

---

(21 వ పేజీ తరువాయి)

జంటనగరాలలో 2500 ఇంటి తోటలకు పంచడానికి ఒక పథకం అములులో వున్నది. ఈ విధంగా అనాబ్‌షాహి ద్రాక్ష పెంపకానికై ఉచితధన సహాయం ఉన్నది.

ప్రతి యేటా పండవలసిన పంటలో 10 ప శాతం చీడ పీడల వల్ల నష్టమవుతుందని అంచనా వేశారు. దీనివిషయమై ఈ మధ్య రైతులు శ్రద్ధచూపుతున్నారు. పెద్దఎత్తులో సస్యరక్షణ కృషికూడా 1962-63 లో జరిగింది. ఒకలక్ష యెకరాలలో స్ప్రేయర్లు, డష్టర్లు ద్వారా పంటను కాపాడటమేకాక విమానాల ద్వారా 20,000 యెకరాల వరిపంటకు 4000 యెకరాలప్రత్తి పంటకు మందులు చల్లబడినవి.

రసాయనపుఎరువులు రైతులకు సకాలంలో సులభంగా అందడానికి ఇదివరకు అములులోవున్న ప్రతిబంధకాలన్ని సడలించబడ్డాయి. రైతులు నేరుగాసహకార సంఘాల వద్దకు ఇతర డిపోల వద్దకు వెళ్ళి తెచ్చుకొనవచ్చును.

ఈ విధంగా ఎన్నోమార్గాలలో అవకాశ మున్నంతవరకూ ప్రభుత్వం పాటుబడుతూ ఉన్నది. ఉచిత ధన సహాయం, ఋణమూ, వస్తుసదుపాయమూ, సాంకేతిక విషయాలూ, రైతులకందజేయబడుతూ ఉన్నాయి. ఈ నాటి సమస్యలోని తీవ్రతను ప్రతివ్యక్తి గుర్తించి తమతమ శక్తికొద్దీ మనస్ఫూర్తిగా ప్రయత్నించి ప్రభుత్వయంత్రాంగంతో సహకరించి వ్యవసాయంలో, కృషి చేయగలరనడంలో సందేహం లేదు. ★

# గ్రంథసమీక్ష

## ప్రభాతమతీ వ్యాఖ్యాసహిత ప్రభావతీ ప్రద్యుమ్నము

జ్ఞారని శబ్దసంస్కారం, అర్థ సంపదలు, పదమైత్రితో వెల్లివిరియడం సులభ అన్వయ పరిపూర్ణ భావవ్యక్తీకరణత, విస్పష్టోక్తి, పదభావ సంబంధ సహితత్వం, భావ అపరిపూర్ణత మండూక ప్లుతివంటి అసంపూర్ణ భావ వ్యక్తీకరణ లేకపోవడం, సందర్భ సహిత అవసరార్థ భావ ప్రకటన బలయుక్తమైన, యుక్తియుక్తమైన, ఉక్తిప్రయోగం, పూర్వాపర విరుద్ధ రాహిత్యం స్వవచన వ్యాఘాత రహితత్వం అల్పవాక్యభావ పుంజం మహావాక్య భావంతో, పడుగూ పేకగా పదవాక్య బంధాలను కూర్చడం వంటి సద్గుణాలను బహుతపఃఫలంగా అలవరచుకున్న మహాకవి పింగళిసూరన. కళాపూర్ణోదయం, ప్రభావతీప్రద్యుమ్నం, రాఘవ పాండవీయం అన్న మూడు సువర్ణకృతులతో-ఆంధ్ర సాహిత్య చరిత్రలో సువర్ణయుగం అనిపించుకున్న రాయలయుగంలో మేలిమి బంగారంవంటి ప్రముఖస్థానం పొందిన సూరన గురించి యిక్కడ ప్రత్యేకించి పేర్కొనవలసిన అవసరంలేదు. ప్రాచీన సాహిత్యంలోని ఉత్తమ కృతులలో ఒకటైన సూరన కృతమైన ప్రభావతీ ప్రద్యుమ్నాన్ని ప్రతిభావంతమైన ప్రభామతి అనదగిన (ఈ పేరు వ్యాఖ్యకు రచయిత పెట్టకపోయినా) ప్రశంసనీయమైన వ్యాఖ్యతో వెలువరించిన వెంకట్రామా గ్రంథమాల అధిపతి శ్రీ ఈదర వెంకట్రామయ్యగారిని ఆంధ్రదేశం హృదయపూర్వకంగా ప్రశంసించవలసి వున్నది. (ప్రభావతీ ప్రద్యుమ్నము :- గ్రంథకర్త : పింగళిసూరన. వ్యాఖ్యాకర్త : శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి, ప్రకాశకులు, వెంకట్రామ గ్రంథమాల, విజయవాడ; రాయల్ సైజు 400 పుటలు ; వెల : 8-00)

కవితాభూషణ విద్వత్కవిశేఖర బిరుదాంకితులై పండితలోకంలో మంచిదొక్కశుద్ధిగల పండితుడుగా మునిత్రయ చరిత్రరచనతో నేటి తెలుగు కవిలోకంలో ఉదాత్తమైన శబ్దసంపత్తి, ఉత్తమకవితా పటుత్వశక్తి కలిగిన సత్కవిగా పేర్కొనదగిన శ్రీసూర్యనారాయణ శాస్త్రిగారు దీనికి చక్కని వ్యాఖ్య వ్రాయడం సముచితంగా ఉన్నది. శృంగార నైషధం, ఆముక్తమాల్యద కృతులకు కీర్తిశేషులు శ్రీ వేదం వెంకట్రాయ శాస్త్రిగారు రచించిన వ్యాఖ్యల రచనా పద్ధతికి, వెంపరాల వారి వ్యాఖ్యా రచనా పద్ధతికి తేడా వున్నది. వేదంవారు అనుసరించిన పద్ధతిలోనే వ్యాఖ్యా రచనకూడా వెలసివుంటే మరింత విపులమై, విషయ వివేచనతో కూడినదై రాణించేదను

సమీక్ష

వాఙ్మయ మహోధ్యాక్ష

కొంటాను. ఐనా ప్రాచీన ప్రబంధాలకు వ్యాఖ్యలు తప్పనిసరిగా కావలసిన పరిస్థితులేర్పడుతున్న యీ రోజులలో ఆ కావ్యాలను సునిశితంగా అన్ని దృక్పథాలనుంచి అర్థం చేసుకుని అభివ్యక్తీకరించ గలిగినవారు క్రమంగా తగ్గిపోతున్న యీ రోజుల్లో ఇటువంటి వ్యాఖ్యల అవతరణ ఆవశ్యకత యినుమడిస్తున్న దనడం నగ్నసత్యం. ప్రతిపదార్థ, తాత్పర్య, సంగ్రహ వ్యాఖ్యా విశేషాలతో అలరారుతున్న ఈ వ్యాఖ్య కావ్య పఠనాసక్తులైన విద్యార్థులకెంతైనా ఉపయుక్తం అవుతుందనడంలో సందేహం లేదు. ద్విత్వకార యుక్తమైన "పుత్త్రి" శబ్దం "పుత్" అన్న ధాతువునుంచి ఏర్పడిందనే భావించ నక్కరలేదు. (చూ॥ పే॥ 22 పు॥) "పూఞ్" ధాతువునుంచి ఏర్పడిన పుత్రశబ్దంలోని తకారానికికూడా "అనచిచ" సూత్రంవల్ల ద్విత్వంవచ్చి "పుత్త్రి" కావచ్చును. ద్విప్రాస, త్రిప్రాస, చతుష్ప్రాసలు కేవలం అలంకారార్థం పేర్కొనబడ్డాయి. అమరామాత్యునకు ఇత్యాది పద్యంలో చతుష్ప్రాసను మనం గుర్తించినప్పుడు "మజనకునకు" ఇత్యాది పద్యంలో (20 పేజీ) పంచప్రాసను గుర్తించవలసి వస్తుంది. ప్రాను, ప్రాఁకు మొదలైన చోట్ల వ్యాకరణ సూత్రాలవల్లే రూపనిష్పత్తియిచేసి చూపించుదాం అనుకున్నప్పుడు (27 పుట) "ఇత్తు" బిందుపూర్వకంబగు" వంటి సూత్రాలను విడువకూడదు. 28 పుటలో మరొకసందర్భంలో యివ్వడం జరిగినా అది ప్రథమ పర్యాయంగానే, ప్రథమసందర్భంలోనే పేర్కొనబడ్డం మంచిది. వలెను అన్నది గ్రాంథిక రూపంకాదు. వలయును అన్నది సరైన రూపం. వలెను అన్న క్రియారూపం రూపొందడానికి "వలు" ధాతువు లేనేలేదు. గ్రాంథికందృష్టితో చూచినపుడు ఇటువంటి అక్రమ "వలు" ధాతురూపాలను శ్రీ సూర్యనారాయణశాస్త్రిగారి వంటి పండితులు ఒకకంట కనిపెట్టవలసి వున్నది. పెనగలలో మట్టిగెడ్డల వలె కొన్ని చోట్ల ప్రామాదికాలైన వ్యాకరణాది వ్యాఖ్యా విశేషాలున్నా ప్రాచీన సాహిత్యంపట్ల ఆసక్తి, అభిమానం పెంపొందవలసిన ఆవశ్యకత వున్న యీ రోజుల్లో యిటువంటి వ్యాఖ్యను రచించిన శ్రీ సూర్యనారాయణ శాస్త్రిగారు వ్యయప్రయాసల కోర్చి ప్రకటించిన వెంకట్రామ గ్రంథమాల వారూ ప్రశంసనీయులు. ★

## నిరాటంకమైన శక్తి నిచ్చునవి
# కూపర్ సిఆర్ డీసెల్ ఇంజన్‌లు

మీ పొలంలో. దృఢమైన కూపర్ సిఆర్ డీసెల్ ఇంజన్ గంటల కొలదీ నిరాటంకంగా పనిచేయును మరియు సర్వీసింగ్ అక్కర్లేకుండా దీర్ఘకాలం మన్నగలదు.

కూపర్స్ సి.ఆర్. 8, సిఆర్ 14, సిఆర్ 19, సిఆర్ 26 మరియు సిఆర్ 40 ఇంజన్‌లు 8 నుంచి 40 బి.హెచ్.పి. వరకు సర్వ సిద్ధంగా లభించుచున్నవి.



ఇతర సుగుణములు :

* దృఢమైనవి మరియు ఖర్చు తక్కువ– లైట్ డీసెల్‌ఆయిల్ వ్యయం తక్కువ.
* నడుపుట చాలా సులభం.
* సమృద్ధిగా విడిభాగములు లభించును.
* "కూపర్–ఆమోదిత" సర్వీస్ సంపిణీ దారుల ద్వారా తక్షణం లభించును.
* నీటి సరఫరాయేగాక ఇతర పలువిధోపయోగములు.
* ఒక సంవత్సరం గ్యారంటీ.

**కూపర్** ఇంజనీరింగ్ లిమిటెడ్
సతారా రోడ్. ఎస్.ఆర్. రైల్వే. మహారాష్ట్ర




**కూపర్**
డీసెల్ ఇంజన్

దీనిని
కలిగి
యున్నవారిని
అడగండి

MCS. CE. 825 TEL




ముఖచిత్రం: ఉష-చిత్రలేఖ.

ఈ సంచికలోని కొందరు రచయితలు

| | |
|---|---|
| చక్రపాణి | బలివాడ కాంతారావు |
| బైరాగి | బి. వి. రమణారావు |
| అవసరాల రామకృష్ణారావు | కోడూరి కౌసల్యాదేవి |
| ఇల్లిందల సరస్వతీదేవి | సి. నారాయణ రెడ్డి |

ఇంకా ఎన్నో ఆకర్షణలతో వెలువడుతుంది.